శ్రీరస్తు

# శ్రీమద్రామాయణాద్భుతోత్తర కాండము.

గుడివాడ తాలూకా అంగలూరు వాస్తవ్యులగు

మధ్వశ్రీ

నందగిరి వేంకటప్పారావు పంతులు గారిచే

నాంధ్రీకరింపఁబడి ప్రకటింపఁబడియె.


దుగ్గిరాల

ప్రబోధినీ ముద్రాక్షరశాలయందు

బ్ర. వ. నిరంజనశాస్త్రిగారిచే ముద్రింపఁబడియె.

1911.



కాపీరైటు.]



వెల రు [1—4—0



మధ్వశ్రీ నందగిరి వేంకటప్పారావు పంతులుగారు.

# కవిజీవితము.

శ్రీమద్రామాయణాద్యుత్తర కాండము. ఈ గ్రంథకర్త నందగిరి వేంకటప్పారావుపంతులు మధ్వబ్రాహ్మణుడు, విశ్వామిత్ర గోత్రజుఁడు, ఆశ్వలాయనసూత్రుఁడు, వేంకటనారసింహ పుత్రుఁడు శేషమాంబాగర్భ శుక్తిముక్తాఫలాయమానుఁడు, కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా అంగలూరు గ్రామవాస్తవ్యుఁడు. ఈ కవి విభవ సంవత్సర భాద్రపద శు॥ ౧ బుధవారమునకు సరియగు క్రీ_శ_1868 సం॥ రం 19 ఆగస్టు తారీఖున జననమందెను. పదునాల్గవ సంవత్సరము వయస్సునందే కవిత్వ రచనకుఁ బ్రారంభించి చాటుధారపద్యములు చెప్పుచు నద్భుత మనీషావిశేషంబునఁ బండితులు మెచ్చుకొన నష్టావధానము చేసి పదునెనిమిదవ సంవత్సరమునఁ గ్రంథరచనకు దొరకొని,

| | | | సం॥ |
|---|---|---|---|
| | 1. | మైరావణ చరిత్రము (యక్షగానము) ... | 1886. |
| | 2. | ఆంధ్ర మేఘ సందేశము ... | 1887. |
| | 3. | నిర్వచనచతురముఖీ విలాసము (ఇప్పటి నవలవలె పద్యకావ్యము) ... | 1888. |
| | 4. | నవకథాగద్య ప్రబంధము ... | 1888. |
| * | 5. | సీతారామశతకము ... ... | 1893. |
| * | 6. | రామశతకము ... ... | 1894. |
| | 7. | గోపికాప్రియశతకము ... ... | 1895. |
| * | 8. | ఆదికేశవసీసశతకము ... ... | 1903. |
| * | 9. | బాలాశతకము ... ... | 1904. |

* 10. ప్రసతశ్శైల హనుమచ్ఛతకము ... 1904.
11. శ్రీకృష్ణమానసపూజ ... ... 1905.
12. హరిహరస్తోత్రతారావళి ... 1905.
* 13. శ్రీమద్రామాయణాద్భుతోత్తరకాండము 1909.
14. రామలింగేశ్వర శతకము ... 1910.
15. అంబా దీన సంరక్షణీ శతకము ... 1910.
16. చండమార్తాండశతకము ... 1910.

ఈషోడశగ్రంథములను రచించెను.

ఇందు నక్షత్రపు గురుతుచేర్చిన గ్రంథములు మాత్రము ముద్రితములై ప్రకటింపఁబడినవి.

ఈకవిమనీషా విశేషంబత్యద్భుతంబనుటకుఁ గొండొక నాఁడొక పండితుఁ డొక గ్రంథంబు చదువఁగా నందు నొక పత్రంబు పోయిన నీ కవి యాగ్రంథం బందుకొని, పోయిన పత్రంబులోని కథ పద్యగద్య రూపకముగ స్వకవిత్వముచే నల్లి చదివి కథాసందర్భమున కనుగుణముగా సరిపెట్టెను. ఇది సామాన్య ప్రతిభ కాదుగదా? ఈ కవి మొదట శేరీ కలవపూఁడి గ్రామమునకు కరణమై దరిమిలాను జరిగిన దిద్దుబాటులో నాగ్రామమింకొక గ్రామముతోఁ జేరిపోయినందున అంగలూరు గ్రామమునకు సహాయగ్రామ కరణముగ [ అసిస్టెంటు కరణము ] గా నేర్పరుపఁబడి పనిసేయుచున్నాఁడు. ఈయన కరణీక వృత్తియందు రేయుంబవలును దీరిక కలుగని రాజకీయవ్యాపారములచేఁ గాలక్షేపము సేయుచుండియు నెట్టులో తీరిక కలిగినప్పుడెల్లఁ గాలమును వ్యర్థపరచక కవిత్వవల్లికకు దోహదముసేయు సద్గ్రంథ రచన గావించుచుండును. ఈకవి ప్రోత్సాహముచే నంగలూరునందుఁ గవిత్వాభిరుచి నవనవోన్మేషమునొంది పెక్కండ్రమీఁదఁ బ్రాకియున్నది.

ఇప్పుడంగలూరునందు ఉభయభాషాభిజ్ఞులు గవిత్వరసైకలోలురు బలువురుగలరు. నిజముగా నాయూరు శారదా భాండాగారమగునని చెప్ప నొప్పు. మఱియు నీకవి ప్రోత్సాహముచే నంగలూరునందు 1890 సం॥ నుండి "బుద్ధిప్రదాయినీ" యను సంఘసంస్కరణ సభయొకటి నెల కొలుపఁబడి 10 సంవత్సరములు మిక్కిలి శ్రద్ధతో పనిజరుపఁబడినది. ఈమధ్యకాలమున "బుద్ధిప్రదాయిని" యను నొక మాసపత్రిక యీ కవి యాజమాన్యముక్రిందఁ బ్రచురింపఁబడెను. ఇవన్నియు నట్లుండ నీకవిచేసిన యొక గొప్పసంస్కరణ విషయమగు ఘనకార్య మిచ్చట మనము పేర్కొనకుండినఁ గృతజ్ఞతాశూన్యుల మగుదుము. అది యెట్టిదనఁగా, హిందూమహా సంఘమునుండి పెద్దకాలమేని పరావర్తితమై స్త్రీజాతినంతయు నజ్ఞానాంధకారమునఁ గూలఁద్రోచినది స్త్రీవిద్య. ఇట్టి స్త్రీవిద్యను పునరుద్ధారణచేసి దేశక్షేమము నభివృద్ధిసేయ వలయునని పెక్కండ్రు సంఘసంస్కరణాభిమానులు వాక్యశూరులై పెక్కుపన్యాసము లిచ్చుచుండు నిక్కాలమున గార్యశూరుఁడై పెక్కు కష్టంబులకోర్చి యీకవి శిఖామణి 1904 సం॥ 1 మే తేదిన 15 గురు బాలికలతో నంగలూరునందు స్త్రీవిద్యాభివృద్ధి కొరకు బాలికాపాఠశాల నొకదానిని స్థాపించి దానిపోషణకై స్వాంతద్రవ్యము రు 1250 లు ఖర్చుచేసి మిక్కుటపాటుపడి దాని నభివృద్ధిలోనికిఁ దెచ్చెను. ఈపాఠశాలనుండి 1907 సం॥ రం లో విశాఖపట్టణమందు జరిగిన ప్రెసిడెన్సీ కాన్ఫరెన్సుకు జేరిన సంఘసంస్కరణ సభకు ముగ్గురు విద్యార్థినులు డిలిగేట్సుగా పోయి యా సభవారిచే బహుమానములందియుండిరి. అప్పుడే మ॥రా॥రా॥ శ్రీ కురుపాంరాజాగారి దర్బారులో అడ్రెస్సుయిచ్చి వారి బహుమానములం గూడ స్వీకరించిరి. ఈపాఠశాల శుక్లపక్ష చంద్రునివలె క్రమాభివృద్ధినొంది 5 తరగతులయందు 159 గురు బాలికలు చదువుచుండగా 1909 సం॥ జూను నెల 11 తేదిన లోకల్ బోర్డు

వారి పోషణక్రిందికి వదిలియున్నారు. ఇందువలన నీకవియొక్క సంఘ సంస్కరణాభిలాషయు, పట్టుదలయుఁ స్వార్థత్యాగము, పరశ్రేయస్స హనబుద్ధియు వెల్లడికాఁగలవు. ఈకవి కవిత్వశైలి తెలియుటకు కవి కృతగ్రంథములనుండి యొక్కొక్కపద్య ముదాహరించుచున్నాము.

(1) మైరావణ చరిత్ర.

శా. ఈడంబోక శశాంకశేఖరునితో ♦ నీరేడు లోకంబు ల
ల్లాడంగా రజతాద్రివేఁబెరికి చా ♦ హాగ్రంబులం గందుక
క్రీడారంభము సూపి మించిన దశ ♦ గ్రీవుండు దానాజిలో
నేడా మర్త్యునిచేఁ బరాజయము వాం ♦ ఛేఁ జెప్పఁగాశక్యమే.

(2) ఆంధ్రమేఘసందేశము.

చ. నవజలబిందుసంగ్రహణ ♦ నైపుణజాత కపాళిఁజూచుచుఁ
దివమునబద్ధపఙ్క్తులయి ♦ ద్రిమ్మరునట్టి బలాకజాలముఁ
దవిలి గణింపుచుఁ భవదు ♦ దారనుగర్జిత భీతలై చెలుల్
గవుఁగిటఁజేర్చ సిద్ధులు సు ♦ ఖంబున నిన్నునుతింతు రెంతయుఁ.

(3) నిర్గద్యచతురముఖీవిలాసము.

మ. ఒకవేళఁ ధనవంతుఁడై మెలఁగు వే ♦ రొక్కప్పుడన్నార్థియై
బికిరంబెత్తును బూజ్యుఁడై సభలలోఁ ♦ బెంపొందుఁగొన్నాళ్లు వ
జ్రకరప్రాంచిత భోగభాక్కగును బా ♦ రబ్ధానుసారంబుగఁ
సకలంబుఁ ఘటియిల్లుగాశ నరుఁడెం ♦ చఁ గర్తయే వానికిఁ.

(5) సీతారామశతకము.

కం. చిలువదొకిమీనిమెత్తని
తలిమంబున గలిమి చెలువ ♦ దగునూడిగముల్
సలుపఁబసఁగులుకు నీయొల
చెలువమపుర యంగలూరి ♦ సీతారామా.

## (6) రామశతకము.

కం. వినయనమదమరమకుటీ
కనదలతుల మహేంద్రనీల ♦ కాంతిని కరముల్
దినదినమునీదుసుచరణ
వనజములన్మధుపలీల ♦ భాసిలు రామా.

## (7) గోపికాప్రియశతకము.

ఉ. బృందసురేంద్రధామ పద ♦ వీ ముహురున్నత భాగ్యబృంద గో
విందపదారవింద పరి ♦ వేష్టిత తుంద సమగ్రమంగళా
మందశుభాఢ్యమాధవ స ♦ మస్తకిశోర చరిత్ర సత్సుధా
స్యందసుకర్మకంద హృద ♦ యంబున నెన్నెద గోపికాప్రియా.

## (8) ఆదికేశవశతకము.

సీ. అందమౌపున్నమ ♦ చందమామనుబోలు
ముద్దుగులుకెడు నగు ♦ మోముతోడఁ
జెలిదమ్మిరేకుల ♦ కళలామతించెడు
కరుణారసముజిల్కు ♦ కనులతోడఁ
దొలుకరిమబ్బుతోఁ ♦ దులదూఁగఁగాఁజాలు
మెరుఁగుఁజామనిచాయ ♦ మేనితోడఁ
బొందామరలఁగుల్కు ♦ చరదంబుహావణించు
మెత్తనియడుగుల ♦ మెలపుతోడఁ
గలుము లిగురొత్తఁగన్నుల ♦ కరవుదీరఁ
జూపుమీనీదురూపంబు ♦ సుందరాంగ
స్మరణమాత్రార్తజనసుప్ర ♦ సన్నభావ
విప్రపుర్యాదికేశవ ♦ విపులవిభవ.

(9) భాలాశతకము.

కం. పని లేక యున్న వారల
మనములు పరిపరివిధముల ♦ మ్మానక చలియిం
చును దుర్విషయంబులనే
వినునుదలఁచు సేయు నిజము ♦ వినుమిది భాలా.

(10) శ్రీశైల హనుమచ్ఛతకము.

మ. తలఁపన్ గోష్పదమయ్యెనీకు లవణో ♦ దన్వంతము గ్రాసురా
వళిసీ విక్రమలీలముందు మశక ♦ ప్రాయంబుగాడిందె ను
జ్వలమా బ్రహ్మశరంబునీకుఁ దృణక ♦ ల్పంబయ్యె లేవిట్టివిం
త లికెందెన్ శ్రీశైలవాస హనుమం ♦ తా చింతితార్థప్రదా.

(11) శ్రీకృష్ణమానసపూజ.

శ్లో॥ సమంచత్కాళిందీతట విపినమార్గేషు సతతం
గవాంబృందం గోపార్భకపరిచితస్స్నిగ్ధకలయన్
సుధాధారాసారం రుచిరమురళీగానవిభవైః
కిరంతం తం లీలావ్రజశిశువరం సంస్మరమనః.

(12) హరిహరస్తోత్రరత్నావళి.

శ్లో॥ హరిమీశేడితద్విపహారిమ్మానతభవభయాపహారిం
హరమాశ్రయామి సంసృతిహరమంచితపన్నగేంద్రహారం.

(14) రామలింగేశ్వరశతకము.

మ. చెవులేకానిక లేవుకన్నులనుచుం ♦ చింతింతురీలౌక్యమూ
ఢవులన్ సర్వజగత్ప్రభుత్వమహిమా ♦ ధారేయుఁడా నీకు న
చ్చెవులుంగన్నులు లేనిచందమయితో ♦ చెన్ గుయ్యొమొఱ్ఱోయనం
గ వినంజూడఁగ నేరవాశ్రితుల వం ♦ శన్ రామలింగేశ్వరా.

(15) అంబాదీన సంరక్షణీశతకము.

మ. జనయిత్రీబధిరప్రయుక్తునెదుటన్ ♦ పంకూదినట్లయ్యె నా
మనవుల్ కారణమేమి నన్నుఁ గరుణిం ♦ పన్ శక్తిలేదయ్యెనా
వినిచిత్తంబుపరాకుగానోలసెనా ♦ వింతయ్యెపున్ జాగిఁకన్
బనిలేదీప్సిత సిద్ధిసేయుము మదం ♦ బాదీనసంరక్షణీ.

(16) చండమార్తాండశతకము.

సీ. కడువేసవినిమయూ ♦ ఖంబులు బరపి పృ
థ్వీతపింపనంబువుల్ ♦ బీల్చిమబ్బు
నందుంచిపరిణామ ♦ మొందించివానకా
రునవృష్టియనురూప ♦ మునసొంగి
సస్యముల్ మొలిపించి ♦ స్వకిరణంబులు చంద్రు
నందుసుధారూప ♦ మొందనిలిపి
మంచుగావించి యి ♦ మ్మహిసస్యపోషణ
మొనరించియన్న మం ♦ దున సృజించి
చతురగతిభూతకోటి ర ♦ క్షణముసేయఁ
గర్తవీవందుచే జగ ♦ ద్భర్తవీవ
యాయురారోగ్యదాయి ♦ భక్తానుయాయి
చండమార్తాండమహిత తే ♦ జఃప్రచండ.

అంగలూరు.
26—12—10.

ఇట్లు,
అడవి సాంబశివ కవి.
త్రిపురనేని గోపాలకృష్ణయ్య కవి.

# పీఠిక.

శ్రీమద్రామాయణము యొక్క ప్రాశస్త్యమును కథావిధాన మును నెల్లరకు సువిదితంబె. కావున దానిం జర్విత చర్వణము సేయ నక్కర లేదు. వాల్మీకి మహర్షిచేత విరచితంబగు రామాయణము శతకోటి ప్రవిస్తరమై బ్రహ్మలోకమున గోపితంబై యుండెననియు, నది మర్త్యలోకమునఁ బంచవింశతి సహస్రపరిమితంబై కాండసప్తకకలితంబై యుండెననియు, నట్టి బ్రహ్మలోక గుప్తమైన గ్రంథమునందేమేమి విశేషములు కలవో యను సంశయముచే శిష్యుండగు భరద్వాజుండు ప్రశ్నించఁగా వాల్మీకిమహర్షి యీయద్భుతోత్తరకాండమును రామాయణసారమని వక్కాణించె. అట్లు గావున నీగ్రంథోత్కర్ష వేఱఁ బేరుకొన నవసరముగలుగదు. ఇట్టి మహాగ్రంథమును సకలజన పఠనార్హముగావించుట శ్రేయస్కరము గావున దీనిని సంస్కృతమునుండి సాధ్యమగునంతవరకు యథామూలముగా నాంధ్రీకరించితిని. కొన్నికొన్ని వర్ణనాంశములందు మాత్రము స్వకపోలకల్పితములం జేర్చితినిగాని రచనాప్రణాళికయం దెచ్చటను మూలాతిక్రమణము సేయలేదు. ఈ గ్రంథము రామాయణముయొక్క భాగమే అయి పఠనపాఠనశ్రవణశ్రావణాదుల నభ్యుదయదాయకమగుటచే ననవసరముగు నధికవర్ణనలు చేర్పక మూలమునకు వ్యాఖ్యానప్రాయముగా రచియింపఁ బడినది. గనుక జనులకుఁ బారాయణోపయోగముగా నుండుననుటకు సందియము లేదు. గ్రంథమునందలి గుణాగుణములు పాఠకులే గ్రహించఁదగువారు గావున నావిషయమయి యిచ్చటఁ జెప్పు టనవసరము.

ఈగ్రంథరచనయందెచ్చటను రేఫశకటరేఫలభేదము గ్రహింపబడదయ్యె. ఈ శకటరేఫ విషయము "దేవీభాగవతము" నందు

దాసు శ్రీరాములుగారును "బిల్హణీయము" నందు అజని సాంబశివ కవిగారును విపులముగఁ జర్చించియుండిరి. కాబట్టి పిష్టపేషణముమాని తద్విషయమించుకంత సూచించెద.

ఆంధ్రశబ్ద చింతామణియందు "షట్త్రింశదత్ర తే" అని శుద్ధాంధ్రవర్ణములు ముప్పదియారని చెప్పి, "శ్లో॥ ద్వివిధా ఏదు దేతో వక్ర తమా వనుస్వారా । కగ చజ యుగ టడణ తదన పబమ యరలవసహా శంతుహాల్వర్గః॥" అని వర్ణనిర్దేశము చేయునపుడు శకటరేఫ కలదని రూపాంతర నిర్దేశము చేయలేదు. కావున శకటరేఫయొకటి కలదని శుద్ధాంధ్ర వర్ణసమామ్నాయమున రూపాంతరముతోఁ జేర్చుటకు శాస్త్రాధారము లేదు. "లఘ్వాలఘువశ్చే తిద్వేధాంతస్థాః వదంతి శాస్త్రారః। అన్యేన్యవ్యాకరణే స్పష్టార స్త్వత్ర గృహ్యతే ద్వివిధః" అను సూత్రమున, య, ర, ల, వ లకు లఘుత్వాలఘుత్వభేదమంగీకరించి అందు య, వ, ల లకు సంస్కృత వ్యాకరణమునందే లఘుత్వాలఘుత్వ భేదము నిర్దిష్టమయి యుండుటంజేసి "ర స్త్వత్రగృహ్యతే ద్వివిధః" రస్తు=రకారమైతే, అత్ర = ఈఆంధ్రభాషయందు, ద్వివిధః=లఘుత్వా లఘుత్వ భేదములతో రెండువిధములుగా, గృహ్యతే = గ్రహింపఁబడు చున్నది. అని విశేషవిధిగా సూత్రము రచింపఁబడినది.

సంస్కృతమునందు రేఫకు ద్విత్వమిచ్చుటనురాదు. లేదు. ఈ ఆంధ్రమునందు, గొర్రె, బర్రె, మర్రి, మొదలగు శబ్దములయందు రేఫద్విత్వ మోపపన్నమగుచున్నది. కావున నట్టి ద్విత్వసిద్ధికై రేఫ కలఘుత్వ మంగీకరింపఁబడినది. ఇంతమాత్రముచేత రేఫకు రూపాంత రము నిర్దేశించుట కాధారమెట్లుకలిగినదో? అట్లయిన యవలలకుఁ గూడ రూపాంతరము సిద్ధించి తీరవలెనుగదా! పోనిండు. "సిద్ధిర్లోకా ద్దృశ్యా" అని యున్నందున శబ్దసిద్ధి లోకవ్యవహారమువలనఁ గదా తెలియఁదగినది? అట్లయినచో, అరదము, అఱచుట, యీ రెండుశబ్దము లందలి రేఫ ముచ్చారణమువలన భిన్నముగా నగుపడుట లేదుగదా. అందు అరదాదిగతము రేఫయనియు, అఱచుటాది గతము శకట

రేఫము ( అలఘురేఫము ) అనియు నెట్లు తెలియఁగలదు. లఘ్వలఘు రేఫల కుచ్చారణ భేదముండవలయునుగదా. కాదేని య వ ల లకు వలె విధాయకసూత్రమైన నుండవలయును.

అట్టి విధియును లేదు. కావున ద్విత్వశ్రవణముగల, మఱ్ఱి, ఇత్త్యాది పదగతమైన రేఫ అలఘురేఫమనియు. తదితర స్థలములయందుఁ గల రేఫ లఘురేఫమనియు, శాస్త్రకర్త యుద్దేశ్యమయినటుల నిర్వివాద ముగా స్ఫురించుచున్నది.

ఇట్లుండగా మూలము లేని శకటరేఫవాద మెచ్చటనుండి వచ్చి నదో తెలియరాకున్నది. నన్నయాదులగు కవిత్రయము వారీభేద మెంచిన ట్లగుపడదు. అనంతరము పెక్కండ్రు మహాకవులుఁగూడ నీ విషయమందంత పాటించినట్లుతోఁచదు. ఎట్లయినను రేఫద్వయ వాద మునఁ బెనఁగులాడినది కాకునూరి అప్పకవియే. ఎన్నితిప్పలఁబడియును తుదకు దానే పప్పులో కాలువైచె. ఒక పదమునందలి రేఫశకటరేఫ యని యొకరుసెప్పిన, మరియొక రది సాదు రేఫమనిరి. ఈచిక్కులుబడ లేక క్రొంద రుభయ రేఫయనిరి. అనఁగా నొకపదములోని రేఫ యొక్క మారు శకటమెక్కి మరియొకమాటు దిగి సాదురాయగుననుట. ఈ వాద ప్రాశస్త్యమునకు మితిలేకపోయె. శకటరేఫను నిర్ధారణ చేసిన శాస్త్రకర్త అది యిట్టిచోటనుండునని దానికి విధిచెప్పకున్న నది యిట్లే పర్యవసించును. చ జ లకు దంత్యతాలవ్యవిధి సెప్పనప్పుడు "అద్దంత్యా" అని దానిని విధించినాఁడు. అట్లే రేఫకు శాకట్యమిచ్చెనేని దానికి నునికి సెప్పవలయునుగదా. శాస్త్రకర్త అట్లొఁ జేయలేదు. శబ్దసిద్ధి లోకంబువలన గ్రహించఁదగియుండగా "ఆలోక మనన్యాదృశము నిత్యా మునై యుండగా అందువలన, అరదాదిపదగతమై లఘూచ్చారణతోడి రేఫయును, మఱ్ఱ్యాదిపదగతమై ద్విత్వసహితా లఘూచ్చారణతోడి రేఫయును మనకు లభ్యములగుచుండగా వేరేసూత్ర నియమమేలనని యుపేక్షించి యుండవలెను. కాబట్టి రేఫకు ద్విత్వసహితత్వము లేనిది అలఘుత్వమురాదు. శాకట్యము లేదు. అలఘురేఫగాక శకట రేఫ

వేరందమా. అది యీవాదమునంతయు మ్రింగినదేగాని మొదట వర్ణ సమామ్నాయమునవచ్చి చేరకుండుటచే దానికి నుపపత్తి కనుపడదు. వర్ణమున కునికి స్థిరపడినఁగదా దానివ్యాప్తి ఆలోచించవలయుట? కావున నట్టివాదముకూడదు. ఏది యెట్లున్నను రేఫకు శకటత్వము వచ్చినందువలన భాషావధూటికి మిక్కిలి యిక్కట్టువచ్చునేగాని సౌష్ఠవముగానేరదు. భాషాసౌలభ్యమునకు భంగముసేయుమార్గమవలంబించుట మంచిదికాదుగదా. అందువలననే యిప్పటి భాషాభిజ్ఞులు రేఫద్వయ మైత్రికి నిర్వివాదగా నొప్పుకొనియేయున్నారు. కావున నీ గ్రంథరచనయందు రేఫకు శకటత్వరూపాంతర మంగీకరించఁబడలేదు. దానంజేసి యిందు శకటరేఫమెచ్చటను దృష్టిపథమునంబడదు. పండితులీవిషయమై నిష్పక్షపాత దృష్టితో విచారించిన నేనుచూపిన వాదము న్యాయమనియును దేలకమానదు.

మరియు నచ్చటచ్చట నించుగ్విరామము, నఖండవిశ్రామము గ్రహింపఁబడినవి.

ఇందుఁగొన్ని ముద్రాస్ఖాలిత్యములు దొరలియున్నవి. కాన వానిని శుద్ధపత్రిక ననుసరించి ముందుగ సవరించుకొని పాఠకులీగ్రంథమును జదువవలయునని ప్రార్థించుచున్నాను. ఎంతటివారికైనను బ్రమాదాదిజనితములగు తప్పులుండుట సహజము. ఇందెందేని లోపములున్న సుదృక్కులగు పాఠకులు నిరసించి గేలిసేయక వానిని నాకుఁ దెలియఁబరచినచో వందనపూర్వకముగ నందికొని యనంతర ముద్రాపణమునందు సవరించికొనియెద. కవిత్వశైలియందెట్టిలోపములున్నను గ్రంథగౌరవముచేతనైనను బండితులుదీనిమన్నించి పరిగ్రహింతురుగాత.

అంగలూరు.
20—10—10.

ఇట్లు,
నందగిరి వేంకటప్పారావు.

# విషయసూచిక.


| పుట. | విషయము. |
|---|---|
| | ప్రథమాశ్వాసము. |
| ౧ | ఇష్టదేవతాదికము. |
| ౮ | అంగలూరు గ్రామాభివర్ణనము. |
| ౨౩ | కవివంశానుక్రమణిక. |
| ౨౬ | గణకవృత్తిప్రశంస. |
| ౨౮ | కవి విచారము. |
| ౩౧ | కృతికర్తృగవేషణము. |
| ౩౫ | షష్ఠ్యంతములు. |
| ౩౭ | కథాప్రారంభము. |
| ౪౧ | అంబరీషచరిత్రము. |
| ౪౬ | త్రిశంకునిభార్య తపముసేయుట. |
| ౪౮ | త్రిశంకుపత్నికి హరి ప్రత్యక్షమగుట.<br>త్రిశంకుపత్ని గర్భవతియగుట. |
| ౪౯ | అంబరీషజననము. |
| ౫౦ | అంబరీషరాజ్యప్రాప్తి.<br>అంబరీషుఁడు తపముసేయుట, |
| ౫౧ | అంబరీషునకు శ్రీహరి యింద్రరూపమునఁ బ్రత్యక్షమగుట. |
| ౫౨ | అంబరీషునకు శ్రీహరి ప్రత్యక్షమగుట.<br>అంబరీషస్తవము. |
| ౫౬ | అంబరీషునకు హరివరంబులిచ్చుట. |
| ౫౮ | శ్రీమతీరూపాభివర్ణనము. |

౬౨ అంబరీషునికడకు పర్వతనారదులువచ్చుట.

౬౪ శ్రీమతిని దమకిమ్మనిఁ పర్వతనారదులంబరీషుంగోరుట.

౬౫ నారదుఁడు విష్ణునిఁ బర్వతునకుఁ గ్రోఁతిమొగంబు గల్పించుమని యడుగుట.

౬౬ పర్వతుఁడు నారదునకుఁ గొండముచ్చుమొగము చేయుమని విష్ణునివేఁడుట.

౬౭ శ్రీమతీ స్వయంవరము.

౭౦ శ్రీమతి విష్ణుని వరించుట.

౭౧ పర్వతనారదులు వైకుంఠమునకరిగి శ్రీమతి వృత్తాంతమడుగుట.

౭౩ పర్వతనారదులంబరీషుని శపించుట.

౭౪ { విష్ణుచక్రము పర్వతనారదుల వెంబడించుట.
విష్ణుఁడు చక్రమును వారించుట.

౭౫ పర్వతనారదులు విష్ణుని శపించుట.

౭౭ పర్వతనారదులు బ్రహ్మచర్యముఁ బ్రతిజ్ఞసేయుట.

ద్వితీయాశ్వాసము.

౮౦ కౌశికోపాఖ్యానము.

౮౨ కౌశికునివద్దికి కుశస్థలవాసులగు విప్రులువచ్చుట.

౮౩ { కౌశికునివద్దికి కళింగరాజువచ్చుట.
కళింగుఁడుతన్నుఁగూర్చి గానము సేయఁగోరి ప్రత్యాఖ్యాతుఁడగుట

౮౫ కౌశికాదుల బ్రహ్మలోకమునకుఁ గొనిపోవుట.

౮౬ కౌశికాదులఁగొని బ్రహ్మ విష్ణులోకమునకరుగుట.

౮౭ కందాష్టకము.

౮౯ పంచచామరపంచకము.

౯౦ విష్ణుండు కౌశికాదుల కుచితనివాసంబేర్పరచుట.

౯౨ { కౌశిక కృతగాన వినోదము.
నారదాదులు లక్ష్మీచేటికలచే నుత్సాహితులగుట.

౯౩ { తుంబురుని గానముసేయ నియమించుట.
తుంబురునకు బహుమానమిచ్చుట. }

౯౪ { నారద పరాభవము.
నారదుఁడు లక్ష్మిని శపించుట. }

౯౫ { నారదునియొద్దకు లక్ష్మీవిష్ణులువచ్చుట.
నారదుని లక్ష్మీదేవి వేఁడికొనుట. }

౯౬ { నారదుని విష్ణుఁడూరడించుట.
నారదుండు గానబంధుని కడకరుగుట. }

౯౮ నారదుఁడు గానబంధునికి నిజవృత్తాంతం బెరింగించుట.

౯౯ గానబంధుని పూర్వవృత్తాంతము.

౧౦౬ నారదుండు గానబంధునియొద్ద గానమునేర్చుట.

౧౦౯ నారదుఁడు తుంబురునికడకరుగుట.

" నారదుఁడు విష్ణునికడకరుగుట.

౧౧౧ నారదుఁడు శ్రీకృష్ణుని దర్శించుట.

౧౧౨ నారదకృత నవరసరత్నమాలికాస్తోత్రము.

౧౧౩ నారదుఁడు శ్రీకృష్ణునియొద్ద సంగీతవిద్యనేర్చుట.


తృతీయాశ్వాసము.


౧౧౭ రావణుఁడు తపస్సుచేసి బ్రహ్మచే వరంబులొందుట.

౧౧౯ రావణుఁడు సురలజయించుట.

" రావణుఁడు మునులను జయించఁదలచుట.

" రావణుఁడు మునుల శోణితమును గ్రహించి మండోదరిచే దాపనిచ్చుట.

౧౨౦ మండోదరి విషమని మునిరక్తముఁ గ్రోలుట.

౧౨౧ మండోదరి గర్భవతియగుట.

౧౨౨ మందోదరి గర్భమును రహస్యముగా నివర్తించుట.
౧౨౩ జనకునకు యజ్ఞభూకర్షణంబున సీతాదేవి దొరకుట.
౧౨౪ రామునికి పరశురామునితోనైన వివాదము.
౧౨౬ పరశురాముఁడు శ్రీరాముని విశ్వరూపము చూచుట.
౧౨౭ పరశురాముని తేజోపహరణము.
,, పరశురాముండు మహేంద్రాద్రియందు నిర్విణ్ణుండగుట.
౧౨౮ పూర్వరామాయణ కథానుసంధానము.
౧౩౦ హనుమంతునకు రాముఁడాదివిష్ణుఁడై కనుపించుట.
౧౩౧ రాముఁడు హనుమంతునకుఁ దత్త్వోపదేశము సేయుట.

## చతుర్థాశ్వాసము.

౧౫౫ ఆంజనేయకృతస్తోత్రతారావళి
౧౬౩ రాముఁడు సేనలతో సముద్రముదాటుటకు యోచించుట.
,, లక్ష్మణుఁడు సముద్రునిఁ బ్రార్థించుట.
౧౬౪ లక్ష్మణుని సంరంభము.
,, రాముఁడు లక్ష్మణుని ననునయించుట.
౧౬౬ వసంతర్తు వర్ణనము.
౧౬౯ సీతారాముల యుద్యానవనవిహారము.
౧౭౮ జలక్రీడాభివర్ణనము.
౧౮౧ సూర్యాస్తమయ చంద్రోదయాద్యభివర్ణనము.

## పంచమాశ్వాసము.

౧౮౮ శ్రీరామచంద్రుని మునులు దర్శించుట.
౧౮౯ మునులు రావణవధఁ బ్రశంసించుట.
౧౯౨ సీతా ప్రత్యాఖ్యానము.
౧౯౩ సీత సహస్రకంఠ రావణుని వృత్తాంతము సెప్పుట.

౨౦౯ సహస్రకంఠ వధార్థము రాముఁడు పుష్కరద్వీపమునకరుగుట.

షష్ఠాశ్వాసము.

౨౧౬ పుష్కరద్వీప రాక్షసులు రామసైన్యమునుజూచి సహస్ర కంఠుని కెఱింగించుట.

,, సహస్రకంఠుఁడు ప్రతాపోక్తులు పలుకుట.

౨౧౮ సహస్రకంఠుఁడు యుద్ధమునకు వెడలుట.

౨౨౪ సహస్రకంఠునికి యాకాశవాణి రామవృత్తాంత మెఱింగించుట.

౨౨౬ అసురసైన్యముతో రామునిసైన్యమునకైన యుద్ధము.

౨౨౯ నరవాన రసురాసుర ద్వంద్వయుద్ధము.

౨౩౨ సేనాధిపతుల యుద్ధము.

౨౩౬ లక్ష్మణుని యుద్ధము.

౨౩౭ శత్రుఘ్నుని యుద్ధము.

,, భరతుని యుద్ధము.

౨౩౮ లక్ష్మణుఁడు పిండారకుం జంపుట.

౨౪౨ సహస్రకంఠుఁడు వాయవ్యాస్త్ర ప్రయోగముచే నరవానర సేనలఁ దూలఁదోలుట.

౨౪౭ సహస్రకంఠుఁడు మున్ను విష్ణుని పరిభవించుట.

౨౪౯ రాముఁడు సహస్రకంఠుని బాహుబలమున కచ్చెరువుపడుట.

౨౫౦ సహస్రకంఠుఁడు రామునిపైవచ్చుట.

౨౫౧ సహస్రకంఠ రామ ద్వంద్వయుద్ధము.

౨౫౫ రాముఁడు సహస్రకంఠునిపై బ్రహ్మాస్త్రమును బ్రయోగించుట.

౨౫౬ రాముని బ్రహ్మాస్త్రము సహస్రకంఠుఁడు భగ్నము సేయుట.

౨౫౭ రాముఁడు మూర్ఛిల్లుట.

౨౫౮ మునులు భయమొందుట.



౨౪౯ సీతాసంరంభము, సహస్రకంఠవధ.

౨౬౧ మాతృకాసంరంభము, తన్నామములు.

౨౬౩ సీతామాతృకా కందుకక్రీడ.

౨౬౪ శివుఁడు శవరూపధారియై సీతాపాదభరము వహించుట.

బ్రహ్మాదికృత సీతాస్తవము.

౨౭౦ బ్రహ్మ రాముని మూర్ఛవాపుట.

౨౭౧ రామునకు మునులు సీతాసంరంభం బెఱింగించుట.

౨౭౩ సీత రామునకుఁ దనమహిమ చెప్పుట.

సీతా విశ్వరూప సందర్శనము.

౨౭౬ రాముఁడు సీతను స్తుతిసేయుట.

౨౮౪ రామునకు సీత వరంబులిచ్చుట.

౨౮౬ రాముని బ్రహ్మ స్తుతించుట

౨౮౮ బ్రహ్మ సీతాదేవి నభినుతించుట.

౨౯౧ రాముఁడు సీతాసమేతుఁడై యయోధ్యకువచ్చుట.

౨౯౧ రాముఁడు సీతావిజయము నెఱింగించుట.

౨౯౩ సుగ్రీవాదులు స్వస్థానముల కరుగుట.

౨౯౮ ఫలశ్రుతి.




ఓం.

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణే నమః.

# శ్రీమద్రామాయణాధ్యాత్మోత్తరకాండము.

---

## ప్రథమాశ్వాసము.

* ఓంకారాంచదమన్మగాంకనియతైస్సత్త్వైగజృంభయన్
తద్భోగాత్ప్రిణవేనిహాత్మనిపునస్సంకోచయన్ క్రీడతి
స్వస్మిన్ లక్ష్యసమాసమాంకతులితైర్వర్ణైర్వర్ణైర్నన్ స్వాహ్వాయం
యః పాయాదమగేశ్వరస్సభువనక్షేమంకరః కింకరాన్. ౧

---

* అ ౧ ఆద్యమైన మహాప్రకృతి;<br>
ఉ ౩ సత్వరజస్తమములు త్రిగుణములు.<br>
మ ౫ పృథివ్యాది పంచభూతములు.<br>
(ఈతొమ్మిది ప్రకృతులచే తనే జగత్సృష్ట్యాదులు కలిగెను)

౯ ప్ర + నవము, ఉత్కృష్టమైన నవసంఖ్యయే ప్రణవము.

ఇందు.

సమాంకములు ౪ వ<br>
విషమాంకములు ౫ శి<br>
(కాన ప్రణవ లక్ష్యనామము. శివ అనునదియే.)

ఇదే ఓన్నమశ్శివాయ అను మంత్రమగును. ఎట్లనగా,

శి - వ

౫ - ౪ = ౧

శి వా య,

౫ + ౪ + ౧ = ౧౦,.

౧ మొదలు ౧౦ వరకు సర్వసంఖ్యాసమష్టి.

౫౦ + ౫

మః న ఓం

శా. శ్రీవల్గత్కుచకుంభసంభరితకా ♦ శ్మీరాంకవక్షస్తటి
ధావద్రోచిరహీనహారమశిసం ♦ దర్భాంబుమాశ్లేషశో
భావిన్యాసముగాశివాహ్వాయముహుః ♦ ప్రఖ్యాపితోమాధవ
త్వావిష్టుండమరేశ్వరుండొసఁగుస ♦ ర్వార్థంబులశ్రాంతమున్. ౨

మ. తననామంబుఁదలంచుభక్తులఖిలా ♦ ర్థంబుల్ఫలింపన్యశో
ధనులై భావుకభోక్తలై వెలయ ని ♦ త్యశ్రీసమాఖ్యాఢ్యయై
వినుతార్యాంచితనామధేయయగుచున్ ♦ విశ్వేశుదేహాధివా
సినియైమించుజగత్త్రయీజననిస్వ ♦ శ్రేయంబులిచ్చుఁగృపన్. ౩

శా. అప్సరాయిత దివ్యరత్నమయవీ ♦ ణావిష్కృత శ్రీసుదృ
గ్వీప్సాభావి నిజాంగ మేచకవిభా ♦ విద్యోతితుండైయశో
ద్రప్సగ్రఘ్నమనీషిహంససకలా ♦ ర్థశ్రీకరున్మన్మనో
లిప్సాపూర్తిఁదలంచి కొల్తువనమా ♦ లిన్ద్రాతలోకావలిన్. ౪

చ. తనదునివాసమైయలరు ♦ దమ్మిమొగుడ్చఁగఁజేయుచున్నలో
చనము తెరంగుసూచియది ♦ చయ్యననెమ్మదినాటిమాటు నా
ధునిఁగవుఁగింటఁదార్చుచును ♦ దోరఁపుఁగుబ్బల నొత్తిమెచ్చున
వ్వననిధి కన్యమాకిడున ♦ వారితసంపదలెల్లకాలమున్. ౫

మ. పలుకుంగొమ్మమొసంగుచెక్కుఁగవయున్ ♦ ఫాలంబుగెమ్మోవియున్
దళుకుంగన్నులునొక్కటన్గొసరిమో ♦ దంబొప్పముద్దాడఁగా
సలుమోముల్ చరితార్థతన్ బొరయనా ♦ నందించుమానల్వని
చ్చలునుద్యత్కృపనాకొసంగుతమహై ♦ శ్వర్యాయురారోగ్యముల్.

---

మరి అమరేశ్వర అనగా ఓం నమశ్శివాయ మంత్రమే అగును

అ మ రే శ్వ ర

౧+౫+౨+౪+౨ = ౧౪ = ఓం

౧+౪=౫, ౧+౪+౫ = ౧౦; ౧—౧౦ = ౫౦+౫

య నా శి మః న ఓం

మ. అవతంసాయితనూతనైందవకళా ♦ న్యాలగ్నసచ్చంద్రికా
భవదర్ధస్మితకందళప్రసరణ ♦ ప్రాయస్ఫుటేందీవర
చ్ఛవిమల్లోచనకోణనిస్సృతదయా ♦ సమ్యక్సుధాసారసే
కవిభూతిన్ మృదువాక్కదంబములొసంగన్ వాణిఁ బ్రార్థించెదన్. ౭

శా. గండోద్గీర్ణనితాంతదానలహరీ ♦ గంధాపతద్భ్రామరీ
షండాభ్యర్హితగానసంశ్రవణసే ♦ చ్ఛాహర్షమానాత్మఁడై
శుండాగ్రంబున మోదకంబులఁతలోఁ ♦ జుంబించుచంచత్కృపా
శౌండుండై తగువల్లభాగణపతిన్ ♦ సద్భక్తిసేవించెదన్. ౮

సీ. శతకోటిచంద్రభా ♦ స్ఫారకాంతివిలసిల్లు
శంఖచక్రములవి ♦ చ్చలుభజింతు
నఖిలజగంబుల ♦ కాధారయష్టులై
క్రాలుగదానంద ♦ కములఁగోల్తు
హాటకలసీలాద్రి ♦ యలఘుశర్కానిఁబోలఁ
జాలుకిరీటంబు ♦ సంస్మరింతుఁ
గలుములకొమ్మకు ♦ య్యెలగఁగఁదగునిట్టి
పుట్టువుమచ్చఁజిత్త ♦ మునఁదలంతుఁ

గీ. గారుమెఱుఁగులునఁగులుకుచి ♦ క్కనిమెఱుఁగు
తీవియంబోలిహారిమేనఁ ♦ దీప్తిఁజిలుకు
కాంచనాంబరయుగళంబుఁ ♦ గలితభక్తి
సేవసేయుదునిష్టార్థ ♦ సిద్ధికొరకు. ౯

సీ. ఉరగకనత్తిన ♦ పడగపెంపునకుర్వి
మెచ్చుగుగారుడ ♦ పచ్చగాఁగఁ
బరచినతనపేని ♦ పగపునకిందిరా
ధవుఁడుమహేంద్రవర ♦ త్నంబుగాఁగఁ

బుట్టిన తనకొద్ద ♦ చుట్టకుపాతాళ
వివరంబుమట్టిన ♦ పెట్టిగాఁగ
బోరసి మనూష్పగా ♦ డ్పులకు సంస్కృతమైన
శబ్దశాస్త్రంబుని ♦ స్వనముగాఁగ

గీ. దనతను స్వచ్ఛకాంతిసం ♦ తతులుపూర్ణ
విమలబోధామృతస్ఫూర్తి ♦ వెల్లడింప
సతతాచ్యుతసేవార్థు ♦ శాంతిశాంతుఁ
డగు ననంతుయశోవంతు ♦ నభినుతింతు. ౧౦

కం. సతతమువాహనమై య
చ్యుతునకుఁ గైంకర్యపరతఁ ♦ జూపించుచు సం
శ్రితకోటి నుద్ధరించెడు
దితిదైత్యనికాయుడైన ♦ తేయుభజింతున్. ౧౧

మ. పొగడొందన్ హనుమంతుఁడై తొలుత రా♦మున్ భక్తిసేవించుచున్
దగభీముండయి కృష్ణసౌహృదనితాం ♦ తజ్ఞానపారీణుఁడై
మగుడన్ మధ్వవిభుండుగాఁగలిగిస ♦ న్మార్గంబుసూచించె నే
భగవత్కార్యపరాయణుండలజగ ♦ త్త్రాణున్ బ్రశంసించెదన్ ౧౨

మ. లవణార్ణోనిధి రామకార్యపరుఁడై ♦ లంఘించినట్లాత్మ భ
క్తివితానంబు భవాబ్ధి లంఘునసము ♦ త్సాహంబుగావించునే
సవిశేషప్రతిభాసముల్లసిత వి ♦ జ్ఞానప్రభావంతుఁడా (మదిన్ ౧౩
ఛవివంతున్ హనుమంతుదాంతు సుమహా♦చ్ఛాంతున్ దలంతున్

శా. జీవేశైక్యభిదావదావదమహా ♦ సిద్ధాంతసారార్థగుం
భావద్యోతక భాష్యసంగ్రథన ము ♦ ఖ్యప్రాణభూతాత్ముఁడై
జీవశ్రేణికి నచ్యుతాంఘ్రియుగళీ ♦ సేవాసుధాస్వాద లీ
లా నైశద్యము దెల్పుమధ్వవిభుని ♦ ల్లాంబుముసేవించెదన్. ౧౪

కం. ఇనశశికుజబుధగురుకవి
శనిరాహుధ్వజసమాఖ్య • సమశ్రీనుగ్రహముల్
వినుతానిశలాభస్థిత
ఘనఫలములమాకొసంగఁ • గాఁ బ్రార్థింతున్. ౧౫

మ. హరిపాదాంబుజ వందనాభి రతి ని • త్యప్రాంచితానంద ని
ర్భరచిత్తుండయి జీవదేవ పదత • త్వజ్ఞానపారీణతన్
బరమార్థజ్ఞుఁడితండనంగనతుల • ప్రఖ్యాతిరాజిల్లుమ
ద్గురునిన్ వేంకటనారసింహునతిని • ర్ధూతాంహుసేవించెదన్. ౧౬

తే. తనదుభరతచరిత్ర గ • ద్యాలరామ
మహిపతికొసంగిసన్మాన • మహిమఁబొంగి
వెలయుమద్గురు రెండుచిం • తలవసిష్టు
పుత్రుఁగొలుతు సీతారామ • బుధకవీంద్రు. ౧౭

మ. సురలోకావతరద్విరించవధూ • శుంభత్పదాంభోజనూ
పురఝాళంఝళికాయితాంచితవచ • స్ఫూర్జద్దరిత్రీ సుతా
వరచారిత్రవినిర్మితిప్రవణతా • వ్యాపారసుశ్లోకబం
ధురువాల్మీకిఁదలంతునాద్యకవితా•ధూర్నిర్వహోత్సాహునిన్ ౧౮

మ. కనదామ్నాయవిభాగసంచరదలం • కర్మీణవాగ్ధోరణీ
వినుతాష్టాదశసత్పురాణరచనా • విఖ్యాతినానాముని
ప్రణుతాత్రాక్యమ హాస్ఫుటాత్మమురజి • త్ప్రోద్యోతితాంశావతా
రనయోల్లాసుని వ్యాసునిందలఁతుస • ర్వజ్ఞత్వవిన్యాసునిన్ ౧౯

సీ. కాళిదాసుమనోజ్ఞ • కవితారసోల్లాసు
భవభూతిసంభృతా • భవవిభూతి
దండిదుష్కవిలోక • దండిశంకరునైదు
షివశంకరుమాఘు • జితవచఃమాఘు

శ్రీహర్షరచితసు ♦ ధీహర్షుఁ జోరు య
శోరుచిరాత్మప్ర ♦ చారుసమ్మ
యూరువిద్యానసీ ♦ ద్యోతమానమయూరు
శివభద్రుఁ గీర్తిల ♦ క్ష్మీసముద్రు

గీ. బాణుఁ గృతిపూజితాచ్యుత ♦ బాణుగుణఘు
ణుఁ జయదేవుఁ గీతస ♦ త్కృతికృతప్ర
భావు సకలగీర్వాణకా ♦ వ్యక్రియాను
భావవిభవుల సుకవులఁ ♦ బ్రస్తుతింతు. ౨౦

సీ. సన్నుతగుణధుర్యు ♦ నన్నపాచార్యుని
ఘనగుణోన్మేషిఁ ది ♦ క్కనమనీషి
స్ఫుటయశస్సాతత్యుఁ ♦ బోతనామాత్యున
దంభవచోల్లాసు ♦ శంభుదాసు
సజ్జనవినుతయ ♦ శస్కరు భాస్కరు
సురుచిరసత్కళా ♦ సోముసోము
గర్వితదుష్కవి ♦ గణభీము భీముని
స్తులతమోనిరసన ♦ సూరుసూరు

గీ. సత్యకీర్తిసనాథు శ్రీ ♦ నాథుసాధు
భూరినయధుర్యు నప్పిన ♦ వీరనార్యు
భాసురాంధ్రవచస్సము ♦ ల్లాసకృతిరి
రంసులగు సుకవిహంసులఁ ♦ బ్రణుతిఁ దేల్తు. ౨౧

సీ. పటుకవిత్వప్రతి ♦ భావతి భామతి
భోజరాజసభాప్ర ♦ పూతసీత
యఖిలకలావతి ♦ మైనలీలావతి
యతులవిద్యోన్నిద్ర ♦ యగుసుభద్ర

యున్నిద్రధీసము • ద్రోగ్వేలయగుశీల
విమలభాషామర్మ • విజ్ఞవిజ్ఞ
భరతాభినయకళా • పతిభానుమతిసపు
స్త్వార్థతత్వజ్ఞ బ • యగుసులీబ
గీ. నళినగర్భవధూపద • జలజయుగళ
ఘంఘుళితనూపురారవో • ల్లసదపూర్వ
సరససంస్కృతవరకావ్య • విరచయితలఁ
గవయితలనెల్లమది నెంతు • గారవింతు. ౧౧

సీ. కృష్ణరాయఁకుఁబు • త్రిక మోహనాంగిమా
రీచపరిణయస • త్కృతిరచయిత
విలసిల్లువేంకటా • చలమహాత్మ్యముకృతి
విరచించుతరిగొండ • వెంగమాంబ
మధురవాక్యములరా • మాయణకృతిసేయు
ననవద్యకవితల్ల • జాఖ్యమొల్ల
కృతినబలాసచ్ఛ • రిత్రరత్నసుమాల
గ్రుచ్చినభండారు • అచ్చమాంబ
గీ. నాగ్నజిత్తీవివాహమొ • నర్చిపెంపు
వడయువేమూరిశారదాం • బయును మొదలు
ఆంధ్రభాషాపరిష్కార • పైనసతులు
ని[illegible] ౧౩

తే. భూతిపొపులనుఁగొ సియాడి • ప్రీతిపత్త
మానకవులకు నంజలి • పూనిభావి
కవులఁదలఁపోసి యుపచార • గౌరవంబు
నడపెద మదీయకృతికిను • స్నతియొనర్పన ౧౪

కం. సరసుల లోఁ దెరుగఁ ద
శ్చరితమున విశారదత్వ ♦ చారమరయుచుఁ
బరుషములు వల్కుకుకవుల
మురిపెము సుకృతులకయోగ్య ♦ ముగఁదోఁచుఁగదా. ౨౬

వ. అనియిట్లు ప్రాగీప్సిత గ్రంథ నిర్విఘ్నకరణ సంప్రదాయా
వచ్ఛేదలక్షణ నిబంధనంబుగా నిష్టదేవతావందన గురుజ
నాభినందనంబులంగావించి. ౨౭

తే. కృతిముఖాచరణీయసం ♦ గతులునడపి
కర్తృవంశావతారప్ర ♦ కారకథన
మునకుఁగడఁగెదు నెడజన్మ ♦ భూమియందు
ప్రేమసహజముగానవ ♦ ర్ణింతుఁదొలుత. ౨౮

—*అంగలూరు గ్రామాభివర్ణనము.*—

సీ. చంద్రసూర్యాంకపా ♦ ర్శ్వలసత్తుహినభూధ
రమ్ముశిరోభూష ♦ ణమ్ముగాఁగ
గంగాసరస్వతీ ♦ కాళిందిముఖ్యన
దములు ముత్యాలహా ♦ రములుగాఁగ
గగనాగ్రచుంబిశి ♦ ఖర వింధ్యముఖకుల
శైలముల్కనదురో ♦ జములుగాఁగ
సంగతాన్యోన్యకృ ♦ ష్ణాగౌతమీనదుల్
లాలితంబగుమొల ♦ నూలుగాఁగ

గీ. తీరుపడమటికనుమచా ♦ లారుగాఁగ
సహ్యజాతామ్రపర్ణికల్ ♦ చరణనూపు

రములుగా నిత్యశృంగార ♦ రసము జిలుకు
మహిమలకుఁ బేటి భారత ♦ క్ష్మావధూటి. ౨౮

సీ. ప్రతిశతక్రతువైభ ♦ వాస్థలిం బాలించు
సగరనలాదులౌ ♦ చక్రవర్తు
లాసాగరాంతధా ♦ త్రీవనప్రచారులౌ
రామమాంధాత్రాది ♦ రాజవరులు
శ్రుతివిభాగక్రియా ♦ స్నాతధర్మసంస్థాప
నాచార్యులైనవ్యా ♦ సాదిమునులు
నవరసాలంకార ♦ కవితాప్రవీణులౌ
కాళిదాసాది స ♦ త్కవిచయంబు
గీ. గడుపుసల్లఁగ నేతల్లి ♦ గనినపిల్ల
లట్టివిఖ్యాతరత్నగ ♦ ర్భాఖ్యపూత
నిరుపమానఫలోత్కర్ష ♦ భరతవర్ష
వైభవం బెదఁ దలపోయ ♦ వందనీయ. ౨౯

వ. అట్టిభారతవర్షంబున. 30

శా. కృష్ణామండలమండనాయితమహీ ♦ భృత్పూజ్యసామ్రాజ్యలో
చిష్ణుప్రాభవశాలితాకలితమై ♦ చెల్వొందుచుం జంద్రమా
నిష్ణాతార్యజనాభిపూజ్యమహిమో ♦ న్మేషోల్లసద్గ్రామతా
భూష్ణుశ్రీగుడివాడమండలము స♦ద్భూమ్యాఫలోత్కృష్టమై. 31

వ. అందు. 32

సీ. వేదవేదాంగప్ర ♦ వీణతాపరధాత్రు
సుషమావిశేషభూ ♦ సురకులంబు
దారులోహహిరణ్యా ♦ తారశిల్పక్రియా
రూఢనైపుణ్యకా ♦ ర్యవ్రజంబు

నానాధనాగమా ♦ ధీనవాణిజ్యవృ
త్త్యాజీవనైశ్యజ ♦ నాకరంబు
హాలముఖాలబ్ధధా ♦ న్యధనాభివృద్ధిని
స్తంద్రదసచ్ఛూద్రప్ర ♦ జాయుతంబు

గీ. సఖిలసంపత్సమృద్ధమై ♦ యనవరతము
దలశకటసద్ధనుంటూప ♦ థంబుగాఁగ
శ్రీమదనుశేశకరుణావి ♦ శేషవిలస
దభినవాభ్యుదయమువిూఱు ♦ నగలూరు. 33

శా. సాంగస్ఫూర్తింబరావనీపతిజిగీ ♦ షణబాణ [illegible]
గంగామార్గమునందు రస్తునడుపన్ ♦ గాంక్షించి [illegible] చే
సంగప్లించఁగనిండుఁగట్టడలునే ♦ [illegible] నాటఁగోత్రల బుర
బుగస్తూరనుపేరవాడఁబడెఁబ్ర ♦ ఖ్యాతప్రచారంబుగన్. 3౪

మ. మొగలాయీల ప్రభుత్వవేళలఁ జమూ ♦ పుల్ [illegible] పోకల్గుతన్
దగునిచ్చోటనసీదు [illegible] హా [illegible] ద్వాంబొప్పనింపూడనా
ర్చ్యగరిష్ఠప్రమథాధిపాలయము ప ♦ జ్జ [illegible] కారెంబుగా
డఁగ నేన్ సంస్మరణీయమాత్రదశపై ♦ డన్ జాల నాసంగరిన్. 3౫

చ. పురినలుమూలలందు [illegible] ♦ పు [illegible] గలవందిత [illegible] సం
భరితములై సదావికచ ♦ వారిరుహోత్పలభాసురంబులై
శరధిచతుష్కమంతరవ ♦ సచ్ఛినలాత్మనురేఖ్వరాభిషే
కరచనఁగోరితా వాయుప ♦ కంఠమునే శెనా కోయసంగమన్. 3౬

చ. చెఱువుల్ తోఁటలుఁగమ రు ♦ చించెడుబాఁటలు మంచిపేఁటలున్
మెఱుఁగుసెలంగువాడలును ♦ మేడలు ప్రన్ననిచెట్లనీడలున్
గురుతరమైన కోవెలలు ♦ గోపురముల్దగు ధర్మసత్రముల్
గరమరుదారనస్థలిసిన ♦ గల్గుసిరుల్గణుతింపశక్యమే. 3౭

గీ. గలిగి ధనసంపదలసారు ♦ గనికుజేరు
కలిమిమెచ్చక పసమీరు ♦ కమ్మవారు
సాలఁబెంపారుసజ్జన ♦ సమితితీరు
నభినవోత్సవములఁగోరు ♦ నంగలూరు. ౪౦

సీ. జననాదికమ్మునే ♦ చరెకర్తయొకఁడు లేఁ
డనుతత్త్వవిజ్ఞాత ♦ లచట లేరు
భూసురాదికవర్ణ ♦ ములు లేవు శుక్లాదు
లవియనుసంస్కర్త ♦ లచట లేరు
శౌచమారోగ్య శా ♦ స్త్రమె ధర్మనియతిగా
దనిచెప్పుతార్కికు ♦ లచట లేరు
దానధర్మములు బం ♦ ధనహేతువులె మోక్ష
మబ్బదన శాస్త్రజ్ఞు ♦ లచట లేరు
గీ. కలిగి నందరాస్తికులులో ♦ కజ్ఞులధిక
తత్త్వవేత్తలు ధర్మప ♦ థప్రవిష్టు
లైనజనములు సుమనస్కు ♦ లధివసింప
నమలినస్ఫూర్తిఁజెలువారు ♦ నంగలూరు. ౪౧

సీ. కోట్సుబూట్సునుబ్యాట్సు ♦ గొనినవిద్వాంసులు
నైతిమన్పొంగువా ♦ రందు లేరు
శూన్యఫాలము క్రోత ♦ జుట్లునై సంస్కర్త
లనుపేరుబూనువా ♦ రందు లేరు
శ్రుతుల ప్రమాణముల్ ♦ మతిఁదోఁచినట్లునే
యుగధర్మమనుధీరు ♦ లందు లేరు
అజ్ఞులుమనపెద్ద ♦ లాచారములువ్యర్థ
మను నాగరికశూరు ♦ లందు లేరు

గీ. పండితుల కర్థములొసంగ ♦ వలదువారు
కాయకష్టముచేత్తుర ♦ కర్మమైన
యాచరించిగడించరా ♦ దాయటంచు
నార్యధిక్కృతిసల్పువా ♦ రందు లేరు. ౪౨

సీ. ఒక్కరెండింగిలీస్ ♦ ముక్కలురాఁగనే
విద్వాంసులని విర్ర ♦ వీఁగువారు
క్రాపింగుతల తిల ♦ కము లేనినొసలునై
సంస్కర్తలనియుబ్బ ♦ సాగువారు
సత్తుచిత్తనుపల్కు ♦ లొత్తిపల్కుచుమహా
వేదాంతులనిపీఠి ♦ వెడలువారు
పట్టె నామమ్ములు ♦ వెట్టినంత నె విష్ణు
భక్తులమని ప్రజ్ఞఁ ♦ బలుకువారు

గీ. కుంటిగ్రుడ్డకు నొకనాఁడు ♦ గ్రుక్కెడంత
గంజిపోయించినసె దాన ♦ కంకణమ్ము
గట్టితిమటంచు దంబముల్ ♦ గొట్టువారు
మందునకునైన వెదకిన ♦ నందు లేరు. ౪౩

సీ. స్వాతంత్ర్యమింగనా ♦ జాతికిఁగూడదా
యని పతికెదురాడు ♦ నట్టివారు
చదువేను నేర్పితిఁ ♦ గదగృహకృత్యముల్
సేయ నేటికనియో ♦ చించువారు
నక్షరజ్ఞానము ♦ న్నందుకు విటులకు
త్తరములువ్రాయుటే ♦ జరుపువారు
సభలకుఁబోవచ్చు ♦ సతులన్న నడకువ
విడచిపెద్దల కంట్లఁ ♦ బడెడువారు

గీ. కాఁశివాసంబుతగదు ని ♦ ర్బంధమనుచు
విడువనాడఁబిల్లు కైసేసి ♦ వీధి వీధి
విబులనామంత్రణము సేయ ♦ వెడలువారు
పారసాక్షులెవ్వాఁరున ♦ య్యూరఁలేరు. ౪౪

సీ. దమయంతి సీత చం ♦ ద్రమతిముఖ్యపతివ్ర
తలచరిత్రములు ని ♦ త్యమును జదివి
పతిభక్తివృద్ధిస ♦ పర్యయీశ్వర సేవ
యనుమహాగుణముల ♦ నధిగమించి
సత్యంబుదయయునా ♦ ర్జవముశౌచముశాంతి
జ్ఞానసంపత్తి ని ♦ చ్చలువహించి
యాయవ్యయముల ర ♦ హస్యమ్ములెఱుఁగుచు
గృహకృత్యనిర్వాహ ♦ మహిమగాంచి

గీ. నిర్మలపరోపకార స ♦ త్కార్యనియతి
నలరియింతులమేల్బంతు ♦ లనఁగఁదనరి
యహార స్త్రీవిద్యకడులాభ ♦ కారియనని
దర్శనములొసంగ రచటి సౌం ♦ దర్యవతులు. ౪౫

సీ. ఎయ్యదిసంఘాభి ♦ వృద్ధికిఁజాలప్ర
నాదియైసుజనాభి ♦ నంద్యమయ్యె
నెయ్యదిగార్హస్థ్య ♦ హితధర్మమార్గప్ర
చారహేతువుగాఁ బ్ర ♦ శస్తమయ్యె
నెయ్యదిదేశమం ♦ దెల్లనాగరికత
తలసూపఁగలదోహ ♦ దముగనెసఁగె
నెయ్యదిచిరసమా ♦ దృతతమంబడచివి
జ్ఞానమార్తాండ ప్ర ♦ కాశమొసఁగె

గీ. ననుదినాభ్యుదయమునొంది • యంగనలకు
కల్పలతవోలెనొసఁగుసం • కల్పఫలము
ప్రౌఢిమైనట్టిబాలికా • పాకశాల
రంగుమీరఁగ నలరారు • నంగలూరు. ౪౬

క. ఆపురమునవిలసిల్లుఁ
శ్రీపతినతలోకవితతి • సీతారామా
ఖ్యాపరిణతినకోవెల
గోపురముశిఖాగ్రచుంబి • గోపురమగుచున్. ౪౭

సీ. చాలునెవ్వనిమంత్ర • శక్తిరామునిఁగూర్చి
రవిసుతువాసర • రాజుఁజేసె
తనరునెవ్వానియు • త్సాహశక్తిపయోధి
వడిదాటిజానకి • వార్తఁదెచ్చె
ఘాసిల్లునెవ్వాని • ప్రభుశక్తిరణహతుం
డైనసౌమిత్రికిఁ • బ్రాణమిచ్చె
తలఁపనెవ్వానిస్వా • తంత్ర్యశక్తిభవిష్య
దబ్జాసనత్వము • ర్యతవహించె
గీ. నమ్మహాప్రాయుఁడైన వీ • రాంజనేయుఁ
డాశ్రితావనపరమద • యావిధేయుఁ
డగుచునర్చాకృతివహించి • యధివసించి
యప్పురింబూజితుండుగా • నొప్పుచుండు. ౪౮

కం. మంగళములిచ్చి గ్రామము
లంగలఁబ్రజలకుదొసంగు • లనుదీరిచిప్రో
వంగలవేలుపుపేరున
గాంగానాలమ్మయనబ్రా • గడ్తుంగాంచున్. ౪౯

కం. గాంగానాలమ్మమెతా
గంగానమ్మయనజనని ♦ కాయముదయతో
డంగావనూరనూరనె
సంగుచుననువర్షమున్బ్ర ♦ జలపూజఁగొనున్. ౫౦

వ. కావున. ౫౧

సీ. వరుణదిక్కునఁగృతా ♦ వసథమైమాయూరి
జనులఁబ్రోచెడునమ్మ ♦ వనములమ్మ
చలిది నైవేద్యము ♦ ల్పాపడిబిడ్డలఁ
గనికరించెడునమ్మ ♦ వనములమ్మ
ప్రతివత్సరము జాత ♦ రలమెచ్చి కాపుల
ననుకంపఁగనునమ్మ ♦ వనములమ్మ
చీడపారులమాన్పి ♦ యోడకఁ బశువులఁ
బెనుపు జేసెడునమ్మ ♦ వనములమ్మ

గీ. పాడిపంటలుదయచేసి ♦ ప్రజలనెల్ల
మొనసికాపాడఁ గలయమ్మ ♦ వనములమ్మ
పూని నేజేయువందన ♦ ముల్గ్రహించి
పెనుపుసిరులివ్వఁగలయమ్మ ♦ వనములమ్మ. ౫౨

వ. మరియు నప్పురవరంబు నిరుపమాన సంపద్భరితంబై కరంబునల
రారుచు నలుగడల నెలకొను పొలంబులఁ దలంబగు కలమాది
సస్యంబులచెలువు కనుల పండువులుసేయ బలుమరు చేలగట్టుల నీరు
వెట్టదిరుగాడు పొలము కాపరుల సందడికిం గొందలంబంది పరచు
పొలముపిచ్చుక పూరేడు మొదలగు పులుగుల రెక్కలసవ్వడికి
సంగాతంబగు లేత పయ్యెరపోకునకు గదలు వరియాకుల మ్రో
తలపేరి సంగీతమునకు బరిసరంబునంబరగు చిరుతగుంటల నిండి

కొను మండూకకాండంబుల రటాత్కారంబులు తానమానంబులు సూప నపూర్వంబగు శ్రవణానందంబు గందళింప నందందతందాన పదంబులు వాడుచు కోలూది కత్తవలం ద్రొక్కి మొల్లంబులగు చెల్లు లెత్తి గట్టులుం గురిమిడులు వేయు కమతగాండ్రం బిలిచి కాలోచితంబులగు నూడిగంబులం జెప్పుచు పాడి పసరంబునకు నిన్నగడ్డి మోపుం దేవైతివి నేడు దూడం గుడుపద య్యో నింతయాగడంబా యని బెదరించు యజమానులం గని గజగజవడంకి బొంకుసాకులం జెప్పబోవ జంకెనచూపులం బింకంబు సెరిపి యింకనైన మెలకువతో మెలంగుమని చెప్పిపోవు సంసారులును

సంసారుల యిండ్లముందరి కొట్టంబులం గట్టువడి పాలంబులన్నియు జలంబు నిండి యునికి బైలు మేతకు పోంజాలకం జేమేతల మరగి వట్టిగడ్డియు జనపకట్టలుం బొట్టనిండం దిని గుఱవెట్టు నేత్రపద్దలకు దూడలవిడచి పాలుపితికి పనటులంబోసి కాచి తోడు వెట్టి వేకువన లేచి చిలుకం బూనిన ప్రోయాండ్ర కరంబులం గల్లుగల్లున మొరయు కంకణంబుల రవళికిం దలంకి కొక్కొరకోయని కూయు కోడికూత లాలించి మేలుకని లేచి సాలలం గట్టిన యాలపోతులకు మేతలు వైచి గృహప్రాంగణంబులం గూర్చుండి గుస్సగుస్సనం బొగచుట్టలు కాల్చు ముదుసలివారు పోరాడి లేప నెట్టకేలకు లేచి కనులు నులుముచు నుత్తరీయంబులు జారం జేతికఱ్ఱలును గ్రుచ్చెప్పులుం దొడగి కట్టుబడివారలం బిలిచి హలాదిపరికరంబు లెత్తించుకొని పొలంబులకు వోవు పడుచువారలును

పడుచువారలు మూపునం గావడులలో బిందియలం డగింపం జెరువునీరు మోచి తెచ్చునెడం గడచిన రేయి పడిన చినుకుజడివలన నడుసైన దారువుల నడచుట నడుగుల నంటుకొనిన బురదం గడుగు

కొన దాము తెచ్చిన నీరంతయుఁ బొరబోయుఁ జాలుఁజాలు మీరు నీరు తెచ్చిన నిరవాకంబేమి యింటిలోని కుండలన్నియు వట్టివయ్యెనని విసుకుకొను ముసలమ్మలును

ముసలమ్మల పైటచెరంగులంబట్టి యుసియాడు పసిపిల్లలు కసరువట్టిన బుజ్జగించుచు నజ్జునందొచి యీతేపంగ్లో యని కేకవైచిన విని పెనురుతివ్వలలో వడ్లగింజలుపోసి తీసకొనిపోయి పల్లెమ్మున సరికిసరియని బుట్టలంగొలిచి పోసుకొను కొవడివాండ్రంగో జగడంబులాడి తోడివారితో వారియాగడంబు లుగ్గడించు ప్రోడచేడియల సందడికి బెదరిఁ జెదరలాగు కోడెల నదలించుచుఁ బుడమికి లంఘించి ప్రోలువట్టెఘూలలకు దొలఁగ శకటంబులు దిగిచికొను శాకటికుల సమ్మర్దంబున నడువ వలనుగాక నెడనెడ నరుగుప్రక్కఁజేరి చేతిగంటల మ్రోగించవీలులేక "సాంభశివా" యని కేకవైచు జంగంబుదేవరలకు సూయవారంబులుదెచ్చిపెట్టు మచ్చెకంటుల కేలి బంగరు కడియంబుల జిగిడంబుతోడ నెకసక్కెంబులాడు చావడులలో రాసులుపోసిన కట్టు కుసుమధాన్యంబులును

కుసుమధాన్యంబులు రాసులుగొలుచు కొలగాండ్ర కుంచంబులకువంచాలుపట్టిన సంచులు నిండిన నొండొంటికి జేరగిలఁబెట్టి పట్టుబడులు తీరిన కుట్టినెట్టెంబువైచి బండ్లమీద నెక్కించి ఘూమశకటస్థానంబునకుఁ దోలుకొనిపోవు సాహుకార్లతోడి బేరంబులాడి కూడిన రొక్కంబుల చేజిక్కంబులు నింపుకొను మోతుబరిరైతులును

మోతుబరిరైతుల నాశ్రయించి సాలుపెట్టుబడులకు నప్పులు తెచ్చి యిల్లువాకిండ్లు పొలముపాత్రలు కుదువలుబెట్టియు విక్రయ

పత్రంబులు వ్రాసియు, కాడిసాగించి పండినపంటలనెల్లఁ దెచ్చి వారి యింట నప్పగించు బీదసాదలకు నాదరువగు పాడిగేదెలను నని పెడు జనపవాములిడిన దాక్షిణ్యకారకుల దట్టంబుగఁ బ్రాకిన సొర బీర కాకర మొదలగు పాదుల వెదకి తెచ్చిన కూరగాయల కతం బునఁ బ్రతిదినంబును శాకలోపంబు లేక విందుగుడుచువారల చం దంబునం దనరు భూసురబృందంబును

భూసురబృందంబు మందిరంబుల సుందరాంగు లరవిందమిత్రుఁ డుదయించకయె ముందుగానందంబుగా నలికి ముగ్గులు పెట్టి పాత్రశో ధనంబు గావించి చెరువునకరిగి యమ్మలక్కలతో ముచ్చటలాడుచు నుదికిపిడిచిన మలినవస్త్రంబులొక్క బుజంబునను నుదకపాత్రంబు లొక బుజంబునను దాల్చికొనివచ్చి ప్రొయిరాజవెట్టి పొదలకడ వంటలు గావించినఁ; జెరువుగట్టు మఱ్ఱియాకులు దెచ్చి విస్తీర్ణంబు లగు విస్తరులంగుట్టి స్నానంబు చేసి దేవతార్చనంబు సలిపి జేగంట లుగొట్టి గృహమేధుల భోజనావసరంబులకు జుక్కతెగిపడునట్టు వచ్చి వారు వేగంబ రమ్మన బుడిచెంబులు పూని స్నానంబు గావించి తడిబట్టలార వైచి కట్టుకొనివచ్చి వడ్డించబోవు తఱి మాకత్తెసరు లని జారవిడచి నారీమణుల వేధించి కడిగిపెట్టిన తప్పెలలఁ దుడిచి పెట్టి యాకంతంబుగా భుజించి యించుక విశ్రమించి యూరిపిన్న పెద్దలంజేరి పిల్లవాని యుపనయనంబనియుఁ బిల్లదాని పెండ్లియని యుఁ జెప్పుచు నాశీర్వచన పనస లేకరువుపెట్టి సొమ్ము కాసిదు గ్గాని సంతరించికొనిపోవు విప్రయాచకుల నీచవృత్తిం బయింగోడి చూచుచు నర్థోపన్యాసంబు గావించు పండితులఁ బరివేష్టించి చెరు వుగట్టున మఱ్ఱిచెట్టుక్రింద రామాయణాది పురాణశ్రవణంబు లా చరించు జరఠసమూహంబును

జరఠ సమూహంబు గోష్ఠినుండ మనసొప్పక దవ్వుగా జేరి నవ్వులాటలమాటలాడుచు నిష్ఫటులాటలాడు క్రోడెకాండ్ర పజలం గూరుచుండి చంకనిరికికొనిన జనపనారపోచలల్లనల్లన నందించి పురిబిళ్లలం గ్రుసనం ద్రిప్పుచు గండెలువడుకు నడిపాయంపువారి గేరడంబులాడి యర్ధముండితంబులగు కాశింగుతలలమర వెనుక ముందులు సమంబులుగ జారవిడచిన చెంగులల్లాడం దెల్లమల్లుటా ణెలంగట్టి నిస్తులంబులగు నిస్తిరీకోటుంపై వల్లెవాటునైచిన సరిగ ఖండువాలు జిరాడ వాటంబులగు బూట్సులందొడిగి నాగరికము ద్రవెలయ షోకుగా వీధులందిరుగు తరుణవయస్కుల సలీలా విహారంబులును

హారంబులుగ నమితందాల్చిన రుద్రాక్షమాలికల సందున దాండవించు లింగకాయలు వక్షస్తాడనంబాచరింప బాడిసెలం బూని దారువుంజెక్కి రథాంగాది శకటావయవంబులు రచించు రథకారవారంబుల చేతిసమ్మెట ప్రేటులం బొడము ఠాంకారనాదంబు శ్రవణకుహరగతంబైన జెవులు రిక్కవొడచి తోకమట్టెత్తికొని పరచు గోతర్ణకంబుల మెడలంగలుగు చిరుమువ్వల ఘుళంఘుళారావంబు తానమానంబు సంపాదింప నతినూతనోపవాహ్యమాన శకటంబుల యిరుసూరాపిడిని వెడలు సీత్కార రావంబు వల్లకీస్వనంబు కరణి శ్రావ్యభావంబునొంద నయత్నకల్పిత మంగళతూర్యవిలాసంబు శవణింపం దనరు శృంగాటక ప్రదేశంబులును

శృంగాటక ప్రదేశంబుల నెసంగు సంగళ్ల మంపుగాడ్పైన గంపలంబోసి కందులుపెసలలసందలులవలు మినుములు మొద

లగు గాయధాన్యంబులు, సుప్పు మిరపకాయ చింతపండు మొదలగు సంభార ద్రవ్యంబులును గొనవచ్చినవారితో బేరంబులాడి తవ్వాలు సోలలు వెట్టి కొలచి కాని దుగ్గాని లాభంబులకు బీకులాడి తీగెలుదీయుచు మాటలాడు గోమటిపెద్దల యంచించి మామూలుపేర యీగానిదెమ్మని చేతి యినుపగూటంబుల గొంకెంబులు గిల్లుగిల్లున మోగించుచుఁ రాగ పాటలువాడు బంటవాండ్ర యల్లరికిం జెవులుసిల్లులువోవ నిలువనోడి విసుకుకొనుచుంబోవు సంసారులకుం దారసించి "బాబుగోరు! మీరు సూపినపని చేసినామండి; గట్టుమీదదుబ్బులెక్కదీసేశాం; ఆడబ్బిప్పించండి యింకేమైనపని సూపింతారండి" అని యడుగు తూయుపువాని వెంట వారలుగూడెంబున కరిగి యచ్చోచ్చట నెడమచేత జంగులను వొడికమ్ముల నడుముం జేతిమీద నందగించు గాజులుగలిగి రిత్తగానుండు గుడిచేయి మాటుటకు నోయన గుడిపయ్యెంటలు వెలయ ముదుకంచు కోకలుగట్టి చెవుల గుండనంపు పైడికాడలందగింప నుండు వెలమెతల గొందరింజేరి యూడిగంబులకు నియోగించువారును

వారును వీరును బిలువ బేరంబులాడి రూకపైకము హెచ్చుగబుచ్చికొని చలిదిసాపడి తలను మొగురాచి యొక్కపరి దువ్వికొని గంజియన్నంబుకుండలు నెత్తిబెట్టుకొని "ఓవెంకమ్మ నాగమ్మరామో బ్రొద్దెక్కెన"ని యొండొరుల బిలిచికొని గుంపులుసాగిచేలకుంబోయి బట్టలెగగట్టి చేతనాగుపట్టలుపట్టి బారులుదీరి వంగి "కామమ్మఘట్టంగ కరువువచ్చింది" యనియును "మునగ పూవంచులు తుమ్మెదా, మా మునసాబుపేరేమి తుమ్మెదా" అనియును పలువిధంబులగు పాటలఁ జెవులు గింగురుమనునట్లు పాడుచు నాటువేయు నూతపువాండ్రఁ జూచుచు నడచుపాంథుల జేరి

మాకుంగల్లుకుండ దెమ్మని యుల్లరిచేసి వారిచే జేడపావుగొనిపో వుగట్టువాపడంతుల జంతతసంపు వింతలకు మిసిమింతులగుచు యుల్లంత ఘంటాపథంబులనరుగు నాగరిక సమూహంబులును

నాగరిక సమూహ ముత్సాహంబుగల్పించి స్వదేశ శిల్పనైపుణ్యంబభివృద్ధినొందించు తలంపున జేయూతయొసగిన నూతనముచు మూలబడ్డిన మగ్గాలు మునలసాగించి, నిపుణులగు పనుగులమరించి బరిబెద్దిచ్చి కండియలాసుకొట్టంబులంబెట్టి యిట్టిబజోషిపలక దట్టింపున కులయూను గుణ్యంబుగ. పాటలు. పొడుచు నేతపనిసేయు సాలెవారల జేరనరిగి చీరలు జామూనులు పేరంబులాడి కొనిపోవు వణిక్ప్రకాండంబులును

వణిక్ప్రకాండంబులు వెరగుపడ బహువిధంబులగు క్రొత్తరంగుల చీటితానులు గాలికట్టు చెన్నులు విక్టోరియా మకీనా మొదలగు విలాతి వస్త్రంబులుప్పాడుచాపులు గలంకారియద్దకంబుల రకంబుల చీరలు ఉత్తరీయంబులు లోనుగాగల వివిధవస్త్రవితానంబుల మడతలు గడుమంచెలంబెట్టి, కొనువారికి విసువులేక చూపుచు బేరంబులాడు బట్టల యంగళ్లవారును

బట్టల యంగళ్లవారివద్ద నద్దెకుందెచ్చి, చాపుపైనుతానులు చాందినీలుగట్టి జాత్రగర్భితంబులగు తెరలలంకరించి దర్శనీయంబులగు సీనులందగింప నపూర్వనాటక ప్రదర్శననిపుణులగునటులచే ప్రవర్తితంబులగు నాటక రంగంబులును.

గలిగి యసామాన్య రామణీయకంబున దనరు నప్పురంబునందు.

## ౼* కవి వంశానుక్రమణిక *౼

శా. శశ్వద్ధుర్భరి తపోమహత్త్వమున పర • ప్రష్ఠత్వవిఖ్యాతుఁడై
విశ్వామిత్రనివారకంబగుచు శ్రీ • విర్మించు సర్వజ్ఞుఁడా
విశ్వామిత్రమహర్షిగోత్రమున నా • విర్భూతులై నిస్సమా
నైశ్వర్యంబున నుంద్రుసండగిరి నా • రవ్వీటవ్యాపారులై. ౫౪

శా. సాధ్వాచారపరాయణాత్మ నిజవం • శక్షేమకృత్ జ్ఞానసం
పద్వ్యస్తాంహసుఁడై వెలింగెఁగమలా • పత్యంఘ్రిసేవాదృతిన్
మధ్వశ్రీగురువందనాభిరతి స • న్మానార్హుఁడై సద్వచో
మధ్వభ్యాహృత పండితర్షభుఁడు శ్రీ • మత్పద్మనాభుండిలన్. ౫౫

తే. అమ్మహోనిధి రఘుపతి • యమ్మవోలు
నబ్జలోచన రఘుపతి • యమ్మయందుఁ
గనియె నిరువురుపుత్రులఁ • జనుఁడువిద్య
యందువిజ్ఞానబోధంబు • లందినట్లు. ౫౬

శా. భ్రాజిష్ణుప్రతిభానిరాకృత మహా • బర్హిర్ముఖాచార్యుఁడై
రాజిల్లెన్ బటురాజకార్యకరణా • రంభప్రథాదంభస
త్తేజోవైభవమొప్పసర్వబుధప • ఙ్క్తిస్తవ్యచాతుర్యరా
మాజీపంతులు సంతతార్థిపటలీ • మందారభూజంబనన్. ౫౭

కం. శ్రీరాముఁడు మునుజానకి
నారూఢిన్ బెండ్లియాడి • నట్టులరామా
జీరావుజానకమ్మన్
దారంగాఁగొనియెధర్మ • తత్పరుఁడగుచున్. ౫౮

చ. జనకునియిల్లువిల్లలపు • సంపదలన్ దులదూఁగనుర్వరా
జనవసుప్రసిద్ధిఁగని • స్వచ్ఛవిదేహకులాభిరామమై

ఘనశివధర్మపద్ధతము ♦ గాంచితోఁ సుఖవృద్ధినొందె రా
మునిసతి జానకమ్మసరి ♦ పూర్ణమహాగుణభాసమానయై. ౫౯

కం. కనిరాదంపతులు ముదం
బునవిద్యాద్రినర్గములను ♦ బోలెడుఘనులౌ
తనయులను శేషగిరి రా
వును వేంకటనయను సుప్ర ♦ భునినరసింహులఁ. ౬౦

వ. అమ్ముమ్మువ్వురిలోన. ౬౧

కం. తనరెడు హిరణ్యకశిపు వ
ర్ధన సంప్రీణితబుధుండుఁ ♦ బ్రహ్లాదసదా
వనుఁడుదితపుణ్యజనసుఖుఁ
డన వేంకటనారసింహుఁ ♦ డచ్యుతయశుఁడై. ౬౨

వ. మఱియుసత్తముఁడు. ౬౩

సీ. సతతవిష్ణుపదాను ♦ సరణప్రవీణుఁడై
సత్ప్రభుండనెడుయ ♦ శంబుగాంచి
విబుధాన్నదానప్ర ♦ వితరణశౌండుఁడై
కువలయంబునకుమ ♦ క్కువయొనర్చి
సకలకలావిలా ♦ సములకు నిక్కమై
జైవాతృకత్వప్ర ♦ శస్తిమించి
చారుసువృత్తప్ర ♦ చారధుర్యుండై
ఘనభూజనానురా ♦ గంబు వెంచి

గీ. వరయశశ్చంద్రికలదిగం ♦ తరములలరఁ
దనరుసర్వజ్ఞశేఖరుం ♦ డనుచుఁ బొగడఁ
దగనిజాన్వయజలధికు ♦ త్సవమొనర్చె
శ్రితబుధుండు వేంకటనార ♦ సింహవిభుఁడు. ౬౪

క. పరిణయమయ్యెనతండిం
దిరమందరధరుఁడుగొనిన ♦ తెఱఁగునఁబ్రీతిన్
వరముఖజితశశిబింబన్
జిరతరసుగుణావలంబ ♦ శ్రీశేషాంబన్. ౬౫

సీ. గుణమునీచానుస ♦ రణమన్నసడివాయ
జనియించినట్టిచూ ♦ జలధికన్య
రాతిపుట్టువటన్న ♦ రాఁయిడిదీర్చుకో
జన్మాంతరముగన్న ♦ శైలపుత్రి
పలువురనోళ్లలోఁ ♦ బడినయూరడిదీర
నిలభవమొందిన ♦ పలుకువెలఁది
పెనురక్కసికిని బు ♦ ట్టిన దూరువోనాడ
మారుపుట్టువునందు ♦ మఘుపురాణి
గీ. యనఁగనతిలోకభవ్య గు ♦ ణావలంబ
యగుచు సంతత భర్తృసే ♦ వానురాగ
కలనఁబతిదేవతాతిల ♦ కంబునాఁగఁ
జెలఁగెసద్గుణనికురంబ ♦ శేషమాంబ. ౬౬

సీ. గారాముతోఁబెంచ ♦ దారపాలికునాజ్ఞ
మేయమ్మ సద్బుద్ధు ♦ లెల్లనేర్పె
నసమానగృహనిర్వ ♦ హణశక్తిఁగష్టము
లేకుండ నేయమ్మ ♦ సాకెనమ్మ
మరిరామబాయి ల ♦ క్ష్మణబాయి భరతబా
యియు శత్రుఘ్నబా ♦ యి యనునామ
చిన్నికూతులనెల్ల ♦ నన్నుబోలఁగఁబ్రేమ
వెలువారఁబెంచునే ♦ ధన్యశీల

గీ. కులము వేల్పగునట్టి శ్రీ ♦ జలజనాభు
వలని దృఢభక్తి నాకల ♦ వాటు సేసి
ఘోరమగు తత్కరుణకు బా ♦ త్రునిగఁ జేసి
నట్టి మాయమ్మ శేషమ్మ ♦ యభినుతింతు. ౬౭

కం. ఆమిథునము పూర్వసుకృత
సామర్థ్యప్రాప్త రామ ♦ చంద్రకటాక్ష
శ్రీమహిమ గాంచె విబుధవ
రామాన్యగుణాఢ్యు వేంక ♦ టప్పయ్యనఘ్. ౬౮

మ. విలసద్వాయుకుమారదివ్యకరుణా ♦ వీక్షాసమాసాదితా
మలధీనై భవసన్నిరూఢకవితా ♦ మాధుర్యపారీణతన్
గుల దైవంబగు వాసుదేవునికథా ♦ నూత్నామృతాస్వాదనం
కలితోత్కంఠత నొక్క నూతనకృతిం ♦ గావించఁగా నెంచుచోన్. ౬౯

* గణకవృత్తిప్రశంస. *

సీ. రాత్రిందివవిభేద ♦ రహితనానావిధ
లేఖ్యసమ్మర్దజ ♦ డీకృతంబు
పృథులకేదారప ♦ రీక్షార్థబహుళప
ర్యటనానిరంతరా ♦ యాసితంబు
నసకృత్ప్రభుత్వస ♦ మానయహేతుమా
తాయాతసంక్లేశ ♦ తాంగకంబు
నైకరాట్పురుషసే ♦ వాకృతావసరప్ర
తీక్షణవిషయావ ♦ ధీరితంబు

గీ. కశ్చిదధికారదర్శితా ♦ గౌరవంబు
ముహురశిలగ్రామ్యజనవాక్ప్ర ♦ ముషితధీక

మనవరతబహుకృత్యస ♦ మాకులంబు.
గడుభరంబగుఁగద గ్రామ్య ♦ గణకవృత్తి ౨౦

సీ. ప్రతికాల్వతూమునం ♦ బరువారి దెమ్మని
యింజనీర్శాఖవా ♦ ర్గుంజుచుండఁ
బ్రతితాడియీతనం ♦ బరుసూపుమనియాబు
కారిడిపార్ట్మెంటు ♦ వారుబిలువఁ
బ్రతిబీటు కేసీల ♦ పట్టీతనిక్కీకి
పోలీసువారొక్క ♦ మూలఁదగులఁ
బ్రతిదినంబునను వా ♦ రంటునమన్సనర్వ
గోరిసివిల్ కోర్టు ♦ వారుదిగువ

గీ. రాళ్లనుచు బీళ్లనుచు సాగు ♦ బళ్లటంచుఁ
బలుతెరంగులయధికార్లు ♦ పట్టిలాగ
లెక్క కెక్కువయగు పనుల్ ♦ సిక్కుపరుపఁ
గరిణీకము కూరలందుప్పుఁ ♦ గల్లువోలు. ౨౧

శా. ఆచంద్రార్కన నశ్వరోజ్వల సమా ♦ ఖ్యాశాలిరాణ్మాన్యతా
సాచివ్యోన్నతగోపరాజుకుల భా ♦ స్వద్రామమంత్రీంద్రసా
మీచీనోద్యమవిప్రసాత్కృతములై! ♦ మించెన్ ద్రదలింగావనిన్
ప్రాచుర్యంబుగ గ్రామలేఖ్యపదవుల్ ♦ పారంపరస్వాస్థ్యతన్. ౨౨

మ. అనవద్యప్రతిభాప్రభావవిభవుం ♦ డావేణుగోపాలరా
వనుధీరుండు విశాఖపట్టణవరం ♦ బందుండివిచ్చేసి వి
న్నను మాస్పారఁగొనెన్ నబాబుఫరమా ♦ నానంగలూర్గ్రామునతే
ఖ్యాని యోగాంచితవృత్తిసర్వజనమా ♦ న్యప్రక్రియాపాత్రుఁడై. ౨౩

ఉ. ఏనఁగనాఁడు నామహితుఁ ♦ డేడవతాత నృపాలుఁ డెల్లమ
న్నించఁదదాదిమత్పితరు ♦ లెల్లరు జీవనవృత్తిదానిఁగా
వించిరి నేను నిప్పుడది ♦ పీడఁగలేక కులక్రమాగతం
బౌచుసగౌరవంబుగఁద ♦ దాశ్రయము౯ భజియించియుండుట౯ ౨౪

చ. కరిణికవృత్తిసూఁడఁబహు ♦ కష్టము రేలుఁబవల్లఁ దత్క్రియా
చరణకృతావధానతయె ♦ సంగప్రసంగమికొందుసేయఁగాఁ
దరియఁసుమంతయుండదిఁకఁ ♦ దద్దయువిద్దెలనేరువ౯ బ్రబం
ధరచనసేయశక్యమగు ♦ నాయది వేరుగఁజెప్పనేటికి౯. ౨౫

వ. అట్లుండియును. ౨౬

* క వి వి చా ర ము. *

చ. తలపఁబురాజనుర్వరచి ♦ తంబగు పుణ్యముకల్మినెట్టులో
నళినదళాక్షుదివ్యకరు ♦ ణాలవపాత్రతఁగాంచివాఙ్మితా
కలనమొకింతనాకిపుడు ♦ గల్గులుగీర్వనితాపదాబ్జసం
విలసితనూపురారభటి ♦ మించు కవిత్వరసానురక్తిచే౯. ౨౭

మ. తలప౯ బండితసాధ్యమైతగు ప్రబం ♦ ధంబ్రాంధముగావించిని
ర్మలభక్తి౯ జననంబునెల్లఁజరితా ♦ ర్థత్వంబునొందింపఁగాఁ
గలనోయంచుఁగడంగునాకడఁకఁజో ♦ కఁ బ్రాంశులభ్యోన్నత
స్థలసంయుక్తఫలంబుకుబ్జుఁడుగొన౯ ♦ దాఁబూనునట్లాగదా. ౨౮

మ. అగునో సంతతినెర్రిమొర్రియనిజా ♦ యూసాగ్రహాపేక్షమా
నఁగలాఁడెవ్వఁడు, గద్యపద్యములసం ♦ దర్భంబుమాధుర్యమొం
దగఁబోదంచుప్రబంధకల్పనకును ♦ ద్యద్యత్నము౯ జేయఁగాఁ
దగదే కావునఁగేలిసేయకుఁడుమ ♦ త్ప్రారంభము౯ బండితుల్. ౨౯

మ. యతనీయంబగుఁగాదెకీదృశునకు౯ శ్రే ♦ యస్సాధనప్రక్రియా
యతికై కాననసాధ్యమైనస్వమతి ♦ వ్యాపారయోగ్యస్థితి౯

ధృతినేతాదృశకృత్యనిర్వహణసా • ధిష్ఠప్రయత్నంబుబూ
నితినన్నుం జరితార్థుఁ జేయవిధిరా • నీవాశ్రితార్థించుచున్. ౮౦

మ. కలవెన్నో రసవంతముల్ సుకవితా • కావ్యంబులిం కేలనీ
యలఁతింబల్కులఁ గ్రొత్తకబ్బమని ధీ • రాగ్రేసరుల్ నీరసం
బౌలయంజూడకుఁడయ్య ప్రౌఢనవలా • లున్నన్ రసాస్వాదవే
త్తలవిజ్ఞాతమనోజతంత్రతయగును • గ్దిన్ జూచిలాలించరే.. ౮౧

చ. మునుపటికాలమందున్నృప • ముఖ్యులు దేశహితేషులై ప్రియం
బునసుకవిప్రకాండమున • పూర్వబహూకృతినాదరించిపూ
న్కినెరయఁ సత్ప్రబంధచయ • నిర్మితిచేనభివృద్ధి భాషకున్
బొనరిచి దేశమభ్యుదయ • మున్ గనజేసిరుదంచితస్థితిన్. ౮౨

ఉ. అన్యము రాజభాషయిపు • డాటజనంబులు దేశభాషసా
మాన్యముగాఁదలంచిగరి • మన్ విడనాడుటనిందుసత్కృతుల్
మాన్యతఁగాంచుభాగ్యమిహ • మంబువహింపమినిట్టివేళసా
జన్యధనుల్ ప్రబంధముల • జాడదలంపఁగఁ బాలుమాలుటన్. ౮౩

శా. దైవోపాత్తకవిత్వధోరణిప్రబం • ధంబుల్ గవుల్ వాక్యశో
భావైదగ్ధ్యమెలర్పఁజేసినబళిరం • పన్ జూచువారైన లే
రేవెంటన్ శిథిలంబులై కవులలో • యింపన్ గృశించంగ ము
ద్రావిన్యాసమొనర్పనెంచినప్రయ • త్నంబుల్ వృథాయైచనున్. ౮౪

మ. ధనికుల్ సత్కృతిముద్రణార్థముగన • ర్థంబుల్ ప్రసాదింపలే
రనయంబున్ బహుభంగిగోర్కులను వ్యా • జ్యార్థంబు ప్రీడద్రుతై
మ్మనిరన్ వందల్కుగుమ్మరింతురిటులౌ • రాదుర్వ్యయంబన్న వ
చ్చునుగాబోలునువిత్తముల్ యశముఁబెం • చ్చంగావలెన్ దిక్ప్రియల్.

కం. అతులప్రయాసపడి స
త్కృతులెన్నొరచించఁజాలె • నేనియుముద్రా

ధృతి లేక చూచుజన సం
తతి లేకంతగ్ర్పహస్థి • తములగుటయగుఁగా. ౮౬

వ. అజ్ఞాన లోకకాండులైన నూతన సత్కృతి సందర్శనానందకందళిత హృదయారవిందులు గాకుందురే యని నాసందియంబు వీడి నూతన కృతినిర్మాణధోరణీ కృతావధానుండనై. ౮౭

చ. జనిసఫలంబు సేయుటకుఁ • జాలిన సత్కృతినిర్మితిక్రియా
ఘనతరయత్నగౌరవముఁ • గైకొనినాఁడని కేమహామహా
ధనునిచరిత్ర నాపలుకు • ధన్యముగా రచియింతునంచు నె
మ్మనమునఁ జింతసేయుచున • మస్తకధల్ దలపోయుచుండఁగన్. ౮౮

ఆ. శివపదారవింద • సేవాధురీణుండు
ఘనమహాకవిత్వ • ధనుఁడు నాదు
సఖుఁడునైనయడవి • సాంబశివాఖ్యుండు
సెలిమి నన్నుఁ జూచి • పలికెనిట్లు. ౮౯

కం. అనయము సంతతినస్తక
మున శాశ్వతమగుచు నిలుచు • భువిసత్కృతియే
తనరించు నిహపరంబుల
ననుపమమగు సుఖము గర్త • కతుల యశముతోఁగా. ౯౦

కం. వినుమెందరెందరో ధన
జనియింపరు కృతిముఖమున • సత్కీర్తిగాం
చినవారిఁగాక యన్యుని
వినియెదమే నేటికొక్క • విమలయశస్కున్. ౯౧

కం. కననద్భుత రామాయణ
మనఁగాఁగలదొక్క గ్రంథ • మాద్యేయముదా

నినిజల్లుబోసతోఁ గృతి
యొసరింపుమునికుఁగీర్తి ♦ యును సుకృతమగున్. ౨

కం. మునుపుపురాణములన్నియుఁ
దెనుఁగునరచియించుకవులు ♦ దీనివిడఁచుటల్
గనుఁగొనభవదీయపురా
జనురార్జితపుణ్యఫలవ ♦ శంబయనఁదగున్. ౩

మ. అనినాకూరిమిమిత్రుఁడిట్టులుచితం ♦ బౌనుద్యమం బేర్చిచూ
పినను దత్కృతినిర్మితిప్రవణుఁగాఁ ♦ బ్రేమోన్నతిన్ జేసియ
ర్జునునిన్ గృష్ణుఁడువోలె సిద్ధవిజయ ♦ ప్రోత్సాహుఁగావించితా
నును సాహాయకమాచరింపఁ గృతికిన్ ♦ నూల్కొంటిదక్షుండనై. ౪

॥ కృతికర్తృగవేషణము. ॥

కం. పరమోత్తమరామకథా
కరమగుసత్కృతియొనర్పఁ ♦ గంటినిభవమున్
జరితార్థమయ్యెదీనికి
వరునింగా జేయఘనుఁడె ♦ వండనియరయన్. ౫

చ. నవరసగుంభసంభరిత ♦ నవ్యవచోవిభవంబెసంగఁగా
నవహితవృత్తిఁ జేయఁగన ♦ మాదరముంగయికొన్నసత్కృతి
ప్రవరమువిష్ణువైభవము ♦ రామకథామయమౌటదానిసిన్
శివునికినర్పితంబుగను ♦ సేయుటమేలనితోఁచెనామదిన్. ౬

కం. శివకేశవులకభేదము
వివరించెడుపెక్కుశ్రుతులు ♦ వినఁబడుఁగద శ్రీ
ధవునికథకుశివుఁడధిపతి
యనుపటమునకగాంచినంబు ♦ నదితెనయన్. ౭

క౦. హరిభక్తులగుచుహరుని
న్నిరసించిన శైవనిష్ఠ • నీరజనాభుఁ
బరిభవమొనరించిన న
న్నరులకు నిశ్చయముగాఁగ • నరకముగలుగుఁ. ౯౮

* క౦. శివయనఁదొమ్మిదిప్రణవము
నవసంఖ్యయె విష్ణువనియు • నం బ్రణవంబౌ
వివరింపఁగఁ బ్రణవార్థం
బవుభేదంబెద్దివిష్ణు • వనశివుఁడనఁగ. ౯౯

క౦. కుమతులకుమత ద్వేషము
సమకొని పరమార్థమెఱుఁగఁ • జాలమిభిన్న
క్రమదృష్టి గలుగునది ని
క్కము నరక ద్వారమగుఁద • గదనుష్టింపఁ. ౧౦౦

వ. అని తలచి, ౧౦౧

క౦. భవునకును భార్యయగుశాం
భవి విష్ణుసహోదరియని • పలుకుదు రే నై
ష్ణవుఁడనుమత్కృతి కన్యకు
ధవుఁడర్ధాంగుధరుఁడగుట • తగు నావిగదా. ౧౦౨

చ. సుమహితతత్త్వసద్గుణవి • శోభితచంచదలంక్రియాభిరా
మ మధురధర్మమైతనరు • మామకసత్కృతికన్యనిచ్చె నె
య్యమలర విష్ణువల్లభుని • నల్లునిఁజేసినచో సుమంగలీ
త్వమమరశాశ్వతంబుగను•వన్నెయువాసియుఁగాంచునిర్ధరఁ. ౧౦౩

వ. అట్లగుటం జేసి. ౧౦౪

---

* శి వ వి ష్ణు అ ష ము
౫+౪=౯, ౪+౫=౯= ౧+౩+౫=౯=౯౦.

కం. అరుగంగ నేలదూర
మ్మరుగున్బోరుగనుచుమాను • నిష్టార్థమ్మౌ
ల్గరుణనిడుచుండు నమరే
శ్వరుఁ డేవరుఁడగుటకొప్పు • వాఁడీకృతికిన్. ౧౦౫

* చ. ఎంచఁగసంఖ్యలై నన మ • రేశ్వరశబ్దమునొందునొంటియో
జించఁగనై నసంఖ్య విల • సిల్లుమహాప్రణవస్వరూపమై
యంచితవిశ్వహేతుమహి • మాధికకర్త బరమేశ్వరత్వమూ
హించఁదదీయమావిభవ • మేయనినిశ్చయభంగిఁ దెల్పఁగన్. ౧౦౬

† శా. ఏమెడసాంఖ్యనిర్ణయ స • మీడితమైయభియుక్తమైన రా
మాయణశబ్దమెన్నఁ బ్రణ • వాత్మకమానదిగాననేకసం
ఖ్యాయుతమైక్యమాటఁ బ్రణ • వాత్మకమీకృతియోంక్రియాత్మకుం
డౌయమరేశ్వరాహ్వయశి • వార్పణసేయుటయుక్తమేకదా. ౧౦౭

వ. అని కృతనిశ్చయుండనై తి నిట్టి శ్రీమదమరేశ్వరస్వామి యెట్టివాఁ
డనిన. ౧౦౮

సీ. భద్రకాళీసర్మ • ముదాప్తిప్రమోదని
ర్నిద్రచిత్తుఁడువీర • భద్రదేవుఁ
డాశ్రితప్రకరభ • యాపహదీక్షాప
రాయణుండైన వీ • రాంజనేయుఁ
డఖిలసౌభాగ్య గు • ణాశ్రయ సత్కృపా
వతిజగజ్జననిహా • ర్వతిభవాని

---

* అ మ రే శ్వ ర రా మా య ణ ం
౧+౫+౨+౮+౨=౧౮ ఓం ౨+౫+౧+౯+౧=౧౮ ఓం

† ఏకారము ౧౩ వది సున్నయొకటి కలసి, ౭౦, ౧౮ అగును.

మూకవాగ్దాస ని ♦ ర్మద్రదయాఢీన
తాక్షీణవిభవ కా ♦ మాక్షిదేవి

సీ. వలపటను డాపటనుగృతా ♦ వాసకలన
నెలమి సేవింపమధ్యన ♦ హీనభాస
మాన గగనాగ్రచుంబివి ♦ మాన రాజ
శాశ్వతకృతాదరుం డమ ♦ రేశ్వరుండు. ౧౦౯

మ. తతసద్భక్తిమహాభిషేకకరణా ♦ ర్థంబభ్రగంగాంబు సం
గతగారుత్మతకుంభహస్తులగుచున్ ♦ గోపుండునింద్రాదిదై
పతసంఘంబనఁదోయసంభృతఫల ♦ వ్రాతంబుతోఁజుట్టు సం
తతముగ్ బొల్పగునారికేళతరుసం ♦ తానంబులకోటి వెలన్. ౧౧౦

శా. వ్యోమగ్రాహ్యమహాప్రణాహయుతదీ ♦ వ్యత్తద్ధ్వజస్తంభభా
గ్వ్యోమవ్యాపిశిఖానిబద్ధపటుఘం ♦ టోద్భూతనాదశ్రుతి
వ్యామగ్నోచ్ఛ్వభవభీపరాఙ్ముఖములై ♦ యర్కాశ్వముల్వ్యోమ్నానున్
ద్వ్యోమధ్యంబునుదక్షిణోత్తరపథా ♦ భ్యస్థానపారీణతన్. ౧౧౧

మ. అహారారంభవిజృంభమాణఖతటి ♦ న్యంభోజసంవర్తికా
సహసోద్గీర్ణసుగంధబంధురమరు ♦ జ్జాగ్రస్నపినార్కమ
ద్గ్మహాకసంద్విగుణీకృతద్యుతిసమ ♦ గ్రప్రాగ్రిమాంద్యోతమా
నహిరణ్యస్ఫుటకుంభసంభృతవిమా ♦ న శ్రీదృగానందమౌ. ౧౧౨

కం. ఏవంవిధవిభవంబున
భూవినుతగుణాంగలూరు ♦ పురమున నతర
ఠ్నాప్రైభవనిరవధికరు
ణావేశుండగుచు వెలయు ♦ నమరేశుఁడిలన్. ౧౧౩

**—* షష్ఠ్యంతములు. *—**

కం. ఓంకారరూపునకును న
లంకునకును జంద్రమః క ◆ లావిలసితజూ
టాంకునకుసంతతనిరా
తంకీకృతపాదవినమి ◆ త్ప్రకరునకున్. ౧౧౪

కం. నతభక్తలోకరక్షా
ధృతికిన్ శ్రుతినికరమకుట ◆ దీపితచరణ
స్థితికిన్ నిరవధికరుణా
మతికిన్ ధృతసతికినమద ◆ మర్త్యవితతికిన్. ౧౧౫

కం. మానసిజగర్వవిదూరున
కనవరతత్రాతత్రిభువ ◆ నాధారునకున్
ఘనకరుణోదారునకున్
ప్రణుతాశేషాదితేయ ◆ పరివారునకున్. ౧౧౬

కం. శివునకునమదవనమహో
త్సవునకుగిరిజామనోబ్జ ◆ ధవునకునుభవో
ద్భవునకునిగమనూపుర
రవునకుభవునకుధృతోడు ◆ రాట్స్రిసవునకున్. ౧౧౭

కం. వాహాయితనిగమాంతన
మోహనునకున్ భక్తనికర ◆ మోహాపహాస్యా
రాహారభాక్కృపా స
న్నాహునకున్ద్రాతబహుళ ◆ ణవ్యాహునకున్. ౧౧౮

కం. యమిమానసవాసునకున్
గమలాప్తసహస్రకోటి ◆ ఘనభాసునకున్

శమితాఖిలనతదోషున
కమలగుణావేశునకును ♦ యమరేశునకున్. ౧౧౯

వ. బహుసహస్ర నమస్కార పూర్వకంబుగా సమర్పించి నాయొనర్పంబూనిన శ్రీమద్రామాయణాద్భుతోత్తర కాండంబునకుం గథాక్రమంబు. ౧౨౦

గీ. వ్రతిశిరోమణి వాల్మీకి ♦ రచితరామ
కథఁగలుగునద్భుతోత్తర ♦ కాండవిధము
నవధరింపుము, సీతాజ ♦ యావహాంబు
శ్రీమదమరేశ సమధిక ♦ చిత్ప్రకాశ. ౧౨౧

ఇది పీఠిక.



## కథా ప్రారంభము.

మ. తమసాతీర నివాసునద్భుత తపో ♦ ధాముర్ మహాప్రాజ్ఞువా
గ్రమణీమధ్యమవిష్టపావతరణా ♦ రంభాగ్రసోపాన భూ
తు మునీంద్రోత్తమువాల్మికిం గదిసి చే ♦ తుల్మోడ్చి సద్భక్తి ను
త్తమశిష్యుండును దత్ప్రియుండగు భర♦ద్వాజుండుతానిట్లనెన్. ౧

కం. మునిచంద్ర! నీవురామా
యణమన శ్రీరామచరితి ♦ మద్భుతలీలన్
మునుశతకోటి సువిస్తర
మొనరఁగ రచియించితివి స ♦ దుపకారమతిన్. ౨

ఆ. బ్రహ్మలోకమందుఁ ♦ బరఁగెనా రామాయ
ణంబు మునులు సురగ ♦ ణంబుఁ దవిలి
చదివి వినుచు సంత ♦ సంబునఁ దేలుచు
నుందు రనవరతము ♦ నుడుగుణాఢ్య. 3

తే. పంచవింశతి సాహస్ర ♦ పరిమితంబు
కాండసప్తకయుక్తంబు ♦ గా మనుష్య
లోకముననిల్చియున్న సు ♦ శ్లోక భరిత
రామకథసుధ వీనులా ♦ రంగవింటి. ४

కం. సురలోకగతంబగు రఘు
వరపూజ్యకథా సుధార్ణ ♦ వంబున ప్రతిశే
ఖర! యేమి విశేషంబులు
విరచించితో యనుచు వినఁగ ♦ వేడుకకలిగెన్. ౫

తే. శిష్యుఁడను భక్తుఁడను దయ ♦ చేసినాకు
నవ్విధంబు తెల్లంబుగ ♦ నానతిమ్ము!
భక్తియుతులకునెందు జె ♦ ప్పంగరాని
గోప్యములు గల్గునే? మహా ♦ గుణశరణ్య! ౬

వ. అని యడిగిన శిష్యునిఁ దిలకించి పరమాదరభరితుండై వాల్మీకి మునీంద్రుం డిట్లనియె. ౭

శా. భారద్వాజ! భవత్కృతంబయిన సం ♦ ప్రశ్నంబునం సంప్రమో
దారూఢిందగె మద్మనంబు విను ము ♦ న్నా రామదివ్యత్కథా
పారావారముదంచితాద్భుతకథా ♦ పారంబుగాఁ జాలు వి
స్తారంబై తగునట్లు శ్రోతృపరమా ♦ శ్చర్యంబుగాఁ జేసితిన్. ౮

చ. అదియిటుపంచవింశతి స ♦ హస్రమితంబుగ మర్త్యలోకయో
గ్యదశఁబ్రకల్పిత గోప్య పర ♦ మార్థముగా రచియించినాఁడ నిం
దుఁ దెలియఁ జెప్పనైతిగుణ ♦ ధూర్వహ! చిన్మయశక్తియైనభూ
మిదుహితభూరివైభవ స ♦ మేత మహాద్భుత కృత్యసంగతుల్.

మ. అతిభక్తుండవు నీయెడన్ గలదె గో ♦ ప్యార్థంబు యుష్మజ్జను
ష్కృతదుష్కృత్యము లెల్లఁ దూలవినుమా? ♦ సీతాచరిత్రంబుహృ
ద్గతమై క్రమ్మరనాకుమేనఁబులకల్ ♦ గల్గించెడున్ భక్తి గో
పితమైయెయ్యది బ్రహ్మలోకమున సం ♦ ప్రీతిన్ బ్రకీర్త్యంబగున్.

చ. ప్రకృతి యనాది భూత గుణ ♦ భాసుర భూతిసమేత విష్టప
ప్రకరజనుస్థితిప్రళయ ♦ బాధురకృత్యసనాథ బుద్ధి సి
ద్ధి కలితసర్వకారణ య ♦ తీతగుణవ్రజ విశ్వహేతుతా
ప్రకట యనంత చిన్మయి శు ♦ భప్రదనాఁజనుసీతపేర్మిశోభన్.

కం. అరయంగవిద్య యవిద్యయుఁ
బరమేశ్వరి సర్వతంత్ర • పరతంత్ర పరా
పర కుండలిని జగన్మయి
ధరణీసుత తదీయ విలసి • తము జగమెల్లన్. ౧౨

కం. ఆపరమశక్తి హృదయ
ప్రాపితగాఁజేసి తత్ప్ర • పాగతిఁదత్త్వ
ద్దీపితమతిహృదయాగ్రం
ధ్యాపత్తిఘటిల్లినసుఖు • లగుదురుయోగుల్. ౧౩

ఆ. ధరణినెప్పుడెపుడు • ధర్మంబునకుహాని
యగు నధర్మమునకు • నగు సమృద్ధి
నరగనపుడుధర్మ • సంస్థాపనార్థంబు
జరుగుచుండుఁ బ్రకృతి • సంభవంబు. ౧౪

కం. అరయఁబరంజ్యోతిపరా
త్పరుఁడు పరంధాముఁ డజుఁడు • పరమాత్ముఁడు సు
స్థిరుఁడు పరబ్రహ్మము రఘు
వరుఁడగుణుఁడకల్మషుండు • భావింపంగన్. ౧౫

సీ. నిత్యుఁ డనంతుండు • నిర్మలుండ గుణుండు
సర్వాంతరస్థుండు • శాశ్వతుండు
నలఘుచిదేకర • సాత్ముఁడక్షోభ్యుండు
నిర్వికారుఁ డజుండు • నిశ్చలుండు
రాముఁడు సర్వకా • రణ కారణుఁడు నిరం
జనుఁడగు కేవల • సాక్షిమాత్రుఁ
డతని సాన్నిధ్యమం • దఖిలంబు గల్పించు
బహురూపములఁ బరా • ప్రకృతిసీత

గీ. యజ్ఞులిదియెల్లరాముని ♦ యందుఁగలిగె
నంద్రు; నిక్కంబుప్రకృతి కృ ♦ త్యంబులివ్వి
ప్రకృతియనరామునికి భిన్న ♦ భంగికాదు
సాధులైక్యానుసంధాన ♦ సరణిగంద్రు. ౧౬

కం. రవియందుఁ గలుగు తేజము
సనతుగఁ బరమాత్మునందె ♦ సఁగుఁబ్రకృతివిభే
దవిధిఁగనుఁగొనఁజాలమి
నవాచ్యయంద్రు; తత్కృతంబ ♦ యగు సర్వంబున్. ౧౭

తే. భవ్యశక్తిసమేతుఁడై ♦ పరఁగునట్టి
బ్రహ్మమగుయోగిజనులకు ♦ సాన్యుఁడఖిల
కర్తృతఘటిల్లునతనిక ♦ ఖండచిత్స్వ
రూపుఁడఖిలాత్ముఁడైనపూ ♦ రుషుఁడతండు. ౧౮

ఉ. కన్నులు లేక సర్వమును ♦ గన్గొనువీనులు లేకయున్ వినున్
గ్రన్ననఁబాణిపాదయుతి ♦ గల్గకపోవు గ్రహించువిశ్వమున్
బన్నుగఁదానెసంగుఁదన ♦ భంగియెఱుంగదు విశ్వమెల్ల స
ర్వోన్నతుఁడున్ బురాణపురు♦షోత్తముఁడున్ వినురాముఁడై తగున్.

కం. ఆసీతారఘురాముల
భాసుర మర్త్యావతార ♦ పద్ధతిసముప
న్యాసమొనరింతు వినుజను
రాసంగభవోగ్రదురిత ♦ మంతయుఁబాయున్. ౨౦

తే. పాఱుఁడుపఠించివాగ్వృష ♦ భత్వమొందు
రాజుపఠియించిభూమికి ♦ రమణుఁడగును
వైశ్యుఁడుపఠించికనుఁబణ్య ♦ ఫలసమృద్ధి
శూద్రుఁడుఁబఠించికడుఁబెంపు ♦ సొంపుగాంచు. ౨౧

వ. లోకానుగ్రహకారణంబుగ సంగీకరించిన సీతారాఘవుల మర్త్యావతారంబులందు మొదల రామజన్మకథ నెరిగించెద. సావధానుండవై వినుమని భరద్వాజునకు వాల్మీకి యిట్లనియె. ౨౨

అంబరీషచరిత్రము.

తే. రామజన్మకథైక కా ♦ రణము విష్ణు
దివ్యమాహాత్మ్యవిభవ వి ♦ స్తీర్ణమఖిల
దోషహరమైన యదియంబ ♦ రీషచరిత
చెప్పెదనువినుమేకాగ్ర ♦ చిత్తవృత్తి. ౨౩

కం. గోపురశిఖాగ్రచుంబిత
గోపురమైనవలు లేని ♦ గురుసంపదకుఁ
గాఁపురమై వెలయు నయో
ధ్యాపురమలకాపురంబు ♦ నామ్రేడితమై. ౨౪

ఉ. ఆపురదివ్యసౌధశిఖ ♦ రాగ్రహిరణ్మయ కుంభసర్వతో
స్థాపితచారుహీరమణి ♦ సంభృతశుభ్ర మరీచి మాలికా
వ్యాపృతిగాంచివ్యోమపద ♦ మందుజలభ్రమనొంది నిర్జర
ద్వీపవతీసముద్గమము ♦ దెల్పిరిమింటనదంబుగల్గునే. ౨౫

మ. నవరత్నాంచితసాలసౌధగృహ నా ♦ నాపణ్యవీథీవితా
నవినోదంబులతోఁ బయోదనిచయాం ♦ తర్వారియందాపుర
ప్రవరంబే ప్రతిబింబితంబగుమఁ ద ♦ ద్భావంబు వీక్షించి వో
దివిగంధర్వపురంబుగల్గుననను యు ♦ క్తిస్ఫూర్తిగల్గెఁ భువిన్. ౨౬

సీ. శ్రుతులెల్ల వదనైక ♦ గతములై విలసిల్లఁ
జతురాననులనంగఁ ♦ జాలుటయును
దుర్గాధిపత్య బం ♦ ధురభూతి యుతులౌట
రాజశేఖరులనఁ ♦ గ్రాలుటయును

యెనలేని రొక్కంపు • టెకిమీఁదులై యుండఁ
గలితలోకోత్తర • ఖ్యాతియరుదె
హాలముఖజనిత్రమై • యలరు సంపదగల్గ
నలఘుబలులనంగ • వెలయుటరుదె
గీ. యనఁగనతిలోకభవ్యగు • ణానుభావ
శీలురై యాపురిని విల • సిల్లుచుంద్రు
విప్ర నృప వైశ్య శూద్ర ప • విత్రనామ
వంతులైయొప్పు నాలుఁగు • వర్ణములును. ౨౭

సీ. ధారాప్రచారస్య • దాహూఢమారుత
బాంధవంబులు మహా • సైంధవములు
పటుదానసౌరభ • ప్రాపితేందిందిర
బంధురంబులుగంధ • సింధురములు
తతనూత్నబహురత్న • ధాగధగీజనా
నందనమ్ములు ఘన • స్యందనములు
భూరిపీవరసత్వ • తారభాగ్యోత్కమో
ద్భటసముద్భయమున • ద్భటచయమ్ము.
గీ. విపులముగనందఁగలరాజ • వీధులందు
నెందుఁజూచినఁ గ్రందుగా • నేపునొందు
బలితఁపుపసందు జనుల • కన్నులకువిందు
నెరపునేమందు నప్పుర • వరమునందు. ౨౮

చ. అనుపమకాంతివైభవము • నందఁపుముద్దుమొగంబు పొంకముం
గనుఁగవతీరుసిబ్బరఁపుఁ • గబ్బిచనుంగవపొరుగల్గునం
గనలబెడంగుతో నమర • కాంతలకింతుక భేదమున్నదే!
కనుఁగొనదృష్టిభేదమునఁ • గ్గలుసఁబంచుఁ దలంచకున్నచోన్.

ఉ. అందలిపూవుఁదోఁటలను • మంచితనూతన పుష్పసౌరభం
బెంగు విచిత్రభంగి విల • సిల్లఁగ నచ్చట నంటుగట్టి మె
చ్చందగుతోఁట వేలుపుల • సామిదివంబునఁ దీర్చఁగానిచో
నందననామమేమిటికొ • నర్చఁగ నాతని పూవుఁదోఁటకున్. ౩౦

చ. చెలువములెల్ల నొక్కెడ న • సించినకైవడి మేలిసంపదల్
కలిగినయంతనట్టి నొక • కందువ నిల్పిన భంగినుర్వరన్
గలుగు పురంబులందుఁ దల • కట్టువెరంగున నద్భుతంబుగా
వెలయుచునుండు నాపురము • విశ్రుతనామసమన్వితంబుగన్. ౩౧

సీ. జగజంతలై పూని • మగపోఁడుములుసల్పు
ప్రోడలయూర్పుగా • డ్పులనుబలసి
వలరాచపోరుల • నలసిన వెలఁదుల
కులుకుఁగుబ్బల చెమ్మ • టలు గ్రహించి
బిగికౌఁగిలింతల • బెసఁగునింతుల మేని
కలపంపుతావులు • గిలుబులాడి
రతిపరిశ్రాంత దం • పతిగాత్రసంశ్లేష
ములఁజిక్కిచిక్కియి • మ్ములనువెడలి

గీ. యల్లనల్లన రత్న సౌ • ధాగ్రసర్మ
హర్మ్యవాతాయనముల చా • యలనుబొంచి
పొంచి విహరించునెప్పుడు • పంచబాణ
బాంధవమ్మప్పురమున • గంధవహము. ౩౨

తే. మేలిసంపద సురపురి • లీలఁగ్రాలు
నాపురంబేలు దేవేంద్రు • ననుకరించి
చారువిక్రమయుతుఁడు శ్రీ • శంకరువనఁగ
జనఘుకీర్తిసమేతుఁడౌ • జనవిభుండు. ౩౩

చ. ఎనిమిది దిక్కులం బలిమి ♦ నేలఁగఁజాలిన లోకపాలురన్
ఘనులనొనర్చి మర్త్యమ జ ♦ గంబు తెరంగు దలంచి వారియం
దెనసినయట్టి సద్గుణము ♦ లెల్లను నొక్కెడనిల్పి చేసెఁబో
వనజభవుండు నామనుజ ♦ వల్లభుఁడైన త్రిశంకుఁడింపగున్. ౩౪

ఆ. లేమితెంచిచూడ ♦ లేములకొనుల
నెంచ భంగసంగ ♦ మేరులంద
కాంక్షవాలయంద ♦ కాక లేనెచ్చట
రాజవర్యుఁడతని ♦ రాజ్యమందు ౩౫

ఆ. అతనికాంతకాంత ♦ యఖిలగుణాంబుల
లలితరూప నవ వి ♦ లాసకలిత
భద్రలక్షణాఢ్య ♦ పతిదేవతాశిరో
మణియనంగఁజాలఁ ♦ బ్రణుతిఁగనియె. ౩౬

ఉ. కోకిలలేని క్రొంజివురుఁ ♦ గుత్తులమావియెపో లతాపుర్న
దాకొనలేని పుష్పము వి ♦ ధంబునఁ జంద్రుఁడు లేని రేయినాఁ
బ్రాకటసంపదుజ్వలత ♦ రంబగునా నృపుమందిరంబు శో
భాకలితంబుగాక కను ♦ పట్టె సుతోత్సవశూన్యమౌటచేన్. ౩౭

సీ. అలఘుసంసారసా ♦ ఖ్యమహీరుహామునకు
నుపతిరఫలము పు ♦ త్రోదయంబు
ప్రకటపున్నామనా ♦ రకనదీసంతర
ణోపాయతరణి పు ♦ త్రోదయంబు
రమణీయ యౌవనా ♦ రామవాటిసిగుర్చ
నాగిఁజైత్రలక్ష్మి పు ♦ త్రోదయంబు
అజవంజవవిచా ♦ రాంధకారమడంప
నుపదీపకళిక పు ♦ త్రోదయంబు

గీ. నమలగార్హస్థ్యధర్మ ప ♦ ద్మాకరమున
కుదితబాలార్కనిభము పు ♦ త్రోదయంబు
విదితసౌభాగ్యవంశాబ్ధి ♦ వృద్ధి కొఱకు
నొదవు ముక్తాఫలంబు పు ♦ త్రోదయంబు. ౩౮

చ. నవనవచూర్ణకుంతలము ♦ నాగుపన్మృత్యదశ్రీపకాండ సే
వ్యవిభవముం దరస్మితప ♦ మంచితకేసరభాసమానమౌ
త్యవిశదమంజువాక్యకుసు ♦ మాసవమానుతవక్త్రపద్మముం
జవ్వలలరంగముద్దుఁగొనఁ ♦ జాలనిజన్మము జన్మమే ధరన్. ౩౯

చ. జిలిబిలిముద్దుపల్కులు రు ♦ చించనవారుణపల్లవాతి కో
మలపదహస్తభాగములు ♦ మాటికి భూతలముం స్పృశింపఁగన్
దులదులఁ బ్రాకి వచ్చెడు సు ♦ తుంగని యెత్తి తదంగ ధూళిచేఁ
మలినముగాని చేను బలు ♦ మాఱునుసుమీ తలపోసి చూడఁగన్.

శా. ఆలక్ష్యోజ్జ్వల దంతకుట్మలము స ♦ వ్యక్తాతిమాధుర్యపీ
లాలాపంబ నిమిత్తహాసము మనా ♦ గాకుంచితాంఘ్ర్యబ్జముం
లీలావస్తుగృహీతపాణికముఁ గే ♦ ళీలోలచిత్తాబ్జమౌ
బాలాలింగనసౌఖ్యమబ్బుట మహా ♦ భాగ్యంబు సంసారికిన్. ౪౧

మ. విరతిన్ బొందక వంశవృక్ష ముపజీ ♦ వింపంగఁ జేయున్ భయం
కరపున్నారకసింధుని స్తరణసౌ ♦ కాపాత్రమహోదారతా
క్యరమాభోగనవాంకురాంబుకణసే ♦ కంబివ్వఁగాఁ గర్తయౌ
నరయంబుత్రుఁడె పుత్రహీనుఁడయినన్ ♦ వ్యర్థంబగుఁ జన్మముల్.

సీ. పాలబుగ్గలుగుంట ♦ దేలఁగాననిమిత్త
హాసాంకురముచూపు ♦ నట్టిముద్దు
లేమావిచిగురుబో ♦ లెడు నాల్కచలియింప
నగ్గుగ్గుబంచేస్చు ♦ చుండుముస్పు

అరుణాంగుళములఁ బా ♦ దాంగుష్ఠమునునోరఁ
గ్రుక్కి చూచూయని ♦ కుడుచుచున్న
బడిబడిఁబోరలఁ ♦ బడితలయెత్తి కా
ళులు గదల్చుచు లేవఁ ♦ దలఁచుచున్న

గీ. హస్తములుజాను తలములు ♦ నననిమోపి
మెల్లనల్లనఁగదలి పా ♦ కాడుచున్న
పూని వేడుక జూడంగ ♦ మేనువొంగఁ
బట్టిఁగాలించఁజాలని ♦ భవమదేల ౪౩

ఉ. వారివిభాగ్యవైభవము ♦ వారిదిజన్మమహాఫలంబనన్
వారిది సంతతోత్సవము ♦ వారిదినిర్మలభాగధేయమె
వ్వారి గృహాంగణంబునను ♦ వారకఁదప్పటడుంగులన్ శుభా
కారుఁడుసత్కుమారుఁడు త ♦ గన్ జరలాడుచునుండుఁగ్రీడలన్.

వ. అని చింతించి. ౪౪

త్రిశంకుని భార్య తపము సేయుట.

కం. పతిదేవతాశిరోమణి
యతనిగృహిణిభవ్యగుణ స ♦ మన్వితనియమ
వ్రతసహిత యగుచునుశ్రియః
పతిసేవయొనర్చుచుండె ♦ భక్తినియుక్తిన్. ౪౫

చ. అమలుననంతునాద్యు బర ♦ మాత్ముగుణత్రయహేతుభూతువే
దమయునిరంజనున్ హరి స ♦ దాతను నచ్యుతు బ్రహ్మవిష్ణు రు
ద్రమయుఁద్రికృత్యసంగతుఁబ ♦ రాత్పరు శేషశయానునిందిరా
రమణుముకుందు నార్తజన ♦ రక్షకునెంచి భజించెభక్తితోన్.

కం. తనువున హరికైంకర్యము
మనమునఁదద్దివ్యరూప ♦ మననము సంకీ

ర్తనము తగువాక్కు సనుగా
ననయముఁగడుభక్తిమెరయ ♦ నచ్యుతుఁగొలిచెన్. ౪౮

సీ. గంధపుష్పంబుల ♦ గరుధూపదీపాది
సంభారములుతానె ♦ సంతరించి
తగశుచిస్నాతయై ♦ ధౌతాంబరముఁగట్టి
స్థండిలాలంకార ♦ సరసిదీర్చి
యమ్మజగన్నాథు ♦ నాదినారాయణు
నావాహనముచేసి ♦ యధికభక్తి
శ్రద్ధయునిరవొంద ♦ సంపూజితునిఁజేసి
సాష్టాంగమెరఁగి యం ♦ జలిఘటించి

గీ. బహువిధస్తోత్రములొనర్చి ♦ భక్ష్యభోజ్య
ములునివేదించి పిమ్మట ♦ ప్రియ్యులైన
విష్ణుభక్తుల నర్చించి ♦ విమలతత్త్వ
పాడభోజనియగుచుండు ♦ సతతంబు. ౪౯

కం. ఇటులదృఢవ్రతయై యా
కుటిలాలక వాసుదేవుఁ ♦ గొలిచెనుగడు దు
ర్ఘటతరమిది యనుచుమహా
జటిముఖ్యులువొగడనయుత ♦ సంవత్సరముల్. ౫౦

ఆ. ఉపవసించిభక్తి ♦ నొక్కద్వాదశినాఁడు
శ్రీనివాసుసేవఁ ♦ జేసిభక్తి
యుతముగాఁగశౌరి ♦ యుపకంఠమునభూమి
శయ్యగూర్చియున్న ♦ సమయమునను. ౫౧

త్రిశంకునిపత్నికి హరి ప్రత్యక్షమగుట.

మ. హరి యాపుణ్యచరిత్రస్వప్నమునఁ బ్ర ♦ త్యక్షంబుగావచ్చిన
త్కరుణాదృష్టిఘటిల్ల నేమివరముల్ ♦ గాంక్షించెదో యిచ్చెదన్
తరుణీ! కోరుమటన్న నీదుపదభ ♦ క్తశ్రేష్ఠుఁడై సర్వభూ
వరచూడామణియైనపుత్రకునిదే ♦ వా! నాకొసంగన్ దగున్. ౯౨

కం. అనికాంక్షించిననిచ్చితి
నని యొకఫలమిచ్చివిష్ణుఁ ♦ డంతర్హితుఁడై
చనినంత మేలుకనిపతిఁ
గని కలతెఱఁగెఱుకపఱచి ♦ కడుమోదమునన్. ౯౩

కం. జలరుహనాభుఁడొసంగిన
ఫలమును శుచియగుచునియతి ♦ భక్షించిముదా
కలితయగుచున్నింతికి
నెలదప్పెన్ దౌహృదంబు ♦ నిజమైపొదలెన్. ౯౪

త్రిశంకుపత్నిగర్భవతియగుట.

తే. పడఁతిశిశువుఁదునుగర్భగు ♦ బ్బలునుబలిసి
యచలసంపదగౌరవ ♦ మందియుండ
లేమికిరవై కృశించిన ♦ లేమకాను
నాదుకొనిదౌహృదరమాపెం ♦ పొందఁజేసె. ౯౫

కం. నవలానునుచెక్కుంగవ
లవలీదళములనిపోల్చు ♦ లాగునఁదగన్
దవిలి విలసిల్లెపాండిమ
కవివాక్కులకనృతకలన ♦ గాంచునెయొందున్. ౯౬

కం. హరికృపదనుభవించెను
పురుషవరుఁడు గర్భమంతఁ ♦ బొదలఁగ వానిన్
ధరణికనుంగొనఁబోయెను
కరణిన్ మనుచోరవసతికి ♦ గాటంబయ్యెన్. ౫౭

కం. చెలిగుబ్బగుబ్బలులపై
నలచూచుకనీలమేఘ ♦ మావృతమగుచున్
దొలుకరిజడివడిఝూపెను
నలవమరఁగనోకిలింత ♦ లధికంబయ్యెన్. ౫౮

కం. నడజడనుపడియెనారే
ర్పడియెన్ ముత్తరులుబలిసె ♦ బ్రిబలెనరుచియున్
గడునలసతదలసూపెన్
బడఁతికి నంతంత గర్భ ♦ భారముఁ బొదలన్. ౫౯

అంబరీష జననము.

కం. పరమోచ్చసంగతములై
సరవిశుభగ్రహములెల్ల ♦ సదనములందున్
జరియింపభద్రబలవి
స్ఫురితంబై మించునొక్క ♦ శుభలగ్నమునన్. ౬౦

కం. అనఘంబగు తేజంబున
జనలోచనకమలములుప్ర ♦ సన్నంబులుగా
నినునింగాంచినప్రాగ్దిశ
ఘనముననప్పద్మనయన ♦ గనియెన్ దనయున్. ౬౧

కం. పుత్రోత్సవమొనరించెన్
ధాత్రీపతిగోహిరణ్య ♦ దానంబులచే

గోత్రానిబుధులఁబున్యాచ
రిత్రులనానావిధములఁ • వృష్టులఁజేసెన్. ౬౨

తే. దోషరహితాత్ముఁడతఁడంబ • రీషుఁడనఁగ
నామకరణంబుగావించె • నందనునకు
బాలకుఁడు శుక్లపక్ష క్ష • పాకరుని వి
ధమునవర్ధిల్లె నానాట • రమణమీఱ. ౬౩

అంబరీషు రాజ్యప్రాప్తి.

చ. చదివె సమస్తశాస్త్రములు • సాములలోఁగడిదేరె, వింటినే
ర్పుఁడెలసె, నస్త్రశస్త్రపరి • పూర్ణతఁగాంచె, గజాశ్వధోరణా
స్యదసహుఁడయ్యె, నూర్జితధ • రాధిపనీతివిచక్షణాత్వసం
పదనిరవొందె, రాసుతుఁడు • సాగతనూతనయౌవనంబునన్. ౬౪

ఉ. ఆతనితండ్రియప్పుడువ • యఃపరిణామమునొందిచాలసం
జాతచిరానుభూతనిజ • సంభృతరాజ్యరమావిరక్తుఁడై
ప్రీతినిజాత్మజున్గుణవ • రిష్ఠునృపాసనయుక్తుఁగాఁగ ను
ర్వీతలభర్తఁజేసెఁబ్రజ • లేమరుసంతసమందిమెచ్చఁగన్. ౬౫

మ. అవనీరాజ్యపదస్థుఁడై నృపవరుం • డయ్యంబరీషుండుమా
ధవునిన్గాఢతపంబునన్బ్రమదయు • క్తస్వాంతునింజేయఁబూ
నివెసన్ రాజ్యము మంత్రిపుంగవులపై • నిన్ నిల్పిసమ్యగ్విశో
త్సవచిత్తుండగుచున్ శుభాశ్రమముచెం • తన్ జేరెసద్భక్తితోన్. ౬౬

అంబరీషుఁడు తపము సేయుట.

మ. హృదయాబ్జంబున శంఖచక్రధరు స • ర్వేశున్ జతుర్బాహునీ
రదవర్ణున్ హారిపీతవాసు ద్విజగ • ద్రథ్యాకరున్ వేదవే
ద్యుదమూసాగరుశుద్ధకాంచననిభున్ • దుఃఖార్తి నిర్మోచనున్
మదినైతేయహరున్ద్రిమూర్తిమయునే • మంబొప్పధ్యానించుచున్.

కం. అత్రినిష్ఠాయుతినుగ్ర
వ్రతతత్పరుఁడగుచు వేయి ♦ వత్సరములు భూ
షితలోకమగుదనంగ నూ
ర్జితతప మొనరించ జక్రి ♦ ప్రీతుండగు మఱి ౬౮

కం. గరుడారూఢుండై సుర
వరులెల్లం గొలువభక్తి ♦ వత్సలుఁడగు శ్రీ
హరి యేగుదెంచి ధరణీ
శ్వరుని మనోరూఢిమెరుఁగ ♦ దలఁచికపటియై. ౬౯

అంబరీషునకు శ్రీహరి యింద్రరూపమునఁ బ్రత్యక్షమగుట.

కం. ఆవినతాపుత్రకుఁడై
రావణముగఁ జేసి తాను ♦ రత్నభూషుఁడై సం
భావితకులిశకరుండై
యావిభుకట్టెదురనిలచి ♦ యుప్రశ్నించెన్. ౭౦

చ. నరవర నీతపంబును మ ♦ నంబున మెచ్చితి నేఁ ద్రివిష్టపే
శ్వరుఁడగు వాసవుండను భ ♦ వత్సుకృతేప్సితసిద్ధి సేయఁగా
వరదుఁడనై తిఁగోరుమన ♦ వానిఁగనుంగొని సాధ్వృంతు ని
ర్జరవిభుఁడంచు నెంచుచుఁగ ♦ రంబున నాదరవృత్తి నిట్లనున్.

ఉ. నిన్నుదలంచి యోఁడపము ♦ నిర్జరనాయక సేయ నీవు నా
కెన్నికనిచ్చు కోర్కులవి ♦ యేలన్నృథాశ్రమమేను సంతతా
పన్నశరణ్యుఁ జక్రధరుఁ ♦ బ్రార్థనసేయుచుఁగాని యన్యులన్
గన్నులఁ జూడవిష్ణుము లో ♦ నచ్చకనచ్చిన జాడ నేగుమీ. ౭౧

చ. వరమునినాథనాథుఁడు శ్రీ ♦ వరకరుఁ డార్తశరణ్యుఁ డీశ్వరే
శ్వరుఁడు పరాత్పరుండు గుణ ♦ సంగవిహీనుఁడనాదిమధ్యుఁడ

క్షరుఁడుజగన్మయుండఖిల ♦ కారణుఁడచ్యుతుఁడవ్యయుండు శ్రీ
హరివినఁ నాకనాథుఁడుత ♦ దన్యులవేఁడ సురేంద్ర యెన్నఁడున్.

చ. అనిదృఢనిశ్చయంబున జ ♦ నాధపుఁడాసురనాథుఁడిక్కుఁ గ
గ్గోసమికిమెచ్చిమాధవుఁడు ♦ గొబ్బునఁదార్క్ష్యునిపై సశంఖచ
క్రసలినశార్ఙ్గపాణియు వి ♦ రాజితకౌస్తుభవక్షుఁడున్ వినూ
తనజలవాహనీలతను ♦ దర్శనుఁడై వెసఁదోచెనయ్యెడన్ ౨౪

అంబరీషునకు శ్రీహరి ప్రత్యక్షమగుట.

వ. అట్లు ప్రత్యక్షంబైన పుండరీకాక్షు ననాథనాథు నిఖిలదేవగంధర్వ సంస్తూయమానునాదిదేవునింగనుంగొని పులకితశరీరుండును, సముద్గతసంతోషబాష్ప పూరితనయనుండును, నద్భుతప్రమోద వికచ వదనుండునునై యంబరీషుండు గద్గదవాక్యంబులనిట్లనివినుతించె.

అంబరీషస్తవము.

సీ. జయజగన్నాథ కృ ♦ ష్ణముకుందగోవింద
కమలలోచనభక్త ♦ గణశరణ్య
జయపరమేశ్వర ♦ శాశ్వతపరమాత్మ
కమలామనోహర ♦ కమలనాభ
జయపురుషోత్తమ ♦ సచ్చిదానందాత్మ
రవికోటితేజస ♦ రదవిసీల
జయపరమానంద ♦ సత్యస్వరూపక
విశ్వైకకారణ ♦ వేదవేద్య

గీ. జయసనాతన విశ్వర ♦ క్షావిచక్ష
జయనిరంజన శాశ్వతై ♦ శ్వర్యకలిత
జయవిధీంద్రాది వంద్యదు ♦ ర్జనవిదూర
జయచిదానందవైకుంఠ ♦ సాధువరద. ౨౫

సీ. నిఖిలలోకములకు • నీవయనాదివి
కలిగించఁబోషించఁ • గర్తవీవ
నీయందవసియించు • నీయెల్లజగములు
జగములందీవుని • చ్చలునుగలవు
నీగుణత్రయముకా • న్పించుమూర్తిత్రయం
బగుచువిశ్వాత్ముఁడ • వచ్యుతుఁడవు
పురుషోత్తముఁడవునం • పూర్ణబోధమయుఁడ
వాద్యంతరహితుఁడ • వవ్యయుఁడవు
గీ. నీవసర్వాత్మకుండవు • నిర్మలుఁడవు
దేవదేవనారాయణ • దీనవరద
నిన్నునమ్మితినన్నుర • క్షింపుమొరుల
వేడనీదాసదాసుఁడ • విశ్వరూప. ౨౨

సీ. కలిమిచెల్వకురచ్చ • గద్దియమైమెదఁ
గడలిపుట్టువువుమాని • కంబుదనర
కరమొయిల్ చాలఁగా • గ్రమ్ముఁగనానును మేనఁ
గలుకుబంగారుదు • వ్వలువమెరయఁ
దొగలఁదమ్ములఁబ్రోచు • జిగివెలుంగులమించు
వలుదసంకునుజుట్టు • వాలుగాలఁ
గాటుకకొండచ • క్కటివేవెలుంగునా
నాదటఁబామిడికం • బందగింప
గీ. పొంగిరంగారుసింగార • ములకొటారు
గాఁగఁబాగడొందుమేలిచ • క్కందనమ్ము
పొసఁగబత్తులముంగొంగు • పసిడియగుచు
నలరునాసామినీకుజో • హారుసేతు. ౨౩

ప్రహరణకల్పిత వృత్తము.

కలుములచెలి చ ♦ క్కఁగ నెదఁగులుకన్
జెలువులగనివై ♦ చెలఁగుచు వెఱపున్
కలికితనమున ♦ క్కటికముఁ బెరయన్
బలుమరునన్బ్రో ♦ వఁగఁదగుఁ బెద్దిమెన్. ౨౯

సుకేశరవృత్తము.

సకలజగన్నియామకుని ♦ సాధుసన్నుతున్
ప్రకటదయాసమంచితుని ♦ భక్తవత్సలున్
సుకవిజనేడ్యసర్వగుణ ♦ శోభిసిస్సమా
ధికుఁబరమేశునిన్నుఁబ్రజు ♦ తింతుమాధవా. ౩౦

శిఖరిణవృత్తము.

జగంబుల్ గాపించన్ దగమనుపనా ♦ శంబుగొలుపన్
జగన్నాధాయుష్మత్త్రిగుణకలనో ♦ ద్ధారియమెకదా
యగున్ శక్త్యంబిబ్రాద్యఖిలసురవం ♦ ద్యాంఘ్రియుగనీ
యగణ్యైశ్వర్యంబద్భుతముగద స ♦ ర్వైకనిలయా. ౩౧

ద్రుతవిలంబితగర్భితోత్పలమాల.

దేవపరాత్పరా, నతవి ♦ ధేయజనార్దన ♦ నాకిపా, ల, కా
పావనవైభవా, వితత ♦ భద్రకవిస్తుత ♦ విశ్రుతా,త్మ, కా
సేవితనిర్జరా, కృతివి ♦ శేషసుగీతస ♦ మృద్ధధా,న, లో
కావనసుస్థిరా, వ్రతిస ♦ మర్చితభవ్యగు ♦ ణైకభూ, పకా. ౩౨

స్రగ్విణీభుజంగప్రయాతకందగర్భితసీసము.

శ్రీశ,హర్యక్ష,లోక ♦ సేవ్యాద ♦ యా,భూమ
కుందా,విభూ * చిదానందరూప

భద్ర, స్థిరా, నాకి ♦ వంద్యాయ ♦ ధీసంధ్య
భావా, న్వితా * మహా ♦ దేవకృష్ణ
విద్యా, పరా, నైక ♦ వేదాంత ♦ పా, లాయ
హాత్మా, శ్రయా * సమ ♦ స్తూతరాత్మ
పావిత్ర, వర, శ్లోక ♦ భవ్యప్ర ♦ భా, యుక్త
దోషా, చరా * సద్వ ♦ శేషయుక్త

గీ. పరమకరుణాసుధారస, ♦ భరితచరిత
వాసుదేవ ♦ పరమకృపా ♦ ఘ్యా, సురేశ
నిరుపమగుణాభివర్ణిత, ♦ శరధిశయన
దానవప్ర ♦ శమనధుర్య, ♦ గా, నమోస్తు. ౮౩

రథబంధశాకవృత్తము.

(శ్రీ)సహాయసుర ♦ సేవ్యవైభవా
వాసుదేవభవ ♦ నైత్యనాథవా
దాసరక్షణ వి ♦ ధాయకవ్రతా
భాసమానగుణ ♦ బంధురాచ్యుతా. ౮౪

కవికంఠభూషణ వృత్తము.

పరమేశచక్రధర ♦ పంకజలోచన కాంచనాంబరా
పురుషోత్తమాపరమ ♦ పూరుషనిత్యనిరంజనాపరా
త్వరదైత్యసంహరణ ♦ పాలితసర్వజగత్పరంపరా
కరుణానిధీవిధృత ♦ కౌస్తుభకంఠిసుతామనోహరా. ౮౫

తరళద్రుతవిలంబితగర్భసీసము.

సు, రుచిరవైభవ ♦ సూరివందిత, రూఢ
సత్కరుణాన్వితా ♦ సర్వగమ్య

ప్ర, విచలితాశ్రిత • పాతకోత్కర, వేద
వేద్యమహోనిధీ • హృద్యవేష
వి, రచితసంతత • విశ్వరక్షణా, రాజ
శేఖరవందితా • చిత్స్వరూప
సు, ఖచరసంశ్రయ • శుద్ధసత్వవి, కస్వ
రాకృతిభాసురా • లోకనాథ
గీ. పరమపావనపండిత • పాలనా, ఢ్య
హరవిరించిముఖామర • పార్చితా, త్మ
గరుడవాహనకర్బుర • గర్వహా, రి
వరదదాసశివంకర • భద్రదా, యి. ౮౬

నాగబంధము * స్రగ్ధరావృత్తము.

గోత్రారాతిప్రపూజ్యా • గురుసమరదర • క్షోణిభేదిప్రతాపా
పత్రీశస్యందనాము • త్పరితిపదపదస • ద్భక్తగుప్తాఘనీవి
త్సత్రవ్యోతాత్మసద్మా • శమితనతజుగు • ప్సాముదాపూర్ణభద్రా
సత్రార్ధజ్ఞాదిపాత్ర • స్థలజలజపదా • సర్వదక్ష్యాగుప్తైతా. ౮౭

చక్రబంధము * శార్దూలవిక్రీడితవృత్తము.

యత్నావేద్యపరాకృతీ పరమక • ల్యాణప్రదీప్తతనూ
రత్నాఢ్యప్రథమాంకవత్సరసహం • దారిక్లిష్టలోకస్తుతా
ప్రత్నాటవ్యచయప్రియంకరసురా • రాతిఘ్నధీవిన్మనూ
నూత్నాబ్జాయతసారనేత్రప్రణతా • నూనార్చితాంచన్మనూ. ౮౮

అంబరీషునకు హరి వరంబులిచ్చుట.

చ. అని వినుతించిన న్హరి ప్రి • యంబుననిట్లను వత్స నీశుభ
క్తినియతి మెచ్చుఁ గూర్చె భవ • దీయమనోరథసిద్ధి సేయుదు న్
వినుమిఁకభక్తవత్సలుఁడ • వేఁడుము నీదుచికీర్షితంబులం
చనవుడుహర్షగద్గదస • మన్వితవాక్యములనాతఁడిట్లనెన్. ౮౯

మ. జలజాతాసనముఖ్యదుర్లభమునీ • సందర్శనంబబ్బెని
మ్ములనాకింతటికంటె నేటికివరం • బుల్ నాపయిన్ సత్కృపా
కలనంబుండినవాక్కులన్ మనమునన్ • గాయంబునన్ గర్మలన్
జలనంబించుక లేక నీపయిసదా • సద్భక్తినాకియ్యవే. ౯౦

మ. భవదంఘ్రిాంబుజభక్తితత్పరుఁడనై • పాలించెదన్ భూమి వై
ష్ణవధర్మోత్తరలీల యజ్ఞజపపూ • జాహోమసత్కర్మంబులన్
దివిషద్వర్గముతృప్తిఁ బొందఁగభవ • ద్దివ్యవ్రతాసక్తిమా
నవులెల్లన్ జరియింపఁజేయఁగలయా • న్నిత్యంబునిమ్మీశ్వరా.

ఉ. నావుడునట్లకాకని జ • నార్దనుఁడానరనాథుఁగాంచి సం
భావనమీఱనిట్లనె నృ • పాలకభూరితపంబునన్ మహా
దేవునిఁబ్రీతుఁజేసెదవు • దీనిధరించితి నీసుదర్శనం
బీవుమదీయుఁడంచుఁగొను • మిచ్చెదనీయెడవత్సలుండనై. ౯౨

కం. ఘనరోగదుఃఖభయములు
మునిశాపంబులునరిపుస • ముదయాపదలున్
నినుఁబొందనేరవెన్నఁడు
మనుజేశ్వరచక్రరక్ష • మైకొనియునికిన్. ౯౩

వ. అని యానతిచ్చి మధుసూదనుండంతర్హితుండైన నంబరీషుండును నిర్విఘ్నంబున లబ్ధవరుండై పురంబునకుఁ జనుదెంచి. ౯౪

తే. అతఁడు బ్రహ్మోత్తరంబుగ • నఖిలజనులఁ
బరమవైష్ణవధర్మ సం • భరితులుగనొ
నర్చిపాలించెసర్వ వ • ర్ణములుస్వస్వ
ధర్మనియతిఁబ్రవర్తిల్ల • ధరణియెల్ల. ౯౫

కం. హయమేధశతమువిఘ్న
ప్రియముగనొనరించి శక్రుఁ • బేరిమిమెప్పన్

నయసహితుఁడగుచు సాగర
చయవేష్టితవసుధయేలె • జనవినుతుండై. ౯౬

మ. ధరణిన్ విష్ణుపరాయణుండగుచునా • తండేలఁగానెల్ల మం
దిరభాగంబుల విష్ణుపూజలొగి వ • ర్ధిల్లెన్ద్రయీఘోషణం
బురువయ్యెన్ బహుయజ్ఞసంవిలసనం • బుత్సేకమయ్యెన్ బరి
స్ఫురణోదాత్తతఁగాంచెధర్మముదప • స్ఫూర్తుల్సమృద్ధిన్గనెన్.

ఆ. బహుళసస్యయగుచు • భాసిల్లెనవనిదు
ర్భిక్షమనఁగనెందుఁ • బేరుమాసె
నఖిలప్రజలకాయు • రారోగ్యములెసంగె
నీతిప్రబలెఁ గడున • నీతికముగ. ౯౮

తే. హరిసుదర్శనరక్షితుం • డగుచునొప్పి
యంబరీషుఁడుపాలించు • నవసరమున
చతురుదధివేష్టితాఖిల • క్షితియునభిన
వాభ్యుదయమొందివెలసెన • త్యంతముగను. ౯౯

తే. అఖిలధరణీతలేశుఁడౌ • నంబరీష
భూపతికివిష్ణుకృపచేతఁ • బుట్టెనొక్క
కమలలోచన కమలాంశ • కలితయగుచు
మంజులాకారశీల శ్రీ • మతియనంగ. ౧౦౦

శ్రీమతీరూపాభివర్ణనము.

తే. ఆకుమారీ శిరోరత్న • మమలపక్ష
చంద్రరేఖయుఁబోలె ని • స్తంద్రయగుచు
దినదినాభ్యుదయమున వ • ర్ధిల్లుచుండఁ
దరుణికప్పుడు యావనో • దయముగలిగె. ౧౦౧

ఆ. సకియకంతకంత ♦ సడలు బాల్యంబుతోఁ
నన్నువగుచునడుము ♦ సన్నగిల్లె
నహరహంబువాదలు ♦ నట్టిజవ్వనముతోఁ
బూఁపచన్నొగడలు ♦ పొటకరించె. ౧౦౨

చ. లలనకుఁగల్గుచూపుచప ♦ లత్వము పెన్నెరివేణినైల్యముల్
తొలఁగనియాన మాంద్యమును ♦ దోఁచినమధ్యము లేమిగబ్బిగు
బ్బలఁదగు కర్కశత్వమును ♦ బ్రస్తుతిపాత్రములయ్యె మోమునిం
గ్మలకమలాధికంబగుచు ♦ రాజిలఁగల్గినిలొచ్చుదోఁచునే. ౧౦౩

మ. ఇనులన్ జందురుఁడొక్కకందువనెవ ♦ ర్తించంగఁజేయన్ నవా
దరుఁడై తాతలతాంగిముద్దుమొగముల్ ♦ ధమ్మిల్లముల్ జంద్రవి
స్ఫురణన్ జీకటిపెంపుమించ సృజియిం ♦ చున్ గాకనై జంబు గీ
డ్పరుపన్ జాలునె కేశబంధమెపుడున్ ♦ బశ్చాద్గతంబౌఁగదా. ౧౦౪

ఉ. అందములెల్లఁగూర్చివన ♦ జాసనుఁడించునిఁజేయఁగాఁబగల్
గందివిసర్గుఁడైననిది ♦ గాదనితామరపూవుఁజేసినన్
వందురిరేల్మొగిడ్చిజిగి ♦ వాడిననాతనిసవ్విచేసెఁబో
కందుఁడుకొమ్మమోమును బ ♦ గల్నిశికాంతులుగల్గిరాజిలన్.

తే. వదనలావణ్యరససంప్ర ♦ వాహజనిత
మైనయిందీవరద్వయం ♦ బక్షియుగము
తత్సుగంధానుబంధలు ♦ భ్రమయివచ్చు
నళికులంబగువాలు చూ ♦ పులబెడంగు. ౧౦౬

తే. ఇంతిశ్రీసతియంశజ ♦ నించెననుచు
శ్రీమతీనామధేయ యీ ♦ చెలువయనుచుఁ
గడఁగియిరువంకలందె శ్రీ ♦ కారములను
వ్రాసెనోధాతయనఁగఁ గ ♦ ర్ణంబులలరు. ౧౦౭

చ. పొలుచుసుగంధముల్గడు న ♦ పూర్వముగాఁ బెనఁగించిలోకులన్
బలుచనిగొల్పుగంధఫలి ♦ పల్కుసుసర్వసుగంధభోగముల్
వలఁచితపంబొనర్చి చెలి ♦ నాసికయై జనియించికాంచెఁబో
సలలితవృత్తిసర్వసుమ ♦ సౌరభసంగ్రహణప్రవీణతన్. ౧౦౮

తే. విద్రుమస్ఫూర్తివిలసిల్లు ♦ వెలఁదిమోవి
క్రమపల్లవరాగయు ♦ క్తంబొనర్చి
నెంచిచూడననంగుని ♦ యింద్రజాల
మిట్టిదనుచునచింపంగ ♦ నేరితరము. ౧౦౯

కం. పలుకుదురు ముత్తియములని
పలుకుదురదియేటిమాట ♦ పరువఁపు రుచులన్
బలుకుదురు గలిగికెంపుం
బలుకుదురు సుకట్టడమునఁ ♦ బాటిలియున్నన్. ౧౧౦

కం. వలమురికరివేలుపుకై
యలరియుసుస్వరముగామి ♦ కలజడిఁదపముల్
సలిపిచెలియకంధరయై
లలిఁబలుకంగలిగె శుక కి ♦ లాలాపములన్. ౧౧౧

మ. చెలిలావణ్యఁపుఁబాలవెల్లిసొబఁగుల్ ♦ జిందంగఁబూవింటిజో
దలవోకన్ దరువంగజవ్వనమునా ♦ య్యందెచ్చుపీయూషసం
కలితోదంచితహైమకుంభయుగమై ♦ కన్పట్టెఁబూఁబోఁడికిన్
వలిసిబ్బెంపుమెరుంగుగుబ్బకవతే ♦ వన్ జూపరుల్ మెచ్చఁగన్. ౧౧౨

కం. శృంగారసరసియైతగు
నంగనలావణ్యఘన ర ♦ సాభోగమునన్
బొంగుతరంగములనఁగనె
సంగువళులుసుడినెరంగొ ♦ సఁగుఁబొక్కిలియున్. ౧౧౩

కం. అచలాధిపత్య మొందిన
కుచగౌరవముం దలంచి • కొమ్మపిరుందుల్
బ్రచురించె నీడుజోడుగ
నచలాధికతిత్వగౌర • వాడంబరముల్. ౧౧౪

తే. జఘనభూమండలమున నె • సంగినట్టి
చారుకాంచనకదళికా • స్తంభయుగము
కరణిఁజూపట్టునూరువు • ల్మరియునచటి
కమలకర్భంబులనఁగజం • ఘలుదనర్చు.

కం. పల్లవములరుణరుచిసం
పల్లవమునసిర్జితములు • పదయుగమునకుల్
సల్లలితకోరకావళి
గోళ్లకుఁదులఁగాకచిప్పుఁ • గుత్తులడాఁగెన్. ౧౧౬

సీ. తప్పిఁనలోఁగలుగుమా • ద్దవమునుజొక్కఁపు
కుందనంబునఁ జెలు • వొందుకాంతి
చందురులోని ప్ర • సాదసౌభాగ్యంబు
విరిమల్లెపూవుల • పరిమళంబు
నాణిము త్తియముల • నలుసులావణ్యంబు
రతనంపు కళికల • రంగుపొంగు
లేఁజివురాకుపా • ళికసౌకుమార్యంబు
పూవుఁదేనియలందు • పసఁగుతేట

గీ. తొలుకరిమెఱుంగుదీవెల • మిలమిలయును
నాదవిణానివచ్చి సుధవోసి • పదునుచేసి
తత్తదవయవరచనసం • దర్భపరచి
తాతరచియించె నెన్నసీ • నాతిమిన్న. ౧౧౭

సీ. అంకసీలిమవేణి ♦ యందుంచి పూర్ణేందు
మండలంబునఁ జేసె ♦ మగువమోము
కాఠిన్యగుణమెల్ల ♦ గబ్బిగుబ్బలఁడాఁచి
కెంపుచేమలఁ జేసె ♦ కెంపుమోవి
చాంచల్యకలనలో ♦ చనములనెలకొల్పి
మించుచేరచియించె ♦ మెలఁతమేను
నురులుకప్రపుతెల్పు ♦ చిరునగవుననిల్పి
యనఁటిబోదెలఁదీర్చె ♦ నతివతొడలు
గీ. గుణములునుదోషములునునను ♦ గుణముగాఁగఁ
దత్తదవయవములయందుఁ ♦ దవులుకొలిపి
నెలతఁగావించినట్టియా ♦ నేర్పుసూచి
వనజగర్భునిఁజతురాస్యుఁ ♦ డనఁగవచ్చు. ౧౧౮
తే. పాలమున్నీటిపెందెరఁ ♦ గ్రాలుచునని
కాంతరమువాసివచ్చిన ♦ యట్టికలిమి
వెలఁదిపోలిక శృంగార ♦ వేషయగుచు
నలరెనారాచకన్నె ప్రో ♦ యాలుమిగుల. ౧౧౯
కం. భువనశ్లాఘాలంఘన
నవనవసౌందర్యరేఖ ♦ నరవరసుతయి
ట్లువఖత్పక్షకలి తైం
దవరేఖయుఁబోలెవృద్ధిఁ ♦ దనరుచునుండెన్. ౧౨౦

అంబరీషుని కడకు పర్వత నారదులు వచ్చుట.

వ. అయ్యవసరంబున. ౧౨౧.

మ. మహతీకబల్గురువాసుదేవశుభనా ♦ మన్యాసముద్యత్సుధా
లహరీసాధితమాధురీణములుగు ♦ లక్కబల్కసంధ్యాంబుము

క్సహకారిద్యుతులొప్పు కెంజెడలుమిం ♦ చన్ లోకసంచారధూ
ర్వహులౌ పర్వతనారదుల్ భువనసం ♦ భావ్యాత్మకుల్వచ్చినన్.

చ. కనుఁగొనియంబరీషుఁడధి ♦ కంబగుభక్తిని డోఁడి తెచ్చి మ
న్ననఁగనకాసనస్థుల నొ ♦ నర్చియథావిధినర్ఘ్యపాద్యపూ
జలనొసంగివందనము ♦ నల్పివినీతిని మోడ్పుకేలుదా
ల్చినిలిచినన్ నరేశ్వరుని ♦ సేమమెఱింగిమునీంద్రులున్నెడన్.

ఆ. తనయఁదోడి తెచ్చి ♦ మునివల్లభులకు మ్రొ
క్కించదీవనలను ♦ నిచ్చిమునులు
సతివభువనమోహ ♦ నాకారవిభవంబు
మెచ్చిచూచిరెడద ♦ రిచ్చవడఁగ. ౧౨౮

కం. సరసురవిద్యాధరకి
న్నరగంధర్వాప్సరోగ ♦ ణంబులలో సుం
దరులఁబలుమారుఁ జూడమె
సరివత్తురెదీనిరూప సౌష్టవమునకున్. ౧౨౯

సీ. వదనసౌందర్య సం ♦ పద దిలకించిన
శశిలేఖవక్రయై ♦ చనకయున్నె
వాలుఁగన్నులబెళ్కు ♦ వర్ణించఁబూనిన
హరిణిలోలోభయ ♦ మందకున్నె
నాసికాసౌష్టవం ♦ బాసఁజూచినయంత
నరతిలోత్తమమోము ♦ వంచకున్నె
చారుతనుద్యుతి ♦ చకచకల్ఁబరికింపఁ
గనిహేమకదుఁగాకఁ ♦ గరఁగకున్నె

గీ. పలుదపెందొడలందంబుఁ ♦ దలఁచినంత
వాడియలరంభయొకపార ♦ వీడకున్నె

యాచారయుఁచానరామణీ ♦ యకముఁ జూడ
మునివరులకైనఁ దాలిమి ♦ చినుగకున్నె. ౧౨౬

వ. అని తలంచుచు నంబరీషుం గని యీకన్నియ నీకూతురే? దీనిపే
రేమి! యెవ్వరికిచ్చితివి యని యడిగిన. ౧౨౭

కం. ఈ మగువ నాదుపుత్రిక
శ్రీమతియను పేరఁదగువ ♦ రిష్టగుణాఢ్యం
డై మెరయు వరునకీఁదరి
యై మెలఁగెడుఁ గన్య మునికు ♦ లాక్షేపయుచేసున్. ౧౨౮

శ్రీమతిని దమకిమ్మని పర్వతనారదులంబరీషుం గోరుట.

చ. నలినదళాక్షి పైఁదలఁపు ♦ నారదు చిత్తమునందుఁ గ్రాఁగినా
చెలిపయి నెమ్మనంబునిలి ♦ చెన్ మఱి పర్వతమౌనికిన్ గడున్
వలపుల రాచవానిబల ♦ వంతఁపుఁ జైవులఁ జిక్కియుండఁగన్
దలఁగఁగ నెంతవానికయి ♦ నం దరమే భువనత్రయంబునన్.

చ. ప్రియమునవంతనంబునకుఁ ♦ బిల్చి నృపాలుని తోడ నీగు క
న్నియనిఁక నాకునీదగున ♦ నెన్ మునివర్యుఁడు నారదుండు వెం
డియునట పర్వతుండునుఁ గ ♦ డిందగునక్కఱ నట్లవేఁడ వా
రియభిమతంబెఱుంగుట న ♦ రేంద్రుఁడు భీతిలి మ్రొక్కి యిట్లనున్.

చ. ఇరువురుగోరినార లెటు ♦ లిద్దఱికిచ్చెదఁ గన్నె సత్కృపా
వరులయి చిత్తగించుఁడు త ♦ పస్వికులోత్తములార కన్నె మీ
యిరువురిలోన నెవ్వరివ ♦ రించునొ వారికి నిత్తు ధర్మ త
త్పరులగు మీరెఱుంగని వి ♦ ధంబులు గల్గునె యెందునావుడున్.

మ. ధరణీనాయక నీదువాక్యముఁ గడున్ ♦ ధర్మోత్తరంబై నదీ
సరణిన్ జేయుము రేపువచ్చెదముసీ ♦ సత్యంబుపాలింపుమీ

మరువంబోకుమటంచుఁజెప్పి వెస న ♦ న్మౌనీశ్వరుల్ శ్రీహరి
స్మరణానందమనోరవిందులు నిజే ♦ చ్ఛామార్గుఁడై పోవుచున్.

నారదుఁడు విష్ణుని పర్వతునకుఁ గ్రోతిమొగంబు
గల్పించుమని యడుగుట.

ఆ. అంత నారదుండు ♦ హరినంబుజాతాక్షు
వాసుదేవు భక్త ♦ వరదుననఘుఁ
గనఁగవిష్ణులోక ♦ మునకేగి వైకుంఠ
పురమునందుఁబరమ ♦ పురుషుఁజూచి. ౧౩౩

చ. ముకుళితహస్తుఁడై కదిసి ♦ మ్రొక్కి నమోస్తు సమస్త లోకనా
యక పరమేశ మాధవ ద ♦ యాపరభక్త భయాపహార దై
త్యకులనుదాపహా వినమి ♦ తాఖిలదైవత తే యటంచు మ
చ్చికవినుతించినామనవిఁ ♦ జేకొనుమీశ రహస్యమిమ్మనెన్. ౧౩౪

చ. చిరునగవంకురింపఁగఁగు ♦ శేశయనాభుఁడు నానివాంఛితం
బెఱుఁగ రహస్యమిచ్చి విను ♦ పించు మనోరథమన్న సంభ్రములం
దెరఁగిమహాత్మమాధవ త్వ ♦ దీయుఁడ నన్యుల వేడనామన
స్కరలనుదీర్పనీవగతి ♦ గావెదయన్ వినువిన్నవించెదన్. ౧౩౫

సీ. అలయయోధ్యాపుర ♦ మందునీభక్తుఁడౌ
నంబరీషుండను ♦ నవనిపతికిఁ
గలదు శ్రీమతి యను ♦ కన్నెయొక్కతె రుచి
రాంగి దానినిబెండ్లి ♦ యాడఁగోరి
వేఁడితిన్నృపునట్ల ♦ వేఁడఁబర్వతుఁడుమా
యిరువురివాంఛితం ♦ బెఱిఁగినృపుఁడు
కై సేసియిరువురు ♦ గద్దియనుంచుఁడి
కన్నెయెవ్వరిఁగోరుఁ ♦ గడఁగియతని

గీ. కిచ్చెదనటంచువచియించె ♦ నిందు కేమ
నోడఁబడితిమెల్లి రాగడు ♦ విడిమెనతఁడు
నాకు నాకన్యలభ్యమా ♦ నట్టివెరవు
దలఁచినాకోర్కె తీర్చి వడి ♦ సలుపవలయు. ౧౩౬

ఉ. రూపసిఁగోరుకొంటయను ♦ రూపముకన్యకుఁగానవాయెఁదా
గోపము లేకఁ బర్వతున ♦ కుఁదా గలిగించుము వానరాననం
బో పరమేశ! భక్తులకు ♦ నోపి శుభంబొనరింపుదీవు నీ
కే పొగడొందునన్నను స ♦ రేయని నల్లననవ్వి శౌరియుఁదా. ౧౩౭

తే. అన్యులకుఁజూడనెప్పటి ♦ యట్లయుండి
కోరి శ్రీమతి చూడంగఁ ♦ గ్రోతిమొగముఁ
గావలయుఁబర్వతునకంచుఁ ♦ గాంక్షచేసి
నారదుఁడు, నట్లయిచ్చితి ♦ ననియె హరియు. ౧౩౮

పర్వతుఁడు నారదునకుఁ గొండముచ్చు మొగము
చేయుమని విష్ణుని వేడుట.

తే. ఇట్లువరమొందినారదుం ♦ డేగినంతఁ
బర్వతుఁడువచ్చియిందిరా ♦ భర్తఁగాంచి
మొక్కివినుతించి తమకథ ♦ మొదలనుండి
విన్నపముచేసియిట్లని ♦ వేఁడెహరిని. ౧౩౯

తే. కోరి శ్రీమతికనుఁగొన్నఁ ♦ గొండముచ్చు
మొగముగానుండనోరులకు ♦ మునుపట్లు
కనుపడఁగఁ జేయునారదు ♦ ననుచువేఁడ
నట్లయిచ్చితిననిపల్కె ♦ నచ్యుతుండు. ౧౪౦

కం. ఇరువురుమునులిట్లుపర
స్పరవంచకులగుచుఁదన్నుఁ ♦ బ్రార్థించినశ్రీ

హారిభక్తవత్సలుండుగా
న రచించెదనని యోఁ గోరి • న తెరంగల్లన్.    ౧౪౧

వ. ఇట్లు పర్వతనారదులు పరస్పరవంచకులై తమతమకామితంబులు సమకూర్చుకొని, పదంపడి యిరువురుం గలసి మరునాఁ డరుణోదయంబున కయోధ్యాపురంబునకువచ్చి తమరాక నృపాలున కెఱిం గించిన నంబరీషుండుఁ బురంబును నగరంబును నలంకరించ నియో గించిన.    ౧౪౨

శ్రీమతిస్వయంవరము.

సీ. మృగమదపంకంబు • మెదిచియాంతటనల్కి
యలరుఁగందఁపుఁబ్రోకల • యొంపిచల్లి
కట్టాణిముత్యాలు • గలిపి ముగ్గులువెట్టి
పరువంపుటగరు ధూ • పములు వైచి
చెలువొప్పుగరుడప • చ్చలతోరణాలుగట్టి
తళుకొందునిలువుట • ద్దములునిల్పి
పొలుచుచీనాంబరం • బులచెక్కములొప్పనిచ్చి
హారుఁబొందుమేలిచి • త్రములుదీర్చి
గీ. క్రమ్మచిత్రాంశుకములమే • ల్కట్లునెరపి
భద్రవస్త్రప్రతానంబు • పరిఢవించి
పురము నగరునుబహువిధం • బులనవీన
చిత్రరచనలు మెరయఁగా • చేసిరపుడు.    ౧౪౩

మ. కురువిందంబులకంబముల్ పులుఁగురా • గోపాసనుల్ చందురా
పరువంపుర్జవిరెల్ సురేంద్రమణులన్ • బాటిల్లుపెందల్పులన్
గరమొప్పారనపూర్వచిత్రరచనా • కల్పోజ్వలంబైన భూ
వరునాస్థానపుమంటపంబునను సౌ • వర్ణాగ్రపీఠంబులన్.    ౧౪౪

చ. ఎలమిఁ దలిర్పఁ దారుసకు ♦ లేంద్రుల గద్దెల నిల్పి యష్టపూ
జలొసఁగి యంబరీషుఁడు ప్ర ♦ సన్నమనస్కుఁ తనాత్మపుత్త్రి ను
జ్జ్వలమణిభూషణాంబర వి ♦ భాసితగా నొనరించి తెచ్చి చే
నలరుల దండ యిచ్చి వన ♦ జాస్యకు వారలఁ జూపి యిట్లనున్. ౧౪౫

తే. చానరో మాఢమీముని ♦ సత్తములను
వీరలిరువురిలో మనం ♦ బెయందుఁ
దగులు నాతనికీ పూల ♦ దండ యిమ్మ
టంచుఁ జెప్పిన నవ్వన ♦ జాస్యయపుడు. ౧౪౬

కం. ఆలోలనయనవారల
నాలోకించుటయు వాన ♦ రాస్యము గోలాం
గూలముఖ మగుచు నిరువురుఁ
జాలవికారాకృతుల నె ♦ సఁగి కనఁబడిరన్. ౧౪౭

తే. సకియ యేమియుఁ దోఁచక ♦ సంశయించి
నిలువ వారల నడుమను ♦ స్మలితాబ్జ
లోచనుఁడు మేచకాంబుదా ♦ లోకనీయ
గాత్రుఁడగు దివ్యపురుషుఁడొ ♦ క్కరుఁడు దోఁచె. ౧౪౮

వ. అట్లు తోఁచిన నతని రుచిరాకృతిదర్శనపరాధీనయగుచు నిలిచినం
గని తండ్రి తన చేల నీరియం దొక్కని గళంబున నీసుమమాల నిడు
మని యెచ్చరించుటయు నాకన్నియ తండ్రికిట్లనియె. ౧౪౯

చ. తపసులుగాన రాచటుఁ ♦ దప్పక క్రోతియుఁ గొండముచ్చునై
నృపవర! కానవచ్చెదరు ♦ నీలశరీరుఁడు పూర్ణచంద్రమో
లపనుఁడు పీతవాసుఁడు వి ♦ లాసమేతుఁడు దీర్ఘనృత్తదో
ర్విపులభుజాంతకుండొకఁడు ♦ వేము దోఁచెను వానిఁ గోరెదన్.

కం. సురుచిరరూపయుతుండ
ప్పురుషుఁడు కుడికేలుసాఁపి ♦ పూదండఁగొనన్
ద్వరపడిమెడనుమందస్మిత
వరవదనుండగుచువాని ♦ వరియింతునవన్. ౧౭౧

ఉ. నారదుఁ డవ్వెలంది వచ ♦ నంబులకున్ గడుసంశయించుచున్
సారసనేత్రి వానిని భు ♦ జంబుల వెన్నియొ చెప్పవేయఁగన్
ధారుణినాథనందన య ♦ థార్థము వానికి బాహుయుగ్మమిం
పారెడునన్న పల్కు విని ♦ పర్వతుఁడిట్లనె రాజకన్యతోన్. ౧౭౨

కం. కన్నెరొ వాని యురంబున
నున్న విధం బేమి బాహు ♦ యుగళమునందే
మున్నదిచక్కఁగఁగనుఁగొని
కన్న తెరంగిప్డు చెప్పఁ ♦ గదవే యనినన్. ౧౭౩

కం. ఉరమునఁ జంచద్రుచి వి
స్ఫురితంబగుమాలయొకటి ♦ పొలిచెడుజాలన్
శరముశరాసనమును ద
త్కరములవిలసిల్లుననుచుఁ ♦ గన్నియ సెప్పెన్. ౧౭౪

సీ. కన్యకారత్నమి ♦ క్కరణిఁ జెప్పఁగ విని
నారదుండిట్లు మ ♦ నమునఁ దలఁచె
నిదియేమిమాయయో ♦ యెఱుఁగంగరాదౌర
మాధవుండెంతటి ♦ మాయకాఁడు
తస్కరుండాతఁడు ♦ దప్పనన్యులు కారు
కాకున్న నాకేలఁ ♦ గలుగునిట్లు
కొమ్మనొగ్గెను వేళఁ ♦ గొండముచ్చుమొగంబు
హరినమ్మనచ్చునే ♦ యనుచుఁ దలఁచె

గీ. పర్వతుండును నిదిహారి ♦ పనియు కాక
యీ తెరంగున నాకేల ♦ క్రోఁతిమొగము
వచ్చునని యొంచెసిరీతి ♦ వారు సంశ
యాకులస్వాంతులై యున్న ♦ యవసరమున. ౧౪౪

ఉ. అప్పుడు రాజు వారిఁ గని ♦ యార్యశిఖామణులార! యీ తెరం
గెప్పుడుఁ జూడమున్ వినమి ♦ దేమి! వి మోహ మొనర్చె బుద్ధికిన్
దప్పకయిట్టులౌటకు గ ♦ తంబది యేమగునో! యెరుంగుఁడీ!
విప్పగు జ్ఞానదృష్టినని ♦ వేఁడుటయున్ మునివర్యులల్కతోన్.

తే. వింత లేదిందు వేరేమి ♦ వృద్ధులన్చు
మముఁ గడసిపుచ్చి యొరులకీ ♦ మగువనీయఁ
దలఁచితో కాక తడవేల ♦ ధరణినాథ
యింతిమాయందొకని వరి ♦ యింపు మనుము. ౧౪౬

మ. అనినన్ భీతిలి యంబరీషుఁడు ప్రియం ♦ బారం దనూజాతఁ గ
న్గొని యీ మానులయందు నొక్కరుని నీ ♦ కుం జూడఁ గాఁ బోలు నా
తని వేవేగ వరించుమన్న నపుడా ♦ తన్వంగియున్ మాలికన్
గొనియుచ్చోటికి వచ్చి చూడఁ దపసుల్ ♦ ఘోరాకృతిన్ దోఁచినన్.

శ్రీమతి విష్ణుని వరించుట.

కం. ఓలిం వానరగోలాం
గూలాననులైన మునుల ♦ కునుమధ్యవయ
శ్శీలలితుఁ బురుషమణిమకు
టాలంకృతుఁ గాంచి మాల ♦ యతనికి వైచెన్. ౧౪౮

తే. బాలికామణి యూతని ♦ మాలికాప
రిష్కృతునిఁ జేయఁ దాను న ♦ దృశ్యయయ్యెఁ

దత్తణమ్మునఁనిదియద్భు ♦ తమ్మటంచు
నచటివారెల్లరును వెర ♦ గందిచూడ. ౧౬౦

ఉ. శ్రీమతిపూర్వజన్మమున ♦ శ్రీహరివల్లభుఁ జేటగోరి ని
ష్ఠామహనీయమైతపము ♦ సల్పెఁదదీయకృతంబుపేర్మిన
త్తామరసాక్షిఁగైకొనియె ♦ దానవమర్దనుఁడుర్భ్వభవాంతరా
క్రామిత సత్క్రియాఫలము ♦ గ్రచ్చరభోగ్యముగాకతక్కునే.

తే. అట్టులంతర్హితాత్మయై ♦ నట్టితనయఁ
దలఁచి నృపతియువ్యసనాఢ్యు ♦ తములనొందెఁ
దాపసులురిచ్చవడినిహ ♦ తాశులగుచు
ముచ్చముడిఁగిరి దిగ్వాచో ♦ ముఖరులగుచు. ౧౬౨

పర్వత నారదులు వైకుంఠమునకరిగి శ్రీమతివృత్తాంతమడుగుట.

మ. హరియిట్లామృగశాబనేత్రఁగొనితా ♦ నంతర్హితుండై చనన్
సురవాచంయమచంద్రులీప్సితహతిన్ ♦ శోకావిలస్వాంతులై
పరమేశున్బురుషోత్తమున్సురవరున్ ♦ భక్తానుకంపానిధిన్
వరదున్గానఁ నేగిరప్పుడు వెసన్ ♦ వైకుంఠమార్గంబునన్. ౧౬౩.

చ. మునివరులిట్లువచ్చుటను ♦ ముందుముకుందుడెరింగి శ్రీమతిన్
గనుఁగొనివచ్చుతాపసులు ♦ గానకయుండఁగఁడాగియుండుమం
చనియెసరోజలోచనయు ♦ నట్లనిగూఢముఁగాఁగనుండె నం
త నచటికేగుదెంచిరి జ ♦ నార్దనదర్శనబుద్ధిసమ్మునుల్. ౧౬౪

ఆ. వచ్చినారదుండు ♦ వనజాక్షుఁగనుఁగొని
భక్తిమెుక్కిమెుదలఁ ♦ బ్రస్తుతించి
నాథయిట్లుసేయ ♦ న్యాయమేకన్నియఁ
దెచ్చితీవ్రమాకుఁ ♦ దెలియకుండ. ౧౬౫

# శ్రీమద్రామాయణమ్ము ఉత్తర కాండము.

చ. అనవినిశౌరి కర్ణములు ♦ హస్తయుగంబున మూసియిట్లనుం
మునులకుఁ జెల్లునే! విషయ ♦ ముఖ్యులు పామరులాడు చందముల్
వినఁదగునే! కృతంబెఱుఁగ ♦ వే! వినుమాయుధమంటి బాసచే
సిన మఱినమ్మవే ముని వ ♦ చించిన నారదుఁ డంతఖిన్నుఁడై. ౧౬౬

ఆ. చెలిని మంతనంబు ♦ సెప్పినాకేటికిఁ
గొండముచ్చు మోము ♦ నుండఁ జేసి
తనినని నిముకుందు ♦ డాతని చెవిలోనఁ
జెప్పె దారహస్య ♦ మిప్పగిదిని. ౧౬౭

సీ. నీవుగోరినయట్లు ♦ గా వానరాస్యంబు
పర్వతునకును జో ♦ ప్పడఁగఁ జేసి
నాఁడఁ గదా నీవు ♦ నన్నుఁ గోరినయటు
లప్పర్వతుండును ♦ నరుగుదెంచి
నీకు గోలాంగూల ♦ నిభ ముఖంబొనరించ
మనివేడె నీయట్ల ♦ యతఁడు నాకు
భక్తుఁడుగాన త ♦ త్ప్రార్థనం ఘటియించ
కునికిఁ జెల్లునె! చెప్పు ♦ మనఘ నేను

గీ. భక్తవత్సలుండ ♦ భక్తులుగోరిన
యర్థములనొసంగు ♦ టది వ్రతంబు
గాన నాకు నింకఁ ♦ గలదె దోషంబు నీ
విట్టులాడుటొప్పు ♦ నే మునీంద్ర. ౧౬౮

వ. అని చెప్పి నప్పుడు పర్వతుండును నట్లయడిగిన నతనికిని నివ్విధంబు నుత్తరంబిచ్చి విష్ణుండు వారలం గాంచి మీరు కోరిన తెఱంగాచరించితి. ఇంతియ కాని నా యెడ నొండు కపటంబు లేదాయుధంబంటి వచించెదనని యె నయ్యెడ నారదుండు హాసిల్లనియె. ౧౬౯

మాయురూపమధ్య ధను
ష్పాయకహస్తుఁడయినిలిచి ♦ చాసంగొనివే
షోమి నతఁడాన్వడగు నా
రాయణ భవదన్యులిట్టి ♦ యధికులు గలరే. ౧౭౦

మ. అనినం మాధవుఁడిట్లనెం గలరు మా ♦ యావుల్ గమంబెక్కుల
య్యానిమేషాసురయక్షకింపురుషులం ♦ దందెవ్వరోకన్నియన్
గొనిపోఁజాలరె యేను చక్రధరుఁడన్ ♦ గోదండ హస్తుండనే
కనుగొమ్మొప్పుఁజతుర్భుజుండ ద్విభుజా ♦ కారుండనై వత్తునే. ౧౭౧.

కం. ఊరక నేటికినన్ని
ట్లారడిచేసెదరనంగ ♦ నది నిక్కముగన్
నారాయణ వంచకుఁడన
గారాదని దివిజమునులు ♦ ఘటితాంజలులై. ౧౭౨

కం. నినునేలమార మము ర
మ్మని కన్నియనొరులకిచ్చె ♦ నవనీపతి చే
సిననారాత్మ్యము తెరఁగే
మనఁగలదే కపటమతని ♦ దని మునులంతన్. ౧౭౩.

ప ర్వ త నా ర దు లం బ రీ షు ని శ పిం చు ట.

కం. చనియంబరీషనృపుఁగనుఁ
గొనిమాకిచ్చెదనటంచుఁ ♦ గూఁతునొరులకి
చ్చినవాఁడవు నీదగువం
చనముఁన కనురూపమైన ♦ శాపముఁగొనుమా. ౧౭౪

ఆ. మాయ వేసెమమ్ము ♦ మరపించితివి గాన
మాయ నీవు మునికి ♦ మఱపు సేయ

నిన్ను నీవెఱుంగ • నేరకయుండు మ
టంచు మునులున్నపుడు శ • పించిరలిగి. ౧౨౫

కం. శపియించెడు తత్క్షణంబున
విపుల తమోరాశిధరణి • విభువెనుకొన్నన్
కుపిత మయి విష్ణుచక్రం
బపుడు తమోరాశి దోలఁగ • నడచుచుఁ గదిసెన్. ౧౨౬

విష్ణుచక్రము పర్వతనారదుల వెంబడించుట.

ఆ. కదిసి మునులమీఁదఁ • గడఁగిన భీతిల్లి
పరవఁ దొడఁగి రాసు • పర్వమునులు
వెంటఁదగులుకొనియె • విష్ణుచక్రము తమో
రాసిఁ గొనుచు వారు • త్రాసమంద. ౧౨౭

మ. తమవెంటన్బడి విష్ణుచక్రము మహా • ధ్వాంతంబుఁ గ్రక్కొంచు ను
గ్ర మరీచి ప్రచయాతిదుస్సహశిఖా • ప్రద్యోతమై వచ్చుచం
దము వీక్షించి భయార్తులై మునులు నా • నాలోకముల్ సొచ్చి దు
ర్దమచక్రానలకీలలన్ గడపువా • రల్లిమికిన్ ఖిన్నులై. ౧౨౮

తే. కన్నె వరియింతు ననికోఁగు • కొన్న ఫలము
తడవు లేకిట్లు చేఁజేతఁ • గుడువవచ్చెఁ
జాలునిక భక్తవాత్సల్య • శాలివైన
విష్ణుఁ డేకాక యొకదిక్కు • వేఱుగలఁడె. ౧౨౯

విష్ణుఁడు చక్రమును వారించుట.

మ. అని యూహించుచుఁ ద్రాహి త్రాహి భువనై • కాధార విష్ణో జనా
ర్దన గోవింద మమున్ భయాతురుల శీ • ఘ్రంబె రక్షించవే
యనుచున్ జేరిన నోడకుండుడను చుఁ బ • ద్మాక్షుండు చక్రంబు చ
య్యన వారించి తమంబడంచి కరుణా • యత్తాత్ముఁడై యిట్లనున్.

కం. అపరాధంబొనరించెను
తపస్వివరుఁడారనాను ♦ దర్శనమిది శాం
తిపరుల్ గానక్షమించుఁడు
తపోధనులకు సైపరాని ♦ తప్పులుగలవే. ౧౮౧

సీ. అంబరీషుండనా ♦ కత్యంతభక్తుండు
గాన నాతనికి ర ♦ క్షణముసేయ
నీచక్రమునునియ ♦ మించితిమిం శాప
జనిత తమోరాసి ♦ జనవిభునికిఁ
గదిసిన ధ్వాంతంబు ♦ ఖండింపఁగావచ్చి
యాతమోరాసిమి ♦ మ్మనుసరింప
ననుయాయియైమీకు ♦ నలజడిగావించె
నపరాధమయ్యె న ♦ నసరముగ

గీ. ననఘులకుసాధులకు శాంతి ♦ ధనముగాదె
యనుచుఁ బ్రార్థించుహరిపల్కు ♦ లాలకించి
శ్రీమతినిమాధవుండౌ హ ♦ రించె ననుచు
నెంచి కోపించి విష్ణు శ ♦ పించిరిట్లు. ౧౮౨

పర్వత నారదులు విష్ణుని శపించుట.

సీ. మనుజవేషముదాల్చి ♦ మమునిట్లువంచించి
శ్రీమతీకన్యఁ దె ♦ చ్చితివిగాన
నంబరీషునివంశ ♦ మందుమానవుఁడవై
యవతరించుమువన ♦ జాక్షనీవు
శ్రీమతీదేవిధా ♦ త్రీపుత్రియైపుట్టు
నై దేహపతియింట ♦ ననితదాఁగి

నీకుదేవేరియౌ ♦ నీవుగాత్మసధర్మ
మూని ధర్మంబున ♦ నువిదఁగొంటి

గీ. వంచుచే నీదుభార్యను ♦ నసురుఁడొకఁడు
నిన్ను వంచించి కొనిపోవు ♦ నెలఁతకొరకు
నేము దుఃఖించి నట్లుగా ♦ నీవు నింతిఁ
గూర్చి మితిలేని వగపునఁ ♦ గుందగలవు. ౧౮౩

వ. అని శపియించిన విష్ణుండు మునులకిట్లనియె. ౧౮౪

శా. సారశ్రీకర మంబరీషనృపవం ♦ శంబందుఁ గల్గుంగుణో
దారుండై పొగడొందు పఙ్క్తిరథుఁడౌ ♦ ధాత్రీశు పుత్రుండనై
శ్రీరాముండనఁగా జనించెదను నే ♦ శేషుండు సౌమిత్రియౌ
దోరుగ్రాయుధయుగ్మమౌ భరతశ ♦ త్రుఘ్నాఖ్యలం గల్గెడున్.

కం. ఋషి శాపవాక్యములన్నృత
విషయంబులుగాఁదగవు వి ♦ వేకించియు కి
ల్బిషులగు వీరల విడుమని
విషధరవర్ణుండు మాన్చె ♦ వెసఁజక్రంబున్. ౧౮౬

కం. ఎప్పుడు రాముఁడనై ధర
నొప్పుగ జనియింతు నపుడ ♦ యొలయుమునన్నున్
దప్పఁదుగద ఋషిశాప
విప్పుడు నృపుఁబాయు తమము ♦ యోగ్యకొంచున్. ౧౮౭

వ. అని. ౧౮౮

తే. తమమునాత్మార్థముగసంచి ♦ తంబొనర్చి
హానిదించినది యదృ ♦ శ్యమయిపోయె

జక్రమును దాపసుల కల ♦ జడిగొనర్చ
కంబరీషుని రక్షింప ♦ నరిగెనురలి. ౧౮౯

తే. చక్రహస్తుని భక్తవా ♦ త్సల్యమెఱిఁగి
యధికభక్తిని హరికి సా ♦ ష్టాంగమెఱఁగి
యనుమతినిగాంచి వెడలి వా ♦ రచటు వాసి
పోవుచును శోకసంతప్త ♦ బుద్ధులగుచు. ౧౯౦

పర్వత నారదులు బ్రహ్మచర్యమునకుఁ బ్రతిజ్ఞ చేయుట.

కం. ఇదిమొదలా దేహాంతము
సుదతులఁగోరక నితాంత ♦ శుద్ధతపస్సం
పదమానధ్యానరతిన్
బ్రతుకుదమని మునులు ప్రతిన ♦ బట్టిరి నియతిన్ ౧౯౧

వ. అట్లు కృతశపథులయి పర్వత నారదులు కన్యాపరిగ్రహంబు గోరక
నాజన్మబ్రహ్మచర్యాదీక్షాపరాయణులై తపోనియమంబుల వర్తిం
చిరి. మరియును. ౧౯౨

కం. రాజర్షి యంబరీషుఁడు
భ్రాజన్నిజకీర్తియగుచు ♦ బహువర్షంబుల్
ప్రజ్ఞాజనులన్ బాలించి మ
హారాజన్యుఁడు విష్ణులోక ♦ మొందెన్ బిదపన్. ౧౯౩

కం. మునివచన సత్యతాపా
లనమునకై చక్రధరుఁడు ♦ లాఘవలీలా
మనుజాకృతిఁ గైకొనితా
జనియించెన్ రవికులము వి ♦ శదకీర్తిగనన్. ౧౯౪

మ. రవివంశోత్తముఁడైన పఙ్క్తిరథుపు ♦ త్రశ్రేష్ఠుఁడైకర్తమా
ధవుఁడుర్విన్ రఘురాముఁడై మునికులో ♦ త్తంసోగ్రశాపప్రభా

తనలబ్ధాంతవిలుప్తకేలితుఁడున్ ♦ దాత్రాళికాన్యప్రబో
ధవిధానప్రభవిష్ణుబోధగుణయు ♦ క్తస్వాంతుఁడున్గానటన్. ౧౯౫

శా. సర్వజ్ఞానపయోధియున్ విమలవి ♦ జ్ఞానప్రకాశాఢ్యుఁడున్
సర్వజ్ఞుండును నైనశౌరిమునిరా ♦ ట్కార్యప్రభావంబుచే
సర్వాచీనవిబోధభావుఁడునపూ ♦ ర్ణాత్ముండునై కల్గి తా
నుర్విన్ భక్తులఁ బ్రోచుపట్లప్రభువి ♦ ట్లొప్పెదినంబై సరే. ౧౯౬

కం. మాయాధృతదేహుండై
మాయాకృత్యంబులలిపి ♦ మానులయెడ నా
రాయణుఁడు మనుజుఁడయ్యెను
ధీయుతులకు మాయ సేయు ♦ తెఱఁగొప్పదటన్. ౧౯౭

తే. రామజన్మకథైకకా ♦ రణము సంబ
రీష చరితంబు నీకు న ♦ శేషముగను
దెలిపితిని విష్ణుమాయావి ♦ ధేయమైన
విమలమాహాత్మ్యమెల్లను ♦ విశదముగను. ౧౯౮

కం. మాయావిమోహనహరికథ
పాయకఁ జెవివిన నువిన్న ♦ బహుభవ దుఃఖో
పాయముల విడచి ఘనమగు
మాయఁ గడచి మోక్షమందు ♦ మనుజుఁడు చులకన్. ౧౯౯

వైతాళీయము.

దశరథసుతజన్మ ♦ దర్శకంబై
విశదంబైయుల ♦ వెల్గునీచరిత్రన్
ప్రశమాన్వితుఁడై ♦ పఠించినన్
భృశకీర్తిగను ♦ విష్ణులోకమున్. ౨౦౦

వ. అనిచెప్పి. ౨౦౧

ఆశ్వాసాంతము.

శా. ద్రాగుప్తిప్రకటప్రసంగతప్రియ ♦ ద్గంగాఝరీశీకరా
భోగాసిక్తవతంసచంద్రకలికో ♦ ద్భూతాహ్వృతస్య దసం
యోగామ్రేడితశీతలాంచితకటా ♦ క్షోపాత్తపీయూషకృపా
ప్రాగల్భ్యావితసేవకప్రకరసా ♦ భాగ్యప్రభావాకరా. ౨౦౨

కం. భవమహితవిభవసహృత్సం
భవహరణధురీణతాను ♦ భవన మదవనో
త్సవగౌరీధవశినను
త్సవసిక్తస్తవవినూత్న ♦ చంద్రప్రసవా. ౨౦౩

మాలిని.

యమినికరసుగేయా ♦ యాగభుగ్వందనీయా
శమిత దురితజాలా ♦ సర్వలోకైకపాలా
సమధికగుణరోపా ♦ సత్యవిజ్ఞానరూపా
విమలతరశరీరా ♦ వేదమార్గప్రచారా. ౨౦౪

గద్య.

ఇది శ్రీరామచంద్రచరణారవిందసపర్యామరందతుందిలమనోమిళిందపవన
నందన పద వందనానంద సందర్శిత సరసకవితావిచిత్ర శ్రీమదానం
దతీర్థ భగవత్పాదాచార్య గురుకరుణాపాత్ర పరిచితాశ్వలాయన
సూత్రవిశ్వామిత్రగోత్రపవిత్రనందగిరివంశశరనిధి రాకాకు
ముదమిత్ర వేంకటనృసింహరాయ పుత్త్ర శేషమాంబాగ
ర్భశుక్తిముక్తాఫలాయమాననిరుపమాన భాగధేయ
సకల సుకవినికాయ విధేయ వేంకటప్పరాయనా
మధేయవిరచితంబగు వాల్మీకీయ శ్రీమద్రా
మాయణాద్భుతోత్తర కాండమహాకా
వ్యంబున ప్రథమాశ్వాసము.

ఓం.

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీమద్రామాయణాద్భుతోత్తరకాండము.

## ద్వితీయాశ్వాసము.

క. సతతరక్షాచణ కరుణా
ధృతనాగాభరణవిశ్వ ◆ దీపకచరణా
వితతభవాబ్ధ్యుద్ధరణా
శ్రితదురితభయప్రణాశ ◆ శ్రీయనురేశా. ౧

వ. అవధరింపుము తదనంతరంబున వాల్మీకిమునీంద్రుండు భరద్వాజున కిట్లని చెప్పందొడంగె. ౨

తే. ప్రతికులోత్తంసయో భర ◆ ద్వాజవినుము
చెప్పెదను పద్మవాసిని ◆ సీతయగుచు
జననిజన్మించుటకు హేతు ◆ వైనయట్టి
విమలచరితంబు నెల్లస ◆ విస్తరముగ. 3

### కౌశికోపాఖ్యానము.

సీ. కలఁడు త్రేతాయుగ ◆ కాలమందు నొకక్ష-
క్షితిసురోత్తముఁడు కా ◆ శికుఁ డనంగ
హరిపరాయణుఁడయి ◆ నానవరతమ్మున్ను
వేడ్కల్పెపను ◆ విష్ణుకీర్తని
విమలనామంబుల గా ◆ నము సేయుచుండుచూ
ఏకభాగానమో ◆ దమున నొక్క-

దివ్యవిష్ణుక్షేత్ర • తీర్థభూమికి నేగి
యస్ఫుటతాళల • యాన్వితముగ

గీ. మూర్ఛనలు శ్రుతిమండల • ములును వెలయ
సుస్వరంబున హరినామ • శుద్ధగాన
రచన నిజభక్తియోగసా • రమయి వెలుఁగ
నతఁడు వర్తించె నియతభి • క్షాశనతను ౪

కం. హరినామగాననిష్ఠా
పరుఁడగు కౌశికునకన్న • పానీయంబుల్
నిరతము నొసఁగుచునుండెన్
బరమగుణుఁడు ద్విజుఁడొకండు • పద్మాక్షుఁడనన్. ౫

కం. సకుటుంబముగా నా కౌ
శికుఁడాతని గృహమునను వ • సించుచు నిష్ఠా
ధికుఁడై శ్రీహరినామ
ప్రకటంబగు గాననియతి • భక్తిం జరిపెన్. ౬

ఆ. భక్తియోగనియతిఁ • బద్మాక్షుఁడును వాని
గానమునకు మెచ్చి • కమలనాభుఁ
గొలుచుచుండె నంతఁ • గొంతకాలమునకుఁ
గౌశికునకు శిష్య • గణముఁ గలిగె. ౭

కం. కొందరు భూసురులును నొక
కొందరు రాజన్యకులులుఁ • గొందరు వైశ్యుల్
గ్రందుగ నేర్పడు శిష్యులు
సందులఁ గౌశికునిఁ గొలిచి • హరిఁ గీర్తించన్. ౮

తే. అందరికిఁ గూడ నన్నపా ♦ నాదికములు
హితముతోడుతఁ బద్మాక్షుఁ ♦ డిచ్చుచుండె
శిష్యగణయుక్తముగను గౌ ♦ శికుఁడు విష్ణు
గానతత్పరుఁడగుచు న ♦ క్కడ వసించె.

కం. మాళవుఁడను నొక వైద్యుఁడు
నాళీకభవాదివంద్యు ♦ నారాయణు ది
వ్యాలయమున దీపంబుల
మాలలు రచియించుచుండె ♦ మనువక నిచ్చల్. ౧౦

కం. మాళవుని భార్య గుణయుత
మాలతి యనునింతి విష్ణు ♦ మందిరము నుషః
కాలముల గోమయంబున
నాలిప్తము సేసి కొలుచు ♦ ననవరతంబున్. ౧౧

వ. ఇట్లందరును గౌశిక గానాకర్ణనాకృష్ట చిత్తులై యుండు నంత. ౧౨

కౌశికుని వద్దికి కుశస్థలవాసులగు విప్రులు వచ్చుట.

సీ. ధరణీసురులు కుశ ♦ స్థలసముత్పన్నులు
సంశితవ్రతులనూ ♦ చానకులులు
గానవిద్యాపరి ♦ జ్ఞానకోవిదులగు
వారేబదుండ్రందు ♦ వచ్చి నిలచి
యాకౌశికుని గోష్ఠి ♦ యందుండి హరినామ
గానపారీణులై ♦ కడుముదమున
నుండి రీగతిఁ గడు ♦ నొప్పారు కౌశికు
గానకౌశలము వి ♦ ఖ్యాతినొంద

గీ. చాలఁగఁ బ్రసిద్ధినొందెనే ♦ చందనమ్ము
నాకళింగధరామండ ♦ లాధిపుండు
వినికరంబద్భుతమునొంది ♦ కనుఁగొనంగఁ
దలఁచివిచ్చేసె నచటికిఁ ♦ దత్క్షణంబ. ౧౩

కౌశికుని సన్నిధికి కళింగరాజు వచ్చుట.

మ. అతిదర్పోజ్జ్వలుఁడా కళింగుఁడు తదీ ♦ యంబైన గానంబు ప్ర
స్తుతిపాత్రంబు నిజశ్రుతిప్రియముగాఁ ♦ దోతెంచినన్ జాల వి
స్మితుఁడై యాద్భుతగానసంగతినను ♦ జెల్వొందఁగాఁ గాడినన్
క్షితిలోఁ గీర్తియుతుండనైనను మహా ♦ శ్రీతించియు ద్రిక్కుఁడై.

వ. అన్నృపాలుండు కౌశికుం గాంచి యిట్లనియె. ౧౪

కళింగుఁడు తన్ను గూర్చి గానము సేయఁగోరి ప్రత్యాఖ్యాతుఁడగుట.

మ. జనలోకస్తవనీయ భూరిసుగుణ ♦ శ్లాఘా సమేతంబుగా
ననుమీరెల్లను చారుగానమున నీ ♦ న్నాణాబుగాఁ బాడుఁడీ
విని మోదంబున నీకు శిష్టులిజనుల్ ♦ వేనోరునన్ మెచ్చఁగా
ననఘా కౌశిక నీకు వాంఛితముగా ♦ నర్థంబు లేనిచ్చెదన్. ౧౫

చ. అనవుడుఁ గౌశికుండు మను ♦ జాధిపుఁ గన్గొని యిట్టులనో
జనవర నాదుజిహ్వ మురశాసను శ్రీహరి సర్వలోక పా
వనుమధుసూదనున్ విడచి ♦ వాసవునైనఁ దదన్యుఁ గోరి కీ
ర్తన మొనరించఁ బోదెటులఁ ♦ దా నినుమానవమాత్రుఁ బాడఁగన్.

కం. జనవర నీవొసఁగెడ సను
ధనము లనిత్యములవేల ♦ ధన్యులకు సనా
తనమగు మోక్షధనంబును
జనిగొని యిచ్చుటకు శౌరి ♦ ప్రభుఁడై యుండన్. ౧౭

కం. అనిపలికెన్ గాశికుఁడా
తనిశిష్యులునట్లు విష్ణు • తత్పరులై య
న్యునిఁ బొగడకునికి దృఢముగ
వినుపించిరి యక్కళింగ • విభునకుఁ గడఁకన్. ౧౯

మ. అనఘుల్ విష్ణుపరాయణుల్ పరమయో • గాసక్తులుగ్రవ్రతప్రో
ధను లెమించుకుశస్థలీనసుమతీ • దైవోత్తముల్ రాజుఁగ
న్గొని మాపీనులు విష్ణునిన్ విడచి య • న్యున్ బాడఁగా నింతయున్
వినఁగాఁ జాలవటంచుఁ బల్కిరి మహా • విజ్ఞానధీరాత్ములై. ౨౦

మ. అనినన్ దర్పపరీతుఁడై నృపుఁడు భృ • త్యశ్రేణి నీక్షించి దు
ర్జనులీ విప్రులు నన్నుఁ బాడ వినరో • ర్వాంజాలము చాడి రె
ట్లొనగూడంగలదో? కసుంగొనెద మీ • రుచ్చైస్స్వనంబొప్పఁగా
ననుఁ గీర్తించుఁడు రోదసీకుహరసాం • ద్రంబై ప్రవర్తిల్లఁగన్. ౨౧

మ. పృథివీనాయకుఁడిట్లు చెప్పిననుద • ద్భృత్యావళుల్ దిక్తతుల్
బధిరీభావమునందఁ బోర్ధ్వివుగుణో • పన్యాసపూర్వంబుగాఁ
బృథుశబ్దంబుగఁ బాడఁ జొచ్చిన భయో • పేతాత్ములై విష్ణుభ
క్తిధనుల్ కౌశికముఖ్యవిప్రులు చెవుల్ • కేల్దోయిచే మూయుచున్.

చ. హరిహరియంచు నుండిరొద • యంతకు మించుచుఁ గర్ణరంధ్రముల్
జొరఁబడఁగాష్టశంకువులు • సొన్పి చెవుల్ మొదలంట వ్రక్కలిం
చిరి మరి కౌశికుండు నిజ • శిష్యయుతంబుగ జిహ్వఁ గత్తిచేఁ
దరుగుకొనెన్ నృపావమతి • తప్పదు పాడక యున్న నంచొగిన్. ౨౩

కం. అవ్విధముగాంచి వారల
నవ్వసుధాపతి స్వకీయ • మగు దేశంబున్
దవ్వుగఁ దొలంగి పోవఁగ
నవ్వేళన్ భటుల చేత • నడపించె వెసన్. ౨౪

తే. అట్లు రాజాజ్ఞ నొందివా • రరిగి యుత్త
రంపుదిక్కునదవ్వగు • నట్టిచోట
మెలఁగి నియమవ్రతంబులు • సలిపి కాల
వశతఁగనవారిఁ జూచి వై • వస్వతుండు. ౨౫

కౌశికాదుల బ్రహ్మలోకమునకు గొనిపోవుట.

ఉ. వీరల కేమి సేతునని • వేమరు నెంచుచు నుండు నంతలో
సారసగర్భుఁ డెల్లదివి • షత్పరివారము తోడ వచ్చినీ
రేరుహనాభుభక్తులు వ • రిష్ఠగుణాఢ్యులు చారుగానవి
ద్యారతి వాసుదేవుని బ్రి • యంబునఁ గొల్చిరటంచుఁ దెల్పుచున్.

తే. ఈమహాత్ములఁ దోడ్కొని • యేగుదెండు
వేగ నాలోకమునకన్న • విబుధవరులు
పేరుపేరునఁ బిల్చియా • ధీరవరుల
సరగఁ గొనిపోయి రాబ్రహ్మ • సదనమునకు. ౨౭

తే. చేరవచ్చినయట్టికౌ • శికుసశిష్యు
వానిగోష్ఠినినర్తించు • వారిఁగాంచి
భక్తిఁ బ్రత్యుద్గతుండయి • పద్మభవుఁడు
స్వాగతము వేడి యర్ఘ్యపూ • జలనొనర్చె. ౨౮

కం. అత్యంతవినయ మొనరఁగఁ
బ్రత్యుద్గతుఁ డైనకమల • భవుఁ గనుఁగొని త
త్ప్రత్యయగౌరవమునకై
నత్యాశ్చర్యంబు నొంది • రమరులు ఋషులున్. ౨౯

వ. అట్లు దేవతలు గావించు విస్మయపూర్వక కోలాహలంబు వారించి
హిరణ్యగర్భుండా కౌశికాదులం గొని సకల విబుధర్షిగణానుగమ్య
మానుండై తూర్ణంబున విష్ణులోకంబున కరిగి యచ్చట. 30

కా శి కా దు లఁ గా ని బ్ర హ్మ వి ష్ణు లో క ము న క ర గు ట.

మ. గగనోత్క్షిప్తతరంగసంగత శర ♦ త్కాదంబినీవైద్యుత
ద్విగుణాంశూజ్జ్వలహేమపత్త్రవిభా ♦ దీవ్యన్మరాళీగణా
స్థగితోత్కీర్ణప్రకరాభిరామమగుచున్ ♦ ధావళ్యమైశుద్ధస
త్త్వగుణాస్ఫూర్తిఘనీభవించిన గతిన్ ♦ దళ్కొందు క్షీరాంబుధిన్.

కం. నారాయణగోలంబ వి
హారాస్పదపుండరీక ♦ మనఁగావిలస
ద్ధీరాంకురరుచినిచయ
శ్రీరాజిలునాసికాంత ♦ రీపమునందున్. 3౨

శా. ధ్వాంతారాతిసహస్రదీధితిసము ♦ ద్యత్తప్తసౌవర్ణసా
లాంతస్స్నాధవిచిత్రమంటపలలా ♦ మాకారభాగుజ్జ్వల
చ్చింతారత్నవినూత్నరశ్మిపటల ♦ శ్రీ దర్శనీయోరు శు
ద్ధాంతప్రాంచదనంతభోగవిలస ♦ త్తల్పాగ్రభాగంబునన్. 33

సీ. సారూప్యభాగులై ♦ చారునిజాకార
ధారులైతగుభక్త ♦ తతులుగొల్వ
సనకాదులగుమహా ♦ మునికోటులుపనిష
త్సూక్తములనువిని సం ♦ స్తుతులొనర్ప
తుంబురు నారదా ♦ దులు దివ్యనిజకథా
సమితి మాధుర్యగా ♦ నములఁబాడ
నవసరంబెరిఁగి ద ♦ క్షాది ప్రజాపతు
ల్నవసన్నగతులు వి ♦ న్నపమొనర్ప

గీ. నాకృతులు దాల్చినిగమము ♦ లనుసరింప
సకల విజ్ఞానములు చేరి ♦ సంశ్రయింప

సద్భుతవిభూతి లక్ష్మీశు • హాయుఁడగుచు
నెలమిమెయినున్న హరిఁ బర • మేశుఁ జూచి. ౩౪

కం. కౌశికముఖ విబుధులతోఁ
గౌశికముఖ విబుధవరులు • గలసికెలనరా
శ్రీశునిఁ గదియఁగ నరిగి కు
శేశయగర్భుండు వినతి • చేసి సభక్తిన్. ౩౫

కవిరాజవిరాజితము.

జయజయమాధవ•జ్ఞానద మాధవ • సంభృతదివ్య యశోవిభవా
జయజయ సర్వజ • గత్పరిరక్షణ • చారుసమస్త గుణాభరణా
జయజయ పావన • శార్ఙ్గ శరాసన •సాధుసమూహమనస్సదనా
జయజయ దామో•దర శ్రీధర విల • సత్కరుణాకరచక్రధరా.

కందాష్టకము.

1 సిరిచేరురమున నిరవుగఁ
గరమలరఁగఁ గేలఁ జుట్టు • కైదువు వెలుఁగన్
బురుడెందు లేని పెంపుం
బర పెడు నెరకాఁడజగము • మనిచెడువాఁడా. ౩౬

2 తొలుకారు మెరుపువోలుచు
దళతళమను పసిఁడివలువ • దాల్చెడు రేఁడా
నలుమొగముల బలుదేవర
మొలువంగల బొడ్డుతమ్మి • పూవు గలాఁడా. ౩౭

3 జగములు గలిగింపఁగ నవి
మగుడన్ మాయింపఁ బెంప • మరిసెకం టెన్

జగజంత లేఁడు నీకె
చ్చగువాఁడుఁ జోడువాఁడు ♦ నరయంగలఁడే. ౩౯

4 తొలుబలుకు నుదలనెనుకం
గలజాడల మెలఁగుపట్టి ♦ గడుసరివాసి
నెలవిట్టిదనుచు నెరుఁగం
గలమే ప్రోవవలెనమ్ముఁ ♦ గనికరములతోఁ. ౪౦

5 పోలఁగ మీలై మరి తా
బేలై యేకలమనయ్యు ♦ వెసనరమెకమై
కూళలగుతొంటి వేల్పులఁ
గూలిచి జగమునకు మేలు ♦ గూర్చిన తండ్రీ. ౪౧

6 వడుఁగువయి గండ్రగొడ్డలి
గడికాఁడై రాచసిరుల ♦ గ్రద్దరియై ప్రే
బుడుతవయి మాయవిద్దెల
గడుసరివై కలికిఁ దనము ♦ గలిగినఁ బ్రోడా. ౪౨

7 వడిఁ జాగిలి మ్రొక్కెదనీ
యడుగుందామరలకెనఁగు ♦ నక్కటికమునన్
గొడవలెడలించినాకె
ప్పుడుసాయంబగుచు నిలచి ♦ ప్రోవఁగదయ్యా. ౪౩

8 దొడ్డింగలిగిన వేలుపు
గిడ్డిఁగద కొలుచువారి ♦ కినిమాకిపుడున్
దొడ్డదొరవగచు గొడవల
యడ్డములెడలించి ప్రోవు ♦ మయ్యాయియ్యా. ౪౪

సీ. శ్రీశాయమైత్ర్యవి • నాశాయహృతభవ
పాశాశయాయ తు • భ్యంనమోస్తు
నారాయణాయ సు • జ్ఞానసారాయ వి
శ్వాధారకాయ తు • భ్యంనమోస్తు
దేవాయ కరుణాస్వ • భావాయ మహితప్ర
భావ భావాయ తు • భ్యం నమోస్తు
ధీరాయ బహుభావ • తారాయ వాత్సల్య
పారంగతాయ తు • భ్యంనమోస్తు

గీ. పరమపదనాయకాయ తు • భ్యంనమోస్తు
హరముఖసమర్చితాయ తు • భ్యంనమోస్తు
భద్రసంధాయకాయ తు • భ్యంనమోస్తు
భక్తతసచ్చిత్సుఖాయ తు • భ్యంనమోస్తు. ౮౫

పంచచామరపంచకము.

1 నమస్సమస్త విష్టపాధి • నాయకాయ శౌరిణే
విమృష్టసర్వ దుష్కృతాయ • విశ్వసంభవాదిస
న్నిమిత్త చిత్స్వరూపకాయ • నిస్సమాధికాయ తే
నమోస్తు చక్రధారిణేభి • నంద్యభద్రకారిణే. ౮౬

2 సరోజ సంభవాండభాండ • జాలమెల్ల గుక్షిలో
ప్రరూఢ సంస్థితిన్ భజింప • పాలనంబు సేయుచున్
నిరంతరంబు శుద్ధసత్త్వ • నిష్ఠతోడ సత్కృపా
స్థిరుండవైన నిన్నుగూర్చి • చేతులెత్తి మ్రొక్కెదన్. ౮౭

3. నిరంజనంబు నిర్గుణంబు • నిర్వికల్పమున్ బరా
పరంబు సర్వహేతుతావి • భాసితంబు శాశ్వతం

బుద్ధిమంబు సత్త్వ నిత్య ♦ మూర్జిత ప్రభావమై
కరంబుఁబొల్చు బ్రహ్మమీవ ♦ గావె విశ్వపావనా. ౪౮

4 తలంప నెల్ల బీజమంద ♦ దంగియుండువృక్షము
నెల్లయట్లునీచరాచరాద్య ♦ మీవిశ్వమంతయుఁ
గలంకు లేక దేవుఁడు ♦ గర్భమందాసీవని
సల్లలంకిబుద్ధిఁజూడవిన్న ♦ కారణుండవీశ్వరా. ౪౯

5 వెలుఁగుకేడుగేల్వప్రాల ♦ విందుఁగీకుగన్నులా
తలయ్యవిన్న నేలమెట్ట ♦ దమ్ములెంచ నేలయు
న్నాలల్ కడిందియున్నులెల్ల ♦ మానిసుల్ కసంగ బి
స్తలాగదయ్య యట్టి నిన్ను ♦ దండలంచి మ్రొక్కెదన్. ౫౦

విష్ణుండు కౌశికాదుల కుచిత నివాసం బేర్పరచుట.

చ. అని వినుతించుచున్న జల ♦ జాసనుఁ గన్గొని వానితోడ న
చ్చిన యం కౌశికాదుల వి ♦ శిష్టగుణాఢ్యులఁ జూచి శౌరి ము
న్నని దయార్ద్ర గాథకడ ♦ ననుమతిఁ గౌశిక రమ్మటంచుఁ బ్ర
సన్నుఁడఁ జెలుపొప్పి పిల్చెనుర ♦ సాధులు నిర్వ్యగంది మూడఁగన్.

వ. అట్లు మాధవుండు గాథావరభరితుండై వారలనెల్ల సబహుమా
నంబుగా నవలోకించి బ్రహ్మకిట్లనియె. ౫౧

చ. విను వనజాతగర్భ! గుణ ♦ వృద్ధులు వీరలు నానుభక్తి సా
ధనముగఁ గోరి కౌశికుఁ స ♦ దాజని తోత్సుకుఁ జేయుచుండు వినూ
తన కమనీయగాన రస ♦ తత్పరులైననుఁ గొల్చినారు కా
వున నిట నీవు సాధ్యులనఁ ♦ బొల్చుచు దేవతలై వెలుఁగుతన్.

చ. అని హరి కౌశికుంగని మ ♦ హాత్మక నీదగు భక్తి మెచ్చితిఁ గూ
ర్చి నిఖిలలోకములొప్పగడ ♦ శిష్యులతోడ గణాధిపుండవై

కం. ననుబాడఁగఁగౌశికునకు
ధనమిడి పోషించి పొందె ♦ ధననాథత్వం
బును మల్లోకావాసము
ననఘుఁడు పద్మాక్షుఁ డీతఁ ♦ డతిధార్మికుఁడై. ౬౧

కం. అని నిర్దేశించి జనా
ర్దనుఁడా శ్రితలాలనైక ♦ తత్పరుఁడై యు
వ్వనజభవాదులు వొగడఁగ
ననంతఫణామణిసుపీఠి ♦ నధివసియించెన్. ౬౨

కౌశిక కృత గాన వినోదము.

ఉ. అప్పుడు కౌశికుండు ప్రియ ♦ మందఁగ విష్ణుకథాసుధారసం
బుప్పతిలంగ వైణిక చ ♦ యోత్సవదాయినియైన గోష్ఠియున్
జొప్పడ నంమగౌశికు వి ♦ శుద్ధసమంచితగాన వైభవం
బుప్పరవీథి నుల్లసిలె ♦ నోలిసురవ్రజమాలకింపఁగన్. ౬౩

కం ఆ మేజువాణిఁ గనుఁగొనఁ
గా మాధవు రాణియైన ♦ కమలాలయయున్
బ్రేమం జనుదెంచెను ని
స్సీమ ముదంబున సహస్ర ♦ చేటీయుతయై. ౬౪

శా. సమ్మర్దంబునఁ గ్రమ్మఁదెంచు సురలన్ ♦ శక్రాబ్జగర్భాదులన్
హుమ్మంచున్ గని చేటికాగ్రసరల ♦ త్యుత్సాహులై కేల వే
త్రమ్ములైకొని సందడిన్ దొలఁగ దూ ♦ రమ్మంచవల్లాఁగ ని
క్కమ్మెమ్మెవ్వర మీశుముందనిపలం ♦ గన్నిప్పిరా వేలుపుల్. ౬౫

నారదాదులలక్ష్మిచేటికలచే సత్కారితులగుట.

కం. నారదముఖులగు సురముని
లారమణులచేతివేత్ర ♦ హతిఁ దవ్వగను

త్సాహితులై నిలచిరి ప్రభు
చేరువబంటధికుఁడని వ ♦ చించుటవినమే. ౬౬

తుంబురుని గానము సేయ నియమించుట.

ఉ. అంబుజగేహ వల్లభుని ♦ యానతిఁ గైకొని గాన కౌశలుం
డుంబురుఁ బిల్చి కౌశికుని ♦ తోడుగఁ బాడుమటంచుఁ జెప్పినం
దంబురమీటి మూర్ఛనలు ♦ దాకొన సుస్వరగాన మాధురీ
ణంబు ప్రశంసనీయత గ ♦ నం దగఁ బాడె నతండు జోడుగన్.

ఉ. భూరిసుధా ప్రవాహ మొగిఁ ♦ బొంగినయట్లు నితాంత మానుషీ
సారము గ్రుమ్మరించుచు ల ♦ సన్మృదు స్వస్వర షడ్జ మధ్య గాం
ధార నిషాద తానకల ♦ నంబుల మూర్ఛనలొప్ప వల్లకీ
చారురవంబు దోడ్పడ నె ♦ సంగెఁ దదుజ్జ్వల గానమయ్యెడన్.

ఉ. ఆమృదుగాన విభ్రమని ♦ తాంతసమర్పిత చిత్తవృత్తులై
వేమరు నన్యచింతనలు ♦ వీడినఁ జిత్తరు బొమ్మలట్ల స
ర్వామరలోకముల్ శ్రుతిసు ♦ ఖామృతిఁ జొక్కి పురానుభూతది
వ్యామృత పానకౌతుకము ♦ నప్పుడు విస్మరణంబునొందెనో యనన్.

వ. అవ్విధంబునం బ్రవృత్తంబైన యమ్మనోహరీయ గానవినోదంబునకు నిందిరాముకుందులమందానందకందళితాంతరంగులై యుండిరి. ౭౦

తుంబురునకు బహుమాన మిచ్చుట.

కం. బహువిధ మణిభూషణంబులు
మహితాంబరములును సబహు ♦ మానంబుగ లో
కహితుండగు తుంబురునకు
మహోత్సవమ్మున నొసంగిరి ♦ మాధవునాజ్ఞన్. ౭౧

కం. హరిచే బహుమతుఁడై తుం
బురుఁ డుల్లమునందుఁ గడు బ్ర ♦ మోదము లొంగా

యీమాహాత్మ్యంబు బహిర్గతుండవయి యొం ♦ టీక గంటివి నా జనన్యమి
శ్లాఘ నమ్మహితంగాం చెనం చుచుఁ బద్మజుం ♦ డత్యంత శోకాతురుండై. ౭౮

ఉ. పుట్టికి నాకు నీజనన ♦ మేటికిఁ దాన నన్నుఁ గీర్తిపున్నెముల్
పెట్టికిఁ బోయెదుం బుడమి ♦ విన్న నువాం బెముకుందుమన్న నా
మేటియె త్రండ్రి నాకు పర ♦ మేశ నిఁ జూడఁగ నబ్బదియ్యె నె
చ్చోటికిఁ బోనకేగువాఁడనని ♦ శోకము నారదుఁ డాందె దేవయ్యేన్. ౭౯

నారదుని యొద్దకు లక్ష్మీవిష్ణులు వచ్చుట.

ఉ. సారసగేహ కిమ్మునియె ♦ సంగిన శాపమెఱింగి భక్తిమైఁ
దారుఁడు వాసుదేవుఁడల ♦ తామరసాలయతోడ వచ్చె ప
న్నారదుఁ డున్న చోటికిఁ బె ♦ న్నగొను భక్తిమునీంద్రుఁ గాంచి ఫా
లాంచితాంచితాంజలిక ♦ యై వినయంబున లక్ష్మి యిట్లనెన్. ౮౦

చ. మునివర నీదు శాపము న ♦ మోఘము గావున నీవె విష్ణుఁ బ్రా
ర్థన మొనరింతు సాంత్వన వి ♦ ధంబున సత్కరుణార్ద్ర బుద్ధివై
యనుమతి సేయుమంచు ఘటి ♦ తాంజలియై కలశాబ్ధి పుత్రి మ
న్నన దయివార వేడికొనె ♦ నారదు శాపము దప్ప నీగతిన్. ౮౧

నారదుని లక్ష్మీదేవి వేడుకొనుట.

ఉ. కానన వాసులౌ ముని ని ♦ కాయము శోణిత మిచ్చు కొనుకై
పూని కసించఁ దత్కలశ ♦ పూరిత రక్తముఁ గోరి క్రోలునే
దానవకాంత యట్టి వని ♦ తామణి గర్భమునందుఁ బుట్టెదన్
దీనికి సమ్మతించు మన ♦ దేవమునీశ్వరుఁ డట్ల యానతిన్. ౮౨

వ. ఇందిర యసంభవంబైన సంభవకారణంబడిగిన సంగీతజ్ఞుఁడగు నారదుం గనుంగొని వాసుదేవుండిట్లనియె. ౮౩

నారదుని విష్ణుఁడూరడించుట.

చ. తపమున యజ్ఞయాగముల ♦ ధ్యాన జపంబులఁ దీర్థసేవలన్
విపులమనోముదంబు నొద ♦ వింపదు మంజులగాన కౌశలీ
సుపఠిత నామకీర్తనము ♦ సొంపునఁ జేసి కరంగుమాడ్కి నా
శపగతపాప్మ! కౌశిక వి ♦ హారము చూచితి గాదె సంయమీ.

కం. తుంబురుఁడు మధురతరగా
నంబునఁ జొక్కించుకతన ♦ నాకుఁ బ్రియుండై
యింబలరు మన్ననలనొం
దం బాత్రతఁ గాంచె వినుము ♦ తద్విధమెల్లన్. ౮౫

ఉ. నీకునుఁ దాదృశంబయిన ♦ నిర్మల గౌరవ లబ్ధిగోరెదేన్
జేకొని గానకౌశలము ♦ నేర్వుము దానికి మానసోత్తరా
ఖ్యాక గిరీంద్ర మందొకఁడు♦గల్గునులూకము గానబంధునా
మాంకలితంబు దాని బ్రియ ♦ మార భజింపుము నేర్పు గానమున్.

మ. అతిలోకంబగు గానకౌశలము ల♦భ్యంబై ననిశోప్పనా
ర్జిత విఖ్యాతి మదీయభక్తియునువ ♦ ర్ధిల్లున్ బ్రియ మొప్పడసు
స్థితమానీయెడనాఖనంచుహరిని ♦ ర్దేశించినన్ మానివి
స్మితుఁడై పంకజనాభు వీడ్కొని త ♦ చ్చింతాఖలుండై యటన్.

నారదుండు గానబంధునికడ కరుగుట.

ఆ. వెడలిగానబంధు ♦ వీక్షించఁగోమాన
సోత్తరావనీధ ♦ రోపకంఠ
మునకు నేగిచిత్ర ♦ ముగ నన్నగంబునఁ
గనియెజ్ఞానసింధు ♦ గానబంధు. ౮౮

సీ. తనచుట్టు దేవగం ♦ ధర్వ కిన్నర తతుల్
కరములందు విపంచి ♦ కలుధరించి
షడ్జాదిసప్తసు ♦ స్వరములుమూర్ఛనల్
గ్రామంబులును తాన ♦ గమకములును
వాదివివాదిసం ♦ వాదిభేదంబులు
బహువిధభావముల్ ♦ పరిఢవిల్ల
గతిద్విసప్తతిమేళ ♦ కర్తలలో శుద్ధ
ప్రతిమధ్యమంబులే ♦ ర్పాటునొంద

గీ. జన్యరాగంబులెల్ల సం ♦ చారకలన
నుల్లసిల్లంగ మోదులు ♦ పల్లవించు
నట్లుగాఁబాడి గానవి ♦ ద్యారహస్య
సంచయంబులుదగ నభ్య ♦ సించుచుండ. ౮౯

వ. తన్మధ్యంబునఁ దదీయ సర్వాచార్యత్వాభిషిక్తుండైన యులూక శ్రేష్ఠునిఁగనుంగొని నారదుండు గాఢవిస్మయాక్రాంతచిత్తుండై చేరంజనిన యులూకంబు నారదాగమనంబెఱింగికృతప్రత్యుద్గానాభివందనాది సంభావనలందృప్తునింజేసి యిట్లనియె. ౯౦

ఉ. దేవమునీంద్ర నీవరుగు ♦ దెంచుట నాజని ధన్యమయ్యె సం
భావితమయ్యె నాగృహము ♦ పావనమయ్యె మదీయవంశముఁ
నావలనం బ్రయోజనమొ ♦ నర్చఁగఁజాలిన దెద్దియేనియుఁ
గావలెనేని కింకరుని ♦ గాఁబనిగొమ్ము మహాత్మనావుడుఁ. ౯౧

కం. సురమౌని పల్కె నీదగు
గరిమం బతిలోకమదిజ ♦ గన్నాథునిచేఁ
బరికథితమయ్యె నిఁక నా
తెఱఁగెఱిఁగించెదను వినుము ♦ ధీరవిచారా. ౯౨

నారదుఁడు గానబంధునికి నిజవృత్తాంతం బెఱింగించుట.

సీ. శ్రీకరంబై మించు • వైకుంఠనగరంబు
నందొక్కనాఁడు శ్రీ • హరియు రమయుఁ
గొలువుండు నెడఁ గౌశి • కుండను భక్తుండు
గానకౌశలమునఁ • గడుఁ దనర్చ
సవ్వేళఁ దుంబురుం • డతనితోడుగఁ బాడి
హరిచేతఁ గడు మెప్పు • లందియరిగె
బ్రహ్మాదిసురలు ని • రస్తులై దవ్వుల
నిలచిరి మహతియు • నేను నట్లు

గీ. కమలవాసిని చేటి • కా కోటి చేతసం
తర్జితుండనగుచుఁ • దరలిపోయి
గ్రుక్కుమిక్కురనక • గ్రుడ్లనీళ్ళుక్కుచు
నుంటి నేమి చెప్ప • నోమహాత్మ. ౯౩

ఉ. ఎన్ని శ్రుతుల్ప్రతించినను • నెంతతపంబొనరించి మించినన్
బున్నములెల్ల వమ్ములయి • పోయెనిఁకేటికి భక్తవత్సలున్
జెన్నగు గానవైభవము • చేఁ గడు మెచ్చఁగఁ జేసెఁ దుంబురుం
డన్నిటఁ ధన్యుఁడయ్యెనని • యార్తుఁడనై పలవించుచుండఁగన్. ౯౪

మ. హరి నన్నుం గని గానబంధుఁడను కా • కారాతి దామానసో
త్తర శైలంబున నుండు నాఖగము చెం • తన్ గానవిద్యాపరి
స్ఫురణంబెల్లను నేర్చుకొమ్మపుడు వ • చ్చున్ నీకు నివ్వేళఁ దుం
బురుఁడిచోఁ గనినట్టి గౌరవమటం • చున్ జెప్పె నుద్యద్దయన్.

కం. హరివాక్యంబుల చొప్పున
నరుదెంచితి నిన్నుఁగని కృ • తార్థుఁడనైతిన్
వరగుణ నను శిష్యునిగాఁ
బరిగ్రహించి నెస గాన • పరుఁ జేయుమనన్. ౯౫

## గానబంధుని పూర్వవృత్తాంతము.

వ. నారదునివాక్యంబులాలించి యులూకంబిట్లనియె. ౯౭

మ. దివిషన్మౌనికులాగ్రగణ్యవినుమ ♦ ద్వృత్తాంతంబు పూర్వంబునన్
భువనేశుండను నామధేయమున నే ♦ భూపాలచంద్రుండనై
యవనీచక్రము ధర్మమార్గమున ను ♦ ద్యత్కీర్తిఁబాలించుచున్
వివిధేజ్యారతినశ్వమేధశతమున్ ♦ విజ్ఞానినైచేసితిన్. ౯౮

ఉ. తారలనైనలెక్కయిడ ♦ దక్షుఁడుగల్గునుః గానిభూమి బృం
దారక కోటికేను విహి ♦ తంబుగదానమొసంగు గోవులన్
నేరరుసెప్పఁబల్మరును ♦ నిర్మలకాంచనసామజాశ్వ ధా
త్రీరథవస్త్రదానములఁ ♦ దెప్పలఁదేల్చుచునుందు విప్రులన్. ౯౯

ఆ. భూరిదక్షిణాల న ♦ పూర్వంబులైనట్టి
సవనములను బెక్కు ♦ సలిపివిబుధ
తతుల నెపుడుఁ దృప్తిఁ ♦ దనుపుమఁ బ్రజలను
జూచిధర్మనిరతిఁ ♦ బ్రోచుచుందు. ౧౦౦

వ. ఇట్లుండి. ౧౦౧

ఉ. విప్రులువేదతత్పరత ♦ వీడకసన్నిగమాంతసూక్తులన్
స్వప్రభుశంఖచక్రిధరు ♦ శాంతునసంతుభజింపఁగా వలెన్
విప్రతిపత్తిగానమున ♦ విష్ణునిబాడఁగరాదుగాన వి
ద్యాప్రవణప్రసక్తులకు ♦ నర్హమునన్నుగణింపఁగాదగున్. ౧౦౨

తే. అంగనలు మంజుగాన వి ♦ ద్యాప్రవీణ
లగుచుననుఁబాడవలెఁగాని ♦ యన్యుఁబాడ
రాదువేదముత్రాల్చువి ♦ ప్రతతిశ్రుతులు
వీడిహరినామ కీర్తనల్ ♦ పాడరాదు. ౧౦౩

కం. సూతులుమాగధులును మ
ద్గీతంబులు పాడవలయుఁ ♦ గృతమతియెవ్వం
డీతెరఁగుల్లంఘించెడు
నాతఁడు వధ్యుండటంచు ♦ నాజ్ఞయొసఁగితిన్. ౧౦౪

వ. ఇట్లతి తీక్ష్ణంబగు నాజ్ఞయొసంగి తద్విధంబున ప్రజాపాలనంబు
సేయుచున్న యెడ. ౧౦౫

మ. హరిమిత్రుండను బ్రాహ్మణోత్తముఁడు ద్వ ♦ ద్వాతీతుఁడున్ వీతమ
త్సరుఁడున్ సాధుచరిత్రుఁడంచిత పవి ♦ త్రస్వాంతుండున్ సద్గుణో
త్తరుఁడున్ శ్రీహరిభక్తియుక్తుఁడగునా ♦ తండొక్కచో నిందిరే
శ్వర సేవాకుతుకంబుతోఁ బ్రచురపూ ♦ జాతత్పరుండై యటన్.

తే. పుణ్యతమమైనయొకనదీ ♦ పులినముననఁ
చారుసుందరమగు శుచి ♦ స్థలమునందు
నతిమనోజ్ఞంబుగా హరి ♦ ప్రతిమనిల్పి
వేదచోదితమార్గ ప్ర ♦ వీణుఁడగుచు. ౧౦౭

ఆ. దివ్యగంధపుష్ప ♦ దీపధూపాదులు
భక్తితో మహార్ఘ ♦ భంగినొసఁగి
బహుళదధిఘృతాక్త ♦ భక్ష్యభోజ్యములతోఁ
బాయసాన్నమొసఁగి ♦ ప్రణతుఁడగుచు. ౧౦౮

కం. దేవోపచారములతో
దేవోత్తముఁడైన వాసు ♦ దేవునికిన్ బూ
జావిధినడపిధరిత్రీ
దేవకులోత్తంసుఁడభ్యు ♦ దితదృఢభక్తిన్. ౧౦౯

కం. మందరధరుమురహరు గో
విందుని సత్కీర్తనములు ♦ వీణాగానా

నందుఁడయిపాడఁజొచ్చె న
మందసుధాస్యంది సుస్వ • రాన్వితలీలన్. ౧౧౦

కం. ఆమృదుగాన సుధాసృతి
చే మోఁడులు పల్లవించెఁ • జెప్పఁగనేలా
నీమహిఁ జేతనలోకం
బామోదం బొందెననుచు • నతిచోద్యముగన్. ౧౧౧

కం. హరిమిత్రుఁడిట్లునందక
ధరు గాన రిరంసనుండఁ • దద్వ్యధమెల్లన్
నరపాలభటులు గనుఁగొని
ధరణీశ్వరునాజ్ఞఁదప్పె • దండ్యుఁడటంచున్. ౧౧౨

చ. వెసజనుదెంచిగర్వమున • విప్రునిఁబల్కఁగఁదూరియానరా
పసదులుపూజ్యమా ప్రతిమ • పారఁగనైచి మహీసురోత్తమున్
గసరుచు రజ్జుబంధములఁ • గట్టితదర్చిత ద్రవ్యవంతతుల్
బసచెడఁ జిమ్మి వాని నర • పాలకు చెంతకుఁ దెచ్చిచూపినన్.

కం. కినలుచు నాజ్ఞోల్లంఘన
మొనరించినవాఁడటంచు • నుర్వీ సురవ
ర్యుని దేశము వెడలనడఁచి
చనువరగైకొంటి నతని • సర్వస్వమ్మున్. ౧౧౪

వ. ఇట్లు పండితమానినై హరినామగాన ప్రకృతిఘాతుకత్వంబున మహాపచారంబొనర్చి యవ్విప్రుని పూజలంజెరిచి గానంబునకు విఘ్నంబుఁగావించి దేశంబు వెడలనడఁచియాజ్ఞాపరిపాలకత్వంబునం గృతార్థుండనై సంతసించితి నంత గొంతకాలంబునకు లోకాంతరప్రాప్తింజెంది కృతాగుపద్రవ్యానుసారంబుగా నులూకత్వంబుఁ బ్రాపించి యెల్లచోటులం బరిభ్రమించుచు భక్ష్యమొక్కించుకయు

దారుకక యనవరత క్షుదాపీడితుండనై యత్యంత దుఃఖితస్వాం
తుండను ఖిన్నుండనునై యమునింజూచి యిట్లంటి. ౧౧౬

కం. ఏపాపమొనర్చితినో
పాపఁపుత్త్రుఁడయిట్లు నన్నుఁ ♦ బ్రాపించె నితాం
తాపప్రదయగు దీనిని
నేవగిదిఁ దొలఁగువాఁడ ♦ నెఱిఁగింపఁగదే. ౧౧౭

కం. అని ప్రార్థించునులూకముఁ
గనుఁగొనినమునిపతి పలికెఁ ♦ గడుదుర్మతివై
మును విష్ణుకీర్తనమునకు
నొనరించితివంతరాయ ♦ మూర్వీపతివై. ౧౧౮

మ. హరిమిత్రుండను మిత్రుఁడోపి హరిసే ♦ వాయత్తుఁడై పాడఁద
ద్వరపూజాప్రతిమాదికంబులను వి ♦ ధ్వంసంబుఁగావించి ని
ష్ఠురతన్ దర్ధనమెల్లఁగొంటివిదయా ♦ శూన్యుండవై వానిత్వ
ద్ధరణింబాయఁగఁద్రోచితా దురితము ♦ వ్వల్లీలనిట్రెక్కొనెన్.

కం. పరమార్థవేదియైతగు
ధరణీసురవరుఁడు విష్ణు ♦ తత్పరుఁడై శ్రీ
హరినామగానరతుఁడగు
టుచు ధర్మంబన్యగాన ♦ యోగముదగునే. ౧౧౯

ఉ. కావున నీవుదుర్విధము ♦ గైకొని శ్రీహరిగానధర్మముల్
గేవలదార్ష్ట్యబుద్ధి నుడి ♦ గించితివా దురితంబు ఘోరమై
నీవొనరించుయజ్ఞములు ♦ నిష్ఫలుదానములున్ నశించెనీ
కావిధిఁబుణ్యలోకగతు ♦ లన్నియుఁదప్పెఁగృతంబుఁదప్పనే. ౧౨౦

వ. అట్లుగావున నష్టపుణ్యుండవగు నీకు నప్పాపంబు పెంపున నీదృ
శంబగుగతి వాటిల్లెఁగావున. ౧౨౧

కం. అరుగుము వెసఁబర్వత కో
టరమునకు వసించు మచ్చ ♦ టను నీకు భవాం
తరగసముత్సృష్ట కళే
బరము లభించు క్షుదదీర ♦ భక్షింపుమటన్. ౧౨౨

కం. వినుమన్వంతరమును గడ
చినదాఁకను నట్లునిరయ ♦ సంస్థితిఁగనియా
వెనుక శునకజన్మముఁగని
మనుజతయటమీఁదనొంది ♦ మనఁగలవనుచున్. ౧౨౩

వ. చెప్పి కృతాంతుండంతర్ధానంబునొందెఁ దదుక్తప్రకారంబున నీపర్వత గుహాసన్నివేశంబుగైకొని యచ్చోట నుపస్థితంబై తోఁచినభవాంతరోత్సృష్ట కళేబరంబు దరిసి క్షుదఁదీర దినుచుండితి నిట్లు.

కం. కృతమగుదోషంబున నుప
గతమయ్యెశవామిషంబు ♦ ఖాదింపనులో
కతలబ్ధమయ్యెఁదరమే
కృతమునుభుజియించకుండఁ ♦ గికురింపంగన్. ౧౨౪

కం. అత్యధికదక్షిణాలసం
స్తుత్యమఖశతంబొనర్చి ♦ సుకృతోన్నతిఁగో
క్షిత్యధిపతినై చెడిదా
ర్గత్యంబిటుగంటిమూఢ ♦ గర్వముకలిమిన్. ౧౨౫

కం. హరిమిత్రుని పూజావిధి
హరియించిన దురితమధిక ♦ మైనాకీ దు
స్తరభవముదెచ్చె నెన్నఁడు
హరిదాసులఁ బరిభవింప ♦ నగునేమేశుల్. ౧౨౬

వ. ఇట్లు లూకత్వంబున శవామిషాశినై దుఃఖంబనుభవించుచుండ నొక్కనాడు దైవయోగంబున. ౧౨౯

మ. జ్వలనద్యన్మణిదీప్తి సంకలితమై ♦ బాలార్కబింబంబునాఁ
జెలువంబైన విమానమందు దివిష ♦ చ్ఛ్రీమంతి నీసంతతుల్
గొలువన్ బల్మరు విష్ణుదూతలు ప్రియో ♦ క్తుల్పల్కుచున్ దోడరా
నలఘుండాహరిమిత్రుఁడొక్కయెడమా ♦ ర్గాయత్తుఁడై వచ్చుచున్.

వ. శవమాంసాశి నగుచుఁ దత్సమీపంబున నులూకదేహంబుతో నున్న నన్నుంజూచి యిట్లనియె. ౧౩౦

మ. భువనేశుండను పేరఁబుణ్యరతుఁడా ♦ భూపాలు దేహంబుగా
దె? విహంగోత్తమ నీకు నెట్లుగలిగెన్ ♦ దీనిం భుజింపంగ నీ
యవనీశుండును పుణ్యుఁడేమిటికి ని ♦ ట్లయ్యెన్ విచిత్రంబగున్
భవదీయంబగు వృత్తమెల్ల వినుపిం ♦ పన్ జెల్లు నేనాకనన్. ౧౩౧

చ. అలఘుదయార్ద్రచిత్తుఁడగు ♦ నాతనిఁగన్గొనిభక్తితోఁ గృతాం
జలినయి యేనచూవె గత ♦ జన్మమునన్ భువనేశనాముఁడన్
దెలివియొకింత లేక భవ ♦ దీయసుభక్తికి నంతరాయమున్
గలుగఁగఁజేసి తద్దురిత ♦ కల్పన నిట్లయినాఁడ నీయెడన్. ౧౩౨

శా. ఆకల్పాంతము నిట్టులాత్మతను మాం ♦ సాహారమున్ జేయుచున్
ఘూకత్వంబుననుండి యంతపయిఁ గం ♦ దున్ శ్వానజన్మంబు ద
త్పాకాంతంబున మానుషత్వమును జెం ♦ దన్ గల్గెడున్ గ్రమ్మరన్
నీకున్ జేసినకీడు నన్నిటుల నొం ♦ దెన్ ఘోరమైనాపుడున్. ౧౩౩

కం. ఆలించి నాదుపలుకులు
జాలింబడియాఘనుండు ♦ సమధికకరుణా
శీలుఁడయిశీతలాపాం
గాలోకనములనుజూచి ♦ యపుడిట్లనియెన్. ౧౩౪

మ. ధరనాపట్ల నొనర్చినట్టి యపరా ♦ ధంబెల్ల సైరించితిన్
దురితంబెల్లఁ దొలంగుఁగాక శమమున్ ♦ దోడ్తో తిరోధానమై
హరియించున్ బెడఁబాయుఁగాతశుభక♦ త్వావిష్క్రియాహేతుదు
స్తరకాలుష్యముగల్గుఁగాక హరిభ ♦ క్తిశ్రేష్ఠభావంబొగిన్. ౧౩౫

మ. నినుఁబ్రాపించెడుఁగాక గానమహిమో ♦ న్మేషంబునీజిహ్వయున్
గనువిస్పష్టసువర్ణసుస్వరయుతిన్ ♦ గాంధర్వవిద్యారతిన్
ఘనుఁబీతాంబరుఁబాడుచున్ నిరతమున్ ♦ గంధర్వసిద్ధాదులా
యనిమేషావళికెల్లఁగాంచుమిఁకగా ♦ నాచార్యతన్ మత్కృపన్

ఆ. ఇట్లు విష్ణుభక్తి ♦ యేపారఁజరియించఁ
గతిపయాహములకుఁ ♦ గలుగునీకు
సర్వభద్రములును ♦ శౌరిదయాదృష్టి
ననుచు విష్ణుభక్తుఁ ♦ డతఁడువలికె. ౧౩౬

కం. పరులకు నాపదగలిగినఁ
బరికించి సహింపరోపి ♦ భద్రము గలిగిం
తురు తప్పులెన్న రెప్పుడు
హరిభక్తుల ప్రకృతియిట్టి ♦ దమరమునీంద్రా. ౧౩౭

కం. పరమకృపాపరుఁడగు నా
హరిభక్తుని కరుణచేత ♦ నప్పుడమద్దు
స్తర దురితమడఁగె శమమునుఁ
బరికింప నగోచరత్వ ♦ భావమునందెన్. ౧౩౮

వ. అది మొదలు శ్రీహరినామ గానపారాయణుండై సురగంధ
ర్వాదుల కనవరతంబును గానంబుశిక్షించుచు గానాచార్యుండై
గానబంధుండను నామధేయంబుదాల్చి హరిమిత్రకృపా విశేషం
బున నిరస్తాశేష దురితుండై వర్తించుచుంటినని చెప్పి. ౧౪౦

ఆ. నారదమునిచంద్ర ♦ నాపూర్వజన్మ వృ
త్తాంతమిద్ది సువిది ♦ తముగ నీకుఁ
జెప్పినాఁడఁ దీని ♦ జేరి విన్న నరుండు
ధన్యుఁడగుచు హరి ప ♦ దంబుగాంచు. ౧౪౧

వ. అనిచెప్పి. ౧౪౨

శా. కంటే వీరలనెల్ల యాగభుజులున్ ♦ గంధర్వులున్ గిన్నరుల్
వింటన్ ద్రిమ్మరు నప్సరోగణములున్ ♦ విద్యాధరుల్ సిద్ధులున్
దంటల్ గానము నేరువన్ గడఁగి మ ♦ త్సాన్నిధ్యసంవాసులై
యొంటన్ బాయక సావధానమతులై ♦ యున్నారు శిక్షార్థులై.

కం. శ్రమచేసి నేరువక గా
నములభ్యముగాదు తపము ♦ నర్చిన సామ
ర్థ్యము గలిగియున్న నీవును
విమలమతీ యిట్లు గాన ♦ విద్యన్ గొనుమా. ౧౪౪

కం. వినుము భరద్వాజా! యి
ట్లనిన యులూకంబుగాంచి ♦ యానారదుఁడున్
వినతుఁడయి హరినిఁదలఁచుచు
యనన్యమతి గానశిక్ష ♦ కారంభించెన్. ౧౪౫

నారదుండు గానబంధుని యొద్ద గానము నేర్చుట.

కం. శిక్షాక్రమంబు గైకొని
శిక్షించఁగఁదొడఁగె నపుడు ♦ శిష్యత్వమునన్
దక్షుఁడగు నారదుని య
ప్పక్షికులోత్తముఁడు గాన ♦ పారీణతరున్. ౧౪౬

కం. వనితాసంగమము సత్కృత
మునవన వ్యాఖ్యానసంగ • మున వ్యవహారం
బున నాయవ్యయములు గను
నను వునగానమున లజ్జ • త్యజియింపఁదగున్. ౧౪౭

కం. వినుకుంతితుండు గూఢుం
డును ప్రావరణాది యుక్తుఁ • డును నతివివృతా
ననుఁడు గరక్షేపకుఁడును
ఘననిర్గతజిహ్వుఁడును త • గఁడు గానమునన్. ౧౪౮

కం. తనుఁజూచుచుఁ బరుఁజూచుచు
వినుఁజూచుచుఁ జేతులెత్తి • విరుచుచు నగుచున్
మనమున నన్యముఁ దలఁచుచు
ఘనధిషణా! తగదటండ్రు • గానముసేయన్. ౧౪౯

కం. మనమున భయమును గంపం
బును శోకముగలుగు నెడ బు • భుక్షయుఁ దృషయున్
గొనిచీఁకటి గూడదుగా
ననియతిమరితాళ ఘట్ట • నము తగదొకచేన్. ౧౫౦

తే. నిర్జరమునీంద్ర యిటువంటి • నియమములను
నెఱిఁగిపాటించి తగనభ్య • సించునను చు
నెలమితో గానవిద్య శి • క్షించదివ్య
వర్షసాహస్రమమ్మునిని • వసునిఖిలగము. ౧౫౧

కం. గీతప్రస్తావంబులు
జాతులు స్వరభేదములును • సపహాస్యముగా
జ్ఞాతములై వీణాదిక
చాతుర్యము జంత్రగాత్ర • సరణులనేర్పెన్. ౧౫౨

తే. అట్లు సంగీతవిద్యా ర • హస్యమెల్లఁ
బూర్ణముగ నేర్చి యమ్ముని • పుంగవుండు
నమరులు నుతింపఁ గృతకృత్యు • డగుచుగాన
బంధుఁ జూచి వినీతుఁడై • పలికె నిట్లు. ౧౫౩

కం. నీకతనన్ గృతకృత్యుండ
నై కాంచితి గానవిద్య • యందుఁ గుశలతన్
గాకారికులోత్తమ నీ
కే కార్యము సేతు దాని • నెరుగింపఁ దగున్ ౧౫౪

వ. అనిన గృద్ధం బిట్లనియె. ౧౫౫

కం. పదునలుగురు మనువులు నడు
వదినం బగు బ్రహ్మకంత • వరకును నాకున్
బదిలముగఁ గీర్తి నిలుపుము
విదితగుణా! యిది యె నాక • భీష్టంబనియెన్. ౧౫౬

ఉ. నావుడు వానికిట్లనియె • నారదుఁ డీవుఁ దలంచినట్లుగాఁ
గావుత సర్వమున్ మరలఁ • గల్పము గల్గెడు వేళఁ దార్క్ష్యరతన్
నీవు భుజించి చక్రధరు • నిన్ బ్రియపూరితుఁ జేతు శార్ఙ్గభృ
త్పావనగానయోగమునఁ • బాటిలు మోక్షము నీకు నయ్యెడన్.

తే. స్వస్తియగుఁ గాత నీకు వి • జ్ఞానమహిత
పోయి వచ్చెద నాపయి • బుద్ధి సుప్ర
సన్నముగఁ జేయు మనుచు నం • జలి ఘటించి
నారదుఁడు తుంబురుఁ జయింపఁ • గోరి యరిగె. ౧౫౭

వ. ఇట్లరిగి తుంబురుని గృహసమీపంబున. ౧౫౮

## నారదుఁడు తుంబురునికడకరుగుట.

ఉ. కృత్తనిజోత్తమాంగములు ♦ కృత్తముఖాక్షికరాంఘ్రివక్షముల్
కృత్తనితంబపక్షికటి ♦ కీకసజానుభుజాంగుళీకముల్
నుత్త విచండపృష్టములు ♦ లూనకపోలగళోష్టముల్ వివి
ర్వృత్త వికారరూపములు ♦ స్త్రీపురుషాకృతులందుఁగన్గొనెన్.

చ. కనుఁగొని మీరలెవ్వరిటు ♦ రాఁగతమేమెఱిఁగించుఁడన్న ని
ట్లనియె మునీంద్ర రాగ నిచ ♦ యంబులమేమిటు నీవుగానయో
గనిరతి భిన్నసంధికము ♦ గాస్వరభేదమెఱుంగలేక పా
డిన నిటువంటి దుర్గతి ఘ ♦ టిల్లు మనుండును మాకునిచ్చలున్.

చ. పలుమరునీదుగానము నె ♦ పంబున నీదృశరూప మొందుచున్
బలమఱి వెండి తుంబురుని ♦ భాసురగానము పేర్మిఁగ్రమ్మరన్
మొలచివిదారితావయవ ♦ ముల్విలసిల్లగ స్వస్థభావమున్
గలిగిమెలంగుచుందుమనఁ ♦ గావిని యాతఁడపత్రపిష్ణుఁడై. ౧౬౨

## నారదుఁడు విష్ణునికడకరుగుట.

చ. అచ్చెరువంది నారదుఁడ ♦ హో! యిటులుద్యమమెల్ల వ్యర్థమై
తెచ్చె పరాభవంబనుచు ♦ ధిగ్వచనత్రపలపిష్ణుఁడై కడున్
వెచ్చఁగనూర్చుచున్ మరలి ♦ వేగసతంపుపయఃపయోధికిన్
వచ్చిజనార్దనుంగడిసి ♦ వందనముల్ రచియించి నిల్చినన్. ౧౬౩

తే. అతనిఁగనుఁగొనిహరియిట్టు ♦ లనియెగాన
బంధుకడనేర్చితివి విద్య ♦ భద్రనుయ్యోఁ
గాని తుంబురుతోసాటి ♦ గాఁగఁజాలు
నట్టిపాండిత్యమింకలే ♦ దయ్యెనీకు. ౧౬౪

కం. ఇరువదియెనిమిదియవ ద్వా
పరమున వసుదేవునకు న ♦ పత్యమునై యే
ధరణి జనియింతు నప్పుడు
సురమునివర ! నిన్నుగాన ♦ శూరునిఁ జేతుఁన్. ౧౬౫

కం. తావత్పర్యంతము నీ
వీవిధమున గాన నిరతి ♦ యేర్పడగంధ
ర్వావలి శిక్షించుము మా
దావహమతినన్నుఁ బాడు ♦ చనవరతంబున్. ౧౬౬

వ. అని నిర్దేశించిన నారదుండును వీణావాదన తత్పరుండై త్రిభువనంబుల యథాకామంబుగ సంచరించుచు నింద్రాగ్ని వరుణ వాయు కుబేరాది దిక్పాల సభాంగణంబులను బ్రహ్మలోకంబునను హాహా, హూహూ ముఖగంధర్వ గణంబులతోడను శ్రీనివాసుం బాడుచు నానందంబు నొందుచుండి యొక్కనాఁడు మరల తుంబురు మందిర ప్రాంతంబునం జనుచుండి షడ్జాదిసప్తస్వరంబులు సురకన్యారూపంబులు ధరించి యందుండి తన్నుఁగని నిరాదర భావంబున నవమానంబుచేసిన విన్నఁబోయి యచటువాసి క్రమ్మరయథేచ్ఛముజగంబులం బరిభ్రమించుచు దేవగంధర్వాదులకు యథాన్యాయంబుగ గానశిక్షణంబుగావించుచు నతిచిరంబగు కాలంబుగడపిన తదనంతరంబున. ౧౬౭

నారదుఁడు శ్రీకృష్ణుని దర్శించుట.

చ. హరి వసుదేవసూనుఁడయి ♦ యాదవవంశము లంకరించినన్
సురమునివచ్చికన్గొనె వి ♦ శోభిత రైవతకాద్రి సానుభా
గరచిత సన్నివాసుధృత ♦ కాంచనవాసు మహావిలాసు శ్రీ
కరగుణభూషుఁ గృష్ణు వర ♦ కౌస్తుభసమ్యగలంకరిష్ణునిన్. ౧౬౮

వ. అట్లు గనుంగొని యిట్లని వినుతించె. ౧౬౯

శ్లో. నమో వేదాంత వేద్యాయ
జగతాంమీశ్వరాయతే
ద్వారకా పురనాథాయ
నమః కృష్ణాయ వేధసే. ౧౭౦

దండకము.

శ్రీరుక్మిణీమానసాంభోజ సూరా జగన్నాటకప్రోల్లసత్సూత్రధారా లసచ్చారుకారుణ్యపీయూష నిష్యంద సంరక్షితాత్మీయభక్తవ్రజా గోపకన్యా కటాక్షాంచితేందీవరస్రక్పరిష్కార భవ్యప్రచారా సదా ధారకైశోరలీలా సమాలోలకేళీ కృతాభీరయోషా గృహోపాత్తచౌర్యక్రియామాధుర్య మాధుర్యహైయ్యంగవీనాది సంపూర్యమాణాబ్జ జాతాండభాండాశ్రయాత్మీయ దీవ్యత్ప్రచండా ప్రచండార్క సాహస్రతేజఃప్రకాండా కళిందాత్మజాకూల రాజత్తమాలాటవీ మధ్య గోబృంద సంచారణాన్వేషణాయత్త గోపాలబాలా వళీ కల్ప్యమానోపచారాతివేల ప్రమోదాయ మానాత్మలీలా వినోదాయితాపూర్యమాణోల్ల సద్వేణునాళాంతరుద్గీర్ణగాంధర్వ గీతామృతానేకహేలా సమాయాత గోపాంగనా నర్మవాగ్ధోరణీ గుంభితాదంభవక్షోజ కుంభోన్నమత్తత్పరీరంభ సంభావనా రంభగంభీర కేళీ కళాభాసురోల్లాస రాసక్రియానాట్యవిన్యాస చాతుర్యసంవీక్షణాత్యంత సందుక్షితహీమ్నిప్రచారాత్మనాథాం కపాళీద్రవచ్చిత్తనైయచ్ఛరీచారు ధమ్మిల్ల కృష్ణేచకాంభోద శంకానటద్బర్హిబర్హావతంసాయమూర్తిం సభాస్వర్గదాశంఖచక్రాబ్జశార్ఙ్గాది దివ్యాయుధోపేత నీలాంబుదశ్యామ లోకాభిరామా లసత్పీతకౌశేయవాసా మహోల్లాస శ్రీవాసుదేవా, పరానందభావా, జగన్నాధ, దీనార్త

సంరక్షణా, క్షీణకీర్త్యున్నతా, కౌస్తుభాలంకృతా, దేవదేవా, పరం
ధామ, నారాయణా, వామనా, శ్రీధరా, మాధవా, కేశవా,
హే! హృషీకేశ, గోవింద గోపాంగనానంద, శ్రీకృష్ణవిష్ణో సహిష్ణో
నమస్తే నమస్తే నమస్తే నమః. ౧౭౧

నారదకృత నవరసరత్నమాలికా స్తోత్రము.

మ. తలిరుంబోయవు గోపసుందరులు ని ♦ ద్దంపుం గళల్ గుల్కఁ జె
క్కిళులం నీడలుసూపి కప్పురమునన్ ♦ గీర్ణామముల్ దిద్ది నే
ర్పులు వాటింపఁగ నబ్బురంపుఁదరి తీ ♦ పుల్ జిల్కు కెమ్మోవులం
దలమం దేనియఁ గ్రోలి సొక్కుదవు కృ ♦ ష్ణా వేణుగానప్రియా! ౧౭౨

శా. చేలల్ ముచ్చిలి సిగ్గునన్ దడఁబడన్ ♦ చేయెత్తి మ్రొక్కుండటం
చాలంబాడి కరంబులెత్తఁగృతవీ ♦ తాచ్ఛాద తన్మర్మ వీ
క్షాలోలత్వమునం జెలంగి దర హా ♦ సాంకూరముల్ పైకొనన్
హాళిన్ జూపితి వేటిచెయ్దమిది కృ ♦ ష్ణా వేణుగానప్రియా! ౧౭౩

శా. పాలున్నీగడ తెమ్ము తెమ్మనచు పా ♦ పల్ వేఁగాఁబొట్టకున్
దాళంగంజియుఁ బెట్టఁజాలమి విషా ♦ దంబొంది నిప్పచ్చరం
బైలోఁ జొచ్చెందు కుచేలుబన్నములువా ♦ యన్ గల్మిలోన్క్రుమ్మడిన్
జాలంగా దయచేసి ప్రోచితివి కృ ♦ ష్ణా వేణుగానప్రియా! ౧౭౪

శా. కారాగారనివిష్ట మాతృ పితృ దుః ♦ ఖక్షేపణోత్సాహివై
ఔరా కంసనృశంసతావక జిఘాం ♦ సాశంసి మద్విక్రమ
ప్రారంభంబిఁక సైతుగాక యని ద ♦ ర్పస్ఫూర్తిమూర్తిన్ భుజా
సారోదారత జూపవే కినిసి కృ ♦ ష్ణా వేణుగానప్రియా. ౧౭౫

మ. పృథులోత్పాటితదంతకుంతహతిని ♦ ర్భిన్నోగ్రదంతావళ
ప్రథిమాపాటనచాటుపాటవభుజా ♦ స్ఫాలోద్ఘనిస్స్వాన సం

గ్రథితోత్తుంగితగర్జితోర్జిత రుషో ♦ గ్రంబైన నీమూర్తి స
వ్యథులై చూతురు భీతిమాధురులు కృ ♦ ష్ణా వేణుగానప్రియా!

మ. పరితఃప్రస్రవ దస్రవిస్రరసదృ ♦ ప్యడ్ఢాకినీ కంధరాం
తరవేల్లత్ప్రచురాంత్రసూత్రగణమూ ♦ ర్ధన్యావ్రాతనిర్యంత్రిత
క్షరదుద్వేలవసావిసారమగు సం ♦ గ్రామోర్వియుష్మన్నిశా
చరసంహార విహార ధోరణులఁ గృ ♦ ష్ణా వేణుగానప్రియా! ౧౭౭

మ. అరవిందంబులబోలు కన్నులతి ర ♦ క్తాంభోజ పత్రంబులై
కురుకుల్గట్టి మిడుంగురుల్ సెదరఁగాఁ ♦ గోదండ టంకార ని
ర్భర రోదోంతరభంగి సన్నరకు బో ♦ రందాకు నీవీక్ష దు
స్తర దుఃఖంబులువాపె వేల్పులకు కృ ♦ ష్ణా వేణుగానప్రియా!

మ. కొనగోటన్ వెసమీటిచెండు కరణిన్ ♦ గోవర్ధనంబెత్తి గో
ప నికాయంబు సగోగణంబుగ వసిం ♦ పన్ దాపుగావించి యిం
ద్రునికోపంబును రాలవానయును బోఁ ♦ ద్రోయంగఁజాల్నీదు పెం
పనయంబున్ జగమేమిగాఁదలఁచె కృ ♦ ష్ణా వేణుగానప్రియా!

మ. జగముల్ రెంటనుగల్గుభోగములు ని ♦ స్సారంబులంచున్ దలం
చి గతాశేషమనోవికారులగుచున్ ♦ జిత్తంబులన్ శుద్ధస
త్వగరిష్ఠంబగునీదు మూర్తిని సదా ♦ ధ్యానంబుగావించు వా
రగచాట్లంబడరీ భవాంబునిధి కృ ♦ ష్ణా వేణుగానప్రియా! ౧౮౦

నారదుఁడు శ్రీకృష్ణుని యొద్ద సంగీతవిద్య నేర్చుట.

క. అనివినుతించిన ననిచిన
యనుకంపంగాంచి కృష్ణుఁ ♦ డనఘా నీవ
చ్చినపనియేమన నాతఁడు
వినిపించెన్ దనదు పూర్వ ♦ వృత్తాంతంబున్. ౧౮౧

క. వినిపించి దేవ నీచె
ప్పినచొప్పున ధన్యుఁజేయ ♦ వే! నన్ననినన్
మునిఁజూపి వనజనాభుఁడు
కనుఁగొనలంజాంబవతిని ♦ గనియిట్లనియెన్. ౧౮౨

కం. దేవి! యీమునివరు వీ
ణావాదన కుశలుగా నొ ♦ నర్చుమనుఁడు ద
ద్భావమెఱిఁగియమ్మదవతి
గావించెన్ శిక్షితునిగఁ ♦ గడఁగిమునివరున్. ౧౮౩

కం. ఒకయేఁడుజాంబవతికడ
సకలంకమనీషగాన ♦ మభ్యాసము మా
నకచేయ నారదునిఁగని
సకలార్థజ్ఞుఁడగుశౌరి ♦ సత్యకృపతోడన్. ౧౮౪

ఆ. భవ్యశీలసత్య ♦ భామచెంగటికేగి
యభ్యసించుమింక ♦ ననియెనట్లు
సత్యచెంత మరల ♦ సంవత్సరము నేర్చె
నధిక భక్తితోడ ♦ నత్తపస్వి. ౧౮౫

కం. పిమ్మట రుక్మిణిచెంత న
యమ్ముగ నేర్వుమని చెప్పె ♦ హరియట్లభ్యా
సమ్మొనరించె నచట వ
త్సరమ్ములు రెండమ్మునీంద్ర ♦ సత్తముఁడంతన్. ౧౮౬

తే. ఎన్నివిధములనేరిచె ♦ నేనివాని
కిని స్వరాంగనాయోగమిం ♦ పొనరకున్నఁ
దద్విధంబెల్లఁగనుఁగొని ♦ తాననేర్పెఁ
గృష్ణుఁడన్నారదునకు సం ♦ గీతవిద్య. ౧౮౭

కం. హరిచేసంశిక్షితుఁడై
స్వరవిద్యా విభవమందు ♦ సంపూర్ణుఁడై

చరితార్థుఁడయ్యె నారదుఁ
డురుబ్రహ్మానందవిభవ ♦ మొందె మనమునన్. ౧౮౮

తే. ఆతఁడిట్లుబ్రహ్మానంద ♦ మధిగమించ
ద్వేషదోషాదులడఁగె సం ♦ తోషమొదవె
తుంబురుని మీఁది యీర్ష్యయు ♦ దోఁచకుండె
నపుడునారదుఁగనియిట్టు ♦ లనియెశౌరి. ౧౮౯

ఉ. కోరినవాంఛితంబు సమ ♦ కూడెఁగృతార్థుఁడవైతివింక నో
నారద! తుంబురుండొడరి ♦ నాదుచరిత్రము లెంచి గాన వి
ద్యారతిసర్వలోకముల ♦ యందునుబాడుచుసంచరించు మి
చ్ఛారతిమోక్షసౌఖ్యము ని ♦ జం బరచేతవసించుసీకనన్. ౧౯౦

వ. అని చెప్పినఁ గృష్ణునకు నమస్కరించి తదనుమతంబున రుక్మిణీ సత్యభామా జాంబవతులతోడ శంకరాలయంబున స్వరజాతివిశారదుండైన నారదుండు సదాశివప్రీత్యర్థంబు గానంబు చేసి పదంపడి తదనుమతి నిజేచ్ఛంజనియె నట్లుగావున. ౧౯౧

కం. ధరణీసురుఁడై పుట్టిన
హరిమంగళకథలు సుస్వ ♦ రాన్విత గాన
స్ఫురణన్ బాడుచుఁ జొక్కెడు
పరమోత్తమునకును మోక్ష ♦ ఫలము లభించున్. ౧౯౨

తే. కర్మలనువాక్కులనుమనో ♦ గతి ననన్య
భావుఁడై విష్ణుఁగొలిచి య ♦ ద్దేవు దివ్య
కథలుసుస్వరగాన సం ♦ కలనఁబాడు
నతని జననంబుచరితార్థ ♦ మగునిజముగ. ౧౯౩

ఆ. అతి నిగూఢమైన ♦ యది జానకీజన్మ
కారణంబు సకల ♦ కలుషహరము
నిఖిలఫలకరంబు ♦ నిశ్శ్రేయసప్రద
మొనకపరచినాఁడ ♦ నిదియుసింద్ర. ౧౯౪

వ. అని చెప్పి. ౧౯౫

అశ్వాసాంతము.

శా. వాగర్థప్రతిపత్తిసంమిళిత శ ♦ ర్వాణీయుగర్ధాంగ యు
క్తాగఃకల్పపురత్ర యీాదనుజ సం ♦ హారక్రియోత్తుంగసో
ద్వేగప్రౌఢహలాహలగ్రసనబృం ♦ హిష్ణుక్రమా భంగలీ
లాగోపాయిత భక్తపుంగవ గుణా ♦ లంకార విశ్వేశ్వరా. ౧౯౬

కం. వాసవముఖసురవరమకు
టాసక్త వినీలమణిరు ♦ గాళిభ్రమర
వ్యాసంగపదాంభోరుహ
భాసురసేవామరంద ♦ పరితుష్టనతా. ౧౯౭

స్రగ్విణీ.

వాసుదేవాది సం ♦ వంద్యపద్రైభవా
వ్యాససూత్రార్థ సం ♦ వాసనిత్యోత్సవా
వాసవామిత్రని ♦ ర్వాపణప్రాభవా
శ్రీసముద్యోతవి ♦ శ్వేశశంభూశివా. ౧౯౮

గద్య.

ఇది శ్రీరామచంద్రచరణారవిందసపర్యామరంద తుందిలమనోమిళిందపవన
నందన పద వందనానంద సందర్శిత సరసకవితావిచిత్ర శ్రీమదానంద
తీర్థ భగవత్పాదాచార్య గురుకరుణాపాత్ర పరిచితాశ్వలాయన
సూత్ర విశ్వామిత్రగోత్రపవిత్ర నందగిరివంశశరనిధి రాకాకు
ముదమిత్ర వేంకటనృసింహరాయపుత్ర శేషమాంబాగర్భ
శుక్తిముక్తాఫలాయమాన నిరుపమాన భాగధేయ
సకల సుకవినికాయ విధేయ వేంకటప్పారాయ
నామధేయవిరచితంబగు వాల్మీకీయ శ్రీమద్రా
మాయణాద్భుతోత్తర కాండ మహాకా
వ్యంబునఁ ద్వితీయాశ్వాసము.

ఓం.

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమద్రామాయణాద్భుతోత్తర కాండము.

---

## తృతీయాశ్వాసము.

మహనీయ దయావైభవ
సహితకటాక్షావలోక • సంరక్షిత స
న్నిహితపదభక్తహృద్వశ
బృహదుజ్వలచిత్ప్రకాశ • శ్రీయమరేశా. ౧

వ. అవధరింపుము. తదనంతరంబున వాల్మీకి మునీంద్రుండు భరద్వా
జునకిట్లనియె. ౨

కం. సిరియేచందంబున ముని
వరశోణితమున నిశాట • వనితకుసుతయై
ధరణిం జనియించెనొ త
చ్చరితం బెఱిగింతువినుము • సంప్రీతుఁడవై. 3

### రావణుఁడు తపస్సు చేసి బ్రహ్మచే వరంబులొందుట.

మ. దశవక్త్రుండనురాక్షసోత్తముఁడు మున్ • త్రైలోక్యరాజ్యార్థియై
భృశనిష్ఠారతి బ్రహ్మఁగూర్చి తపమున్ • భీమోద్యమంబొప్పఁగా
నశనంబుల్లక పెక్కువర్షములు సే • యన్ దత్తపోవహ్నినల్
దిశలంగ్రమ్మిన ముజ్జగంబులు దిత్రా • త్రిన్ దల్లడిల్లెన్ గడున్.

మ. జ్వలనార్కద్యుతిదుస్సహోద్యతదశా ♦ స్వకూరనిష్టాబృహ
జ్జ్వలనాచ్ఛాదితమైన విష్టపము నో ♦ జంగాంచి పద్మాసనుం
డులలిన్ నిర్జరసేవ్యమానుఁడయి తో ♦ డ్తోవచ్చి, లే? వత్స! నా
కెలమిన్ గూరిచె నీదు నిష్టఁభవదీ ♦ యేష్టంబు లేనిచ్చెదన్. ౫

ఉ. చాలుఁదపంబు కోరుమనఁ ♦ జండకరార్పితదృష్టిఁద్రిప్పియ
చ్చాలుపుకుత్తుకల్గల ని ♦ శాటుఁడు తామరచూలిఁజూచి జే
జే లొనరించి దేవ దయ ♦ చేసెదవేని యమర్త్యభావమున్
గాఁలిగ నిమ్మనంగ విని ♦ కంజభవుండనవానికయ్యెడన్. ౬

కం. జననముగలిగిన వారికి
వినుమృత్యువు లేని మనికి ♦ విశ్వమునందున్
జనదటుగావున తగియెడు
మనోరథముఁగోరుమిత్తు ♦ మసలకయనినన్. ౭

చ. కపటమెరింగిరావణుఁడు ♦ క్రమ్మరపల్కెసురాసురోరగా
ద్యుపగత నిర్జరప్రభువు ♦ లోర్వఁగఁజాలని జీవితంబు వి
ష్టపములఁగెల్చు శక్తియును ♦ సమ్మతినిమ్ము మనుష్యకోటి నే
నెపుడు గణింపనన్నఁడుది ♦ యెట్టిదో తెల్పుము నాఁగనిట్లనెన్. ౮

కం. నాకు జనించిన కూతురి
నేకోరితినేని కన్యయు ♦ సింతియనిచ్చున్
గైకొనకుండిననప్పుడు
నూ కల్గువరాంతమనియు ♦ సురుఁడువచించెన్. ౯

ఆ. అట్లకాకకోరి ♦ నట్లిచ్చితిని తపం
బింకమానుమనుచు ♦ నేగెనజుఁడు
ధాతవరమువలన ♦ దర్పదుస్సాధ్యుఁడై
మొనసి మూఁడులోక ♦ ములు జయించె. ౧౦

రావణుఁడు సురల జయించుట.

చ. అని మిషనాథు నుక్కడఁచి ♦ యగ్గిని బెగ్గిలఁజేసి కాలునిన్
వనములపాలుసేసి జల ♦ వల్లభు నల్లనఁ జోపి వాయువున్
బొనుపడనాపి గుహ్యకవి ♦ భున్ బ్రభమాలిచి మూఁడులోకముల్
గనుకని గెల్చి పొల్చె దశ ♦ కంఠుఁడు కుంఠిత విక్రమంబునన్. ౧౧

కం. బలిమిఁ ద్రిలోక జయుండయి
యిలఁ ద్రిమ్మరుచుండి యొక్క ♦ యెడ దండకమున్
బలువనమునఁ గనుఁగొనియెన్
జ్వలనార్క సమప్రభులను ♦ సంయమివరులన్. ౧౨

రావణుఁడు మునుల జయించఁ దలచుట.

మ. కినుకన్ వీరల గెల్వకే గతిఁ ద్రిలో ♦ కీజేత నై యింతు నం
చనలార్కాభుల హారిఁ జూచి భవదీ ♦ యంబైన రక్తంబు చ
య్యన నాకిందు మిమున్ జయించినటులౌ ♦ నట్లివ్వకేనిన్ మదీ
య నిశాతాసికి మీ తపంబు లెదురే! ♦ యన్నన్ విభీతాత్ములై.

కం. మునులియ్యకొనిరి దానికి
దనుజుఁడు నిశితేషునిహతిఁ ♦ దత్తనువులఁ గై
కొనె శోణితంబు కలశం
బున దజ్జయ చిహ్నమునకు ♦ ముదితుండగుచున్. ౧౪

రావణుఁడు మునుల శోణితము నుగ్రహించి మందోదరిచే దాపనిచ్చుట.

సీ. వినుగృత్సమదుఁడను ♦ ముని నూఱుపురు సుతుల్
గలవాఁడు సతియొక్క ♦ కన్నెఁ గోరఁ
దపము గైకొని నాఁడు ♦ దనయయై యిందిర
జనియించవలెనని ♦ మనమునందుఁ

దలఁచి లక్ష్మిస్వ మాత్ర • తత్పరుండై కుశా
గ్రంబులఁగూర్చి దు • గ్ధంబునొక్క
కలశంబునందు ని • మ్ముల సంగ్రహమొనర్చె
దైవయోగంబున • రావణునకు

గీ. దొరికెఁదత్కలశంబందుఁ • గరకుటసుర
నించెనచ్చటి మునులశో • ణితములెల్ల
రక్తసంపూర్ణమైన పా • త్రఁగొనిపోయి
తపసుల జయించితినని సం • తసముపడియె. ౧౫

చ. కొనిచనిలంకఁజొచ్చి తన • కోమలిఁగన్గొని రక్తపూర్ణ పా
త్రనొసఁగిదాఁచుమిందుఁగల • రక్తముఘోర విషంబుజుమ్మి దీ
నినొరులకీక క్రోలకను • నీవవధానముతోడఁగావుమీ
యని నియమించితాను ప్రియ• మార నిజేచ్ఛఁజరించెనయ్యెడన్.

చ. విజితులఁజేసి నిర్జరుల • వేలుపుఁగొమ్మలఁ బట్టితెచ్చియా
రజమిరవారవారలఁ గ • రంబనురాగముతోడఁగూడి చి
త్తజ రతితత్పరుండగుచు • దైత్యకులేంద్రుఁడు మేరుమందరా
ద్యజరగిరీంద్ర కందర వి • హార కృతాదరుఁడై మెలంగఁగన్.

మందోదరి విషమని మునిరక్తము గ్రోలుట.

మ. ఇతరస్త్రీరతిసక్తచిత్తుఁడయి పౌ • లస్త్యుండు క్రీడింపఁ ద
ద్గతి మందోదరి చూచి సైపకను చిం • తాక్రాంతయై యాత్మ జీ
వితమందున్ గడునిష్ఫలత్వమతిదా • వేమారుభావించుచున్
మృతిఁగాంక్షించివిషాధికంబనుటఁ బే • ర్మిన్ గ్రోలెఁదద్రక్తమున్.

ఉ. ఎక్కువప్రీతితోడ హృద • యేశుఁడువేడుక నన్యకాంతకున్
జిక్కిదృఢానురాగమును • జెంది నిరాదరభావమొప్పఁగా

మక్కువ నూపకున్న నల ♦ మానినికిన్ దలపోసి చూడఁగాఁ
జక్కఁదనంబు పేర్మియును ♦ జవ్వనమున్ వృథగాదె యెయ్యెడన్.

కం. పతి పరభామినితోడుత
రతినెనయఁగఁ గాంచినట్టి ♦ రమణికిఁ దన జీ
వితము తృణప్రాయముగా
మతిఁదోఁచున్ గాదె సౌమ్య ♦ మానసయైనన్. ౨౦

కం. పరకాంతతోడఁగూడిన
పురుషునితో మెలఁగుకంటెఁ ♦ బొలఁతుకకున్ ని
ష్ఠురతరదావాగ్ని శిఖాం
తర సంస్థితియనువటంచు ♦ దలఁచున్ జూడన్. ౨౧

వ. అట్లు గావున మందోదరి ముమూర్షయై విషాధికంబనుటఁ దలఁచి
తత్కలశరక్తముం గ్రోలె. ౨౨

మందోదరి గర్భవతి యగుట.

కం. వరనిష్ఠాఢ్యముని పురం
దరలక్ష్మీమంత్రమంత్రి ♦ తపయఃకలశాం
తరగతశోణితపానము
తరుణికిఁ గలిగించె దౌహృ ♦ దము సర్వేశా. ౨3

కం. నడుముబలిసెఁ జూచుకములఁ
గడునలుపుదనర్చెఁ దెలుపు ♦ గండతలములన్
గడుకొనె నారేర్పడె నడ
జడిమంబు వహించె నపుడు ♦ జలజాననకున్. ౨౪

కం. ఉద్యల్లక్ష్మీమంత్రస
ముద్యోతక్షీరలేశ ♦ ముదరగతంబై

విద్యుల్లతికాగాత్రికి
సద్యోగర్భంబానర్చెఁ ♦ జాలనరుదుగన్. ౨౫

మందోదరి గర్భమును రహస్యముగా నివర్తించుట.

చ. తన తెరఁగెల్లఁజూచుకొని ♦ దానవభామిని సాలవిస్మయం
బున నిదియేమి చందమని ♦ బుద్ధిగలంగ విషాధికం బటం
చనె మునిశోణితంబు కడు ♦ పయ్యెను దాగ్రివఁగ నింకభర్తకే
మనఁగలదాననంచు హృద ♦ యంబు విషాదవిలోలమైతగన్. ౨౬

చ. అనిమిషకామినీ సహితుఁ ♦ డై ననునొల్లక వల్లభుండు గా
మనుడయి యేడుగాలముఁ బ్ర ♦ మత్తతనుండఁగ నేనునిట్లు గ
ర్భిణినగుచున్నఁ జూచి నగ ♦ రే! చెలులేమనిబొంకుదాన నా
థునిమొగమెట్లు చూచెదను ♦ తోఁచదు దీనికి నేమిసేయుదున్.

తే. అనుచుఁ జింతాకులస్వాంత ♦ యగుచు గర్భ
మోక్షణార్థినియై చంచ ♦ లాక్షితీర్థ
సేవనవ్యాజమునఁగురు ♦ క్షేత్రమునకు
నింపుదళుకొత్తుపుష్పవిమాన ♦ మెక్కి యరిగె. ౨౮

తే. అరిగియచ్చోటఁ బ్రసవించి ♦ యాశిశువును
బసిఁడిమందసముననిడి ♦ వసుధగోప్పి
తంబొనర్చి సరస్వతి ♦ యంబువులను
గ్రుంకి నిజమందిరమున క ♦ క్కొమ్మవచ్చె. ౨౯

వ. ఈగర్భధారణమోక్షణాది వృత్తాంతంబతి నిగూఢంబుగాన ద్వితీయ
కర్ణగోచరంబుగా రక్షించియుంచి తాను యథాపూర్వ విహారం
బుల మెలంగె ననంతరంబున బహుకాలం బరిగిన నొక్కసమ
యంబున. ౩౦

జనకునకు యజ్ఞభూకర్షణంబున సీతాదేవి దొరకుట.

సీ. జనకుఁడన్న విదేహ ♦ జనపతి యజ్ఞార్థి
యై కురుక్షేత్రమం ♦ దధికనిష్ఠ
సవన భూశోధన ♦ స్వర్ణలాంగలమునఁ
గావింప సీతాము ♦ ఖంబునందుఁ
బసిఁడిమందసముతో ♦ పసిపాఁపదొరికిన
వినువీథిఁ గడుపుష్ప ♦ వృష్టిఁ గురిసె
నది చూచి విస్మితుం ♦ డగు రాజునకు నభో
వాణి యిట్లనె ధరా ♦ వరవతంస

గీ. యద్భుతంబేల నీకు మే ♦ లయ్యె నీవుఁ
గూతురుగఁ బెంచుకొనుము నీ ♦ కు శుభమగును
కలికి సీతాముఖంబునఁ ♦ గలుగుకతన
సీతయను పేరదగునంచుఁ ♦ జెప్పెనపుడు. ౩౧

కం. మతిమంతుఁడైన జనక
క్షితిపతి యా ముద్దుపాపఁ ♦ జేకొని లక్ష్మీ
సతిఁ గన్న పాలవారిధి
గతిఁ గగనంబంటఁ బొంగెఁ ♦ గడు మోదమునన్. ౩౨

కం. నిర్వర్తిత యజ్ఞుండై
యుర్వీపతి దానుభార్య ♦ యును మోదమునన్
బర్వేందువదనఁ గైకొని
సర్వజనుల్ వొగడఁ బురికిఁ ♦ జనిర వ్వేళన్. ౩౩

ఆ. ధరణిలోనఁ బొడమ ♦ ధారుణీసుతయన
సీతయందుఁ గలుగ ♦ సీతయనఁగ

జనకదుహితయగుట ♦ జానకియనఁగ న
వ్వేలఁది మిన్నయచట ♦ వృద్ధినొందె. ౩౪

కం. ఇది సీతాజన్మవిధం
బిది చదివిన విన్నవారి ♦ కెడపని సిరులన్
బొదవించుచు శ్రీరాముని
మదవతియైయింటనెపుడు ♦ మసలక యుండున్. ౩౫

కం. ఇది సకల పాతకహరం
బిదివిభవారోగ్యఫలద ♦ మిదిపుణ్యతమం
బిదికల్యాణ సమాశ్రయ
మిదిచదివిన జనునిదురిత ♦ మెల్ల నశించున్. ౩౬

రామునికి పరశురామునితో నైన వివాదము.

వ. అనిచెప్పి మరియు నిట్లనియె. ౩౭

కం. సీతాకల్యాణము సం
ప్రీతిన్ గావించి రఘువ ♦ రేణ్యుఁడు పత్నీ
భ్రాతృయుతుఁడగుచు మును సా
కేతమునకు నరుగునెడ న ♦ కిల్బిషలీలన్. ౩౮

ఆ. రైణికేయుఁడైన ♦ రాముఁడు భృగువంశ
పావనుండు సకల ♦ పార్థివేంద్ర
కులభయంకరుండ ♦ కుంఠితశౌర్యుండు
మనుకులేంద్రు విక్ర ♦ మంబెరింగి. ౩౯

మ. ధనురస్త్రంబులుదాల్చి బ్రాహ్మణము క్షా ♦ త్రంబైన తేజంబు పెం
పొనరంగా నెదురేగుదెంచి రఘురా ♦ జోత్తంసు శౌర్యంబుగ
న్గొనమార్గంబునకడ్డమైననతనిన్ ♦ బుణ్యాత్ము నీక్షించి రా
మ నరేంద్రుండు బహూక్రియావినయసా ♦ మ్యస్ఫూర్తిఁ దానిట్లనెన్.

ఉత్సాహ.

స్వాగతంబునీకుమౌని ♦ చంద్రసీఘ్రమాకు న
భ్యాగతుండవైతివిప్పి ♦ తార్థమేమొ చేసెదన్
వేగఁ దెల్పుమన్న నవ్వి ♦ విప్రుఁ డింకఁ జాలు చా
ల్స్వాగతంబు సూపునీదు ♦ శౌర్యమెల్ల నాక నెన్. ౪౧

కం. నరపాలోత్తమ శౌర్య
స్ఫురణముగలవాఁడవేని ♦ భూపాల కుల
క్షరదంబీ నాచాపము
వెరవక చేఁదాల్చియెక్కు ♦ వెట్టుమటన్నన్. ౪౨

మ. అనినన్ రాముఁడు పిన్న నవ్వొలయ బ్ర ♦ హ్మణ్యుండనౌనిన్నుఁ జె
ల్లునొకో ధిఃకృతు జేయ బ్రాహ్మణకులు ♦ ల్లోకోత్తరుల్ రాజనం
దను లావిప్రులపట్ల శౌర్యమును బూ ♦ నఁగ జాల రిక్ష్వాకు వం
శనిధుల్ ధర్మధురీణులట్టులొనరిం ♦ చన్ బోవ రెక్కాలమున్. ౪౩

వ. అనిన రఘురామునితో భృగురాముం డిట్లనియె. ౪౪

మత్తకోకిల.

చాలుఁ బ్రల్లదముల్ నృపోత్తమ ♦ శౌర్యధైర్యధురీణతన్
గ్రాలెదేనియుఁ జెప్పనేల వి ♦ కత్థనంబులు క్షత్రియో
న్మూలనవ్రతశీలుడన్ జుము ♦ భూసురుండని చూడకీ
కేలివిల్లొనియెక్కు వెట్టుము ♦ కృత్రిమంబు నెరింగెదన్. ౪౫

కం. అని విల్లిచ్చిన నది గై
కొని సజ్యమొనర్చి నిబిడ ♦ గుణఘోషమునన్
నినిచెదిశాగ్రంబులు రా
మనరేంద్రుఁ డప్పుడు వలికె ♦ మరలనలనితోన్. ౪౬

కం. చాపము సజ్య మొనర్చితిఁ
దాపసయిక నేమటన్నఁ ♦ దడయక నిషువా
రోపించుమనుచునిచ్చిన
భూపతియాశరము వింట ♦ బూన్చియిటులనెన్. ౭౭

శా. వింటిన్ గంటినిదర్పదుర్దమునిగా ♦ విప్రోత్తమా! నిన్ను నీ
కంటన్ బన్నగభవ ప్రసాదభవమౌ ♦ గర్వంబుగాటంబుగా
నుంటన్ జూచితిరస్కరించెదవు న ♦ న్నోపప్పారదర్శించుమీ
వెంటన్ నీకును దివ్యచక్షువులు గా ♦ వింతున్ గృతార్థుండవై.

పరశురాముఁడు శ్రీరాముని విశ్వరూపము చూచుట.

కం. అని దివ్యదృష్టియొసఁగినఁ
గనుగొనె భార్గవుఁడు జనక ♦ కన్యావిభుమై
వనధిగిరిపురనదీ కా
ననజంతుకులంబుతోడి ♦ నానాజగముల్. ౭౯

సీ. ఆదిత్యరుద్ర సా ♦ ధ్యమరుద్గణంబుల
వసువుల యక్షరా ♦ క్షసులగరుడ
గంధర్వకిన్నర ♦ ఖచరుల బితరుల
గ్రహముల సకలన ♦ క్షత్రములను
భూజలానలవాయు ♦ పుష్కరంబులఁజంద్ర
సూర్యుల గులనగ ♦ స్తోమములను
జలధులనదుల నో ♦ షధివృక్షకోటుల
బ్రహ్మర్షివరుల దీ ♦ ర్థములయజ్ఞ

గీ. ములను శ్రుతులను శ్రుత్యంత ♦ ములనరామ
రోండజాదులఘనమేఘ ♦ మండలముల

సకల భూతచరాచర • సహిత విశ్వ
మెల్ల శ్రీరాముమేన వీ • క్షించె నతఁడు. ౫౦

కం. కని మోహమందియద్భుత
మున మునిఁగి భయంబు కంప • మునుఁ గదురఁగ న
మ్మునికులచంద్రుఁడు కర్త
వ్యనిరూఢి నెఱుంగ లేక • నాకులఁబడఁగన్. ౫౧

పరశురామ తేజోపహరణము.

కం. హరిభగవంతుఁడు రాముఁడు
శరమోక్షమొనర్చె నదియ • శనికోటి భయం
కరమై యుల్కలుగురియఁగ
నరిగి భృగూద్వహుని తేజ • మపుడు హరించెన్. ౫౨

తే. అట్లు జమదగ్నిసుతు తేజ • మపహరించి
యతని విహ్వలుఁగావించి • యాశరంబు
క్రమ్మరఁగ వచ్చి రఘుకులా • గ్రణి కరాంబు
జమ్మునకలంకృతి యొనర్చె • క్షణములోన. ౫౩

కం. అలరాము శరంబున వి
హ్వాల భావముఁగాంచి కొంత • వడికిన్ బునరా
కలితప్రాణుండై యు
జ్వలవైష్ణవ తేజమునకు • సలిపెన్ బ్రణతుల్. ౫౪

పరశురాముఁడు మహేంద్రాద్రియందు నిర్విణ్ణుండగుట.

తే. అతఁడు రామాజ్ఞచే మహేం • ద్రాద్రికరిగి
యచట నిస్తేజుఁడై భీతుఁ • డగుచు నొక్క
వత్సరంబుండె నంతట • వచ్చి పితరు
లతని దైన్యంబుఁగాంచి యి • ట్లనిరి ప్రీతి. ౫౫

శా. పుత్రా నీవిటులైతినంచు వగవుం ♦ బొందంగ నేలాద్రిలో
కర్త్రాత్మన్ భగవంతు విష్ణుగని ధీః ♦ కారంబుగావించుటన్
పాత్రంబైతివి దైన్యవృత్తికి జగ ♦ ద్భంధుండు విష్ణుండు సం
స్తోత్రార్హుండును బూజ్యుఁడున్ బ్రభుఁడునం ♦ చున్ జూడ లేవైతివే.

ఉ. పోమ్ము వధూసరంబనెడు ♦ పుణ్యనదిందనరారు నట్టి తీ
ర్థమ్ములనాను తొంటిగతి ♦ ధన్యతఁగాంచెదవీవుదీపితో
దమ్మను తీర్థమందు బ్రపి ♦ తామహుఁడౌ భృగుమౌనిమున్ను సు
గ్రమ్మగునిష్టతోఁదపము ♦ గైకొని తేజము నొందెనాపురన్. ౫౭

మ. పితృవాక్యానుగుఁడై భృగూత్తముఁడుసం ♦ ప్రీతాత్ముఁడై పోయితా
ధృతనిష్ఠావ్రతుఁడై మహోగ్ర తపమున్ ♦ దీప్తోదతీర్థమ్మునన్
శతవర్షంబులొనర్చి పూర్వమగు తే ♦ జంబొంది వర్తించె సు
స్థితితోవిష్ణుపరాయణుండగుచు ను ♦ ద్దీప్తప్రభావంబునన్. ౫౮

కం. ఈ రామచరిత్రముని
ష్టారతి వినునట్టినరుఁడు ♦ సర్వదురిత ని
స్తారంబుగాంచి కడపట
నారాయణలోక మొందు ♦ నతిధన్యుండై. ౫౯

వ. అనిచెప్పి మరియు నిట్లనియె. ౬౦

పూర్వ రామాయణ కథానుసంధానము.

చ. అనఘుఁడు జానకీసహితుఁ ♦ డై రఘురాముఁడువందిమాగధుల్
వినుతులుసేయనిర్జరులు ♦ వింటఁదలంబుగఁబుష్పవృష్టి పెం
పున గురియించఁదూర్యములు ♦ మ్రోయ నయోధ్యకునేగభక్తితో
ననుజులు గొల్చుచుండ విజ ♦ యంబు జగంబులు సన్నుతింపఁగన్

ఉ. ఆదటఁ గొంతకాలమున ♦ కంత నొకానొక కారణంబునన్
మేదినిపుత్రిలక్ష్మణుఁడు ♦ మేలగుభక్తిని వెంబడింపఁగా

సాధుమునీంద్రవర్తన లై ♦ సంగఁగఁగానలకేగుదెంచి ల
క్ష్మీదయితుండు రాఘవుఁడు ♦ సేరెఁ గ్రమంబునదండకాటవిన్. ౬౨

తే. అచట గోదావరీతీర ♦ మందుఁ బర్ణ
శాలరచియించి యందు ల ♦ క్ష్మణుఁడు భక్తి
ననుసరించఁగ సీతతో ♦ నధివసించె
సతతమృగయావిహారాను ♦ షక్తుఁడగుచు. ౬౩

కం. అటఁగొంతకాలమునకున్
గుటిలుండగు రావణుండుఁ ♦ గొనిచనిలంకా
పుటభేదనమున నుంచెన్
దిటమున మహిజాత సీతఁ ♦ ద్రిభువనమాతన్. ౬౪

కం. సీతాన్వేషణ తత్పరు
లై తిరిగిరి పిపినసీమ ♦ నందందుఁగుణా
న్వీతులగు రామలక్ష్మణు
లాతతశోకోపవిష్టు ♦ లై పలుమారున్. ౬౫

చ. జనకసుతావియోగ వశ ♦ సంభృతశోక రసోపవిష్టుఁడౌ
ఘనుఁడగు నా రఘూత్తముని ♦ కన్నులఁగారిన యశ్రువారి పెం
పెనయఁగఁబారెనయ్యడవి ♦ నేరయి వైతరణీసమాఖ్యచేఁ
దనరి పవిత్రమైదురిత ♦ తారణకారణవారిపూరమై. ౬౬

కం. ఇల నశ్రువితరణంబున
వెలసెను వైతరిణియనఁగఁ ♦ బితృతారకమై
లలిస్నానదానతర్పణ
ములనక్షయపుణ్యలోక ♦ ములనిడు బేర్మిన్. ౬౭

కం. కన్నీళ్లనదికినాతని
కన్నులవెలువడిన దూపి ♦ కలుశైలముపై
చెన్నొందెనిట్టులానది
పున్నెపు తీర్థమయి పుడమిఁ ♦ బొగడతనొంచెన్ ౬౮

కం. చెలిమిని సుగ్రీవునితో
సలుపఁగ నేతెంచెరామ♦చంద్రుఁడు తమ్ముం
డెలమినిగొలువఁగఁ గపికుల
ముల సంపత్కారికి ఋశ్య ♦ మూకశిఖరికిన్. ౬౯

కం. ఏవురమంత్రులతో నం
దా వాలికివెరచియున్న ♦ యర్కసుతుఁడు భీ
త్యావిష్టుఁడగుచుఁ జూచెన్
బావనగుణధాముఁరాము ♦ వైరివిరామున్. ౭౦

కం. కని వారలవృత్తాంతముఁ
బనుపడఁగానెఱిఁగి రాఁగఁ ♦ బంచె నెదురుగా
వినయాది సుగుణవంతున్
హనుమంతున్ బుద్ధిమంతు ♦ నతిబలవంతున్. ౭౧

హనుమంతునకు రాముఁడాదివిష్ణుఁడై కనుపించుట.

కం. చనిబిక్షురూపధరుఁడై
వినయంబునఁజేరిరాజ ♦ వీరుల తెరఁగె
ల్లనెరుంగ వేడనతనికిఁ
గనుపించెన్ రాముఁడాది ♦ కైటభరిపుడై. ౭౨

సీ. కలితచతుర్బాహు ♦ కాలాంబుధరదేహు
శ్రీవత్సవక్షుకు ♦ శేశయాక్షు

మకరకుండలకర్ణు • మహితతేజఃపూర్ణు
నవ్యరత్నకిరీటు • నతదివాటు
కౌస్తుభాలంకారు • నిస్తులమణిహారు
దరచక్రహస్తు బు • ధప్రశస్తు
మహితకాంచనవాసు • మందస్మితోల్లాసు
మదనమోహనవేషు • మంజుభాషు


KODANDARAMA LIBRARY TELAPROLU.

గీ. కోటిసూర్యప్రకాశు ర • క్షోవినాశు
నిందిరాసేవ్యమానున • తేష్టదాను
చంద్రకోటిసశీతలు • సాధుశీలు
నద్భుతాకారుగాఁజూచె • నపుడతండు. ౭౩

కం. సనకసనందనముఖ్య
ప్రణుతుఁ బ్రహ్మాదివంద్యు • బ్రహ్మణ్యు సనా
తను నిర్జరవరసేవితు
ననఘునిఁగన్గొనియె నద్భు • తాకారయుతుఁ. ౭౪

చ. కలితఫణాసహస్రమణి • కాంతివిభాసితుగాఁగ లక్ష్మణుఁ
బలుభుజగేంద్రుగాఁ గనియె • భవ్యఫణావళులాతపత్ర సం
కలనఁదలిర్పరామునకుఁ • గైటభవైరికి నూడిగంబులఁ
సలుపఁగఁజూచెనద్భుత ర • సంబునఁబొంపిరివోయి యయ్యెడఁ. 

కం. కనులు మిరుమిట్లుగొలిపెడు
ననుపమతేజమున వెలుఁగు • నద్భుతరూపం
బున నాదివిష్ణువై తగు
ఘను నాతనిఁజూచివెరచి • కన్నులుమొగిచెఁ. ౭౮

ఆ. క్షణముమూసి మరలఁ • గనువిచ్చిచూచిన
చాపబాణధరులు • చారుమూర్తు

లును దపస్వివేషు • లును నై నరాజన్య
వీరవరులఁగాంచె • విస్మయముగ. ౭౭

ఉ. కాంచి వితాకునొంది కర • కంజయుగంబు మొగిడ్చి ఫాలభా
గాంచలమందుఁ జేర్చి విన • యంబునఁ జేరి నుతించి పల్కె ని
ర్వాంచిత లీల సూర్యసుతు • బంటసమీరసుతుండనిట్టులే
తెంచిన మీ తెరంగెఱిఁగి • తెల్పఁగ నాతఁడు పంపవచ్చితిన్. ౭౮

కం. మిముద్విభుజుల ధనురాశుగ
సమన్వితులఁగంటిఁ దరియఁ • జనుదెంచి యపూ
ర్వ మహిమ దివ్యరూపం
బమరం గని భ్రమసి మిగుల • నద్భుతఁ పడితిన్. ౭౯

కం. చేరి యథాపూర్వ శుభా
కారులు గానుండఁ గంటిఁ • గడునక్కజమా
మీ రెవ్వ రిందువచ్చిన
కారణ మదియేమి తెలుపఁ • గాఁదగు ననినన్. ౮౦

వ. ఇట్లు వ్యాకుల మానసుండును, కంపమాన గాత్రుండును, బద్ధాంజలిపుటుండునునై చేరి వినయంబునఁ బ్రశ్నించిన హనుమంతుని యందు సకరుణాదర మనస్కుండై ప్రసన్నుండగు రామచంద్రుండు మృదుమధుర భాషణంబుల నిట్లని చెప్పె. ౮౧

రాముఁడు హనుమంతునకుఁ దత్వోపదేశముఁ జేయుట.

సీ. వత్స హనూమంత • వరగుణవంత నా
కత్యంతభక్తుఁడ • వగుదువీవు
వినుము నీవడిగిన • విధమెఱిగింతు న
త్యాంత గోప్యంబు బ్ర • హ్మాది దుర్ల

భంబు దేవతలు నే ♦ ర్పడ నెఱుంగరుదీని
నిదియవాచ్యము గుహ్య ♦ మిది సనాత
నము దీని నెరుఁగ య ♦ త్నము సేయుదురు ద్విజో
త్తములిది తెలిసి స ♦ త్యముగ బ్రహ్మ

గీ. భూతులై దుఃఖసంసార ♦ భీతివాసి
ముక్తులయ్యెదరిదిగోప్య ♦ ములను గోప్య
మరయ బ్రహ్మణ్యులును భక్తు ♦ లైనవారి
కెరుక పరచఁగఁదగుబుద్ధి ♦ గురుతు నూచి. ౮౨

తే. ఆత్మ కేవలమును శుద్ధ ♦ మక్షరంబు
శాశ్వతంబునుసూక్ష్మంబు ♦ స్వప్రకాశ
మమలమాద్యంతశూన్యంబు ♦ నద్వితీయ
మేకమచలంబు చిన్మాత్ర ♦ మెంచిచూడ. ౮౩

కం. పరికించిచూడ సర్వాం
తరగతమై చిత్స్వరూప ♦ తనునిర్మలమై
పురుషాఖ్యనేకరసమై
పరమంతర్యామియగుచు ♦ భాసిలుచుండున్. ౮౪

తే. అతఁడు పురుషుండుప్రాజ్ఞుండు ♦ నంతరాత్మ
యతఁ కాడలుండు నన్నియ ♦ వ్యక్తుఁడీశుఁ
డతఁడ చిద్రూపుఁడమలుండు ♦ నక్షరుండు
ననుచువర్ణించు వేదంబు ♦ లనవరతము. ౮౫

ఉ. ఆతనియందకల్గు జగ ♦ మాతనియందభివృద్ధినొందు జ
మ్మాతనియందక్రమ్మరల ♦ యంబగునుక్ప్రభుఁడాతఁడాత్మమా
యాతత సంప్రసారణము ♦ నందు నిబద్ధతఁగాంచితాన యీ
చేతనరూపమొంది విల ♦ సిల్లును సంసృతిసంప్రణీతమై. ౮౬

సీ. పోలుచుపృథివ్యాది ♦ భూతపంచకమును
గంధాదివిషయము ♦ ల్గాఁడతండు
చక్షురాదికములౌ ♦ జ్ఞానేంద్రియంబులు
కర్మేంద్రియంబులు ♦ గాఁడతండు
ప్రాణాదిమారుత ♦ పంచకంబును సహం
కారమానసములు ♦ గాఁడతండు
కర్తృత్వభోక్తృత్వ ♦ ఘనధర్మములతండు
గాఁడుప్రధానుండు ♦ గాఁడతండు

గీ. సరవి నన్నమయాది కో ♦ శములువాని
ధర్మములునెంచిచూడనా ♦ తండుకాఁడు
కపికులోత్తమ సర్వల ♦ క్షణవిలక్ష
ణుండు చైతన్యమాత్రుఁడౌ ♦ తండుసూవె. ౮౭

తే. ఎంచఁగఁబ్రకాశతమముల ♦ కెట్లుభేద
మట్లువిశ్వపరాత్మల ♦ కగును వేరు
తరువునీడయువేరైన ♦ దారిజగము
నాత్మయునభిన్నలక్షణు ♦ లగుచునుంద్రు. ౮౮

కం. మలినుండస్వస్థుండును
కలితవికారుండునగుచు ♦ గనుపడునాత్మం
డిలజన్మశతములందియు
గలఁగుం గాకెట్లుముక్తి ♦ గనఁడు కపీంద్రా. ౮౯

కం. సకలవికార విదూరుం
డకలంకుఁడు దుఃఖరహితుఁ ♦ డానందమయు
ప్రకటితుఁడంచాత్మని బా
యక కనుసంయములు ముక్తి ♦ నందుదురు కపీ. ౯౦

కం. వినుమేను కర్తభోక్త సు
ఖిని దుఃఖిని స్థూలతనుఁడఁ ♦ గృశుఁడ ననుచుఁ దాఁ
జనుఁదెంచు నహంకారం
బుననాత్మునియందుఁ గల్ప్య ♦ ములుఁ గపీంద్రా. ౯౧

చ. అతులమనీషులైన బుధు ♦ లాత్మవికారవిదూరముఁ బరి
ష్కృతి రహితంబునుఁ బ్రకృతి ♦ కంటెఁబరంబును సర్వసాక్షితా
న్వితము సమస్థితంబని గ ♦ ణింతురుగాన నబోధమూలమై
జతనమునొందునీకలుష ♦ సంసృతివాయుతనూజదేహికిన్. ౯౨

తే. సంభవంబగున న్యథా ♦ జ్ఞానమరయఁ
బ్రకృతిజనితమా నజ్ఞాన ♦ వికృతిచేత
సర్వగుండు స్వయంజ్యోతి ♦ సత్యుఁడాత్మ
కర్తనని యెంచు దాన ♦ హంకారయుక్తి. ౯౩

తే. తలఁప నవ్యక్తమనఁగ ని ♦ త్యమును సద స
దాత్మకమునగుఁ బ్రకృతి వి ♦ శ్వైకహేతు
వాప్రధానముతోఁగూడి ♦ యక్షరుండు
తానుకూటస్థుఁడగుచు నిం ♦ తయునుజేయు. ౯౪

కం. తానక్షరంబుబ్రహ్మం
బానందాత్మకమటంచు ♦ నదియెఱుఁగని య
జ్ఞానమున నాత్మయందుఁ
బూని యనాత్మాధిరోప ♦ ము ఘటించుఁజుమీ. ౯౫

తే. కలుగు నజ్ఞానమునను దుః ♦ ఖంబురాగ
మోహమదమత్సరాదులు ♦ వాదముదానఁ
బుణ్యపాపంబులునుదానఁ ♦ బొందు భ్రాంతి
యింతయును దేహలబ్ధికి ♦ హేతువగును. ౯౬

సీ. ఆత్మనిత్యుండు ని • రంజనుండును సర్వ
గతుఁడు కూటస్థుండ • ఖండరూపుఁ
డొక్కఁడు మాయచే • నొగిలి సంవళితుఁడై
బహురూపములఁదోఁచఁ • బడుచునుండు
నదిగానఁబరమార్థ • మద్వైతమే ద్వైత
భేదంబు మాయచేఁ • బెరయుచుండు
ఘాగ్రాకనాకసం • బునకు మాలిన్యంబు
సేయఁజాలనియట్లు • మాయచేతఁ

గీ. గలుగునంతఃకరణదోష • కల్పనంబు
నాత్మునకులేదుకేవలం • బైనస్ఫటిక
మెట్లువిమలంబుగావెల్గు • నట్లు శుద్ధ
భావుఁడై వెల్గునాత్మయు • పాధిలేక. ౯౭

కం. జ్ఞానస్వరూపకలితము
గా నెరుగుదురార్యులిజ్జ • గంబును వితతా
జ్ఞానభ్రాంతదృగన్వితు
లానెరిగిదియర్థరూప • మని తలఁతురొగిఁగా. ౯౮

తే. అనుస్వభావంబుచేఁ బర • మాత్మనిర్గు
ణుండు గూటస్థుఁడును వ్యాప • కుండుసతత
శుద్ధచైతన్యమాత్రుఁడై • చూతురతని
భ్రాంతదర్శనులర్థరూ • పకుఁడటంచు. ౯౯

చ. స్ఫటికమురక్తవస్తుకృత • సన్నిధిఁ దద్గుణసంప్రసార మొం
దుటఁదనరూపమొరనయి • తోఁచినకైవడినాత్మమాయచెం
గటగుణదోషహీనుఁడు న • ఖండచిదేకరసాత్ముఁడయ్యు సం
ఘటితగుణప్రవాహుఁడయి • కన్పడుఁబూరుషుఁడంజనాత్మజా.

తే. ఆత్మ శుద్ధంబు నిత్యంబు ♦ నక్షరంబు
సర్వగత మవ్యయంబు ని ♦ శ్చలమటంచుఁ
దలఁచ వలయు నుపాసింప ♦ వలయు వినఁగ
వలయు మోక్షార్థు లగునట్టి ♦ వార లెపుడు. ౧౦౧

తే. అరయ నెల్ల భూతంబుల ♦ యందుఁగలుగు
నట్టి సర్వాంతరాత్మకు ♦ నాత్మరూపుఁ
దన మనంబున నవ్యవ ♦ ధానగతునిఁ
గాఁదలంచుట సూవె యో ♦ గంబనంగ. ౧౦౨

తే. సర్వభూతంబులనుదన ♦ స్వాంతమందుఁ
దనదు స్వాంతమ్ము సర్వభూ ♦ తములయందు
నేకరూపంబుగాఁ జూచు ♦ నెవ్వఁడ మ్మ
హా మహుండద్వయబ్రహ్మ ♦ మగుఁ గపీంద్ర. ౧౦౩

తే. ఎవనికి సమాధికాలమం ♦ దెల్లభూత
ములును నాత్మాను సంధాన ♦ కలననైక్య
మగుచు నన్యంబుఁ దోపక ♦ నణఁగియుండు
నతఁడు కేవల బ్రహ్మమా ♦ నాంజనేయ. ౧౦౪

తే. కామరోగాది దోషసం ♦ ఘములు దొలఁగి
మనసు కేవల సుఖయుక్తి ♦ మరగియుండు
నతఁడు జీవద్విముక్తుఁడు ♦ నమృతమయుఁడు
కేవల బ్రహ్మరూపుఁడో ♦ కేశవర్య. ౧౦౫

తే. అఖిల జగములు నిండిన ♦ యట్టి భూత
సంచయంబు పృదగ్భావ ♦ సరణియుడిపి
తద్గతంబైన సాక్షి చై ♦ తన్య మేక
మగుటఁ దెలిసిన వాఁడు బ్ర ♦ హ్మమగు వత్స. ౧౦౬

కం. ఈయఖిల జగత్కల్పము
మాయామాత్రంబటంచు ♦ మదిఁగనుఁగొని తా
నా యద్వితీయబ్రహ్మం
బై యుండుట దెలిసి పొందు ♦ నానందంబున్. ౧౦౭

తే. పృథుల జన్మ జరారోగ ♦ భేషజంబు
పరమసౌఖ్య సంపాదనో ♦ పాయమైన
యుజ్వలబ్రహ్మ విజ్ఞాన ♦ ముదయమైన
నతఁడె కేవల శివరూపుఁ ♦ డాంజనేయ. ౧౦౮

తే. నదులు నదములు నన్నియు ♦ నుదధియందు
నేకమైయుండు నేరీతి ♦ లోకమందు
నట్ల బహుభంగిఁ దోచునీ ♦ యాత్మభేద
మక్షరమున నిష్కళమయి ♦ యడఁగిపోవు. ౧౦౯

తే. కలదు విజ్ఞాన రూపమొ ♦ క్కటియె సత్య
మగుచుఁ గాలత్రయమున మా ♦ యాస్వరూప
మగుఁ బ్రపంచంబు వేద వి ♦ ద్యావరణము
నొంది జ్ఞానంబు సంమోహ ♦ మొందుచుండు. ౧౧౦

తే. నిర్మలంబును సూక్ష్మంబు ♦ నిర్వికల్ప
మవ్యయంబుస్వయం ♦ ప్రభంబగును జ్ఞాన
మదితిరోహితమగునవి ♦ ద్యాప్రభావ
మునజగంబప్డుదోచు న ♦ జ్జనవరేణ్య. ౧౧౧

తే. ఇదియెసాంఖ్యంబుపరమంబు ♦ నిదియెయుత్త
మంబుయోగంబు నంచితా ♦ మ్నాయసార
మెరుఁగఁజెప్పితినీకుఁ గ ♦ పీంద్రయోగ
మనఁగఁజిత్తమేకాగ్రతఁ ♦ గనుటసూవె. ౧౧౨

కం. యోగమునఁగలుగు జ్ఞానము
యోగముజ్ఞానమ్మువలన ♦ నుద్దీప్తమగుఁ
యోగజ్ఞానయుతుండగు
నాగుణవంతునకునాప్య♦ మపరముగలదే. ౧౧౩

తే. యోగులకుగమ్యమైయొప్పు ♦ చుండునెద్ది
యదియెసాంఖ్యులకును గమ్య ♦ మగుచునుండు
యోగమునుసాంఖ్యమును నన ♦ నొక్కటిగ నె
రుంగువాఁడగు సర్వమె ♦ రుంగువాఁడు. ౧౧౪

తే. యోగులగువారలైశ్వర్య ♦ మొందఁగోరి
మొనసిమాయాబ్ధిఁగొందరు ♦ మునుఁగుచుండ్రు
జ్ఞానులగువారలద్వయా ♦ నందజలధి.
మగ్నులైపొందుచుండ్రు బ్ర ♦ హ్మాంబుఁదుదను. ౧౧౫

సీ. సర్వాత్ముండును ♦ సర్వగతుండును
సర్వకాముండును ♦ సర్వగంధ
సర్వరసుండును ♦ సర్వతఃపాణియు
సర్వతఃపాదుండు ♦ సర్వవేత్త
సర్వతోముఖుఁడు న ♦ జరుఁడ నంఖ్యనుఁడును
నవ్యక్తుఁడజుఁడు మా ♦ యావి నిత్యుఁ
డక్షరుండచ్యుతుం ♦ డాద్యంతశూన్యుండు
పరమేశ్వరుండునా ♦ బడెడుతత్వ

గీ. మేనచుమి పాణిపాదాది ♦ హీనతను గృ
హీతజవనుండు ద్రష్టయు ♦ శ్రోతయగుచు
నెనఁగుదునునేన సర్వంబు ♦ నెరుఁగువాఁడు
వన్నెరుంగఁగఁజాలరు ♦ నరులువత్స. ౧౧౬

తే. ఏకమునునద్వితీయము ♦ శోకదుఃఖ
మద్భుతానందరసమయం ♦ బవ్యయంబు
నైనతత్త్వంబునేన న ♦ న్నార్యవరులు
పరమపురుషుండటందురు ♦ ప్లవగవర్య. ౧౧౭

తే. అరయనిర్గుణమమలంబు ♦ నశ్వరంబు
నుత్తమోత్తమమైననా ♦ యున్నరూపుఁ
దెలియఁజాలరుసుమ్మొట్టి ♦ దివ్యులైన
నతులమాయావిమోహితు ♦ లగుటకతన. ౧౧౮

తే. సర్వగతమును గుహ్యంబు ♦ శాశ్వతంబు
నైనమద్దేహమెఱుఁగు త ♦ త్త్వార్థవిదులు
యోగివర్యులునాదు సా ♦ యుజ్యమొందు
వారుమన్మాయఁదెఱియంచు ♦ వారువారు. ౧౧౯

తే. పరమమునుశుద్ధమునుసర్వ ♦ భద్రకరము
నైననాయందులీనాత్ము ♦ లైనవారు
కల్పకోటిశతంబులు ♦ గడచెనేని
మరలపుట్టరుసుమ్ము జ ♦ న్మంబులందు. ౧౨౦

ఆ. ఏనుచెప్పినట్టి ♦ యిమ్మహావిజ్ఞాన
సాంఖ్యయోగమార్య ♦ సమ్మతంబు
శుద్ధచిత్తుఁడైన ♦ సుతుఁడుశిష్యుఁడుయోగి
గానివానికొసఁగఁ ♦ గాదుసుమ్ము. ౧౨౧

వ. అని శ్రీరాముండాంజనేయున కెఱింగించెనని చెప్పి వాల్మీకిమహర్షి
మరల భరద్వాజునకిట్లనియె. అట్లు రఘుకులోత్తముం డాంజనే
యునకు మఱియు నిట్లని చెప్పె. ౧౨౨

తే. కలిగె నవ్యక్తతత్వంబు ♦ వలనఁగాల
మట్టియవ్యక్తము ప్రధాన ♦ మనఁగ వెలయు
బరుఁడుగానుండు నింతకుఁ ♦ బురుషుఁడీ త్ర
యంబువలన జనించెలో ♦ కంబులెల్ల. ౧౨౩

తే. సర్వతఃపాణిపాదంబు ♦ సర్వతోక్షి
ముఖశిరశ్శ్రుతిమంతంబు ♦ సుఖకరంబు
నైనపరతత్వమీవిశ్వ ♦ మావరించి
యనవరతమును విలసిల్లు ♦ నాంజనేయ. ౧౨౪

సీ. సర్వేంద్రియాభాసు ♦ సర్వేంద్రియ విహీను
సర్వోప మాతీతు ♦ సర్వగతుని
సర్వలోకాధారు ♦ శాశ్వతానందాత్ము
సర్వప్రమాణల ♦ క్షణవిదూరు
ద్వైతవిహీను న ♦ వ్యక్తు సదూపకు
సర్వావభాసకు ♦ సాక్షిమాత్రు
నిర్వికల్పు ననంతు ♦ నిత్యు నిరాభాసుఁ
బరమామృతాత్మకుఁ ♦ బ్రకృతిదూరు

గీ. భిన్నసంస్థితికలితున ♦ భిన్నరూపు
ధ్రువునాద్యంతునవ్యక్తు ♦ భవవిదూరు
గుణవిహీనుఁ బరంజ్యోతి ♦ నను మహీయుఁ
గా నెఱుంగుమునన్ను వి ♦ జ్ఞానమదియె. ౧౨౫

కం. జ్ఞానస్వరూపకుఁడనగు
నేనే బాహ్యాంతరముల ♦ నాడిజగంబుల్
బూని వెలిఁగింతునాచే
వానిఖిలముధార్యమాణ ♦ మైవిలసిల్లున్. ౧౨౬

ఆ. అఖిలవిష్టపములు ♦ నవ్యక్తమూర్తినో
నట్టినాడుచేత ♦ నావృతములు
సకలమైనభూత ♦ నికరంబునాయందు
నిలుచునిదియెఱుంగు ♦ నిగమవేత్త. ౧౨౭

చ. అరయఁబ్రధానముం బురుషుఁ ♦ డంచువినంబడుతత్త్వయుగ్మముం
గరమొనరంగఁగూర్చుటకుఁ ♦ గాలముమూఁడవతత్త్వమౌచనుం
బరువడినీత్రయంబగున ♦ నాదియనంతము విశ్వమెల్లఁ ద
ద్విరచితమీసమస్తమును ♦ వెల్గుమదాశ్రయమొంది ధీనిధీ. ౧౨౮

ఉ. వెలయునుమాయనాఁబ్రకృతి ♦ విశ్వవిమోహినిదానిచేతనే
కలుగు సమస్తలోకములుఁ ♦ గాలముకర్మము దత్సహాయముల్
దలఁపఁగఁ బంచవింశకుఁడుఁ ♦ దత్పరవృత్తినహంక్రియాఢ్యుఁడై
మలయునుజీవభూతుఁడయి ♦ మైకొని కర్తయుభోక్తనాఁగడున్.

ఆ. ఆద్యమగువికార ♦ మదిమహత్ప్రకృతి వి
జ్ఞానశక్తియనెడు ♦ దానివలన
నభిజనిష్యమాణ ♦ మగునహంకారము
దత్ప్రసక్తిజీవ ♦ తత్త్వమొప్పు. ౧౩౦

సీ. ఆవిద్యకంబాన ♦ హ్యాం మతిచేభిన్న
దర్శనుండగుచు ప్ర ♦ త్యక్పదంబు
గనునాత్మయేజీవుఁ ♦ డనఁబడునాతండు
జన్మపరంపరా ♦ సౌఖ్యదుఃఖ
భోక్తయైయజ్ఞాన ♦ మునఁబరావర్తితుం
డగువాని కుపకార ♦ మగుమనంబు
ప్రకృతిరూపకము త ♦ త్పరిషంగమునను వి
జ్ఞానాత్మకుండు సం ♦ సార సంప్ర

గీ. వాహమునగాలకర్మప్ర ♦ వర్తనమునఁ
జిక్కువడియుండుభారము ♦ సేర లేక
ప్రకృతికట్టులఁజిక్కియే ♦ ర్పడస్వతంత్ర
ముడిగి యవివేకమున ముచ్చ ♦ ముడిగియుండు. ౧౩౧

కం. కాలమెసృజించుఁబ్రోచును
కాలమె హరియించుభూత ♦ గణమునఖిలముఁ
గాలవశంగతమంతయుఁ
గాలమెనడపుజుమియదియ ♦ కంపితముకపీ. ౧౩౨

సీ. ఇంద్రియంబులకంటె ♦ నెక్కుడుమనసహం
కారము మనసున ♦ కంటెనధిక
మయ్యహంకృతికంటె ♦ నవలమహత్త్వ
మమ్మహత్తునకు న ♦ వ్యక్తమెచ్చు
నవ్యక్తమునకంటె ♦ నగుఁబురుషుండుత్త
ముఁడుప్రాణవాచ్యుఁడా ♦ తఁడెతలంప
నతనిచేత నె విశ్వ ♦ మంతయురాణించు
భూమమాతనికిఁజి ♦ ద్వ్యోమపదము

గీ. దగుచిదాకాశమునకతీ ♦ తత్వభావ
మెనసియన్నిస్వరూపుఁడౌ ♦ నీశ్వరుండు
నట్టియీశ్వరుఁడనఁగ జ్ఞా ♦ నాత్మకుఁడను
నేననాకంటెఁబరమంబు ♦ నెమక లేదు. ౧౩౩

తే. జగమునందెందుస్థావర ♦ జంగమాత్మ
కంబులగుభూతవితతినా ♦ కన్నఁటియునేను
గానియదులేదు చిద్వ్యోమ ♦ ఘనమహీశు
నన్నెరింగినవిడుచు బం ♦ ధంబులెల్ల. ౧౩౪

ఉ. నీవు సమస్తలోకము సృ ♦ జింపుదుఁ బెంపుదు సంహరింతుఁగా
లాను గుణప్రసక్తిఁ బర ♦ మాత్ముఁడ వౌచుఁ గృపాళుఁగాలముల్
దానొగినాదు సన్నిధి న ♦ దభ్రగతిన్ సకలప్రవృత్తి సం
ధానధురీణ మానిదిగ ♦ దాశ్రితు లేర్పడఁ జాటుచుండెడున్.

తే. దేనిచే నీజగద్భ్రాంతి ♦ మూనిదీని
సంప్రవర్తితముఁగఁ జేయ ♦ జాలియుందు
నట్టిమన్మాయగతిఁ దెలి ♦ యంగ నీకుఁ
జెప్పెదను వినుమేకాగ్ర ♦ చిత్తవృత్తి. ౧౩౬

క. కపివర్య నన్నుఁ గనుఁగొనఁ
దపములు యజ్ఞములు భూరి ♦ దానంబులునున్
నిపుణములుఁ గావులభ్యుఁడఁ
గపటము లేనట్టిభక్తి ♦ గలిగిన నగుదున్. ౧౩౭

చ. అరయఁగ సర్వభావముల ♦ యందును నంతరయామి నౌచు నే
బరఁగుదు సాక్షిరూపమున ♦ భ్రాంతులు కంధరనున్న ముత్తెపున్
సరము నెరుంగకున్న గతి ♦ సారెకు నన్నుఁ బరోక్షసంస్థుగా
నరుదుగ నెంచుచుంట దెలి ♦ యంగ సమర్థులుగారు పావనీ. ౧౩౮

ఉ. ఎవ్వని సుందమంగదిన్మిడి ♦ యెల్లజగంబులు నుండు వానిలో
నెవ్వఁడు సర్వభావముల ♦ నెల్లవిధంబుల నిండియుండు నే
నవ్విమలప్రభావుఁడగు ♦ నట్టిమహేశుఁడ నన్నెరుంగ లే
రవ్విబుధేంద్రముఖ్యులగు ♦ నట్టిసురల్ ఘనులైన యోగులున్.

చ. శ్రుతులును నాప్రభావము నె ♦ రుంగఁగ నేరకఁ బూని నన్ను సం
స్తుతులొనరించు నన్గురించి ♦ సూరులు జన్నములాచరింతు రా
శతధృతిముఖ్యనిర్జరులు ♦ సర్వజగంబులు భక్తితో నమ
స్కృతులొనరింత్రు ధ్యానములు ♦ సేయుదు రెప్పుడు యోగిపుంగవుల్.

తే. సర్వదేవతనుండనై ♦ సర్వయజ్ఞ
భోక్తనగు నేన తత్ఫల ♦ ములనొసంగఁ
గర్తనగువాఁడ నన్నిట్లుఁ ♦ గానెఱుంగు
భక్తులకు సన్నిహితుఁడనై ♦ వరలుచుందు. ౧౪౧

తే. విమలచిత్తులు ధార్మికుల్ ♦ వేదవాదు
లయిన విప్రులురాజన్యు ♦ లార్యవరులుఁ
దొలఁగక స్వధర్మనిష్ఠులై ♦ తెలిసినన్నుఁ
గొలుతు రే నిత్తువారికి ♦ నలఘుపదము. ౧౪౨

తే క్షుద్రులువికర్మసంస్థులౌ ♦ శూద్రులైన
భక్తినన్ను నుపాసించి ♦ పరమపదము
నందజాలుదు రెపుడు నా ♦ యందుభక్తి
గలుగువారలు చెడరు సూ ♦ కపివరేణ్య. ౧౪౩

తే. ప్రతిన జేసిచెప్పెదను మ ♦ ద్భక్తిపరులు
చెడరొకప్పుడు నిది నమ్ము ♦ సిద్ధమనుచు
నాదుభక్తుల నిందించి ♦ ననుబహూక
రించినను నన్ను నట్లుఁగా ♦ వించినట్లు. ౧౪౪

కం. జలమైనఁబుష్పమైనన్
ఫలమైనన్ బత్రమైన ♦ భక్తిసపర్యా
కలననొసంగిన నేనదిఁ
దలఁతున్ మేరువని ప్రియుఁడ ♦ తంజగునాకున్. ౧౪౫

ఉ. వనసరోజగర్భు సృజి ♦ యించి జగంబులొనర్చుకట్టడం
బూనికనిల్పి వానికిని ♦ బుద్ధిసహాయముగా మదాస్యజం
బై నలుఁవొందు వేదనిచ ♦ యంబునొసంగితి సర్వకారణుం
డైన నన్ను గురుండని మ ♦ హాత్ములుయోగులు గొల్తురెప్పుడున్.

తే. సర్వసంసారమునకేన • సంప్రవర్త
కుఁడను హేతువు నిక్కోచ • కుఁడనుసుమ్ము
సాధుజనులకు నేన ర • క్షకుఁడ వేద
విద్విషులకేనహర్తనై • వెలయుచుందు. ౧౪౭

చ. పొలుచుననాదియై భువన • మోహినిమామకశక్తిమాయ నా
నలరుదు నే నమాయకుఁడ • నై సకలైక నియామకుండనన్
వెలయు మదీయశక్తి వర • విద్యయనన్ విను దానిచేత నే
దొలఁగఁగఁజేతుఁ జిత్తమునఁ • దూకొని యోగులమాయజృంభణన్.

తే. సర్వశక్తులకేనయొం • చఁగఁ బ్రవర్త
కుఁడని వర్తకుఁడను సుమ్ము • గుణనిధాన
భువనములకెల్లనాధార • భూతుఁడను మ
హామృతనిధాన రూపుఁడ • నాంజనేయ. ౧౪౯

చ. అరయ రజోమయంబగు మ • దంచిత శక్తి సృజించు విశ్వమున్
సరవిని సత్వరూపమగు • శక్తిభరించును విష్ణుతాప్తిచేఁ
దరమిడి మత్తృతీయమగు • తామస శక్తి హరించు రుద్రతా
స్ఫురణఁ ద్రిశక్తిసంయుతుఁడ • బూర్ణుఁడ నేనజుమయ్య పావనీ. ౧౫౦

ఉ. ధ్యానముచేతఁ గొందరు మ • హోత్తరభక్తిని గొందరున్ బరి
జ్ఞానముచేతఁ గొందరును • గర్మపథంబునఁ జేసి కొందరున్
బూనికనన్నుఁ గొల్తురు ప్ర • బుద్ధులు వీరల మధ్యనుండు వి
జ్ఞానియెదక్కువారలను • శాశ్వతమత్పద మొందుచుండ్రొగిన్.

తే. ఏనయీవిశ్వమెల్ల వ్యా • పించియుందు
భూతభావ్యర్థములశేష • ముగ నెరింగి
యుండు యోగీశ్వరేశ్వరు • నుదితకాల
రూపుననుఁగాంచియమృతంబు • రాశిగంద్రు. ౧౫౨

తే. యోగులగువారలకు నెల్ల ♦ యోగశాస్త్ర
మీవయుపదేశ మొనరింతు ♦ నోగిననుఁ
జిత్తమున నెప్డు ధ్యానంబు ♦ సేయువిధము
యోగమనఁదగు సాధు ప్ర ♦ యోగనిపుణ. ౧౫౩

తే. ననుమహాదేవుఁడందు రె ♦ న్నంగసర్వ
సత్త్వజాలంబుకంటె మ ♦ హత్త్వయుతుఁడ
నగుటఁ బరమేశ్వరుఁడనందు ♦ రఖిలభూత
వితతికిఁ బరుండనై యొప్పు ♦ వెలయుచునికి. ౧౫౪

తే. పరమమహాబృంహణంబున ♦ బ్రహ్మశబ్ద
వాచ్యుఁడనుగా నెసంగుదుఁ ♦ బ్లవగవర్య
యిట్టియోగీశ్వరేశు న ♦ న్నెఱిఁగెనేని
యతఁడ యోగియుముక్తుండు ♦ నగుమహాత్మ. ౧౫౫

మ. పరమానందము నాశ్రయించి గుణసం ♦ పర్కంబు లేకుండి యుగ్
బరమంబై తనుయోగశక్తిమయి వి ♦ శ్వంబెల్లఁ దత్త్వక్రియా
భిరతిన్ గ్రుమ్మరుచుట్టులేనయెపుడున్ ♦ బ్రేరేతు నేవంవిధ
స్ఫురణన్ గాననునెంచుబుద్ధినిపుణుల్ ♦ జూ వేదవేత్తల్ కపీ!

ఆ. ఇదియె పరమగుహ్య ♦ మిదివేదనిశ్చితం
బిదియె జ్ఞానసార ♦ మిదియె శుభద
మతిప్రసన్నచిత్త ♦ ఋషిహితాజ్ఞులునగు
వారికొసఁగవలయు ♦ వానరేంద్ర. ౧౫౬

వ. అని యాంజనేయునకు శ్రీరాముండు వెండియు నిట్లనియె. ౧౫౭

ఉ. ఏనజుమీ సమస్తము సృ ♦ జింపఁగఁ బెంపఁగఁ ద్రుంపఁగఁ గర్తఁ బ్ర
ధానసమయుండ శాశ్వతుఁడ ♦ సర్వజగన్నిచయాంతరాత్మఁ గన్

బూనివసించెదన్ సకల ♦ భూతసమూహమునాదులోపలన్
నేనును సర్వభూతముల ♦ నిండివసించెద వానరోత్తమా! ౧౫౯

చ. అనఘ మదీయమైనపర ♦ మాద్భుతరూపము మున్ను నీవు చూ
చినయది నాదు మాయవల ♦ చే రచితంబగుఁ జుమ్మి సర్వభా
వని చయమంతరంబున న ♦ వస్థితిఁ గాంచిన యేను బ్రేరణం
బనిశము సేతు నిత్యాది క్రి ♦ యామయశక్తియనం దనర్చెదన్.

కం. నాచేతఁ జేష్టితంబై
తోఁచుఁజుమీ విశ్వమెల్లఁ ♦ దొడరి మదాజ్ఞా
గోచరమై మెలఁగును గా
లోచితముగ జగములన్ని ♦ యును నొనరింతున్. ౧౬౧

తే. కర్తనై చేతు జగములు ♦ హర్తనగుదుఁ
గ్రమత నారయింతు రెండురూ ♦ పములు నాకు
నాదిమధ్యాంతరహితుఁడ ♦ నతులనైన
మాయకుఁ బ్రవర్తకుఁడ నాంజ ♦ నేయ! నేను. ౧౬౨

తే. క్షుభితములఁ జేతు సర్గాదిఁ ♦ జొచ్చి యేఁ బ్ర
ధాన పురుషాఖ్యలగు రెండు ♦ తత్త్వములను
దన్నిరోమేళనమున ను ♦ త్పత్తిఁ గాంచు
నెల్లలోకంబులును వాన ♦ రేంద్ర మొదల. ౧౬౩

తే. మహదహంకారపంచత ♦ న్మాత్రలాది
నైన తత్త్వంబులు మదీయ ♦ మైన తేజ
మొలయ నుజ్జృంభితంబులై ♦ కలసి కలసి
భువన నిర్మాణసాధనం ♦ బులగు ననఘ. ౧౬౪

తే. ఘనత జగదేకసాక్షియుఁ ♦ గాలచక్ర
సంప్రవర్తకుఁ డధిక తే ♦ జస్సనాథుఁ

డైన మార్తాండుఁడగుమదీ ♦ యాంగభవుఁడు
వానికొసఁగితి సిద్ధియై ♦ శ్వర్యమేన. ౧౬౫

చ. వినుము చతుర్ముఖుండయిన ♦ వేలుపు పెద్ద మదీయ తేజమే
కను వేలుఁగై యెసఁగఁగ జ ♦ గంబుల నెల్ల సృజించు దాని కీ
ఘనమహిమంబు నేనయొస ♦ కంబుననిచ్చితి మన్ని యోగముల్
బనివడియావలన్నిలిపి ♦ భక్తిఁజరించుఁజుమీ ప్లవంగమా! ౧౬౬

కం. అరయ మన్మూర్తియె చుమి
నారాయణుఁ డనఁగఁ ద్రిభువ ♦ నావనలీలా
పారీణుఁడైన వేలుపు
దారంబగు నాదునాజ్ఞ ♦ తలనిడి మెలఁగుల్. ౧౬౭

కం. మద్రూపకుఁ డగుఁ జుమ్మీ
రుద్రుఁడు కాలాత్మకుం డు ♦ రుప్రాభవ ని
ర్నిద్రితుఁడు నఖిలవిష్టప
విద్రావణ శీలుడైన ♦ వేలుపు వత్సా. ౧౬౮

తే. హవ్యకవ్యంబులెల్లను ♦ దాజ్ఞఁ గొనుచుఁ
బ్రాపణముసేయు నెల్ల దే ♦ వతల కఖిల
విశ్వదీపకుఁడై పాక ♦ విధియునడపు
నగ్ని మచ్ఛక్తి చోదితుం ♦ డై కపీంద్ర. ౧౬౯

తే. అరయ భుక్తాన్న పాక క్రి ♦ యానియుక్తుఁ
డగుచు వైశ్వానరాగ్ని నా ♦ యాజ్ఞ మెలఁగు
సకల జలభర్త వరుణుఁ డీ ♦ జగమునకును
జీవనంబిచ్చు నాయాజ్ఞఁ ♦ జేసి సూవె. ౧౭౦

తే. అఖిలభూతంబులకును బా ♦ హ్యాంతరముల
నిండుకొని ప్రాణభూతుఁడై ♦ యుండుపవనుఁ

ఢీజగద్దేహ వితతి భ ♦ రించియునికి
యెల్ల నాయాజ్ఞఁ జేసి చు ♦ మ్మిస్థచరిత. ౧౭౧

మ. అనయంబు న్నిజకాంతిసంతతి జగం ♦ బాప్యాయనంబొంది వ
ర్ధన మొందన్ విమలామృతాత్ముఁ డగునా ♦ ప్రాలేయభానుండు లో
క నికాయంబుఁ బ్రకాశసంగతముగాఁ ♦ గన్ జేయుచున్ సృష్టి స
ర్జన హేతుండగు భాస్కరుండును మదా ♦ జ్ఞా వర్తులార్యోత్తమా.

చ. సకలజగన్నియామకుఁడు ♦ శక్రుఁడు యజ్ఞఫలప్రదాత మా
మక నియమాను వర్తనుఁడు ♦ మానితధర్మపథైక గోప్త పా
తకి జనలోక శాస్త్రయగు ♦ దండధరుండును మన్నియోగధా
రకుఁ డగుఁ దాదృశుండ ధన ♦ రాజవిభుండు కుబేరుఁ డెన్నఁగన్.

తే. భూతభేతాళములకు వి ♦ భుండు సర్వ
భక్తభోగఫలప్రద ♦ ప్రాభవుండు
నైన యీశానుఁడునుమదీ ♦ యాజ్ఞఁ జేసి
సంప్రవర్తితుఁడగు సుధీ ♦ జనవరేణ్య. ౧౭౪

తే. అంగిరసుఁడుసమస్తశి ♦ ష్యప్రశిష్య
యుతుఁడు రుద్రగణాగ్రణి ♦ యతులతేజుఁ
డైనవామదేవుండునా ♦ యాజ్ఞ జేసి
యోగిజనరక్షకుండయి ♦ యుండువాఁడు. ౧౭౫

ఆ. అఖిలలోకపూజ్యుఁ ♦ డగువిఘ్ననాథుండు
మత్ప్రశాసనమున ♦ మలయుచుండుఁ
బావనాత్ముఁడైన ♦ దేవసేనాపతి
స్కందుఁడును మదాజ్ఞఁ ♦ గాంచిమెలఁగు. ౧౭౬

తే. క్షితిమరీచ్యాదులగుప్రజా ♦ పతులు మత్ప్ర
శాసనమునఁ బ్రజావృద్ధి ♦ సలుపుచుండ్రు

రరయనారాయణాశ్రయ ♦ యైనలక్ష్మి
కలుములిడునుత్ప్రిశాస్తిలో ♦ కములకెల్ల. ౧౪౭

తే. సకలవాగీశ్వరియు సర ♦ స్వతిమదాజ్ఞ
వలనఁజరియించుఁజుమి తన్ను ♦ దలఁచువారి
దురితములుశాంతినొందింపుఁ ♦ బరమవేద
మాత సావిత్రినాయాజ్ఞ ♦ చేతమెలఁగు. ౧౪౮

తే. బ్రహ్మవిద్యాప్రదాయిని ♦ పర్వతేంద్ర
తనయయగునాదిశక్తిభ ♦ క్తజనశుభద
శివసమాశ్రయయగుదేవి ♦ కవిజనేడ్య
యగుమదాజ్ఞావిధాయిని ♦ యాంజనేయ. ౧౪౯

చ. అనిశమునున్నమత్ఫణ స ♦ హస్రమణిప్రకరానుగంత్రిగాఁ
దనరఁగనిద్ధరిత్రి దలఁ ♦ దాల్చు ననంతుఁడునన్నియుక్తికై
కొనియె చుమీ మహాజలముఁ ♦ గ్రోలుచునబ్ధినియామకత్వముం
బనిగొనియాచరించునల ♦ బాడబవహ్నిమదాజ్ఞపెంపునన్. ౧౫౦

వ. మరియు నోహనుమంతా, విను! మాదిత్యవసురుద్ర మరుదశ్వినులను దేవతలును, గంధర్వోరగాప్సరస్సిద్ధసాధ్య విద్యాధరచారణ రక్షోభూతపిశాచాది దేవయోనులును, మదాజ్ఞానువిధాయకులై వర్తించువారు. కళాకాష్ఠాక్షణ నిమేషముహూర్తాహోరాత్ర పక్షమాస ఋత్వబ్దయుగ మన్వంతరాది ప్రమాణభేదంబులఁబర్యవసితంబగు కాలచక్రంబుమదీయశాసనంబునంబరివర్తితంబగుచుండు. స్థావరజంగమాత్మకంబులగు చతుర్విధ భూతంబులు మన్నియోగంబున జన్మానులంబ్రవర్తిల్లుచుండుఁ బత్తనంబులు దేశంబులు భువనంబులుగలుగు, బ్రహ్మాండమ్ములెల్ల మన్నిదేశంబునఁ దత్త ద్వీపంబుల సవస్థితంబులై యుండు, నవి లంఘ్యంబగు మచ్ఛాశ

సంబు ననుసరించి యనేకకోటి బ్రహ్మాండంబు లతీతంబులయ్యుఁ బ్రవర్తమానంబులయ్యు భవిష్యమాణంబులయ్యు నుండుఁ బృథివ్యాపస్తేజోవాయ్వాకాశంబులను పంచమహాభూతంబులు మదాజ్ఞావశంబునం జేసి యంగాంగిభావమిళితంబులై బ్రహ్మాండకల్పనోపాదానంబులగుచుండు. సకలభూతాద్యావరణహేతుభూతంబగు మహాప్రకృతిమద్వశంగతంబై మదాజ్ఞావశంబునం బ్రవర్తించుచుండు. సకలమోహనివృత్తిసాధనంబైన విద్యయు మన్నిదేశంబునం జేసి యోగిజనుల చిత్తంబుల బ్రాపించి మోహకవిలంబపనయించి మత్పదదర్శనంబు గావించుచుండునని చెప్పి వెండియు నిట్లనియె. ౧౮౧

కం. ఇదియదియనఁగా నేటికిఁ
బొదలుచు బ్రహ్మాండజాల ♦ మునఁ గలయదిలే
నిది సర్వము మచ్ఛక్తిక
బదిలంబుగ ననుసరించి ♦ పరఁగుచునుండున్. ౧౮౨

శా. నాచేఁబూరితమైఁ బ్రకాశితముగున్ ♦ నాచేఁదిరోభూతమా
నాచేసంపరిబృంహితంబగుజగ ♦ న్నాట్యాను సంధానస
త్ప్రీచీనుండ స్వయంప్రకాశుఁడనుదు ♦ ర్విజ్ఞేయమాయాగుణ
ప్రాచుర్యుండ సనాతనుండసకలై ♦ శ్వర్యాఢ్యుఁడన్నేజుమీ.

తే. వత్సపరమాత్ముఁడును బర ♦ బ్రహ్మమనఁగ
నేననాకంటె నితరమొం ♦ డేనిలేదు
పూని తెలిపితినీపరి ♦ జ్ఞానమిద్ది
యెఱిఁగి సంసారజలధి త ♦ రింత్రుజుమ్ము. ౧౮౪

మ. వినుమేమాయనుపాశ్రయించియిటులు ♦ ర్వీమానుషాకారతన్
జననంబందితిఁబుణ్యమాదశరథ ♦ క్ష్మానాథుగేహంబునం

దును శ్రీరాముఁడు లక్ష్మణుండు భరతుం ♦ డును వెండి శత్రుఘ్నుఁడం
చనఁగా నాలుగు రూపులొందినిజమే ♦ కాకారుఁడన్ భావనీ. ౧౮౫

ఉ. వానరనీయెడంగలుగు ♦ వత్సలభావముచేత దివ్య వి
జ్ఞానమయంబుగాఁదనరుఁ ♦ నాదుస్వరూపమెఱుంగఁజెప్పితిన్
దీనిని గోప్యమంచును మ ♦ తిన్దృఢభక్తిరతిన్ సదాను సం
ధానముసేయుచుండుము ప ♦ దంపడి విస్మృతిఁజెందకెప్పుడున్.

కం. నీనాసంవాదంబిది
వీనులుదనియంగ నెవఁడు ♦ వినునాతఁడు ఘో
రైనఃపంకవిముక్తుం
డైనిశ్శ్రేయస పదంబు ♦ నందుఁగపీంద్రా. ౧౮౭.

తే. బ్రహ్మచర్యానివిష్టులౌ ♦ బ్రాహ్మణులకుఁ
బూనివినుపించునదిపరి ♦ జ్ఞానశీలు
రగుచునిందలి యర్థంబు ♦ నధిగమించి
యందుదురువారలవ్యయం ♦ బైనపదము. ౧౮౮

తే. అతిదృఢవ్రతుఁడును భక్తి ♦ యుతుఁడు నగుచు
నెవ్వఁడీగ్రంథమెపుడుఁ బ ♦ఠించుచుండు
నతఁడఖిలపాపనిర్ముక్తుఁ ♦ డగుచు బ్రహ్మ
లోకమునుఁబొందగలఁడు ని ♦ శ్శోకుఁడగుచు. ౧౮౯

కం. కావునసర్వవిధంబులఁ
బావనమగు నీచరిత్ర ♦ పఠియింపఁగనం
భావింపవినఁగ మననము
గావింపఁగఁజెల్లుబుధని ♦ కాయంబునకున్. ౧౯౦

కం. అని శ్రీరాముఁడు గూఢం
బును దివ్యంబైనజ్ఞాన ♦ మును తెల్లముచే
సిన విని యాహనుమంతుఁడు
తనమనమున నెంచె ధన్య ♦ తముఁడ నటంచున్. ౧౯౧

వ. అని యాంజనేయునకు శ్రీరాముండానతిచ్చెనని చెప్పిన. ౧౯౨

ఆ శ్వా సాం త ము.

శా. దాక్షాయణ్యుపలభ్యమానవపుర ♦ ర్ధా ప్రార్థనీయాకృతీ
త్య్రక్షాశిక్షిత దుష్టరాక్షసకులా ♦ ధ్యక్షాలలాటేక్షణ
ప్రత్యక్షుభ్యద్దహనార్చిరింధనభవ ♦ త్పుష్పేష్వమ్మ ద్యోషిమ్న గా
లక్ష్మీ భూతకపర్దదుర్దమభుజా ♦ లంకారశూలాయుధా. ౧౯౩

కం. పురదనుజ హరణరణ ధు
ర్ధర ధరణీ రథ రథాంగ ♦ ధరశరశరభూ
కరిముఖ సేవిత వితతా
దరదర పారద సుధావ ♦ దాతశరీరా. ౧౯౪

ద్రు త వి ల ం బి త వృ త్త ము.

శివ శివంకర ♦ సేవకపాలనో
త్సవ సవాహిత ♦ దక్షవిఘాలనా
భవభవామయ ♦ భంజనశీలనా
నవనవేందుపి నద్ధ ♦ జటాలనా. ౧౯౫

గద్య.

ఇది శ్రీరామచంద్రచరణారవిందసపర్యామరంద తుందిలమనోమిళిందపవన
నందన పద వందనానంద సందర్శిత సరసకవితావిచిత్ర శ్రీమదానంద
తీర్థ భగవత్పాదాచార్య గురుకరుణాపాత్ర పరిచితాశ్వలాయన
సూత్ర విశ్వామిత్రగోత్రపవిత్ర నందగిరివంశశరనిధి రాకాకు
ముదమిత్ర వేంకటనృసింహరాయపుత్ర శేషమాంబాగర్భ
శుక్తిముక్తాఫలాయమాన నిరుపమాన భాగధేయ
సకల సుకవినికాయ విధేయ వేంకటప్పారాయ
నామధేయవిరచితంబగు వాల్మీకీయ శ్రీమద్రా
మాయణాద్భుతోత్తర కాండ మహాకా
వ్యంబునం దృతీయాశ్వాసము.

ఓం.

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమద్రామాయణాద్భుతోత్తరకాండము.

---

## చతుర్థాశ్వాసము.

శ్రీ క్షిత దుష్కృత త్రిభువన
రక్షణకల్యాణ గుణ ప • రాయణవినమ
త్పక్షీంద్ర వాహ జగ ద
ధ్యక్ష సముద్యత్ప్రభావ • యమరేశ శివా. ౧

వ. అవధరింపుము వాల్మీకిమహర్షి భరద్వాజునకిట్లనియె. నట్లు రఘుకులోత్తముండు కేసరికుమారునకుఁదత్త్వోపదేశంబు చేసిన. ౨

మ. హృదయాంభోరుహమధ్యసంస్థితుమహా • యోంకారరూపుఁ ద్ర
యీ॥విదనావాప్య మహాప్రభావకలితుఁ • విశ్వాకృతిద్యోతమా
ను దయాసాగరు దేవదేవుని ననం • తుఁ ధ్యానమాత్రైక సం
విదితుఁ గన్గొని యానతుండగుచుఁ గా • వించెఁ మహాస్తోత్రముల్.

### ఆంజనేయ కృతస్తోత్ర తారావళి.

శా. రామస్వామి నకుంఠశక్తి కలితుఁ • బ్రహ్మాద్యదేవుఁ ద్రయీ
స్తోమస్తవ్య మహాప్రభావ మహితుఁ • శుద్ధావ బుద్ధాత్మకుఁ
భూమానందమయుఁ సమున్నతదయా • పూర్ణాశయుఁ నిన్ను ని
స్సీమజ్ఞాన విధాయకుఁ గొలిచెదఁ • శ్రీరామచంద్రప్రభూ! ౪

శా. ఏకం బీశ మనీశ మద్వయ మజం ♦ బిచ్ఛాక్రియాజ్ఞాన శ
క్త్యాకల్పం బఖిలైకమూలము నమ ♦ స్తాంత ర్బహిర్వ్యాప్తమ
స్తోకానంద మనంత మాద్యము ప్రచే ♦ తోబ్రహ్మవిద్గమ్య ల
క్ష్యైకంబై తగు తేజమీవకదవే ♦ శ్రీరామచంద్రప్రభూ! ౫

మ. నిను నాత్మస్థితు రుక్మవర్ణు నమలున్ ♦ నిర్దోష బోధాత్మునం
జనదూరున్ గవిఁ జిత్సుఖాత్మకుఁ బరున్ ♦ శాంతాత్ములై బుద్ధిఁ గ
న్గొని యోగీశ్వరు లద్భుతామృత సుఖా ♦ కూపార నిర్మగ్నులై
చెనయంబోరు భవోగ్రదుఃఖ వితతిన్ ♦ శ్రీరామచంద్రప్రభూ! ౬

మ. జగముల్నీ వలనన్ ప్రభూతిగనియెన్ ♦ సర్వాత్మ సృష్టిక్రియా
నిగమంబెల్ల భవద్వశంగతము ని ♦ ర్ణిద్రప్రభావాఢ్య నీ
వగరిష్ఠంబులలో గరిష్ఠము నణు ♦ త్వంబందణుత్వంబుఁగాం
చి గురుఖ్యాతి వెలుంగుచుందు వెపుడున్ ♦ శ్రీరామచంద్రప్రభూ!

మ. జలజాతప్రభవుండ నాదిజుఁడు వి ♦ శ్వస్రష్టయా వేల్పు నీ
వలనన్ గల్గి పురాణపూరుషుఁడనన్ ♦ బ్రహ్మాండ జాలంబులన్
గలుగంజేసె యథావిధానముగ నా ♦ జ్ఞాధారకుండై ప్రవ
ర్తిలు నీ వింతకు మూలభూతుఁడవు సూ! ♦ శ్రీరామచంద్రప్రభూ!

మ. నిగమవ్రాతములెల్ల నీవలన ను ♦ న్మేషంబుఁ బ్రాపించుచున్
నెగడున్ గ్రమ్మరసంస్థితిన్ గడపటన్ ♦ నీయందకాంచున్ నినున్
జగదాధారుఁడవంచు భూతహృదయా ♦ తద్వర్తివంచున్ దలం
చి గురూత్తంసునిగా భజింతు నెపుడున్ ♦ శ్రీరామచంద్రప్రభూ!

శా. చింతింపందగు బ్రహ్మచక్రమిది నీ ♦ చే భ్రామితంబౌ సమ
స్తాంతర్యామివి నీవ మాయకుఁడ వా ♦ త్మారాము సచ్చిత్సుఖ
స్వాంతున్ యోగిజసేవ్యువిశ్వవిభు శ ♦ శ్వద్దివ్యవృత్త్యాశ్రయున
ర్చింతున్ నే శరణాగతుండనగుచున్ ♦ శ్రీరామచంద్రప్రభూ! ౧౦

మ. అతులంబైన చిదంబరంబునకు మ ♦ ధ్యన్ నృత్యమున్ సల్పు న
వ్భుతరూపుండగు నిన్ను బుద్ధిగుహయం ♦ దున్ జూచి సర్వాత్మతా
స్థితు నానావిధసన్నివిష్టునిగ భా ♦ వింపంగ బ్రహ్మత్వకాం
చితమానందము వొందుచుండు నెప్డున్ ♦ శ్రీరామచంద్రప్రభూ!

శా. ఓంకారంబది ముక్తిబీజమనఁగా ♦ నొప్పున్ భవద్వాచక
త్వాంతకంబౌచు నినున్ స్వయంప్రభుని న ♦ త్యప్రజ్ఞునీశున్ నిరా
తంకున్ దత్ప్రకృతిప్రగూఢమహిమో ♦ ద్యద్రూపునిన్ దుర్జనా
రిం గొంకారుండని చెప్పుచుండు రెపుడున్ ♦ శ్రీరామచంద్రప్రభూ! ౧౨

మ. సతతంబున్ నిను సర్వనిర్జరవరుల్ ♦ సంస్తోత్రముల్సేతు రీ
ప్సితముల్ వొంగ నమస్కరించెదరు ప్ర ♦ క్షీణాంహసుల్ తాపసుల్
యతులా శాంతులు సత్యసంధులును ని ♦ త్యబ్రహ్మనిష్ఠుల్ విదు
ష్కృతులై నిన్ను విశిష్టుఁ జొచ్చెదరొగిన్ ♦ శ్రీరామచంద్రప్రభూ!

మ. బహుశాఖంబున నంతమైతనరు వే ♦ దంబెప్డు బోధించునిన్
మహితైకాకృతి భాసమానునిగ నా ♦ నాలోకసర్గాదిధూ
ర్వహుఁగా నిట్టి నినున్ సువేద్యునఖిల ♦ స్వాతంత్ర్యయుక్తున్నతా
ర్తిహరున్ గొల్చిన శాంతి నిత్యమగుఁజూ! ♦ శ్రీరామచంద్రప్రభూ!

మ. అనఘున్నిన్నణిమాదికాప్రతిహతా ♦ ద్యైశ్వర్యవిశ్వాత్మునీ
శు నచింత్యున్ బరమేష్ఠినప్రతిమ తే ♦ జోరాశి బ్రహ్మణ్యు నె
మ్మనమందున్ దలపోసి శాశ్వతసుఖో ♦ న్మగ్నాత్ముఁడై యుండనే
ర్చినముక్తుండగు వీతశోకుఁడగుచున్ ♦ శ్రీరామచంద్రప్రభూ! ౧౫

మ. వినుమీవొక్కఁడ వెల్లలోకములుఁ గా ♦ వించంగ సర్వంబుఁ బా
లనమున్ జేయఁదుదిన్ స్వలీనముయి కా ♦ లన్ జేయఁగాఁ గర్తవై
పెంపుం జెందెదు విశ్వరూపకుఁడవై ♦ విశ్వేశ్వరా! కేలుమో
డ్చిన మస్కారమొనర్తు నీకు నెప్డున్ ♦ శ్రీరామచంద్రప్రభూ!

మ. పరమేశున్ హరిమిత్రు బాణధరు స ♦ ర్వద్రష్ట నిన్నే వచిం
తురు సూర్యేందునభస్వదగ్నిజలభూ ♦ త్యక్ష్మానభోధాత్రి సా
గరముఖ్యాఖిలరూపసంయుతునిగాఁ ♦ గన్దజ్ఞులెల్లప్పుడున్.
స్థిరవిజ్ఞానమహాక్షరాకృతిధరా ♦ శ్రీరామచంద్రప్రభూ! ౧౭

శా. నీవేయక్షరతత్త్వ మీవ త్రిజగ ♦ న్నిర్మాతవీవే మహా
దేవాఖ్యుండవు నీవ శాశ్వతుఁడవున్ ♦ దేవాదిదేవుండవున్
నీవే నిర్మలధర్మగోప్తవు మహా ♦ నిర్వాణసంధాతవున్
జీవస్రష్టవు పూరుషోత్తముఁడవున్ ♦ శ్రీరామచంద్రప్రభూ! ౧౮

మ. భువనస్రష్టయు భర్తహర్తయగు నం ♦ భోజాతభూవిష్ణు రు
ద్రవిధవ్యక్తులు తావకీనగుణ సం ♦ రంభంబుతో విశ్వనా
భివి సర్వేశ్వరతాయుతుండవు మహా ♦ విజ్ఞాతవున్ సర్వసా
క్షివి నీయందుఁ బ్రతిష్ఠనొందు జగముల్ ♦ శ్రీరామచంద్రప్రభూ! ౧౯

మ. అమలజ్ఞానమయున్ బరాత్పరుని ని ♦ న్నాదిత్యవర్ణున్ గత
భ్రమునానందమయస్వరూపుని తమః ♦ ప్రధ్వంసకున్ నిర్గుణున్
సుమహోరాశిఁ బురాణపూరుషు నజున్ ♦ సువ్యక్తునవ్యక్త సం
స్తిమితాంహస్కునిగా వచింతు రనఘుల్ ♦ శ్రీరామచంద్రప్రభూ!

శా. నీకంటెన్ బరమెందుఁ గల్గదణువే ♦ నిన్ నిర్మలానంద ని
శ్శోకాఖండచిదేకరూపకుఁడవై ♦ చున్ వెల్గుచున్నట్టి ని
న్నాకేఁ జెప్పఁగ లేదు తత్త్వమిక లో ♦ కక్షేమసంధానసు
శ్రీక ప్రాభవదుర్విలోక్య విభవా ♦ శ్రీరామచంద్రప్రభూ! ౨౧

మ. ఉరుతేజోమయమూర్తి నవ్యయు నజున్ ♦ యోగీశ్వరేశున్ బరా
త్పరు విశ్వైకపరాయణున్ సుఖమయున్ ♦ బ్రహ్మస్వరూపున్ నిరం
తరశక్తిత్రయభాసమానుని వచిం ♦ త్యప్రస్ఫుటైశ్వర్యసు
స్థిరు నిన్నున్ బ్రణుతింతు కేల్మొగుచుచున్ ♦ శ్రీరామచంద్రప్రభూ!

మ. శరణార్థిత్వముగాంచి నీపదసరో • జద్వంద్వమెవ్వర్ భజిం
తురులోకంబుల నెల్లవారలును నెం • దుర్ఘోర సంసారదు
స్తరశుగ్బీజ వినాశహేతువగు నీ • సంసేవనంబాత్మ సు
స్థిరభక్తిన్ గొలుతున్ బ్రసన్నుఁడగుమీ • శ్రీరామచంద్రప్రభూ!

మ. వితతంబౌ భవదాజ్ఞఁ బావకుఁడు డాగిన్ • వెల్గొందుచుండున్ సదా
గతివీచున్ భరియించు భూతతతి నీ • క్ష్మాచక్రమర్కేందుల
ప్రతిరోధస్థితిఁ దేజరిల్లుచు దివా • రాత్రుల్ ప్రవర్తింతు రూ
ర్జితమౌ నీవిభవంబమేయము జుమీ • శ్రీరామచంద్రప్రభూ! ౨౪

శా. పూర్వుల్ దావియ భేదభంగి నిరవా • పోల్కిన్ గుణోత్కర్షతన్
భావింపంబడు నీదు శక్తియవి నా • భావంబునన్ దత్క్రియా
ప్రావీణ్యంబున విశ్వసర్గలయముల్ • భాసిల్లు నశ్రాంతల
క్ష్మీవిద్యోతిత నీకుఁ గర్తతయగున్ • శ్రీరామచంద్రప్రభూ! ౨౫

మ. సురరక్షోరగయక్షకిన్నరనర • స్తోమాదినానా చరా
చరభూతంబులు తావకాంశభవముల్ • శాఖాసహస్రోల్లస
త్తరులీలన్ వినుమూలమీవ సుమి యే • తద్విశ్వసంపత్తికిన్
స్థిరకల్యాణగుణాభిపూర్ణవిభవా • శ్రీరామచంద్రప్రభూ! ౨౬

మ. అరయంగా మణులందు సూత్రమిరవౌ • నట్లీవు నానాచరా
చరభూతాంతరవర్తివై వెలుగుదీ • వా సర్వవిజ్ఞానసా
గరయుష్మన్మహిమాప్రచారమెరుఁగం • గా లేరు బ్రహ్మాదులున్
చిరతేజోమయ నిర్వికల్పవిభవా • శ్రీరామచంద్రప్రభూ! ౨౭

శా. క్రేపుల్ వెన్కనివచ్చు ద్రోణదుఘమా • డ్కిన్ భక్తవత్సల్య వి
ద్యాపారీణతయుల్లసిల్ల నిజభ • క్తశ్రేణి సంరక్షణ
వ్యాపారంబు వహించి వారి నెడఁబా • యన్ జాలవీవిట్టి నీ
శ్రీపాదంబులు నాకొసంగఁగదవే • శ్రీరామచంద్రప్రభూ! ౨౮

మ. గుణముల్గల్గునటంచు గొందరిక నై • గుణ్యంబె నిక్కంబు ల
క్షణమంచుం బచియింత్రు గొందరు • గరిష్ఠస్ఫూర్తియనెట్లుఁగా
దణురూపంబనుచుం జిన్ముఁ బలుకుచుం • ద్రమ్యాకృశ్రుత్యంతసం
గృణదభ్యర్హితసచ్చరిత్రకలితా • శ్రీరామచంద్రప్రభూ! ౨౯

మ. అవశత్వంబుననైన దేవభవదీ • యంబైన నామంబునా
ల్కవచింపన్ బహుజన్మసంచితములౌ • కాలుష్యముల్వాసియా
భవవారాసిఁ దరించుమానవుఁడు స • ద్భక్తానుసంధానువ
ర్తిలినీవీశ్వర నీకు వందనములో • శ్రీరామచంద్రప్రభూ! ౩౦

కం. శివరూపరాఘవ భవో
ద్భవ హర కాలాత్మకా క • పర్ది నిగమ
స్తవనీయ ప్రసన్నుఁడవగు
మవిరళకృపసామ్యరూప • మదిసూపఁగదే. ౩౧

కం. చూడఁ జాలరుగద ని
న్నోడక బ్రహ్మాదులును కృ • పోదయమది చే
కూడక యున్నవి నీతిని
వేడెదఁ బూనఁగదె సామ్య • విధమింక విభూ. ౩౨

మ. అనియీతీరునగాఢభక్తినలిక • న్యస్తాంజలివ్యాప్తుఁడై
హనుమంతుండువినీతిఁ బ్రార్థనము నే • యన్ రామచంద్రుండు మ
న్ననమారన్ నిజసామ్యరూప మిరవొం • దన్ దాల్చి సౌమిత్రితో
డనుదారప్రమదాన్వితుండగుచునుం • దన్ గాంచెనాతండొగిన్.

చ. చిరునగవొప్పఁగాఁబ్లవగ • శేఖరుఁగన్గొని రామచంద్రుఁ డా
దరమున నిట్లుపల్కె గుణ • ధామ భవత్కృతమౌ స్తవంబునా
కిరవుగఁ గూర్చె మోదమిది • యెవ్వరు భక్తిఁ బఠించినన్ శుభా
కరమగునట్టిభవ్యగతిఁ • గాంచెదరంచితనిర్వికారులై. ౩౪

క౦. అని చెప్పి మఱియు నతఁడి
ట్లనియెఁ బ్రకృతమగు కార్య ♦ మదితలఁపుము మా
పని యొకటి సేయవలయును
వనచరవిను మత్తెఱంగు ♦ వలనుపడంగన్. ౩౫

చ. ఇనకులచంద్రుఁడైన దశర ♦ థేశ్వరపుత్రులమేము పూర్వజుం
డను నను రాముఁడండ్రితఁడు ♦ తమ్ముఁడు లక్ష్మణుఁడిట్లు కాననన్
జనకుని యాజ్ఞచే వెడలి ♦ చానయు నేమును వచ్చియుండు స
న్మునినికరాశ్రమంబులు గ ♦ నుంగొనుచున్ జరియించనొక్కటన్.

చ. కపటమువన్నిమవ్వనితఁ ♦ గైకొని పోయె నిశాటభర్త పా
ప పరుఁడు రావణుండతనిఁ ♦ బట్టి వధింపఁగ నేగఁగా వలెన్
దపన తనూజుతోఁ జెలిమి ♦ తప్పక మాకొనఁగూర్చు మిప్పుడో
కపికులవర్య! సంగర ము ♦ ఖంబునఁ బెంపుఁగఁదోఁచు నూపఁగన్. ౩౭

చ. అనవుడుఁ బిన్ననవ్వు వద ♦ నాంబుజసీమ నలంకరింప న
వ్వనచరపీయఁడిట్లనియె ♦ భద్రగుణాకర విశ్వమెల్ల నీ
కను దెరువంగ మూయఁగలుఁ ♦ గన్ మలఁగన్ గలదిట్టి నీకుఁ దో
డని యొకమాటు వెట్టెదు మ ♦ హాత్మక యింతటి వింత గల్గునే. ౩౮

ఉ. పోలఁగ నీదు భార్యఁ గొని ♦ పోయె నిశాచరుఁడన్న బూమె లి
వ్వేళ వచించుటంతయును ♦ విశ్వవిడంబనమాత్రమింతె నీ
లీల లెఱుంగఁగాదరమె ♦ లేఖవిభుస్తవనీయ యుష్మదా
జ్ఞాలవసంప్రవర్తితము ♦ సర్వజగచ్ఛయనాదిపూరుషా. ౩౯

క౦. ఐనన్ బ్రభుఁడవు నీయా
జ్ఞానియతిన్ మెలఁగుటది ఘ ♦ నంబగుఁ గానన్
భూనాథచంద్రమిం క
వ్వానరనాయకుని మేలి ♦ బంటు నొనర్తున్. ౪౦

తే. అనుచుఁదగఁజెప్పిదయసేయుఁ ♦ డని నిజాంస
పీఠికారూఢులనొనర్చి ♦ వేగసూర్య
సుతుకడకుఁదెచ్చిచూపిన ♦ నతఁడుఁబ్రణతుఁ
డగుచుఁదనలోఁగృతార్థుఁడ ♦ ననుచుఁదలఁచె ౪౧

తే. ఇతఁడు హితుఁడైనచాలు ని ♦ ర్జితుడయుగును
వాలియంచుదలఁచె నంశు ♦ మాలిసుతుఁడు
రామసుగ్రీవులకును బ ♦ రస్పరప్ర
విదితవృత్తాంతులకు మైత్రిఁ ♦ గుదెరెనపుడు ౪౨

కం ఓలినొకమ్మున నేలం
గూలంగాసేసె నృపతి ♦ గురుబలశాలిన్
వాలిన్ సురవిమతేంధన
కీలిన్ బ్రబలిపన్నసమర ♦ కేళీహేలిన్. ౪౩

కం. ఆవానర రాజ్యమునకుఁ
గావించెన్ బట్టభద్రుఁ ♦ గరుణామతి సు
గ్రీవున్ మూలా విలస
ద్గ్రీవుమహాధైర్యవిజిత ♦ దివిషద్గ్రావున్. ౪౪

కం. ఇనసుతుఁడుసహాయార్థము
వనచరసేనలనుగొనుచు ♦ వచ్చినసీతా
వనజాక్షిరోయఁబంచెను
హనుమంతున్ బుద్ధిమంతు ♦ నతిబలవంతున్. ౪౫

కం. ప్లవఁగవరేణ్యుఁడు వెసఁజని
లవణాంబుధిదాటిమేటి ♦ లంకాపురమం
దవలోకించె నిశాచర
యువతీపరివీతసీత ♦ నురుగుణజాతన్. ౪౬

కం. ప్రీతిఁ జనుదెంచి యతఁడు
సీతావృత్తాంతమెల్లఁ ♦ జెప్పినఁ గపిసం
ఘాతముఁగొని వెంబడి రవి
సూతిఁగొలువననికినాజి ♦ సూనుఁడు వెడలెన్. ౮౭

కం. వానరసేనలఁగొని రఘు
సూనుఁడరిగి కాంచె నెదుట ♦ సురవర్త్మనట
త్ఫేనిలతరంగచంద్రిక
శానిబిడరుచిప్రమాధి ♦ లవణాంభోధిన్. ౮౮

రాముఁడు సేనలతో సముద్రము దాటుటకు యోచించుట.

మ. కనియవ్వారిధి తుంగభంగనివహా ♦ క్రాంతాంతరిక్షాంతభా
గ నవద్యోన్నతియెంచి నిస్తరణమా ♦ ర్గాన్వేషణంబాచరిం
చు నెడన్ దమ్మునితోడనిట్లనియె ని ♦ చ్చో సేనలం గొంచు ని
వ్వనధిన్ దాటఁగ నెద్దియో వెరవు నే ♦ ర్పాటొప్పఁగావింపుమీ.

తే. లక్ష్మణా వేగమన సేన ♦ లంక కరుగఁ
దగు నుపాయంబు సూడుమీ ♦ తడయకనిన
నన్నయానతిఁదలమోచి ♦ యాతఁడును మ
హాప్రసాదమటంచు న ♦ య్యబ్ధిఁజూచి. ౯౦

లక్ష్మణుఁడు సముద్రుని బ్రార్థించుట.

మ. తటినీవల్లభ రామకార్యమిది సం ♦ స్తంభించుమీతోయమి
చ్చట నీ వానరసేన దాటిచనఁగా ♦ సన్మార్గసంధాతవై
త్రుటితారాతిరఘూత్తముండు త్రిజగ ♦ ద్ద్రోహిన్ నిశాటున్ మదో
త్కటుఁ జెండాడఁగ లంక కేగవలె వి ♦ ఘ్నంబిందుఁ గావించకన్.

మ. అనిసౌమిత్రి స్థితిఁ జెప్పినన్ వినక య ♦ య్యంభోధి యుత్తుంగభం
గనినాదంబు దిగంతరంబులఁ జెలం ♦ గన్ సాట్టహాసేద్ధభం

గి నవోన్మీలితఫేనిలంబగుచు నింగిన్ రాయుచున్ బొంగఁగ
న్గాని సౌమిత్రి తదీయగర్వమునకున్ ♦ గ్రోధంబు పెల్లుబ్బఁగన్.

### ల క్ష్మ ణు ని సం రం భ ము.

మ. కురుకుల్ గట్టుచు విస్ఫులింగములుద్య ♦ త్కోణంబులన్ గ్రుమ్మరిం
ప రటద్భీషణదంతఘర్షణనద ♦ ద్భ్రూభ్రూకుటిక్షేప భీ
కరవక్త్రంబున రోమకూపములను ♦ గ్రజ్వాలికల్ వెల్వడన్
గురురౌద్రోద్ధతమూర్తియై జలధిలోఁ ♦ గుప్పించి వేదూఁకినన్. ౫౩

శా. ఆరౌద్రాకృతి బాడబానలసమా ♦ ప్రాభీలమై సోకినన్
పారావారము నాచుగుల్లలును జి ♦ ప్పల్ బైల్పడన్ భూరివాః
పూరంబింకఁగ దుమ్ము కుప్పయగుచున్ ♦ బొల్పేదినన్ గందుయా
దోరావంబులతోడ నిర్ఝర సము ♦ త్క్రోశంబు సంధిల్లినన్. ౫౪

శా. ఆకంపించె సమస్తలోకములు భూ ♦ తాక్రోశముల్ మించెన
స్తోకస్వస్త్యయనత్రయీముఖరులై ♦ చన్ దాపసుల్ మ్రొక్కి రా
లోకక్షోభము సూచి రాముఁడు కృపా ♦ ళుండై సుమిత్రాసుతున్
జోకన్ శాంతునిఁ జేసి యిట్లు తగదం ♦ చున్ జెప్పి వారించుచున్.

### రా ముఁ డు ల క్ష్మ ణు ని న ను న యిం చు ట.

శా. అన్నా లక్ష్మణ యిట్లు జేయఁదగున ♦ య్యా లెమ్ము లోకమ్ములా
పన్నత్వంబునగుం దెవార్ధినడఁకిం ♦ పన్ జెల్లునే యింకనా
కన్నీళ్లన్ వసుధాత్మజావిరహజో ♦ త్కృష్టోప పన్నంబులన్
మున్నీటిన్ మును పెట్టినట్లు మరలన్ ♦ బూరింతునంచున్ వెసన్.

శా. భూపుత్రీవిరహోష్మకప్రతిపదా ♦ పూర్ణాశ్రువర్షంబునన్
భూపాలాగ్రణియంబురాశిమరలన్ ♦ బూరించినన్ సమ్మదా
లాపంబుల్ గదురన్ నిలింపతతు లు ♦ ల్లాసంబునన్ మెచ్చుచున్
బై పైపూవులవానలన్ గురిసిరం ♦ తన్ లోకముల్ రంజిలెన్. ౫౭

శా. కౌసల్యాసుతుసుప్రసాదమునకున్ ♦ గాఢానుమోదంబుతో
నాసంద్రంబుగృహీతమూర్తియగుచున్ ♦ హర్షంబుతో భక్తి వి
న్యాసంబొప్పఁగవచ్చి పెక్కుగతులన్ ♦ సంస్తోత్రముల్ జేయనా
శ్వాసించెన్ రఘువీరమౌళివినమ ♦ త్సౌలభ్యభావంబునన్. ౫౮

సరసాంకవృత్తము.

అలవార్ధిచేనభిహితం ♦ బగురీతినందున్
బలుశైలపఙ్క్తిరచియిం ♦ పఁగఁజేసికట్టన్
దులలేనిసేనలనుసే ♦ తువుమీఁదదాటన్
గలయట్లొనర్చిచనె లం ♦ కకు రాముఁడంతన్. ౫౯

మదాలసావృత్తము.

శ్రీరాముఁడంతకపి ♦ సేనాసమేతముగ ♦ సింధుందరించియవలన్
జేరెన్ద్రికూటనగ♦సీమాంతరీప పరి♦జృంభన్నిశాచరపురిన్ [భూ
గ్రూరాస్త్రశస్త్రబహు♦ ఘోరాగ్నిశిఖలరిపు♦ కోటిన్దహించిదితి
వీరాగ్రయాయియన♦వెగ్గొందురావణుని♦విక్రాంతిఁదీర దునిమెన్.

మ. తనయామాత్యసహోదరాన్వితముగా ♦ దర్పోజ్జ్వలున్ గైకసీ
తనయున్ ఘోరరణంబునన్ దునిమి సీ ♦ తాకాంతఁదాఁగ్రమ్మరన్
గొనుచున్ బుష్పకమెక్కి తమ్ముఁడుఁగపుల్ ♦ గొల్వన్ రఘూత్తంసుఁడిం
పొనరన్ గూడియయోధ్యకుంజనియె న♦త్యుత్సాహ సంయుక్తుఁడై.

శా. సుగ్రీవాంగదమారుతాత్మజకపి ♦ స్తోమంబుదంచజ్జయో
దగ్రస్ఫూర్తిఁ గెలంకులన్ గొలువ ♦ దైత్యశ్రేశిత్రోభక్తిన
వ్యగ్రుండైన విభీషణుండుప్రియభా ♦ వన్ బొప్పసేవింప స
మ్యగ్రాజ్యాభిహితాభిషేకవిభవం ♦ బంగీకరించెన్ దగన్. ౬౨

ఉ. భ్రాతలమాతలన్ హితుని ♦ బాంధవులన్ బరిచారికాశ్రిత
వ్రాతములన్ బ్రధానసచి ♦ వప్రకరప్రకృతిప్రకాండమున్

ప్రీతులఁ జేయుచున్ గుణ గ ♦ రిష్ఠత జాలఁ బొగడ్తకెక్కఁగా
నాతతకీర్తి రాముఁడు బు ♦ ధాభినుతస్థితిఁ జేసె రాజ్యమున్. ౬౩

ఉ. రాముఁడు రాజ్యపీఠము తి ♦ రంబుగ నెక్కెను లోకరంజన
శ్రీ మెరయంగ సార్థకము ♦ జెందెను రాజపదంబు సమ్మద
స్థేమములయ్యె భూతముల ♦ చిత్తము లెల్లనసీతిక్రమో
ద్దామనసీతికాభ్యుదయ ♦ దర్పితమయ్యె జగంబు నిచ్చలున్. ౬౪

చ. దివమున దేవదుందుభులు ♦ దీర్ఘగతిం మెరయంగఁ జొచ్చె ను
త్సవముగఁ బుష్పవృష్టి వసు ♦ ధన్ గురిసెన్ నెలమూఁడు వానలై
భువి బహుభంగి సస్యపరి ♦ పూర్ణముగా నిరవొందె ధర్మమున్
ప్రబలితతవృద్ధిఁ గాంచెఁ బ్రజ ♦ భద్రసమృద్ధి నెలర్చె నెంతయున్. ౬౫

వ. ఇవ్విధంబున జగదానందంబుగా రఘునందనుండు సంప్రాప్తరాజ్య
వైభవుండై విలసిల్లుచున్న యవసరంబున. ౬౬

వ సం త ర్తు వ ర్ణ న ము.

చ. అలరె వసంతముజ్జ్వల ల ♦ తాంతపరాగ నితాంత సౌరభా
కలిత దిగంత మంచిత పి ♦ క ప్రకరస్ఫుట పంచమస్వరా
వళిత మరందపానమద ♦ బంభరగాన లతాంతకుంత సం
కులగుణరావతాంతహరి ♦ కుంఠితపాంథహృదంతమయ్యెడన్. ౬౭

తే. అలఘుమాధవసుప్రసా ♦ దాతిశయము
వలనభూజనులకు రాగ ♦ కలనమించె
నలఘుమాధవసుప్రసా ♦ దాతిశయము
వలనభూజనులకు రాగ ♦ మొలయకున్నె. ౬౮

మ. వనలక్ష్మీసతి మాధవాగమనమున్ ♦ వాంచించి జీర్ణచ్ఛదా
పనయింబున్ బొనరించి భాసురకుసుం ♦ భ ప్రాంశునై పథ్యనూ

తనపత్త్రాంకితమైన వోత్కలికసం ♦ దర్భప్రభూతానురా
గనిరూఢస్థితిఁబొల్చెనట్లయగుఁగాఁ ♦ గాదతల్ బత్తిఁ జేరగన్.

మ. నగపఙ్క్తిన్ దులకించెనయ్యెడ నమం ♦ దప్రాంచితారుణ్యభా
లగదత్యుజ్జ్వలధాతుకందళులు మొ ♦ ల్లంబై సెలంగన్ గనుల్
మగరామొగ్గల గుత్తులున్ దనరె ♦ వేల్లత్కోరకవ్రాతముల్
పొగడొందెన్ నవమాత్తికప్రతతిమై ♦ పొంకంబుగా నంతటన్.

మ. బలమాశైశిరవార్ధికాప్తిఘటియిం ♦ పన్ బాడి చెల్లిల్ల నా
కుల పాటొంది యపాస్తశోభలగుచున్ ♦ గోడొందఁగామాధవుం
డులవిన్ జైత్రరసాయనంబొసఁగ నెం ♦ దున్ గ్రొంజివుళ్లెత్తి యు
జ్జ్వలమయ్యెన్ నవయౌవనంబునుమన ♦ స్సంభూతికిన్ హేతువై.

చ. అలఘువసంతదైవత స ♦ మంచదనుగ్రహలబ్ధిగల్గఁగా
నొలసినపండుటాకుగము ♦ లూడ్చినవారుణపల్లవాప్తిపెం
పలరెఁగుజంబులెల్లనటు ♦ లాగదదైవనియుక్తిసౌఖ్యముల్
దొలఁగిసమగ్రసంపదులు ♦ దూకొను వేళలగల్గుచందముల్. ౨౨

కవిరాజవిరాజితము.

విలసితచైత్రనృపాలసమాగమ ♦ వేళననేహభటుండువనీ
తలమునలంకృతమున్ ఘటియించఁగ ♦ దాగ్గొనిపాండుర పత్త్ర తతిన్
దొలచినవారుణపల్లవపఙ్క్తుల ♦ దోరణముల్ రచియించి సుమా
కవితవితానము నెత్తి మధుద్రవ ♦ కాండముజల్లె మనోజ్ఞగతిన్. ౨౩

చ. ఘనతరులాటచేసనువు ♦ గా సుమనోభ్యుదయంబుదార్కొనన్
మొనసినయన్యసప్రియ స ♦ మూహము మెచ్చఁగవిందుసల్పినన్
సనయమనీషదీవనలొ ♦ సంగెడు దంచితసామగానభం
గినలరుసుస్వరంబులెస ♦ గించుచుఁదద్ద్విజపాళిపల్కరున్. ౨౪

తే. తమకు జాతప్రకారమం ♦ తయును దెలుపఁ
బూనిచండాలునకుసీధు ♦ పానమొసఁగ
నంటుకొనియె బరాగపం ♦ కావిలత్వ
మలఘుగంధవిజృంభణ ♦ మలమికొనఁగ. ౨౫

తే. ఆశుకవివాక్యసరసవి ♦ హారమెఱిగి
కామితఫలంబుల నొసంగి ♦ గౌరవించె
కల్పితసుమనః ప్రచార వి ♦ ఖ్యాతిగనిన
ఘనతరులచందమనయ ని ♦ క్కరణిగాదె. ౨౬

తే. విపులమైతోఁచు పల్లవో ♦ ద్వృత్తికలన
నలరె ననురాగలక్ష్మిల ♦ తాంగులందు
పుష్పవతులైన గణికల ♦ పొలుపుగాంచి
కోరకిత గాత్రపున్నాగ ♦ కోటిసెలఁగె. ౨౭

చ. అనువగువేళఁబుష్పవతు ♦ లైన లతాంగులఁ గౌతుకంబుతో
నెనసిన దద్రజోభరస ♦ మృద్ధి నిజోల్లసనంబుమాన్పగా
ననిచినతృష్ణదద్రసమ ♦ నాగుపసేవనయుక్తిఁబూనినం
దు ననుమవీమసత్వము మ ♦ ధువ్రతకోటికిఁగల్గెనెప్పుడున్. ౨౮

తే. నిరతనాదానుసంధాన ♦ నిష్టతోడ
నాకులనుమెక్కుడువనప్రి ♦ యద్విజులకు
చిరముగాఁబల్లవైకని ♦ సేవనమునఁ
గనులరాగాంధకారంబుఁ ♦ గలుగజొచ్చె. ౨౯

చ. గొనబలరారునామము పువు ♦ గుత్తులపేరినిపానశాలలన్
వనమునఁబంచసాయకుఁడ ♦ వారిగఁదాఁ దెరపించె విప్రయో
గినికరజైత్రయాత్రనో ♦ గిన్ జనుచోనెలదేటిబంట్లకున్
దనివుగగ్రోలఁగామఘువి ♦ డన్ దగఁగట్టడచేసెనోయనన్. ౩౦

చ. అనువుగనుల్లసిల్లెడు ల • తాంగులు తేఁజివురాకుజీవుమల్
గొనబుగ వ్రేలు కొంబయిట • కొంగులుగాఁగఁ బ్రసూనమంజరీ
స్తనవిభవంబునన్ గొమరు • చందముసూప మనుత్కిశోరకుం
డనయము డాసియల్లగిలు • బాడగఁజొచ్చె రసాను షక్తుఁడై. ౮౭

సీ. విస్ఫురద్రాగసం • లసమానకిసలయ
గ్రసన వ్యసన కల • కంఠకులము
విగళన్మధూళికా • వికచప్రసూన బం
ధురరసాసక్త బం • భరచయంబు
పరితశ్శలాటు చ • ర్వణకల్పితకషాయ
కంఠరణచ్చారి • కాస్రకాండ
మాపక్వఫలచంచు • హతినిర్యదమృత ర
సగ్రసిష్ణుస్వన • చ్ఛోకనికర

గీ. మనవరత సంపతత్సరా • గాను వేల
సౌరభగ్రహయాళుస • చ్ఛందనాని
లప్రచారంబుగాసము • ల్లసనమొందె
భాసురములైన మధుమాస • వాసరములు. ౮౮

సీతారాముల యుద్యానవనవిహారము.

మ. జగదానందకరప్రచారమగుచున్ • క్షైత్రంబు రాజిల్లఁగా
జగతీనాథుఁడు రామచంద్రుఁడవనీ • సామ్రాజ్య సంస్థాయియై
మిగులన్ భూమిజనానురాగమహిమో • న్మేషంబుఁగల్పించుచున్
మిఁగిలెన్ భూమిజనానురాగమహిమో • న్మేషంబునిక్కంబుగన్. ౮౯

వ. అప్పుడు. ౯౦

తే. అవనిజాతానురాగ దా • యకము గాఁగఁ
బ్రబలుచుండెను సమయ సౌ • భాగ్యమరసి

ఆనని జాతానురాగ దా ♦ యకుఁడతండు
మెచ్చియారామ కేళికి ♦ నిచ్చగించె. ౮౫

మ. జగతీపుత్రిక చేటికాశతము ప ♦ జ్జన్ గొల్చిరానప్సరో
పగతేంద్రాణి విధంబునన్ ముదమొన ♦ ర్పన్ నర్మవాక్యంబులొ
ప్పఁగ దుర్ ప్రేముడివామభాగమున రా ♦ వాస్తోష్పతిప్రాభవుం
డగు శ్రీరామవిభుండువచ్చెను పవ ♦ న్యాలోకనోత్కంఠతన్.

కం. ఆ గా మరమ ముదంబున
నా రామ రమాభిగమ మ ♦ హఃకలనకుఁదా
గారవమునఁ బ్రత్యుద్గత
గౌరవమునఁగీరరుతిద ♦ గన్ మేలడిగెన్. ౮౭

తే. సుందమారుతగళిత కు ♦ ట్మల కదంబ
మర్ఘ్యముగనిచ్చిసుమరసా ♦ యత్తసమద
మధుకరారావకలన సే ♦ మంబు నడిగె
ఘనతరులఁబేరుఁగనుపవ ♦ వనము నృపుని. ౮౮

కం. భూనరుఁడప్పుడు వసుధా
భావనరుహాలోచనా ప్ర ♦ మోదకరుండై
పావనమై విలసిల్లెడు
నావనసౌభాగ్యమిట్టు ♦ లభినుతిచేసెన్. ౮౯

మ. చెలియా కంటివె? భూమిజాతవగు నీ ♦ సేమంబు భూజాతముల్
కలకంఠార్భటి వేడుచున్ భ్రమరప ♦ క్షక్షేపణాక్షేప ని
గ్గాడభ్యస్తలతకోరకప్రకర ము ♦ క్తారత్నసంతానమున్
గలయంగానుక వెట్టు నిట్టివ యగున్ ♦ గా సోదరస్నేహముల్.

చ. వెనుకొను తేఁటిదాటుబలు ♦ వేనలిరాజిలఁ బూవుగుత్తులన్
చనుఁగవ లేత కెంజివురు ♦ చాయపయంటను మాటువెట్టుచున్

బనిగొని చొక్కపుఁ జిలుక • పల్కులఁ బిల్చునవారుణాంగు
దళకలనంబునన్ బొగడ • తన్వి రొ నిన్నటుసూడు మేర్పడన్. ౬౧

శా. చెన్నౌగుబ్బ గుళుచ్ఛముల్ దడబడన్ • జెంగావిపత్రాంగుళుల్
చిన్నెల్ సూపగ రాగకందళులు రా • జిల్లన్ ద్విరేఫచ్ఛవిన్
విన్నాణంబలరారు వేనలికడున్ • వీడన్ లతాంగిన్ దగన్
బున్నాగంబు కవుంగిటన్ జొనిపెఁ బూ • బోణీ విలోకించితే.

తే. కిసలయాంగుళములఁ గవు • గింటఁ జొనిపి
వలపెరింగించి తనకుఁ గై • వసముచేసి
కొనియెగద రంభ తపసిని • తనదు పేర్మి
నుచితమిదిగద చూచితే • రుచిరగాత్రి. ౬౩

తే. ఎలమిదయివార నొకవింత • వలపు నెరపి
లలితరాగాంకురముల వి • లాస మెసఁగ
నవలతాంగక కలిత వి • న్యాసమలర
గణికజటిమీఁది కెగఁబ్రాకెఁ • గాంచుమతివ. ౬౪

ఉ. చీకటిమ్రానిలేజివురు • జీవురుఁ గ్రొమ్మొయిలంచు దానిపై
గూకలువెట్టు క్రొంబొగరు • కోయిలకూతలు గర్జితంబులం
జొకడపూవుజొంపములు • దంచిత చంచలలంచు నెంచి సు
మ్మిక్కరణిం జెలంగి నటి • యించు శిఖావళమంబుజాననా. ౬౫

ఉ. పొంకముసూపుపై దలుల • పొక్కిలితో బురణించు పూప్రలున్
బింకపుగుబ్బచన్నుఁగవ • బిత్తరముం దలపించు కాయలున్
సొంకవగంధిమే వలపు • సాటికి దీటగు కమ్మతావులున్
బంకజనేత్రి పొన్నకు గ • నంబడె జైత్రరమానురూపతన్. ౬౬

తే. బండిగురువింద యద్దెమాడు • పరువమైన
వలపుదయివారగాఁ బుష్ప • వతి యగుటను

నిండు ప్రేముడి తోఁ గయి ♦ దండఁదాల్చె
నల్లపున్నాగమదియుక్త ♦ మానకాదె. ౯౭

తే. సన్నవిరజాజితీవియ ♦ సరసనున్న
యల్లమ్ముంత్ల నారింజపైఁ ♦ నలమికొనియె
సతులు లతలును వసుమతీ ♦ పతులుదమ స
మీపగతుల నొగయికొండ్రు ♦ మేలరయక. ౯౮

మ. రుచిరామోదవశంవదాత్మమగుచున్ ♦ రోలంబమీ మల్లికా
నిచయోపాంతము వీడ దన్యకుసుమ ♦ స్నేహంబుఁ బాటింప ది
ట్లుచితంబే కద యెందు దంపతుల క ♦ న్యోన్యానురాగంబు గా
ఢచరంబై తగు నేని యన్యులను గం ♦ టన్ జూతురే యెన్నఁడున్.

తే. సకలభూజానురాగంబు ♦ సంతరించు
చైత్రమామోదకారిగాఁ ♦ జాలదయ్యె
జాతికిట్టిద కదసాధు ♦ చరితు చంద
మొక్కకులపాంసనునిమది ♦ కెక్కకునికి. ౧౦౦

చ. చిటవగునూడలున్ జడలు ♦ ద్రెక్కనిపాదములంట్ర వేలఁగా
జటిపటలంబు బల్లపము ♦ సైరణసేయఁగఁ దారసించి ముం
దట వనపల్లవాంగుళి ♦ వి ♦ ధాన సముల్లసనంబుమీరఁగా
నటనమునల్పునీగణిక ♦ నాతిరొ విఘ్న విధాయికై వడిన్. ౧౦౧

శా. రాగంబున్ సుమనోత్పత్తిలోఁ గొనిన యీ ♦ బ్రహ్మణ్యవర్గంబు వీ
తాగంబై యుపరాగతాధికముగా ♦ నభ్యున్నతిన్ గాంచియున్
పాగుద్దిష్టఫలాప్తిఁ గాంచె నిదె యం ♦ బష్టాభిమోగంబు ని
ల్గాఁగాదే! చ్యుతమోగులౌనరుల దు♦ష్ప్రారంభముల్ సూడఁగన్

చ. కలికిరొ చూచితే యిచటఁ ♦ గొర్కనునీయెలమావిజీబు లో
పల కలకంఠమంచితర ♦ వంబున గానము సేయుచంద మ

వ్యాలపులరాచవాఁడఖిల • పాంథజిగీషఁ గడంగి దండు రాఁ
గలఁడని పల్మరుల్ విజయ • కాహళ మ్రోయఁగఁ జేయునట్లగున్.

శా. కంకేళిన్ దిలకించు మీ వనరమా • కమ్రాస్య కాశ్మీర ప
త్రాంకంబో! యన బుష్పగుచ్ఛమిరవొం • దన్ దోఁచుచూ దేనెకా
వంకం ద్రిమ్మరు తేఁటికూటువలు త • త్ఫాలాగ్రనృత్యక్రియా
లంకారాయితచూర్ణకుంతల సము • ల్లాసంబుఁ గల్పించెడున్.

వసంతతిలక.

నాసంతికా కుసుమ ని • ర్భరసౌరభ శ్రీ
వ్యాసంగమై మధుపమ • న్య సుమంబులన్ జా
తాసక్తిగాదధికమా • నదిలభ్యమానే
నాసించునే విరసమా • నదియెవ్వఁడేనిన్. ౧౦౫

తరల.

కలికిసూచితె మాధవీలత • కమ్మక్రొవ్విరితేనెలన్
గలయఁగ్రోలి యలి ప్రకాండ మ • కాండకౌతుక విభ్రమం
బాలయఁ జుమ్మని పాటఁబాడుచు • నొద్దకేగెడుఁబాంథులన్
గెలువవచ్చెడు వీరపాణ వి • కీర్ణదర్పకసేనయై. ౧౦౬

ఇంద్రవజ్రము.

మాకంద వృక్షంబిందె • మాధురీణా
స్తోకాత్మదీవ్యత్ఫల • శోభయెల్లన్
జేకూర్చెఁదాసద్విజ • సేవకై యి
ట్లేకాదొకోనత్తరు • లీడ్యులౌటల్. ౧౦౭

మందాక్రాంతము.

ఎందున్ బృందావనరమకు రా • ణించుతేగుబ్బ చన్దో
యందంబుల్ దాలి కుచఫలమి • క్లొటచేఁ జుమ్ము తన్వీ

చెందుఁ గీర్తిఁ ఘనతరులకుఁ ♦ జేతికిఁ గాన్కలై పెం
పొందఁ గల్గెఁ ఫలసమితిలోఁ ♦ బూజ్యతాగౌరవంబుఁ. ౧౦౮

మత్తకోకిల.

మత్తకోకిలఁ జూడుమీ రొల ♦ మావిక్రొంజివురానుచుఁ
గుత్తుకం గనపెక్కి యల్లనఁ ♦ గూయు ప్రేయసిఁ పజ్జకుఁ
హత్తి రెక్కలనార్చి బుజ్జవ ♦ మాడినన్ గయికోదహా
మత్తకాశినులెందు భర్తల ♦ మన్ననన్ దలపోతురే. ౧౦౯

భ్రమరవిలసితము.

పూవుఁ దేనెఁ ♦ బుటపుటనగుచుఁ
తీవిం గ్రోవుం ♦ డినగతి మొరయుఁ
బ్రావీణ్యంబౌ ♦ భ్రమరవిలసితం
బేవేళం డా ♦ హితముగ వెలయుఁ. ౧౧౦

కుసుమవిచిత్రము.

కులికెడుఁ జాలన్ ♦ గుసుమవిచిత్రం
బలరఁగఁ జూడం ♦ బతి లలితంబై
కలికిరొ తావుల్ ♦ గడకొనమిగులన్
జలరుహబాణో ♦ జ్వలరథమగుచుఁ. ౧౧౧

మత్తకీరము.

అతివ కనుమదెపొన్న చెంగట ♦ హసానుమీ రెడు దాడి మీ
లతిక వికసిత పుష్పగూఢ పి ♦ లాసమై చెలి పైటలోఁ
గుతుక మొసఁగెడు గబ్బిగుబ్బనఁ ♦ గుల్కు పండు నఖాహతిన్
మత కరితనముతోడ నొత్తెడు ♦ మత్తకీర సువృత్తముఁ. ౧౧౨

పాలాశదళము.

ఒదవిచిరుకరువలి స ♦ ముచితగతిఁ దాయఁ
గదలి యభినయవిధము ♦ గను జలితమౌచుఁ

మ్మదుల నటనము నలుప ♦ మెలఁగగను పాలా
శదళ మిడివెలవెలఁది♦సరసి ననువొందన్. ౧౧౩

చ. అనుచున్ జెప్పుచు నుర్వరాతనయతో ♦ నానందమొప్పారఁగా
జనలోకాగ్రణియల్లగ్రుమ్మర వయ ♦ స్యాపాళి కౌతూహలం
బానరన్ గుంపులుగట్టి పుష్పహారణో ♦ ద్యోగంబునన్ జొచ్చి ర
వ్వని నాదంపతులాదరాంచిత మనో ♦ వ్యాపారులై చూడఁగన్.

మ. కలికీ యల్లదె యందుకోగదవె యీ ♦ కంకేళి పూఁగొమ్మనా
నెలమిన్ గై బయికెత్తి నిక్కుచనుదో ♦ యీక్షించి పూబంతి యం
చలి జుంజుమ్మనిచూచుకాగ్రమును డా ♦ యన్ భీతయైచంగునన్
దొలఁగన్ దాటినఁ గేకిసల్ గొనుచు నిం♦తుల్ నవ్విరొక్కుమ్మడిన్.

మ. అనుఁగున్ గత్తియ వేడగాఁ గురువకం ♦ బందించఁ గేలెత్తి నం
దున బయ్యంట యొకింత పీడి తొలఁగన్ ♦ దోర్మూలకూలంకష
స్తనభారంబునకున్ వడంకి తరువున్ ♦ సందింటఁ గై కొన్నగ్రొ
న్ననలున్ బూవులు చిత్తవిత్తుగను డా ♦ నన్ దోచె నగ్రంబుగన్.

తే. కొమ్మయొక్కతె పాటలి ♦ కొమ్మచివురు
జొంపమునఁ బూవుఁగోయఁ గే ♦ ల్జొనిపి వ్రేలి
కొనయె మొగ్గని చిదుమబోఁ ♦ గనిన చెలియ
గమిగ కాపిక నగియె న ♦ క్కలికి యులుక. ౧౧౪

తే. జలుఁగు వెన్నెల మొలవగాఁ ♦ జెలియ నవ్వ
మవ్వపుంబొన్నగున్నపై ♦ మలసెననఁగ
ననఁగ పెనఁగెగ్రొవ్విరిపూవు ♦ లన్నగము న
గములుగావచ్చి నెచ్చెలుల్ ♦ గనుఁగొనంగ. ౧౧౫

ద్విరదగతిరగడ.

1. కలికిరో చూడు చ ♦ క్కని పొన్నగున్నలను
పొలుపమిారెడునట్టి ♦ పూఁగొమ్మ చెన్నులను

2. గిలుబాడు నెలదేఁటి ♦ క్రేవనోక సమదాళి
మెలఁగెడుఁగనుంగొనుము ♦ మిక్కుటంబగుబాళి

3. కన్నెవిరజాజులను ♦ గ్రమ్మక్రొవ్విరితావి
మిన్నులను ముట్టెడిగు ♦ మిక్కుటంబగుఠీవి

4. చెలియ యీ యెలమావి ♦ చెంతమల్లియ తీవె
చెలువు చెంగటియున్న ♦ చెన్నుఁ దెల్పెడు సూవె

5. తలిరుఁబ్రేళ్లుఁ గదల్చి ♦ తన్వి యీ వకుళంబు
పిలుచుచున్నది నిన్ను ♦ వెడలుమటు వైళంబు

6. తన్నితి వశోకమును ♦ తరుణి నీకోపంబు
వన్నెఁదెచ్చెఁగదే ప్ర ♦ వాళ పుష్పచయంబు

7. కన్నెత్తి చూడవే ♦ కలికి యీ తిలకంబుఁ
గన్నపుష్పసమృద్ధి ♦ కల్యాణ ఫలకంబు

8. విరులుఁజిదుమఁగఁ గంటి ♦ వేనఖోల్లసనంబు
తరుగ నీయదు నవో ♦ త్కలికా విలాసంబు

9. తలిరు గుత్తులచెంతఁ ♦ దగునీకరాంగుళులు
కలికి కోయిలపిండు ♦ గని మ్రింగుఁ గ్రుక్కిళులు

10 విరజాజి పూఁబొదలు ♦ వెలయు నీతుమ్మెదలు
విరిదేనెలానికా ♦ వించు నబ్రపు రొదలు

11. గోరంటచివురు మి ♦ క్కుటఁపు గోరువారంబు
గోరంటఁదివురునె ♦ క్కువరాగరుచిరంబు

12. పొగడపై నుమిసితివి ♦ పొలఁతి క్రొవ్విరి చాలు
పొగడఁదగె మిక్కుటఁపు ♦ పొల్పునొందెడు మేలు

13. చెలి నీదుపలుకు మ ♦ చ్చికె సింధువారంబు
చెలిపెడు బ్రవాళరుచి ♦ దృఢరాగ భారంబు

14. పడఁతిరో యీబిల్వ • ఫలములఁ గనుంగొనఁగఁ
దడఁబడెదు తావక • స్తనభరముతోఁ బెనఁగఁ
15. జెలివొండపండనుచుఁ • జేరె నీ కెమ్మోవి
చిలుక చక్కెరపల్కు • చేఁబ్రోవు మీఁదవి. ౧౧౯

తే. అనుచు నిట్లు సమాపచ • యంబు నాచ
రించి జానకి చెలికత్తె • లేగుదేర
సంతవారలతోఁ గూడ • సంబుకేళిఁ
గోరి కాసారతీరంబు • సేరుటయును. ౧౨౦

సీ. దళితారవింద వ • దనబింబయును లస
చ్ఛైవాలవేణిసం • భావితయును
వలమానశఫరికా • విలసితాలోకయు
సురుచిరకంబుకం • ధరమహితయుఁ
బరిచితచక్రవీ • వర పయోధరయును
హల్లకదళకోమ • లాధరయును
లాలితనవ్యమృ • ణాళబాహాయు చంచ
దావర్తపటునాభి • కావివరయు

గీ. కలితసుతరంగవళియు సై • కత నితంబ
బింబయును సౌసరోలక్ష్మి • విచలదళిక
దంబ దృఙ్మాలికల నాయ • రంబు మెరయ
నమ్మృగీలోచనలకుఁ బ్రి • యంబు నెరపె. ౧౨౧

మ. కలహంసార్భటి మేలురాకడిగి వే • డ్కన్ జక్రవాకచ్ఛదా
నిలచంచద్దళితాబ్జకోశపటలో • న్మీలత్పరాగాంక సం
కులలోలంబ కదంబకై తవమునన్ • గ్రొమ్మించు కస్తూరికా
గుళికల్ కానుకవెట్టి స్వాగతమొదం • గూర్చెన్ గొలన్ వారికిన్.

జలక్రీడాభివర్ణనము.

తే. అప్పుడిందీవరాక్షు ల • య్యవని తనయ
మెచ్చవలిపెంపుపావడల్ • మేనఁదాల్చి
కొలనుసొచ్చిహాళాహాళి • గులుకవారి
కేళిఁదేలిరిసంతోష • లీలమెరయ. ౧౭౩

చ. వెలకిలనీదునొక్కయర • విందవిలోచనసిబ్బెఁపుబ్బు గు
బ్బలు తెలిదమ్మి మొగ్గలని • పైకొని జక్కవ గిబ్బముక్కునన్
గిలుబఁగఁ ద్రుళ్లిపట్టుకొనఁ • గేలుఁ జెమల్చినఁ దమ్మిపూవటం
చలమఁగఁజూచితోడిచెలు • లబ్రముతోఁ గని నవ్విరందరున్.

చ. లలనలుతమ్మిపూగుబురు • లన్ జెరలాడుచుఁ గేలుసాపఁగా
నలరునఁబాల్పుతూఁడనుచు • సంచగసించఁగఁదారసించి యా
చెలిగహియింపఁ గేంకృతులు • సేయఁగఁ గేవలన్రరుశత్తి లో
నలమినభీతిఁగూయుకల • హంసలఁజూపిరి చేడెలందరున్. ౧౭౫

తే. తరుణియొక్తరుపొందమ్మి • దళము తెచ్చి
సరవి నవతంసకంబుగా • సంఘటించి
లేఁతజాబిల్లిరేకఁదా • ల్చిన యివంపు
గట్టుమాతురవైతిని • క్కముగననియె. ౧౭౬

చ. అలరుమృణాళనాళముల • నల్లెగ నల్లనినాచుఁగూర్చి యా
విలుసుదఁ జెల్లదమ్మి సర • విన్ సవరించిదె కాచుకొమ్మఁకన్
వలపులఁకేని క్రొమ్ములికి • వచ్చెడునంచని మెచ్చరించు ను
గ్మలిపయిఁ దోడినెచ్చెలులు • గ్రక్కునవైచిరి తమ్మిపూవులన్.

కం. చెలులిట్లు జలవిహారము
సలుపఁగఁగౌతుకముమెరయ • జనకతనయయున్
గొలనికిఁ డిగె శ్రీరామాం
గుళిపల్లవమొకఁటియూఁతఁ • గొనిమాతనితోన్. ౧౭౮

కం. సీతారాములుకేళిని
రీతిఁ బ్రవేశింపఁ జంచ • రీక ధ్వనిచేఁ
బ్రీతిఁగుశలమడిగె సరసు
లై తగుపూరి తెరఁగిట్టి • డాఁగదరుందుర్. ౧౨౯

శా. కంటేయల్లదె మచ్చ కంటియచటన్ • గంజాతకోశంబుపైఁ
గంటే దాంటరిచక్రవాకముముకున్ • గాట్లంబచారించ నో
క్కంటన్ దోఁచెడు పల్లవుండు తమివాం• గన్ గొంగిటన్ దార్చి వా
ల్గంటే గుత్తఁపుగుబ్బపైనఖము రే • ఖల్ నిల్పినట్లైతగన్. ౧౩౦

మ. రమణీలోకశిఖామణీ! కనుమదే • రాయంచ చంచూపుటా
గ్రమునన్ బాలమృణాళ నాళమిరవా • రం దెచ్చి గాటంపు నె
య్యమునన్ హంసికకియ్యమార్గ్గమునఁ జే•యన్ రెక్కపై దార్చి ప్రీతి
య్యముగావించెడుఁగామినీజితుల చ• ర్యల్ చూడఁదనట్లాగదా. ౧౩౧

చ. అతివరొ చూడుమీ వికసి • తాంబుజషండమునందు నాగళ
స్థితివిహరించుసీముగుద • చేడియముద్దుమొగంబునై రసం
గతివిడనాడితమ్ములకు • గాదిలియైకొలిపించుకాంచు స
మ్మతిగను జంద్రమండలము • మాడ్కిఁదలంపున కామతించెడున్.

ఉ. ఓలలుపాడుచున్ సలిల • మొయ్యనఁజల్లుచుఁ జెల్మికత్తియల్
లీలఁజెలంగుచోఁ గనబ • డన్ గలశాంబుధి పెందెరన్ దెరన్
హాళిమెయిన్ బయల్వెడలి • యచ్చరలిచ్చఁదలిర్పఁగొల్వఁగా
గ్రాలెడుకల్మితోయ్యలి తె • రంగునఁగానఁగనౌదువీవిటన్. ౧౩౩

ఇందుకరానుషక్తివిక • సించిన కేకులు ప్రొద్దుతాకునన్
గుందిమొగుడ్పఁ జొచ్చినఁ జొ • కారపుతేనియఁద్రావఁజొచ్చునిం
దిందిరపాళి వేబయలు • దేరఁబరాగమువీపు పచ్చనం
దొందిన గ్రొత్తచందమగు • నుత్పలమాలికఁగంటివేచెలీ. ౧౩౪

వ. అని చెప్పుచు సలిలకేళీవిలాసం బంగీకరించి. ౧౩౫

చ. హాళిహాళి రామచంద్రుఁడు శ ♦ యంబులనంబువుఁ జిమ్మసేకరం
బులునలిము త్తైవుఁ దెరల ♦ ఫోలికజానకి కప్పుఁగొప్పుపై
నిలిచితొరంగుటాప్పెఁగమ ♦ నీయగతిన్ బలుకారుమబ్బుపైఁ
గలఁబడిజారునూత్నకర ♦ కానికరంబురుటంబు దెల్పుచున్. ౧౩౬

కం. రాముని ప్రక్కలఁ గొందరు
కోమలి జనకసుత ప్రక్కఁ ♦ గొందరునైయా
రామామణులు తటాకాం
భోమధ్యమునందు జల్లు ♦ పోరాడిరొగిన్. ౧౩౭

శా. ఓలోలంచని యొక్కనీలకచ నీ ♦ రువ్వెత్తగాఁజల్లఁగా
నాలోలాంబక యొర్తునీరముల నో ♦ య్యన్ గ్రుంకి వేయీఁదియా
నాళీకానన కేలువట్టికొన నా ♦ నమాత్రిస్యమైమున్గి వా
చాలేందిందిర పద్మషండమున దో ♦ చెన్ నవ్విరయ్యందరున్.

చ. చెలియలుపద్మనాళములు ♦ చిమ్మనగ్రోవులుచేసినీరముల్
దులఁదులఁజిమ్మియొండొరుల ♦ తోడుతఁ బన్నిదమాడి తమ్మిపూ
వులు వెసఁగోయఁబోయి మధు ♦ వుల్గొను తుమ్మెదబారు రేగిమో
ములపయి మూగినన్ బెదరి ♦ భూపతిచాటునఁ జేరిరందరున్.

చ. అవనితనూజకేలధవ ♦ శాంబుజమున్ గొనితెచ్చి తద్దళ
ప్రవితతి వేయియున్ రఘు నృ ♦ పాలవరిష్ఠుని మేననద్దియా
నవ్వవసుధామహేంద్రుఁడను ♦ నాఖ్యకుదీటుగ వేయికన్నులి
ట్లువెలసెనంచు నవ్వ నతఁ ♦ డున్ నగికౌఁగిటఁదార్చె మెచ్చునన్.

చ. జలకములాడి యూడిగఁపు ♦ చానలు తోనరుదేఁగొలంకు బై
ల్వెలలితడుల్ వెలార్చి సర ♦ విన్ జలువల్ ధరియించి పూవుబె
త్తులుసిగఁదాల్చి రాముఁడును ♦ డొయ్యలియున్ శశికాంతవేదిపైఁ
గొలువయి రబ్జలోచనలు ♦ గొల్వఁగ లేనలిగాలివీనఁగన్. ౧౪౧

తే. ఒకశనైర్యానభాగము ♦ లోనఁగు చుండ
నొక్కయుచ్చైర్విశ్రితంబ సొం ♦ పొప్పవిసర
నొక్కకించిద్విలగ్న యుం ♦ పొనరఁబాడ
నవనిజారాఘవులుకొలు ♦ వైరివేడ్క. ౧౪౨

సూర్యాస్తమయ చంద్రోదయాద్యభివర్ణనము.

కం. పురుహూతునిసతికాన్కగ
వరుణానికి బంపుమణి సు ♦ వర్ణోజ్వలమౌ
హరివాణమనఁ బ్రతీచికి
నరిగె సవితృమండలము స ♦ మంచితలీలన్. ౧౪౩

కం. అపరాంబురాశి నీటను
దపనరథాశ్వములుబింబి ♦ తస్వాకృతుల
న్యపరామర్శం దుమికెను
నపమున రవిమండలమ్ము ♦ నీరధిఁగ్రుంకెన్. ౧౪౪

మ. సురనాథుండపరాబ్ధిమగ్న దితిభూ ♦ స్తోమంబుమర్దింపఁగాఁ
బరగంజేయు శతఘ్ని కాదహన గ ♦ ర్భస్ఫారగోళంబనన్
జరమాద్రింబడె భానుమండలము త ♦ జ్జ్వాలాకదంబంబనన్
గరమొప్పారెను సాంధ్యరాగముజపా ♦ కంకేళికాశోణమై. ౧౪౫

చ. అలసి పతంగనామధరుఁ ♦ డబ్ధిఁబడన్ గని బంధుబుద్ధిచేఁ
గులమునకెల్లనయ్యెడరు ♦ కూయిడునో యనఁగాఁబతంగముల్
గలకలఁగూయుచున్ బరవఁ ♦ గాఁదొడగెన్ దివినంతబీతిలో
నలమినడాగుమాడ్కిఁగల ♦ యన్ జొరఁబారెఁగులాయసంతతిన్

ఉ. డాసినరాజురాక విను ♦ టన్ గడుపేడుకతోఁ దమస్విని
వాసకసజ్జికామణి న ♦ వంబగు నల్లని పట్టుచీరకై
సేసినమాడ్కి మూసికొనెఁ ♦ జీకటులంతట మల్లెమొగ్గలన్
వాసిగఁగొప్పునన్ దురుము ♦ వైఖరిఁజుక్కలుదోచెనెల్లెడన్. ౧౪౬

కం. కువలయహితప్రచారుం
డవు రాజరుదేరఁగొలువు ♦ నవసరమునకున్
ధవళాంబరమునఁ దగ నె
త్తువితానమనంగఁ దెలివి ♦ దోచెఁ బ్రాచిన్. ౧౪౮

ఉ. సారశుభప్రవృత్తికి ని ♦ శాసతివిష్ణుపదంబు తారకా
వారమనోజ్ఞకుందసుమ ♦ వర్గమునందగఁ బూజచేసి పెం
పారఁగనెత్తుకప్పురఁపు ♦ టారతిపళ్లెరమోయనంగ జం
భారి దిశాగ్రమందొదవె ♦ నైందవమండలమబ్బురంబుగన్. ౧౪౯

చ. సమయశివద్విజోత్తముఁడు ♦ సమ్మతిఁ బ్రాగ్గిరిహస్తపీఠమం
దమరిచి సోమనామక మ ♦ హాస్ఫటికాంచితలింగమందు క్షీ
రమయమహాభిషేకము క ♦ రంబొనరింప జగత్కరండ మం
దమరు పయఃప్రపూరమన ♦ నచ్చఁపువెన్నెలలప్డు పైకొనెన్. ౧౫౦

చ. పరఁగ జగంబునిండుకొని ♦ పాల్కడలింబలె చంద్రికాచ్ఛటల్
తిరమయియుండుగల్గు తెలి ♦ దీవియనం దనరారె నిండుచం
దురుఁడుతదంతరంబునఁ గ ♦ నుంగొనఁగాఁదగె నింద్రసీలసుం
దరరుచిమత్కలంకము జ ♦ నార్దనుఁడోయన నబ్బురంబుగన్.

చ. పెనఁగొనునగ్గలంపుఁదమి ♦ పెంటినిజంటకుఁదీసి రెక్కదా
ర్పనసవరించిచట్టుపలు ♦ ముక్కునఁ జిక్కులుఁ దీర్చి మేనుమే
నెనయఁగఁగుస్తరించి విక ♦ సించిన కల్వతెలన్ జకోరమొ
య్యననవచంద్రికాసుధప్రి ♦ యంబునఁబ్రేయసికిచ్చితాఁగొనున్.

ఉ. బంతులుదీరి చెంగలువ ♦ పళ్లెరముల్ నిరయంగఁ జంద్రికా
కాంతకరంభమిందుఁడనఁ ♦ గాఁ దగు నెయ్యఁపుబానసీఁడిదన్
వంతలుదీరఁగాఁ గొలము ♦ వారలతోడఁ జకోర వారమ
త్యంత ముదంబునివ్వటిల ♦ నామెతలన్ గొనిమెచ్చె నయ్యెడన్.

మ. అపుడా రామనరేంద్ర చంద్రముఁడు నె ♦ య్యంబొప్పఁగా జానకీ
చపలాక్షీమణితోడ నయ్యెడ నుదం ♦ చచ్చంద్రికాశోభకున్

విపులామోదముమీర నూడిగంపు క • న్నెలగ్గోల్వ విచ్చేసె న
చ్చపుఁగ్రొమ్మానికపుంజకచ్చకలు మిం • చఁ జాళువా మేడకున్.

చ. వెలఁదిపసిండియుప్పరిగె • వెన్నెలబైట రఘూత్తముండుఁ దా
వెలఁదుక పొత్తునం గరము • వేడుక మీరఁగ నారగించె మే
ల్వాలపులు గ్రమ్మగాఁ బొగిచి • వండినకూరలు చారులూరుఁగా
యలు కలమాన్నముఁ బెరుగు • నావవడల్ వడియంబులాదిగన్.

చ. కపురఁపువీడెములోని జ • గాజిగి కుందనపున్ నకాషు ని
ద్దపుఁబవడంబు కోళ్ల జల • తారు బుటాసరి పట్టుమంచమం
దుపచిత పుష్పతల్పమున • నుగ్మలి సీతయు రాముఁడున్ మనో
జ పరమరాజ్యభోగము లె • సంగఁ బసన్ గని కూర్కిరింపుగన్.

ఉ. పాయక మున్ స్వరోద్గమము • పాణినిమాయెడ నేర్వలేదె యా
మ్నాయచయప్రపాఠకులు • మాపలుకుంబడి వెంబడిన్ స్వర
చ్ఛాయలు నేర్చికొండనుచు • జాలెకునోయిటు నాఁగఁ గొక్కరో
కోయని యిండ్లపై కెగసి • కూయఁగఁ జొచ్చెఁ బదాయుధావళుల్.

చ. గరిమనుజక్రరక్షణకుఁ • గా నిను రాకను దెల్పు వేత్రహ
స్తురజత వేత్రదండమనఁ • దోచెను బ్రాక్తటిఁ దెల్వి కన్పడెన్
సరభసవృత్తిమైబరచు • సప్తతురంగఖురావఘాతప్రా
గ్గిరితటగైరికోద్యమము • కెంపనఁగా నరుణోదయంబటన్. ౧౫౮

ఉ. ఒక్కటియొక్కఁపై రవిమ • యూఖములయ్యుదయాచలాగ్రమం
దెక్కఁగవాని నన్నిటిఁ గ • ణింపఁగఁ బూనిన యట్లు దమ్మిపూ
రెక్కలు నొక్కటొక్కటిగ • రేకిడుచున్ వికసింపఁ జొచ్చె లోఁ
జిక్కినచంచరీకములు • చెచ్చెరఁ బైకరుదెంచి మ్రోయఁగన్ ౧౫౯

మ. వికసత్పాగ్రిరిదంగనాముఖతటీ • విద్యోతకాశ్మీరచి
త్రకమై చారుజపాప్రసూనరుచిసాం • ద్రంబై వెసన్ దోచెఁ బూ
ర్వకకుచ్చైలశిఖాఖనీసముదిత • ప్రద్యోతమానాబ్జరా
గకరత్నంబన భానుమండలము తం • గత్కాంతిసంపాదియై. ౧౬౦

వ. అప్పుడు శ్రీరామచంద్రుండు వేల్పని యుచితగతిం బ్రవర్తించె ననుటయును.

శా. జూటాలంకృత చంద్రమశ్శకల ని • ష్ఠ్యూతామృతాపీత వీ
తాటంకీకృతభక్త భక్తకణ లీ • లాకృష్టకాకోల కో
లాటేష్వర్థసమర్థపార్థసమర • వ్యాపార పారమ్యవా
చాటద్రుత్యవబుద్ధసిద్ధవిపుల • స్వాతంత్ర్యవిభ్రాజితా. ౧౮౨

కం. మనసిజహార హారకరుణా
ఘనవైభవ భవ జగత్ప్రి • కాండార్చిత ప
ద్వనజాత జాతనిగమా
ధ్వనీనమహిమాభిరామ • దైవలలామా. ౧౮౩

భుజంగప్రయాతము.

మహాదేవభక్తాబ్ధి • మానస్వభావా
మహీభృత్కుమారీ స • మగ్రానుభావా
మహాశానాథకోట్యాభ • మాన్యప్రభావా
మహీయానుకంపా వి • మర్శార్థ్యభావా. ౧౮౪

గద్య.

ఇది శ్రీరామచంద్రచరణారవిందసపర్యామరంద తుందిలమనోమిళిందపవన నందన పద వందనానంద సందర్శిత సరసకవితావిచిత్ర శ్రీమదానంద తీర్థ భగవత్పాదాచార్య గురుకరుణాపాత్ర పరిచితాశ్వలాయన సూత్ర విశ్వామిత్రగోత్రపవిత్ర నందగిరివంశశరనిధి రాకాకుముదమిత్ర వేంకటనృసింహరాయపుత్ర శేషమాంబాగర్భ శుక్తిముక్తాఫలాయమాన నిరుపమాన భాగధేయ సకల సుకవినికాయ విధేయ వేంకటప్పారాయ నామధేయవిరచితంబగు వాల్మీకీయ శ్రీమద్రామాయణాద్భుతోత్తర కాండమునం జతుర్థాశ్వాసము.

ఓం.

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీమద్రామాయణాద్భుతోత్తర కాండము.

## పంచమాశ్వాసము.

వామాంకపీఠ సంశ్రయ
హైమవతీసదృశవాక్ప్ర ♦ హర్షితచిత్తా
రామకదంబితభువన
క్షేమకృపా కల్పకోశ ♦ శ్రీయమరేశా. ౧

వ. అవధరింపుము వెండియు భరద్వాజునకు వాల్మీకియిట్లనియె. ౨

తే. రాముఁడీచందమును మహా ♦ రాజ్యసంప్ర
తిష్టితుండయి గురువు వ ♦ శిష్టునాజ్ఞ
నవనిప్రజలను తనప్రజ ♦ లట్లుప్రోచు
చుండి సుఖముండెనంతట ♦ నొక్కనాఁడు. 3

వ. కాకుత్థ్సకులాభరణుండగు శ్రీరామభూరమణుండహర్ముఖోచిత క్రియాకలాపంబులు నిర్వర్తించి భూదేవతలకు నమస్కరించి తదాశీర్వచన పూజాక్షతంబులు శిరంబునధరించి రాజోచితనైపథ్యంబంగీకరించి కక్ష్యాంతరంబులు గడచి వలుదమగ రాతి పలకలంగూర్చిన యపరంజిగోడలును,నీలంపుదూలంబులును, బవడంపుఁ గంబంబులును, బచ్చలతోరణంబులుంబిల్లికనుమానికంపుటరుంగులును, దమ్మికెంపుటోడు బిళ్లలును గలిగి పలువిధంబులగు నొప్పిదంబులకుం

గుప్పమై, యప్పురందరు సుధర్మకంటె దర్శనీయంబగు సభాభవ నంబుఁ బ్రవేశించి, యచటఁ గనత్కనక రత్నవిభాసమానంబగు సింహాసనంబున నాసీనుండై పూర్వశైలశిఖరంబధిరోహించిన మార్తాండు ననుకరించుచు నఖండతేజో విరాజమానుండైన యవసరంబున, ఖండేందుమండలంబుల డంబువిడంబించు నవికపలకంబులందులకించుగంబు రాగీరు నామంబుల గుబాళించు నెత్తావుల పెల్లున నుల్లసిల్లు ధమ్మిల్ల మల్లికామతల్లికల పరిమళలహరులంబెరసి చేయీతలీదు సముదేందిందిర వారంబుల ఝంకారరవంబులకులికి సలీడ వేల్లత్కనక పంజరాంతరస్థిత శారికా సముదయంబు కలకలంబులుకు పలుకులకుఁ జెలికారంబు నెరపు గంకణక్రేంకారంబులలర నలరుఁ బోండ్లుకొందరు వింజామరలు విసర, సరస వచో విసరశర్కరాప్రసరగ్రసన వ్యసన సమాటీక శౌక కలాప చంచూసమంచిత దాడిమీ కుసుమ గుచ్ఛచ్ఛవిసచ్ఛాత్రరుచి బంధురాధరబింబ విడంబలగు మగువలూడిగంబులకు రత్నపాదుకాపీటికా కరండముకుర కలాంచికావ్య జనాతపత్రప్రముఖ రాజలాంఛనంబులుధరించి కొలువఁగలువప్రావన్నియ శిరోవేష్టనంబులును, సర్వాంగీణంబులగు కంచుకంబులును ధరించి వినయ వినమితోత్తమాంగులై పార్శ్వంబుల సుమంత్రాది మంత్రులాజ్ఞాపరతంత్రులై నిలువఁ, గొలువెల్ల వెలిగింపఁదగుఁ బగటివత్తుల చందంబునందంపుసూపు మాణిక్యమకుటంబులందాల్చి యెడ నెడ సామంత సంతానం బుచిత స్థితిసేవింప, నిలింప గురుగౌరవాధఃకరణ పరిణతధిషణాదర్పణ ప్రతిఫలితకాణాద పాణినీయ గౌతమ కాపిల జైమినీయ, వైయాసిక, దర్శనస్పర్శన శిక్షాకల్ప నిరుక్త ఛ్ఛందో వ్యాకరణ జ్యోతిషాఖ్యషడంగ సంగతర్గ్యజుస్సామాథర్వణ శ్రుతి చతుష్క సముత్కర్షితమను దక్షశంఖ లిఖిత గౌతమ శాతాత

పాంగిరో బుధా శన సపరాశర వ్యాస యాజ్ఞ్యవల్క్య ప్రముఖ నిఖిల ధర్మశాస్త్ర సంసూత్రిత చతుర్దశ విద్యానవద్య వైశద్య సముద్యోతమాన వాదోప వాదరిగంసులగు విద్వాంసులును, జతుర్ముఖవదన శృంగాటక నానర్త్యమాన భాషావధూచరణ నూపుర ఝుళంఝుళీ మంజులతాభివ్యంజిత వచఃప్రచారసంచారితారభటీభారతీ సాత్వతీ కైశికీవృత్తి సముపాత్త వైదర్భి గౌడీపాంచాలికారీతి సముపనీతమాధుర్య సౌకుమార్య గాంభీర్య ప్రసాదౌజఃకాంతిప్రముఖ గుణపరిగణితోపమోత్ప్రేక్షోల్లేఖ సమాసోక్తి కావ్యలింగాద్యలంకార సంకలిత వాచ్యలక్ష్యవ్యంగ్య శబ్దసముపవేశనానుప్రాణితధ్వని చమత్కార ధోరణీ నిరూపిత నానావిధ ప్రబంధరచనానుబంధ విభవులగు మహాకవులును, నానావినోదాహరణ చక్రవాళసింహావలోక బిరుదపద్యగద్య ప్రబంధముఖర వాగ్ఘటులగు భట్టులును, జంత్రగాత్రవిభేదసంపాదిత శుద్ధప్రతి మధ్యమ షడ్జఋషభగాంధారమధ్యమ పంచమధైవత నిషాద సప్తస్వరనిరూపిత వాది సంవాది వివాది తాయి గమక మూర్ఛన కంపన గ్రామతానమాన సంధాని తద్విసప్తతిమేళక ర్తృజన్యజనక స్త్రీ పురుష రాగసముచితాలాప కలాప విలాసాపాదిత శ్రవణానందదాయకులగు గాయకులును, పరిచితా క్రూరవికారాకార చేష్టాప్రకారసందర్శక ప్రకల్పిత మనోవికాసకులగుం బరిహాసకులును, సతత శ్రోతృ పరమాద్భుతాపాదక భారతాదిమహేతిహాస విన్యాసకులగు నైతిహాసకులును, బ్రాహ్మపాద్మబ్రహ్మాండ మార్కండేయాగ్నేయ లైంగస్కాంద వామన వాయు కూర్మ మాత్స్య భాగవత వైష్ణవ భవిష్యోత్తర గారుడ ప్రముఖనిఖిల మహాపురాణోప పురాణగాథావధానమేధాధురీణు

లగు పౌరాణికులును, బలసి తత్తత్ప్రకార సేవావసరవిధాయకులై సేవింప, వాంశిక, వైణవిక, మార్దంగిక, మౌరజిక, నర్తక, వాచక, వైతాళికాదులగు డెబ్బదిరెండు వినియోగంబులవారును, నుచితగతి నవసరంబెరింగి యోలగింప, గురుబుధకవి విహారభాసురంబును, సదానక్షత్రబంధురంబును నై నభోమండలంబు చందంబున, బహువిధవిబుధ సునాశీరముఖ్యసంకలితంబై త్రిదివంబు నవతున, ననంతభోగి సంకులంబై భోగవతీపురంబు తెరంగున, కమలానుమోద నిరంతర రాజహంసాభిరామంబై మానస సరోవరంబు కరణి, పురుషోత్తమాశ్రయంబై క్షీరవారాసివిహారంబున భాసురంబై, పుణ్యజనాభిరామంబుగాకుండియుఁ బుణ్యజనాభిరామంబై సమాశ్రితవిభీషణంబుగాకుండియు సమాశ్రితవిభీషణంబై సులక్ష్మణంబయ్యును సులక్ష్మణంబై గోపాయిత సుమంత్రంబయ్యును గోపాయిత సుమంత్రంబై విలసిల్లు పేరోలగంబున నిఖిలవిబుధ సేవ్యమానుండగు సంక్రందను చందంబుననున్న సమయంబున.౪

### శ్రీరామచంద్రుని మునులు దర్శించుట.

సీ. కౌశికావక్రిత ♦ కణ్వనైధ్రువచ్యవ
నాదులౌ పూర్వది ♦ గంతగతులు
నరిముచాగస్త్యస్వ ♦ స్త్యాత్రేయనముచాదు
లైనదక్షిణహారి ♦ దంతగతులు
రౌద్రాశ్వకామధూ ♦ మ్రప్రముఖులుగాఁగ
వరుణదిశాగ్రసం ♦ వాసగతులు
కశ్యపాత్రివసిష్ఠ ♦ గాలవరోమశ
ముఖ్యులుత్తరకకు ♦ మ్మూలగతులుఁ
గీ. గలసిశిష్యప్రశిష్య సం ♦ ఘములు గొలువ
దీప్తపావకసూర్యాండ ♦ తేజులైన

యద్భుతతపఃప్రభావధు ♦ ర్యాముధాత్రు
లఖిలబ్రహ్మర్షిసత్తము ♦ లరుగుఁదెంచి. ౫

మ. ఫలమూలాదిశుభార్ఘ్యవస్తుకరులై ♦ ప్రాగ్యత్రయీసూక్తసం
కలితాశీర్వచనప్రపూర్వకముగా ♦ క్ష్మాభర్తదర్శించి యు
జ్జ్వలతత్కల్పితచారుకాంచనమహా ♦ చైత్రాసనాసీనులై
యెలమిన్ వద్రచితార్హణప్రకర సం ♦ హృష్టాంతరంగాఢ్యులై. ౬

వ. ఉన్నంత. ౭

కం. సీతాభర్తకళత్ర
భ్రాతృమహామాత్యపౌర ♦ బాంధవమిత్రా
న్వితుఁడయివారలకునవి
నీతిఁబ్రణామంబుసలిపి ♦ నిలిచిన యంతన్. ౮

మునులు రావణవధఁ బ్రశంసించుట.

చ. కలశభవాదితాపస ని ♦ కాయముపుష్కలవాగ్విశేషసం
కలితముగారఘూత్తము జ ♦ గద్ధితచర్యలనెల్లనయ్యెడన్
దలఁచిప్రశంసితంబుల నొ ♦ నర్చుచు సాదరసంప్రమోద ని
ర్మలతరచిత్తవృత్తులల ♦ రన్ బ్రియపూరంగఁబల్కిరీగతిన్. ౯

ఉ. భాగ్యముఁగాదె రామ నర ♦ పాల లలామ ! సరోషవిభ్రమ
దృగ్భ్రమితామరేంద్రముఖ ♦ దిక్పతిసంచయుఁడున్ జగత్త్రయీ
భోగ్యభయోపపాది పరి ♦ పూర్ణపరాక్రముఁడైనరావణున్
మృగ్యతరస్వరూపుని స ♦ మీకమునన్ బొనరించితొక్కటన్.

తే. రావణుని సర్వలోక వి ♦ ద్రావణుని స
పుత్రమిత్ర బాంధవముగఁ ♦ బోరఁదునిమి
జగము నిష్కంటకంబుగ ♦ సలిపితౌర
నీవుసామాన్యనరుఁడవె ♦ నృపలలామ. ౧౦

తే. హృదయశూలంబు నుమ్మునాఁ ♦ డెల్లలోక
ములకు నిజముగ దశరథ ♦ భూపతనయ
వానివధియించుక తన భు ♦ వనములెల్లఁ
గనఁబునర్జన్మమెత్తిన ♦ కరణియయ్యె. ౧౨

ఉ. ఆతనిపుత్రుఁడింద్రుని మ ♦ హాహవరంగమునందుఁబట్టి య
జ్ఞాతభవుండు ప్రార్థనము ♦ సల్పఁగబంధవిముక్తుఁజేసి ప్ర
ఖ్యాతిగ నింద్రజిత్తుఁడను ♦ నాఖ్యవహించెఁగదయ్య యాజగ
ద్భీతికరుఁ వధించుట న ♦ పేతవిపత్కములయ్యెలోకముల్. ౧౩

ఉ. తాతవరంబునుంచువిత ♦ తంబగునిద్దురఁజేయలోక సం
ఘాతములిట్టులైనమనెఁ ♦ గాక నిజంబుగఁ గుంభకర్ణు ను
ద్ద్యోతిత దుష్ప్రచారమున ♦ కోపునె రామ నృపాలయాజిలో
నాతనిఁ గీటడంచితి భ ♦ యంబులుదీరి సుఖించులోకముల్. ౧౪

కం. పదిదిక్కుల దమియించుచుఁ
బదిమొగములచేతనధిక ♦ బలుఁడాతనికిఁ
బెదరిగడగడవడంకుచుఁ
బదునాల్గుజగంబులెపుడుఁ ♦ బార్థివతిలకా. ౧౫

శా. భ్రూవిక్షేప విలాసమాత్రతన పరా ♦ భూతాత్ములై నిచ్చలుఁ
దేవేంద్రాదులు వేపమానతనులై ♦ దీనాననశ్రీకులై
సేవల్ సేయుచునుందురాతనికిఁ గ ♦ జెప్పంగనొండెద్ది య
ద్దేవద్వేషి హతుండుగాన సుఖులై ♦ దీవింత్రు నిన్నాసురల్.

చ. వినుము విధాతమున్ భువన ♦ విప్లవకారణుఁడైన యిమ్మహా
దనుజవధార్థియై నిను గ ♦ దాధరుమాధవుఁ బుండరీక లో
చనుని సభక్తిఁ బ్రార్థనము ♦ సల్పనయోధ్యరఘూత్తమాన్వయం
బుననిటుగల్గితౌపరమ ♦ పూరుషునంశముఁబూనిసత్కృపన్. ౧౭

శా. సాక్షాద్విష్ణుఁడవీవు సీతకమలా ♦ సాధ్వీవతంసంబు ప్ర
త్యక్షంబై జగదాది దంపతులు మీ ♦ రార్తార్తినిర్వాపణ
స్వాక్షేమవ్రతమూనియుండుటది దృ ♦ ష్టాసక్తినస్మాదృశుల్
వీక్షింపన్ జనుదెంచి ధన్యులగుచున్ ♦ వెల్గొందుచుండ్రీశ్వరా.

శా. యుష్మత్సత్కరుణాసుధారస సువ ♦ ర్షోద్రేకముగ్రాసుర
గ్రీష్మోత్సేక మడంప లోకముభయ ♦ క్లేశాంకితాతంకపం
కోష్మావేశమువాసిస్వస్థముగఁ బెం ♦ పొందంగవై తానకా
ర్చిష్మచ్ఛోభనతాపసాశ్రమములన్ ♦ వృద్ధింగనెన్ ధర్మముల్.

కం. నిర్విఘ్నములుగ నీదయ
పర్వితపశ్చర్యలొగి స ♦ ఫలములుగా మా
కుర్వీవల్లభ సుఖముగ
సర్వార్థములొందిమనికి ♦ సమకూరెఁదిరమై. ౨౦

కం. దుష్టాసురవరపీడా
నిష్టమునన్ జిక్కుజగము ♦ నెగులడఁగించన్
గష్టములు సైచెదా ను
త్కృష్ట కృపా దృష్టి నీ ధ ♦ రిత్రీసుతయున్ ౨౧

ఉ. కుత్సితదైత్యపీడనల ♦ కుంబుయిలోడకనొక్కభంగి త
న్మత్సరవృత్తికోర్చి యస ♦ మంజసకష్టములన్ క్షణంబు సం
వత్సరకోటి కల్పముగ ♦ బల్విడిఁద్రోఁచెఁగదయ్య సీత తా
వత్సలయై జగంబుల వి ♦ పత్తులు మాన్ప నుతింపఁజెల్లదే. ౨౨

తే. ఇమ్మహాదేవిజగముద్ధ ♦ రింపనెంచి
యనుభవించిన కష్టంబు ♦ లకటచెప్పఁ
దరమె యిటువంటి యద్భుత ♦ కరుణయెచటఁ
గంటిమే లోకములతల్లి ♦ గాదెయీమె. ౨౩

ఆ. సీతవిశ్వమాత ♦ స్థిరకరుణోపేత
ప్రబలనెగులుదీర్ప ♦ భారమైన
కష్టములుసహించెఁ ♦ గామాతృవాత్సల్య
మిట్టిదగుట తెలిసె ♦ యినకులేంద్ర. ౨౪

సీ తా ప్ర త్యా ఖ్యా న ము.

మ. అనియమ్మౌనులు రామచంద్రునిఁ బ్రశం ♦ సాయత్తులై పల్కగన్
విని తుల్ సల్పఁగనాఁ కించివదనా ♦ విర్భూతహాసాంకురా
భినవశ్రీకమనీయభంగిఁ దగ ను ♦ ర్వీపుత్రితావల్లకీ
స్వనమాధుర్యమృదూక్తి నిట్లనియె నో ♦ జన్ దన్మునిశ్రేణితోన్.

చ. మునివరులార రావణునిఁ ♦ బోరవధించితివంచు రామచం
ద్రు నిటులమీరు మెచ్చుకొని ♦ తోరముగా వినుతించు చందమె
ల్లను బరిహాసపాత్రమగు ♦ లాగునఁదోచెను నిద్దశాస్యునిన్
దునుముటయెంతయెక్కుడని ♦ తోచదు నామదికెంతమాత్రమున్.

మ. దశవక్త్రుండగు నిమ్మహాదనుజుఁ డా ♦ త్మప్రౌఢ దోర్విక్రమ
ప్రశమ ప్రాపితలోకపాలమహిమో ♦ పన్యాసుఁడై పెక్కు దు
ర్దశలన్ గూరిచెలోకముల్ నిజమహో ♦ దౌష్ట్యంబునన్ జాలఁగ
ర్కశుఁడౌనైననుఁ దద్వధంబు నుతి పా ♦ త్రంబంచు నెంచన్ జుడీ.

కం. సురవైరివధార్థము రఘు
వరునిన్ మీరిట్లుపొగడు ♦ వాక్యములెల్లన్
బరిహాసప్రాయమ్ములై
కరమరుదుగఁదోఁచె మునిశి ♦ ఖామణులారా. ౨౮

కం. అనిభూసుత వచియించిన
వినిమునివరులెల్లఁ జాల ♦ విస్మితులై యే
మనిమొందారు వదనంబులుఁ
గనుగొనుచున్ జిత్తములను ♦ గలఁకజనింపన్. ౨౯

తే. ఇందిరాంశంబునను భూమి • యందుఁగలిగె
రాముసాక్షాన్నృసింహుఁడు నా • శ్రయము నొందె
నిమ్మహాదేవి యిట్టు ల • హేతుకముగ
మనల వంచనలాడు నే • యనుచుఁబలుక. 30

చ. అవనితనూజయప్పుడు కృ • తాంజలియై మునులార! మిమ్ము నే
నవమతి సేయ నిప్పగిది • నాడితినంచుఁ దలంచఁబోకుఁడా
వివరము నెల్లఁ దెల్లముగ • విన్నప మేనొనరింతు నీరఘు
ప్రవరుఁడు మీరు నాపయిఁ గృ • పామతి నానతియిత్తురేనియున్.

తే. అన నగస్త్యాదిమునులు రా • మానుమతిని
గాంచి యని ర త్తెరం గెఱిం • గించుమనుచు
నవనితనయయు నతుల హ • ర్షాఢ్యయగుచు
మృదుమధురవాక్యములనప్పు • డిట్లు చెప్పె. 32

సీత సహస్రకంఠరావణుని వృత్తాంతము చెప్పుట.

కం. పతికిఁ బురోహితులకు ముని
తతికిన్ బ్రణమిల్లి వినయ • తత్పరయై భూ
సుత తక్కుసభాసదులకుఁ
గృతశోపచారయయి పూర్వ • వృత్తాంతంబున్. 33

వ. ఇవ్విధంబునం జెప్ప నుపక్రమించె. • 34

చ. మునివరులార! పెండ్లికిఁ • బూర్వము నేఁ బితృమందిరంబునన్
మనమలరంగనుండు నెడ • మానివరుం డతిథిత్వభాగియై
పనుపడ వచ్చె నయ్యెడకు • బ్రాహ్మణుఁ డొక్కఁడు వానిఁగాంచి మ
జ్జనకుఁడు సర్వపూజనలు • సల్ప ముదంబున నాతఁడిట్లనెన్. 35

కం. భూతలనాయక వర్షా
చాతుర్మాస్యంబు నిచట • సలుపఁదలంచితిన్

ప్రీతిఁ దత్పరిచర్యా
ఖ్యాతిథ్యమునీవునడుప ♦ నర్హుఁడవగుటన్. ౩౭

చ. అనవుడునట్లకాకయని ♦ యమ్ముని నర్హతమప్రదేశమం
దున విడియించి భూతి న ♦ నుం బ్రియ పుత్రికఁబిల్చి చేటికా
జన నిచయంబుతోఁడ దుప ♦ చారవిధానము నాచరింపఁగా
ననుమతిసేయనేనును బ్రి ♦ యంబున నమ్ముని సేవసేయుదున్.

తే. అలఘుభక్తిరాత్రిం దివం ♦ బులుసఖీ స
హస్రయుతముగఁ బరిచర్య ♦ యాచరింపఁ
బ్రీతుఁడై యమ్మహాముని ♦ చేతమలరఁ
జెప్పననుదినమునుఁబుణ్య ♦ చిత్రకధలు. ౩౮

తే. సకలతీర్థాభిగమనంబు ♦ సలుపునపుడు
నచటనచ్చటఁ దాఁజూచి ♦ నట్టిచిత్ర
కధలును బురాణములు ధర్మ ♦ గాధలాది
గాఁగఁజెప్పుచునుండు న ♦ య్యోగిమౌళి. ౩౯

వ. అట్లుండి. ౪౦

మ. ఒకనాడా మునిపుంగవుండు కృతసం ♦ ధ్యోపాసనాద్యర్హ కృ
త్యకలాపుండయి తా సుఖాసనము నం ♦ దాసీనుఁడై నెమ్మనం
బకలంకంబుగనుండ హర్షమున సీ ♦ తా! యంచు నన్జేర బి
ల్చి కటాక్షించి ప్రసన్నవాఙ్ముఖుఁడై ♦ చెప్పెన్ మహోదంతమున్.

తే. జనకరాజన్యతనయ యా ♦ శ్చర్యమొకటిఁ
గంటి నదినీకు వినుపించఁ ♦ గాఁ దలంపు
గలిగె మది సావధానంబు ♦ గా నొనర్చి
వినుమనుచు నిట్లు చెప్పె నా ♦ విప్రవరుఁడు. ౪౧

శా. ఓరాజీవ విశాలనేత్ర! దధి మం ♦ డోదన్వదంతంబునన్
మీరున్ స్వాదు జలాబ్ధి యెంతయును బేర్మిన్ బుష్కరద్వీపమం
దారూఢిన్ దగుఁ బుష్కరంబచట న ♦ వ్యార్క ప్రభోద్దీప్తమై
భూరిశ్రీదళసూత్ర నంబురుహ సం ♦ భూతుండు తత్కర్ణికా
గ్రారూఢుండయి యుండు నీభువన న ♦ ర్గాయత్తుఁడై నిచ్చలున్.

తే. తనరు నాద్వీపవర్ష మ ♦ ధ్య గత మగు న
మానసోత్తరపర్వతం ♦ బా నగంబు
నాల్గుదిక్కులయందు నిం ♦ ద్ర యమ వరుణ
ధనద ముఖ్యలోకపాల ప ♦ త్తనము లమరు. ౭౭

తే. అమరవరులకుఁ గ్రీడార్థ ♦ మప్పురమ్ము
లింపుగా విశ్వకర్మ ర ♦ చించె నాత్మ
శిల్ప కౌశల మెల్లఁబ్ర ♦ సిద్ధిఁ గాంచఁ
జెప్పఁదరమానె యచ్చటి ♦ యొప్పిదములు. ౭౫

కం. సుర సిద్ధ సాధ్య విద్యా
ధర గంధర్వాప్సరో వి ♦ తానములా భూ
ధర సుందర కందర మం
దిరములఁ జరియించెదరు స ♦ తీయుతులగుచున్. ౭౬

వ. అవ్విశేషంబుల కేమిగాని. ౭౭

చ. కలఁడు సుమాలి నా దనుజ ♦ కాంతుఁడొకండు పటుప్రతాప సం
చలిత సమస్తలోకుఁడురు ♦ సత్త్వుఁడు తత్తనుజాత కైక నీ
జలరుహపాణి విశ్రవుని ♦ జాయ మునీంద్రు తపోబలంబునన్
గలిగిరి పుత్రులిద్దరు జ ♦ గంబుల గొందలమంద నాపెకున్.

తే. అగ్రజుండందు వెలయు స ♦ హస్రకంఠుఁ
డ వరజుఁడు దశకంధరుఁ ♦ డా యిరువురు

రావణాహ్వాయములు లోక ♦ రావణమునఁ
గాంచి రన్వర్థముగఁ దశ ♦ కమలనయన. ౪౯

ఉ. అందుఁ గనిష్ఠుఁడై తగు ద ♦ శాననుఁ డంబుజసూతిచే వరం
బొంది యవక్ర విక్రమ స ♦ ముజ్వలుఁడై యని నెల్లవేల్పులన్
గ్రందుగఁ దోలి యోలిఁ ద్రిజ ♦ గంబులు గొందల మందలంకలోఁ
బొందుగ నిల్చె వైశ్రవణు ♦ బ్రోలఁ గుబేరునిఁ ద్రోచి తా నటన్.

తే. ముజ్జగంబుల కెదలోని ♦ ముల్లనంగఁ
గడిమివిలసిల్లె నీ దశ ♦ కంధరుండు
వనజగర్భ వరానుభా ♦ వమునఁ జేసి
రాజవదనరో! యిది యబ్బు ♦ రంబుగాదు. ౫౧

తే. అగ్రసంజాతుఁడైన స ♦ హస్రకంధ
రుండు స్వాభావికబలంబు ♦ రూఢికెక్క
నెందు దర్పంబునను దనఁ ♦ కెదురు లేక
పుష్కరద్వీపమందు నె ♦ ప్పుడు వసించు. ౫౨

చ. అడరి కులాచలంబులను ♦ నచ్చనగాయలు సేయు నొక్కటన్
గడువడి సూర్యచంద్రులను ♦ గంకుకగేళికిఁ గూర్చు బల్విడిన్
జడధులు గోష్పదంబులు ప ♦ సన్ నిరసించు నజాండభాండముల్
సుడివడ దొంతికుండలను ♦ చున్ బడఁ ద్రోయఁగఁ జూచు నెప్పుడున్.

మ. హరి దీశానులఁ బారఁదోలి గురు శౌ ♦ ర్యంబేర్పడన్ మానసో
త్తర శైలాంచిత తద్విహారపురముల్ ♦ దానాఁగి యందుత్తమ
స్ఫురణన్ రాజిలు నిర్జరేంద్రపురిఁ దాఁ ♦ బొల్పొంది యన్యంబులన్
వరుసన్నిల్పె నిజాశ్రితాళి సచివ ♦ వ్రాతంబులన్ బెంపునన్. ౫౪

వ. అద్దానవశ్రేష్ఠుం డధివసించిన సురేంద్రపురంబు. ౫౫

ఉ. అరయ నీజగత్త్రయము ♦ నందలి రమ్యపదార్థసంతతిన్
సారము నెల్ల నేర్పి జత ♦ నంబుగఁ గూరిచి శిల్పనైపుణో
దారత బల్మొగ ద్తవడఁ ♦ దత్పురవర్యము విశ్వకర్మ పెం
పార రచించె నన్న దర ♦ మా! పురవైభవ మిట్టి దంచనన్. ౪౬

శా. సాలాగ్రోజ్జ్వలహైమకుంభఖచితా ♦ చనూన్నత్నరత్నత్విషా
మాలాజాలము సాంద్రమై యటనభో ♦ మార్గంబునన్ గ్రమ్మి యు
ద్వేలస్ఫూర్తిఘనీభవించినఁ జుమీ ♦ నెగ్గొందెఁ దత్తద్రుచి
స్వాలోకంబున సూర్యచంద్రకుజసౌ ♦ మ్యాదిగ్రహానీకముల్.

మ. ఘనసౌధాంతర రమ్యహర్మ్యతలరం ♦ గచ్చంద్రశాలాగ్ర నూ
తన ముక్తామణిజాలగుంభిత వితాం ♦ తప్రాంచదుల్లోచ శో
భనసందర్శన భాజనంబగుచు రేల్ ♦ భాసిల్లెడున్ దారకా
కనదభ్యర్ణగతాభ్రమండలము దృ ♦ క్పర్వంబుగా నప్పురిన్. ౪౮

ఉ. క్రిందయి మేఘమండలము ♦ ఖేయగతిన్ శవణింపఁ గ్రొంజిగుల్
సిందు ననేకవర్ణమణి ♦ చిత్రితమా వరణంబు తజ్జలం
బం దనుబింబితంబయిన ♦ యట్టి తెరంగు హొరంగు మీఱు పౌ
రందరచాపరూపరుచి ♦ రత్నమునం గననౌ వసుంధరన్. ౪౯

ఉ. భాసుర సౌధ యూధ సమ ♦ వస్థితహర్మ్య శిరస్థలీస్ఫుర
ద్వ్యాసవరత్న సత్ఫలక ♦ బంధుర మేచక కాంతిపూరముల్
డాసికడున్ బయిన్ బాదవు ♦ టన్ జుమి యాకసమెల్ల వేళలన్
మీసరమైన క్రొన్నలుపు ♦ మించికనంబడుచుండుటారయన్. ౫౦

చ. గొనబలరారు క్రొత్తజిగి ♦ గొజ్జఁగితోఁటల కూటువన్ రుటం
బెనయుఁగఁ గ్రమ్ము వెంచు నివ ♦ మింతటనంతటఁ జాలు వార్ధిపై
దనుకఁగ నందునన్ దడిసి ♦ తద్దయుఁ జల్లని వెల్గు నించుటన్
బెనుపునఁ జందమామచవి ♦ వెల్గను పేరలరార మీఱెడున్. ౫౧

కం. ద్వార చతుష్క తోరణ
హారి హరిన్మణివిభాస్వ ♦ దావరణమునన్
గూరిన కతమున దిక్కుల
కారూఢింగలుగఁబోలు ♦ హరిదాహ్వాయముల్. ౬౨

ఉ. ఆయత సౌధ యూధ సము ♦ దంచితహర్మ్య విరాజమాన వా
తాయనమార్గనిర్గత క ♦ దంబిత ధూప జ ధూమవిభ్రమం
బేయెడ నబ్దశోభవహి ♦ యింపఁగమౌక్తికజాలవల్లికల్
ఛాయకఁజాల్పునెల్లెడన ♦ భంగురసత్కరకామనోజ్ఞతన్. ౬౩

శా. ప్రాసాదాగ్రసముల్లసత్కనక కుం ♦ భన్యస్తముక్తామణి
శ్రీ సంపాదకతోరణప్రకర వి ♦ శ్లేషాపతన్మౌక్తిక
ప్రాసంగం బధరాబ్దమండలమునన్ ♦ బాటిల్లి యుర్వింబడం
గా నూవే! జలదంబు ముత్తియములన్ ♦ గల్గించునంచాడుటల్.

సీ. చంపక పున్నాగ ♦ చందన మందార
పాటలాశోక రం ♦ భాప్రియాళు
కోవిదారార్జున ♦ దేవదారు కపిత్థ
జంబు జంబీరక ♦ సాల తాల
వకుల వంజుళ కుట ♦ వటకుట జాశ్వత్థ
కృతమాల కతమాల ♦ కృష్ణసాల
పనస తినిశ భద్ర ♦ భండీర నీప క
దంబ శాండిల్య చూ ♦ త సురసాల

గీ. మాధవీ మధూక ♦ మాగధీ మాకంద
ముఖ్య వివిధవృక్ష ♦ ములఁ దనర్చి
సర్వకాలకుసుమ ♦ చారు పల్లవ ఫల
భరితములుగఁ దనరు ♦ వనములచటు. ౬౫

శా. నాఁటన్ జంపక పాటలా వకుళ పు ♦ న్నాగాతి ముక్తాదులన్
వీటన్ మీటగు పూవుఁదోఁటల సము ♦ ద్యోలంబులౌ తావు లె
చ్చోటన్ బైకొని నిండనన్నిగయి కొం ♦ చున్ గ్రుమ్మరంగన్ జమీ
సూటిన్ గంధవహాభి ధానము వహిం ♦ చున్ దాస మీరుండిలన్.

తే. కమల కల్హార కుముద సౌ ♦ గంధికాబ్జ
కోక నద పుండరీక సం ♦ కులము లగుచు
బంధుర కషాయ గంధ సు ♦ గంధిలాంబు
పూరములు వెల్గునచటకా ♦ సార తతులు. ౬౭

తే. విపుల సుమనో మహామోద ♦ విభవమెసఁగ
సుకవి వర్ణిత జల్పిత ♦ స్ఫూర్తి వెలయు
నంతరంబెల్ల నమృత మ ♦ యంబు గాఁగ
సరసు లచ్చట నన్వర్థ ♦ సంజ్ఞనలరు. ౬౮

చ. అళిగరు దగ్రచాల నభ ♦ వానిలపాత విఘాత పత్ర చం
చల శతపత్ర నిష్పతిత ♦ పాద పరాగ విసృత్వరాతి గం
ధిల మధురాంబుపూరముల ♦ నీరజసూతి సుధారసంబునన్
వలపాడుఁ గూర్చెనో యనఁగ ♦ వర్ణన గాంచు గొలంకులచ్చటన్.

చ. కొలకుల యొడ్డులన్ గుబురు ♦ కొన్నరుటంపుఁ బొదరింటి తోఁటలన్
గులగులరాలు కప్పురఁపు ♦ కుప్పలు తిప్పలుగాఁగ నందుపై
మొలచిన సన్నజాజులును ♦ మొల్లలు మల్లెలు క్రొత్తతావులన్
గులుకుచునుండు నిత్తులు వి ♦ నోదమునొందఁగనప్పురంబునన్.

ఉ. తావులుగ్రుమ్మరించు సిక ♦ తామయతీరములందు గ్రుచ్చుచున్
దీవులఁ బూవుటీరముల ♦ నిద్దములౌ నెలరాయుఱంగులన్
వీవఁగలేత తెమ్మెరలు ♦ వేమరుఁ గామ కళావిలోలతన్
దీవియఁబోండ్లఁ గూడిచను ♦ డొంతుర నిచ్చలు భోగులచ్చటన్. ౭౧

కం. మందారకల్పతరుహరి
చందనసంతానపారి • జాతద్రుమముల్
బృందములై తత్తటముల
యందుఁ గరంబలరు నీప్సి • తార్థములిడుచున్. ౭౨

కం. మందరముఖశైలంబుల
నందనమునఁ జైత్రరథము • నందనరు తరుల్
పొందుగ నప్పురితోఁటల
యందుల సర్వర్తుఫలము • లై విలసిల్లున్. ౭౩

కం. కనకమణిహాలుకాస్థల
మనుపమ నవరత్నవిరచి • తాపణమార్గం
బనవధి సంపద్భరితం
బనఁదగు నప్పురము గరము • నభిరామంబై. ౭౪

మ. కనకదష్టాపద సత్ప్రకాండ శిఫ శా • ఖా భాసురంబుల్ వినూ
తనగా రుత్మత పత్రచిత్రతము లు • ద్భ్రాజన్మహారత్నశో
భనపుష్ప స్తబకోల్ల సత్ఫలకదం • బభ్రాజమానంబులై
తనరున్ వృక్షములప్పురీవరమహో • ద్యానంబులన్ సొంపుగన్.

చ. రతనపుఁ బల్కులన్ బసిఁడి • రావడి చే బిగియించినట్టి యా
యతమగు రాచబాటలను • నచ్చట నచ్చట శిల్పనైపుణుల్
జతనముగాంచ మానికపుఁ • జట్టులఁ జేసిన సాలిసింగపున్
బ్రతిమ లెసంగఁగాఁ గనుల • పండువుగా విలసిల్లు నెంతయున్.

చ. కళుకుఁ బసిండి దుమ్ముసుక • గాబలుమాని కపున్ జదుర్పలే
చిలుపలు బెంపులై తనరఁ • జెప్పెడిదేమిక ప్రోలి మేల్సిరుల్
మెలఁగెడు లెక్కకెక్కుడగు • మేరునగంబుల సంఖ్య రోహిణా
చలములు నాపణంబులని • బిది వర్ణనగాదు కోమలీ. ౭౭

చ. చెలువుఁ దలిర్చు నప్పురి వ ♦ సించెడి మేలునకైఁ దపంబులన్
సలుపుచునుండ్రు పెక్కులగు ♦ జన్మములన్ సవరింత్రు భోగముల్
గలిగినయంత వట్టిచట ♦ గా భుజియించఁగ వచ్చు భూరి పు
ణ్యులకిఁకఁ దద్విశేషముల ♦ నోపుదురే వచియింప నెవ్వరున్. ౭౮

మ. పరమంబై తగు నప్పురంబునను ద ♦ ర్పక్రౌర్య దుర్ధర్షుఁడై
సురవిద్వేషి సహస్రకంధరుఁడు ని ♦ ల్చున్ దేవ గంధర్వ కి
న్నర విద్యాధర ముఖ్యనిర్జరుల బం ♦ ధ ప్రాప్తులన్ జేసి భీ
కరలీలన్ భువనంబులన్నియు వడం ♦ కన్ విక్రమోదగ్రుఁడై.

చ. బలరిపు ముఖ్యదిక్పతుల ♦ బట్టి గళాగ్రఘ్నుని బంధయుక్తులన్
సలిపి తృణీకరించి నిజ ♦ శక్తిఁ దదీయ విభూతులన్నియున్.
జలమునఁ దానకైకొని యె ♦ సంగెడు విక్రమలీల కీజగం
బుల నెదురెందు లేక పరి ♦ పూర్ణమనోరథుఁడై వెలింగెడున్.

ఉ. మించిన బాహుగర్వమున ♦ మేరువు సర్షపమాత్రమంచు భా
వించుఁ గులాచలంబులను ♦ నెన్నక యచ్చనగాయలంచు లో
నెంచు మహాసముద్రముల ♦ నెల్లను గోష్పదలీలఁ బోలలం
ఘించును నేఁడు దీవుల గ ♦ ణించును లోష్టసమంబులంచోగిన్.

మ. మశకప్రాయముగాఁ దలంచు సకలా ♦ మర్త్యవ్రజంబున్ గత
ప్రశముండై శలభంబులంచును జగ ♦ త్పాలావళిన్ జూచు భీ
వశతన్ గూరి వడంకుచుండుటఁ దృణ ♦ ప్రాయంబులంచున్ జతు
ర్దశ లోకంబుల నీసడించు భుజగ ♦ ర్వంబెందు దుర్వారమై. ౮౨

కం. ఆఘోర దానవుఁడు స్వా
భావికమైనట్టి బాహు ♦ బలమున నజితుం
డై నర్తిల్లు నజస్రము
నేవంవిధ గర్వమున మ ♦ హిష్ఠుండగుచున్. ౮౩

శా. బాలక్రీడసభంగి నాభిగుడు ద ♦ ర్పం బేర్పడన్ లోకముల్
హేలామాత్రముగా జిగీషఁగొని దా ♦ హింసింపఁగాఁ బూనినన్
గీలాభీలములై నలంగి సభయ ♦ క్లేశంబులై భూత ని
ర్మూలంబై వెస గ్రిందుమీఁదగుచు నా ♦ క్రోశింపఁగాఁజొచ్చినన్.

చ. వెరచి సరోజసంభవుఁడు ♦ విశ్రవసుండుఁబులస్త్యుఁడున్ భయా
తురులయి తోడరానరిగి ♦ త్రోక్కటమందుచు నెల్లలోకముల్
మరలసృజించఁగావలయు ♦ లాగునఁబోచిన నమ్మహాసురున్
దురుసుడివోవఁబుజ్జవము ♦ తోఁబ్రతిమాలెడు నూరకుండఁగన్.

కం. అయ్యా బాబా యనుచును
నెయ్యంబున బుజ్జగించి ♦ నీరజగర్భుం
డయ్యెడ లోకోపద్రవ
మొయ్యన లీడంగఁజేసె ♦ నుగ్రాసురుచేన్. ౮౬

కం. దయఁదలచి యతఁడు విష్టప
చయమునకొక కీడుసేయ ♦ సమకొనకునికిన్
భయమెడలి యిప్పగిదిని మ
నియెడున్ గాకొండుభంగి ♦ నిలువన్ గలవే. ౮౭

ఆ. ఆసహస్రకంఠుఁ ♦ డగు రావణుండిట్లు
సకలభువనభయద ♦ శౌర్యుఁడగుచు
రాజవదన! పుష్క ♦ ర ద్వీపసంశ్రయుం
డగుచునున్నవాఁడ ♦ టంచుఁ దెలిపి. ౮౮

ఉ. ఆతనితమ్ముఁడై వెలయు ♦ నట్టిదశానన రావణాసురుం
డీతరిలంకలో నధిప ♦ సించినవాఁడితఁడున్ దపంబునన్
ధాతను మెచ్చఁజేసి వర ♦ దర్పితుడై కడిమిన్ ద్రిలోక ని
ర్జేతయనంగ విక్రమవి ♦ శృంఖలుఁడై వసియించునెప్పుడున్. ౮౯

ఉ. ఈదశవక్త్రుశౌర్యము స ♦ హింపఁగలేక భయార్తులై సురేం
ద్రాదులు సర్వనిర్జర క ♦ దంబముతోఁ బుయిలోడిదాస్య కృ
త్యాది నియుక్తులై మెలఁగు ♦ నట్టితెఱంగయి యున్నవారు శా
తోదరియంచు సంయమి కు ♦ లోత్తముఁడీ తెఱఁగెల్లఁ జెప్పుచున్.

ఆ. కృపదలిర్పఁగాన ♦ దృష్టపూర్వములగు
చిత్రకథలుకొన్ని ♦ సెప్పినాకు
నట్లువానకాల ♦ మమ్ముని మాయింటఁ
జేర్మిమీరనుండి ♦ ప్రీతుఁడగుచు. ౯౧

కం. తనకుఁ బరిచర్యచేసిన
నను వఃజ్ఞనకునిఁగఁనున్ మ ♦ నం బలరఁగ దీ
వనలిచ్చి వాన వెలిసినఁ
జనియె నిజేచ్ఛనుమునీంద్ర ♦ సత్తముఁడంతన్. ౯౨

చ. మునికులచంద్రుఁడయ్యెడల ♦ ముచ్చటఁజెప్పిన చందమెల్ల నా
మనమునజాగరూకమయి ♦ మాటికిసుస్మృతిగోచరంబుగాఁ
దనరు సహస్రవక్త్రుఁడగు ♦ దానవభర్తచరిత్ర మద్భుతం
బును జనియింపఁజేయుచును ♦ భూరిగుణోత్తరులార! పల్మరున్.

ఉ. వేతలలొప్పు నద్దనుజ ♦ వీరుని యద్భుత విక్రమంబు ముం
దీ త్రిజగద్దురాసదుఁడ ♦ హీనపరాక్రముఁడైన రావణా
ఖ్యాతుఁడువక్త్రపంచకయు ♦ గాంచితకీటకమాత్రుఁడంచు వి
ఖ్యాత గుణాఢ్యుఁడమ్మునికు ♦ లాగ్రణిపల్మరుసెప్పె నెంతయున్.

తే. త్రిభువనద్వేషియైన దై ♦ తేయువిభుని
దశవదనుఁబుత్రమిత్ర బాం ♦ ధవయుతముగ
రఘుకులోత్తముఁడిటు సంగ ♦ రమునద్రుంచు
టధికమని చెప్పెదరు మీర ♦ లనఘులార. ౯౪

ఉ. నాకయిపూని వానర గ ♦ ణంబులతోఁ జనుదెంచి మించి నీ
రాకరమంతఁగట్టి దను ♦ జావలిఁగొట్టి పురంబుఁగాల్చినా
కౌకసులెల్లమెచ్చఁగ ద ♦ శాననుఁగూల్చిరఘుప్రవీరుఁడ
స్తోకభుజప్రతాపమునుఁ ♦ జూపెమహాద్భుతభంగినయ్యెడన్. ౯౬

శా. కైలాసాద్రిఁబెకల్చి దుర్భరభుజా ♦ కండూతివాయంగ కే
లీలోలత్వముసూపి శంకరుని బ ♦ ల్మిన్మెచ్చఁగాఁజేసె న
న్నాళీకాసనునిన్ శిరఃకమల రు ♦ గ్ణాన్యోపహారంబునన్
జాలంబ్రీతునిఁజేసెనిష్టపజిగీ ♦ షాజృంభణోల్లాసియై. ౯౭

శా. రోషభ్రూకుటిమాత్రదర్శన విని ♦ ర్ధూతాత్మ దోర్గర్వ కు
ల్మాషుల్గానొనరించె శక్రముఖులన్ ♦ మారెందులేకన్ సము
న్మేషద్విక్రమజృంభణాత్త్రిజగ ♦ న్నిర్జేతృతాఖ్యాతిచే
భూషించెన్ దితిభూమహాన్వయమొగిన్ ♦ భూరిప్రభావంబునన్.

సీ. ఈదశాననుఁడు భా ♦ వింప జగత్త్రయీ
హృదయశూలంబుగా ♦ నెన్నఁదగిన
దుర్భరవిక్రమా ♦ ద్ధురుఁడగు నీతని
ప్రథితప్రతాపమో ♦ ర్వంగలేక
నింద్రాదులను వేల్పు ♦ లెన్నఁజెప్పఁగరాని
దుర్దశలంది వం ♦ దురుచనునికి
నిక్కమయగుసీత ♦ నిన్ దాకి కడఁకస
పుత్రమిత్రమ్ముగఁ ♦ బోర దునుము

గీ. టగయ నాశ్చర్యమగు కార్య ♦ మనఁగవచ్చు
సందియము లేదు మనమీ వి ♦ షయము సెప్పఁ
దలఁచినప్పుడు రాముఁడే ♦ తాదృశాద్భు
తక్రియాధుర్యుఁడగుట స ♦ త్యమగునైన. ౯౯

ఉ. ఓవిబుధేంద్రులార! మది • నొక్కొకమాటు సహస్రవక్త్రుఁడౌ
రావణుదుర్నిరూపిత ప • రాక్రమభంగిఁదలంచినంత నా
కీ విపులప్రయత్నమది • యెల్లవృథాయని తోఁచుచుండు న
ద్దేవవిరోధిదోస్సన్నయము • దీర్పనిచో నిఁక నేమిసెప్పఁదున్. ౧౦౦

చ. అతుల తపఃప్రభావ నిధు • లార! సహస్రశిరస్కుఁడైన య
ద్దితిసుతవల్లభుండు భుజ • దృప్తతనుండఁగ నేక్షణంబునన్
మతినిగలంగి యీత్రిభువ • నంబులకే యలజళ్లు గూర్చునో
యతనివధించకున్న యెడ • నబ్బునె స్వస్థతయంచు నెంచెదన్. ౧౦౧

కం. కొండంతకార్యమయ్యది
యుండంగను జలిపిరాయి • మోయనుదీనిన్
గొండాడనేల దశముఖు
గండడచుట యద్భుతంబు • గాసీలీలన్. ౧౦౨

కం. దురమున సహస్రకంధరుఁ
బరిమార్పన్ గలిగెనేని • ప్రణుతింపఁదగున్
బరమర్షులార లోకో
త్తర కర్మంబనుచు నపుడు • దశరథ తనయున్. ౧౦౩

వ. అట్లుగావున. ౧౦౪

చ. దశ శతవక్త్రుఁడప్పరమ • దైత్యునిసుందరఁగీటమాత్ర సా
దృశుఁడగునీదశాస్యుని వ • ధించుట పెద్దయునద్భుతంబుగా
వశివరులార మీపలుకు • వాక్కులువిన్నఁబురాశ్రుతార్థముల్
విశదముగాస్మృతంబులయి • వింతఁగఁదోఁచిన యంతనవ్వితిన్

కం. ఇది నా నవ్వినచందము
విదితముచేసితినిమాని • విభులార త్రయ్యా

విదితులగుభవాదృశులన్
మది నెఱిఁగియుఁబరిహాసింప ♦ మాకుం దరమే. ౧౨౬

మ. అనుచరున్ జెప్పినయవ్విదేహసుత వా ♦ క్యంబుల్ ప్రియంబారఁగా
మునిచూడామణులాలకించి కడుసం ♦ భూతాద్భుతోపేతులై
జననీ నీవచనప్రకారమరయన్ ♦ సత్యంబయా నమ్మహా
దనుజుండుండఁగ నింకనెక్కడిది స్వా ♦ స్థ్యంబిజ్జగచ్ఛ్రేణికిన్. ౧౨౭

ఉ. తామరపాకుపైజలము ♦ తల్లడమందెడుమాడ్కిఁజిత్తముల్
వేమరుసంచలించెడు బ ♦ లిష్ఠుఁడటంచుసహస్రవక్త్రు ను
ద్దామచరిత్రమెల్ల విది ♦ తంబొనరించఁగనింకవిష్టప
క్షేమవిధాయివైయెదనుజ ♦ శేఖరు నెవ్వఁడు ద్రుంపనోపునో. ౧౨౮

కం. సరసిజభవు ప్రార్థనమున
నురువడిగి సహస్రవక్త్రుఁ ♦ డుండఁగఁగాకే
త్తైరసూపఁ బూనెనేనియు
నరచేతివె భువనవితతి ♦ కసువులుతల్లీ. ౧౨౯

మ. అని యమ్మానులు భీతచిత్తులయి దీ ♦ నాలాపముల్ వల్కఁగా
విను కాకుత్స్థ వరేణ్యు చిత్తమున నా ♦ విర్భూతమై రోష వ
హ్ని నితాంతోజ్జ్వలమైన నాననములో ♦ హిత్యంబునన్ మించె లో
చన యుగ్మంబు ప్రఫుల్ల కోకనద చం ♦ చత్కాంతి కాంతంబుగన్.

చ. అవని తనూజపల్కుల స ♦ హస్రముఖాసురు వృత్తమంతయున్
శ్రవణ పుటప్రవిష్టమగు ♦ చాయన వీరరసంబు వొంగ నా
భువనశివంకరుండు రఘు ♦ పుంగవుఁడుద్భట సింహనాదుఁడై
తవిలి రణోత్సవంబాదవఁ ♦ దమ్ముల మంత్రులఁజూచి యిట్లనెన్.

మ. వినుడీ! నాపలుకీక్షణంబున జగ ♦ ద్విద్రావణుండైన య
ద్దనుజాధీశు సహస్రకంధరు భుజా ♦ దర్పంబు మాయించిబ

ల్మని నేఁడీ పనిబూని యీత్రిభువన ♦ క్లేశంబు వారించెదన్
జనుదెందీరును సేనలం గొని రణో ♦ త్సాహంబుతోఁ జెచ్చెరన్.

మ. ఇపుడే విశ్వము నాశనంబయిన కా ♦ నీ! రాముతో నంత మొం
ది పతంగాన్వయ మూఁగిపోయినను పో ♦ నీ! యెన్నఁడుం గల్గ లే
ని పరాభూతిన కీర్తివచ్చినను రా ♦ నీ! యాసహస్రాస్య ద
ర్ప పరీకాత్మ్మ వధించి లోకముల శు ♦ గ్భారంబు వారించెదన్.

శా. సుగ్రీవుండు విభీషణుండును మరు ♦ త్సూనుండు నానారణ
వ్యగ్రుల్ వానర వీరయూధులును ఁగ్ర♦వ్యాదోత్తముల్ దోడరా
జాగ్రద్విక్రములైన సైన్యపతులన్ ♦ సాగించి సన్నద్ధులై
యుగ్రాయోధన కేళికిన్ బరుఁడు మీ ♦ రుద్యోగమే పారఁగన్.

వ. అని శ్రీరాముఁడు నిజానుజులకానతిచ్చి యమ్మునులం గాంచి భువ
న క్షేమావహంబైన మదీయానవహంబుఁ గనుంగొన మీరును ద
య చేయవలయునని సవినయంబుగాఁ బ్రార్థించి వారలయియ్యకో
లు గైకొనియె నప్పుడు. ౧౧౫

మ. భ్రమదుర్వీధర మందనిర్మథిత పా ♦ రావార శుంభద్ఘుమం
ఘుమ నిర్ఘోషనిరాకరిష్ణు రవనం ♦ క్షుబ్ధాఖిలా శాంతమై
సమరోత్సాహము దెల్పుచున్ మొరసెని ♦ స్సాణంబు వీతున్ భటో
త్తములా యోధన యోగ్యవేషమున మా ♦ ద్యద్భంగి నేతేరఁగన్.

వ. ఇట్లు ప్రస్థానభేరీభాంకారంబు శ్రవణపుటప్రవిష్టంబైనంత. ౧౧౬

ఉ. తల్లులు దండ్రులన్నలును ♦ దమ్ములటంచు నొకళ్లొకళ్లతో
నల్లనఁ జెప్పుచున్ సెలవు ♦ లందక నెక్కడివారలక్కడే
కొల్లలుగాఁ గఁబౌరజన ♦ కోటిరణోచితవర్మయుక్తులై
తుల్లుచువచ్చు సైనికుల ♦ తోఁ జనుదెంచిరి రాముచెంతకున్. ౧౧౭

## శ్రీమద్రామాయణాద్భుతోత్తర కాండము.

కం. సేనానులు సమరోచిత
నానాప్రహరణయుతవృత ♦ నాసహితముగా
భూనాయకునానతి నా
స్థానమునకు రయమెలర్పఁ ♦ జనుదెంచిరటన్. ౧౧౯

తే. హనుమ దంగద జాంబవం ♦ తార్క్ష్యపుత్ర
గజగవయగంధమాదన ♦ క్రకచ పనస
నీలనలరంభ వేగవా ♦ న్నిమిసుషేణ
ముఖ్య తరు చర వర సైన్య ♦ ములును వెడలె. ౧౨౦

కం. మించి విభీషణుఁడును రా
త్రించర సైన్యములు ఖడ్గ ♦ దీప్తులదర సే
వించఁగ రణోన్ముఖుండై
యంచితగతినిలిచె రఘుకు ♦ లాగ్రణియెదుటన్. ౧౨౧

మ. పటుగర్జారవఘూర్ణితాఖిలనభో ♦ భాగంబుగా నాయుధ
స్ఫుటరోచిర్మలినీకృతార్కముగ నే ♦ పున్ జూపుత త్సేనసం
ఘటితోత్సాహముగా జగత్త్రయము భ్రమిం ♦ గంజాలునట్లుండె న
త్కటశౌర్యంబునకున్ వియచ్చరులునా ♦ కంపించికొక్కుమ్మడిన్.

వ. అప్పుడు. ౧౨౩

కం. చిత్తమునఁదలఁచె రాముం
డత్తరిఁ బుష్పకమునదియు ♦ నభిమతభంగిన్
హత్తుకొనివచ్చె నచటికి
చిత్తానుగమగుచు రాజ ♦ శేఖరునాజ్ఞన్. ౧౨౪

కం. చనుదెంచిన పుష్పకమున్
గని సమ్మోదంబునొంది ♦ కాకుత్స్థవిభుం
డనుజులసుగ్రీవాదులఁ
బనిచె దదారోహణప్ర ♦ వర్తనమునకున్. ౧౨౫

సహస్రకంఠవధార్థముఁ రాముఁడు పుష్కరద్వీపమునకరుగుట.

సీ. అంజనాచలశిఖ ♦ రార్కబింబమువోలె
రమణనౌదలకిరీ♦టము వెలుంగ
మేఘంబుమీదిక్రొ ♦ మ్మెరచుచందంబున
నెమ్మేనఁగనకాంబ ♦ రమ్ము గులుక
గగనమండలితార ♦ కాప్రకాండముదారి
నరతఁగ్రొమ్ముత్తెంపు ♦ సరులుమెరయ
భానుమండలయుక్త ♦ పరివేషసుషమమహా
స్త్రముననధిజ్యచా ♦ పమురహింప
గీ. కవదొనలుదాల్చిమగరాల ♦ కత్తళంబు
దొడిగికట్టాయితంబుగాఁ ♦ గడఁగి వచ్చి
పేద లలసాకుపీటిపై ♦ వెడలుకడిమి
నినకులాగ్రణి పుష్పకం ♦ బెక్కటయును. ౧౨౭

శా. రామస్వామి మహారణోత్సవము సం ♦ రంభంబునుం జూడఁగా
బ్రేమాప్తిం బదురీకృతాగమనయై ♦ విశ్వంభరా పుత్రిత
ద్యామాంకస్థితి నింద్రనీలమణి వి ♦ ద్ధస్వర్ణ లేఖాకృతిన్
సామీచీన్యవిభన్ గరంబును మనో ♦ జ్ఞప్రక్రియన్ రాజిలెన్.
తే. భరత లక్ష్మణ శత్రుఘ్ను ♦ లురుతరోద్య
తాయుధులుసజ్యకార్ముకు ♦ లగుచువచ్చి
యమ్మహాభాగుపార్శ్వము ♦ లందు సంగ
రోత్సవంబు కరంబొప్ప ♦ నుండిరపుడు. ౧౨౮

కం. తరుచరవల్లభుఁడగు ఖర
కరపుత్రుఁడు నిజచమూప్ర ♦ కరసేవితుఁడై
ధరయెల్ల మ్రింగఁజాలెడు
నరుదగుపూన్కి నలరారె ♦ నగ్రేసరుఁడై. ౧౨౯

KO... ARAMA LIBRARY TELAPROLU.

కం. ఇభకలభము లనఁదగు నై
త్యభటోత్తములుద్యతాసి • ధనుర్ధరులై మిగులన్
రభసమునఁ గొలువనప్పుఁడు
విభీషణుఁడువచ్చినిలచె • విభుఁడుల్లసిలన్. ౧౩౦

కం. పౌరులుజానపదులు రఘు
వీర సహాయార్థులగుచు • విపులాయుధ వి
స్ఫారకరులగుచు శౌర్యో
దారస్థితివచ్చిరద్భు • తంబగు కడిమిన్. ౧౩౧

మ. ఘననిస్సాణధణంధణారవములా • కాశంబునన్ బర్వఁగా
ఘను సేనాపతులుద్యతాసిధరులై • భూరిప్రతాపంబునన్
జనుదేరన్ బటుశౌర్యసారబహువ • స్త్రాస్త్రాయుతల్ వీర వా
హినులేతెంచి రణోత్సవంబడరఁగా • నెక్కొన్ రథంబొక్కటన్.

తే. మనుజవల్లభునాజ్ఞ సు • మంత్రముఖ్యు
లైన మంత్రి ప్రధానాదు • లసుర వధ ది
దృక్షులై వచ్చిపుష్పకం • బెక్కిరపుడు
పరమ సమ్మోదభరిత హృ • త్పద్ములగుచు. ౧౩౩

తే. అవ్వసిష్ఠాత్రి కణ్వ క • శ్యప పులస్త్య
కౌశి కాగస్త్యముఖ ముని • గణములెల్ల
నినకులాధీశ విజయ ది • దృక్షుచిత్త
ములఁగరంబొప్ప నెక్కిరి • పుష్పకంబు. ౧౩౪

కం. హనుమంతుఁడు రఘువర పద
వనరుహ సంవాహనప్ర • వణుఁడై యుత్సా
హ నిరూఢి మెరయ నవ్వా
హినులకు మేటియనఁజాల • నేర్పరమెరసెన్. ౧౩౫

కం. నర వానర రాత్రించర
వరసేనలు గరులు సైంధ ♦ వంబులు దోర్ద్రో
నరుదెంచి నేల యీనిన
కరణి నధిష్టించెఁ బుష్ప ♦ కము నవ్వేళన్. ౧౩౬

కం. భృశముగ జనువెంచి చతు
ర్దశభువనము లెక్కఁ సేని ♦ తనయందుఁ గనన్
విశదముగఁ గొరఁతఁజూపు న
నిశముఁ బుష్పకము వ్రాలు ♦ నా! విమానంబుల్. ౧౩౭

తే. శ్రాద్ధి సిరితిబుష్పకా ♦ రూఢమగుచు
రఘుకులోత్తముసైనిక ♦ ప్రకరమెల్లఁ
బ్రబలసింహధ్వనులను గ ♦ ర్జిలను జగము
బ్రమింగఁగా నప్పలించెను ♦ భంగినుండె. ౧౩౮

కం. గిరి సరి దరణ్యయుతమా
చరాచరప్రపంచమెల్ల ♦ నన్నద్ధంబై
యరుదెంచి నట్లు రఘుకుల
వరేణ్యసైన్యంబుభీమ ♦ భంగిఁదనర్చెన్. ౧౩౯

మ. పటుతూర్యస్వనముల్ సముద్భటభటా ♦ ప్రత్యగ్రగర్జాధ్వనుల్
చటులజ్వాలతి కానినాదములు హే ♦ షాబృంహితారావముల్
రటదగ్రేసరశంఖఘోషములు తీ ♦ వ్రప్రక్రియన్ గూడి ది
క్తటముల్ ప్రత్యగనొక్కపెట్టనెనెన్ ♦ దద్రామసైన్యంబునన్. 

కం. సన్నద్ధమాత్రె సైన్యము
లన్నియుఁ బుష్పకము నెక్కి ♦ నంతట్రిజగ
త్సన్నుతచరితుఁడు రాముఁడు
గ్రన్నన మదిఁదలఁచెఁ బుష్ప ♦ కము వడచుటకున్. ౧౪౦

చ. తలచినమాత్రపుష్పకము ♦ దాఁగగ నస్థలికుగ్గమించి య
త్యలఘురయంబుమానస స ♦ మాద్భుతభంగిఁజెలంగ సత్వరా
కలిత మరుత్పరంపరఁగ ♦ కాపికమై దివిషద్విమాన ప
జ్ఞులువడిఁదూలఁగానరిగెఁ ♦ దూర్ణనిరూఢివియత్పథంబునన్. ౧౪౨

కం. అతినైన తేయవేగా
ద్భుతగతిఁ బుష్పకము వోయి ♦ పోయి జనకజా
పతిచిత్తవృత్తికి నను
వ్రతమై వెసఁజొచ్చె ♦ పుష్కరద్వీపంబున్. ౧౪౩

కం నిమిషార్థంబునఁ బుష్పక
ము మనోమారు తరయమునఁ ♦ బోయినిశాటో
త్తమనిలయ పుష్కర ద్వీ
పమాన సోత్తరసగంబు ♦ పజ్జను నిలిచెన్. ౧౪౪

వ. అనిచెప్పి. ౧౪౫

ఆశ్వాసాంతము.

శా. శ్లాఘాలంఘన జాంఘికాద్భుత దయా ♦ సంరక్షితాశేష భ
క్తౌఘాభ్యర్చిత పాదపద్మ వరి వ ♦ స్యాత్తాచ్యుతాత్మ్యంబు జా
డ్యాఘిష్టాచ్యుత చక్రదాన మహిమా ♦ దంభ ప్రభావోన్నతా
గ్లౌఘర్మాంశు కృశాను లోచన జగ ♦ త్కల్యాణసంధాయకా.

కం. నక్షత్రేశవతంసా
దక్షమఖధ్వంసకీర్తి ♦ తగుణ దరంసా
శిక్షిత దివిజోత్తంస మ
హాోక్షహా యూశంస్పృప ధుమ ♦ హాోవిత హంసా. ౧౪౭

మాలినీ.

సమదవనవిలోలా • నంతవాత్సల్యశీలా
శమతగురిత జాలా • సర్వలోకైక పాలా
శమనమదవిఫాలా • సాధురక్షానుకూలా
విమలగుణవిశాలా • వేద వేదాంగమూలా ౧౬౫

గద్య.

ఇది శ్రీరామచంద్రచరణారవిందసపర్యామరంద తుందిలమనోమిళిందపవన
నందన పద వందనానంద సందర్శిత సరసకవితావిచిత్ర శ్రీమదానంద
తీర్థ భగవత్పాదాచార్య గురుకరుణాపాత్ర పరిచితాశ్వలాయన
సూత్ర విశ్వామిత్రగోత్రపవిత్ర నందగిరివంశశరనిధి రాకాకు
ముదమిత్రి వేంకటనృసింహరాయపుత్ర శేషమాంబాగర్భ
శుక్తిముక్తాఫలాయమాన నిరుపమాన భాగధేయ
సకల సుకవినికాయ విధేయ వేంకటప్పారాయ
నామధేయవిరచితంబగు వాల్మీకీయ శ్రీమద్రా
మాయణాద్యుత్తర కాండ మహాకా
వ్యంబునఁ బంచమాశ్వాసము.

ఓం.

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీమద్రామాయణాద్భుతోత్తర కాండము.

---

## షష్ఠాశ్వాసము.

యాంచిత్తలక్ష్యసంభా
విత చిన్మయరూప శతస • విత్పసంకాశా
సతతగరిత నాశవినతా
చ్యుత శ్రీయుమకేశ యంగ • లూను నివేశా. ౧

వ. అవధరింపుము. వాల్మీకిమునిపుంగవుండు భారద్వాజున కవ్వలి కథ యిట్లని చెప్పందొడంగె. ౨

మ. కనియెన్ రాముడు మానసోత్తరనగా • గ్రస్థాన దైత్యేంద్ర వ
త్తనరాజంబున పూర్వశిల్ప రచనో • త్తంసీకృతానేకసౌ
ధనికాయాంచిత హైమకుంభగత ర • త్నజ్యోత్స్నాభాత మా
తన మార్తాండమయూఖరాజము ని • తాంతసాంద్ర తేజంబటన్.

ఉ. అప్పటి వీటనిట్లు ప్రియ • మారెసు తోటల గోటు జెల్వున
మున్నచ్చోటనె జూచి రఘు • పుంగవు సేనల దృష్టపూర్వ మా
నచ్చరియంబునొంది యహా • హా! యిదియొకద స్వర్గభోగమం
ద్రిచ్చెడు రక్కసుండు పురి • యౌనిన పూంబొద సేసె నిర్భరన్.

ఉ. ఈనగరంబు నొప్పిదము • శ్రీసనకంపు వనంబు సుందరం
బీ నవరత్న సౌధచయ • మిచ్చటి భోగము లెల్ల నిన్నహా

దానవుకైవసంబున శ • తక్రతుడక్కట భీతచిత్తుఁడై
తా నెడవాసియుండెఁ బులి • దాగిన యీరనుమాకైనొండుటన్.

కం. పెనుబాము చుట్టుకొను చం
దన వృక్షము చందమయ్యెఁ • దలపోయంగా
ననిమిష చయమున కీ వ
త్తన సౌభాగ్యంబు దుష్ట • దైత్యునివలనన్. ౬

తే. ఘోరభోగ్యములవ్వాఁడు • భూరిభాగ్య
ములు విధాత్మని యోగంబుఁ • దొలఁగ నశమె
దర్ప దుస్సహుఁడగుదుష్ట • దైత్యుఁడీచటు
ననిమిషులఁబోవఁదోలి తా • నాక్రమించె. ౭

కం. ముల్లోకంబున కెవలో
ముల్లైయున్నాఁడు దుర్ద • ముండీ దితి భూ
వల్లభుఁడు కడిమిఁ ద్రిభువన
మల్లు నితనిఁ జంప జగము మను స్వస్థంబై. ౮

వ. అని పలుకుచున్న నప్పలుకులతోన బొడమిన వీరోద్రేకంబున నర వానర నిశాచర యోధులెల్లనుఁ బ్రళయాంబు ధర నిస్వనంబులం బోలు గర్జారవంబు లొనరించి వీరశంఖంబులు పూరించిన రఘు కులాభరణుండును రణోత్సాహ దోహలుండై సింహనాదంబు గావించె నంత. ౯

ఉ. ఆనినదంబు దీర్ణవిల • యావసరాంబు ధరప్రజాయమా
నా నిశనవ్రజఘోషసము • దగ్ర మహోగ్రతనుల్లసిల్లఁగా
భూనభము ల్గలంగఁ బడె • భూమి ధరంబులుఁ గంపమొందె నం
భోనిధు లావిలంబులయి • పొంగె నజాండము ల్గ్రుంగె నొక్కటన్.

పుష్కరద్వీప రాక్షసులు రామ సైన్యమును జూచి సహస్రకంఠుని కెరిఁగించుట.

శా. ఆకోలాహలమాలకించి విబుధేం ♦ ద్రారాతి నిర్యత్కు-ద్ధో
ద్రేకుండై యిదియేమి చూడుఁడని యా ♦ దేశించుచుఁ దానవా
నీకంబుల్ ప్రళయాంబుదవ్రజమున ♦ న్వేవచ్చెఁ గ్రోధాప్తి వ
ల్మీకంబుఁ వెసనిర్గమించు సవిషో ♦ న్మేషాహి సంఘంబనన్. ౧౧

మ. పటుగర్జారవ భేరిభాంకరణ శ ♦ బ్దజ్యాని నాదాప్తరా
రటదాశా విసరావకాశముగ ను ♦ గ్రప్రక్రియన్ గోటనో
క్కట దైత్యావళి నిర్గమించి కనె ను ♦ గ్రధ్వాన నానాచమూ
పటలీవ్యూఢము రామపుష్పకము శుం♦భత్కాంతి మున్లోక్యమున్.

శా. ముల్లోకంబులు మ్రింగఁజాలు కడిమిన్ ♦ మూర్తిభ వచ్ఛౌర్యసం
వల్లీలాకలనంబుమాడ్కి- సమర ♦ ప్రారంభ సంరంభగా
ఢోల్లాసాఢ్య చమూసమూహముల నం ♦ దొప్పార నీక్షించి తా
రుల్లంబుల్గలగంగ వేఁజని తదీ♦యోదంతమున్ దెల్పఁగన్. ౧౩

వ. ఆసహస్రకంధరుండా వృత్తాంతంబంతయు విని. ౧౪

సహస్రకంఠుఁడు ప్రతాపోక్తులు పలుకుట.

కం. అని చేయవచ్చె నీపై
మనుజవరుండొక్కఁ డనెడు ♦ మాటలు విని భ
గ్గున మండి మిడుంగురులొగిఁ
గనుఁగొనలందొరుఁగ నొఁడు ♦ కరచి కనలుచున్. ౧౫

మ. కదనక్షోణిని నన్నెదుర్ప రిపుఁడున్ ♦ గల్గెఁగదా నేడిసీ!
బ్రదుకింకేటికిదురశ్యంబెటులఁ డా ♦ పన్ జాలుదుర్ వేల్పులున్
ముదుకండింతకుఁదెచ్చె లేనియెడలన్ ♦ ముల్లోకముల్ బట్టిగ
క్కదలన్ జూర్ణము సేయకుండుదు నె వీ ♦ కన్ దప్పెనింకేటికిన్.

శా. తప్పుల్ దప్పినటంచు మ్రొంగకుడు మీ ♦ దర్పే వేషసాకారముల్
జెప్పన్ వచ్చునుగాక నైమిసురల్ ♦ జీవాబ్ధిలోనుగ్రముగా
కిప్పుడ్వహ్నిఖబమునాబ్ధులోకములు జూ ♦ నిద్రింగదల్ రక్షోగ్రవ్యస్త్వముల్
దప్పన్ గ్రోచెర వ్యోమమండలము ను ♦ త్పన్నంబుగాపించెదన్.

చ. ముదిమది దప్పినట్టి నలు ♦ మోముల పెక్కురి కాండు, నేనునా
యెమిటికిన చ్చెనేని గుడి ♦ యించెదం జెంపలువేసి యోరత
త్పదము సమాక్రమించెద మ ♦ దం బడఁగించెద లోకపాలురన్
గొందగొని తత్పదంబులు న ♦ కుంఠితశక్తి బట్టగ్రహించెదన్. ౧౮

మ. ఎదురై నిల్వఁగలేక యయ్యమున క ♦ య్యింద్రాది దిక్పాలకుల్
బెదురుంగుండెలతోడ వెట్టిసలుపన్ ♦ బెంపేది పాల్పడ్డ నా
మది సైరించితిగాక జూచుచున న ♦ స్మన్నిగ్రహక్రీడయా
త్రిదివవ్రాతము కీటజాతముగ మ ♦ ర్దింతున్ దుష్టాగ్రంబునన్. ౧౯

శా. పాతాళంబు దివంబుగాఁ ద్రిదివముల్ ♦ బాతాళమున్నంబుగాఁ
జేతున్ మర్త్యులఁగా నమర్త్యుల నర ♦ శ్రేణిన్ దివౌకస్స్ఫూర్
పేటుల్గాఁ బరినత్రితాత్మకులఁ గా ♦ వింతున్ విధాత్రాదులన్
పాతాళస్థితిఁగుంద జేయుదు జగ ♦ త్సంక్షోభపూర్వంబుగన్. ౨౦

చ. జలనిధులెల్లఁబూడ్చెద ర ♦ సాస్థలి చూర్ణముచేసె వాస్థలన్
గలిపెద మేరుమందరము ♦ క్షితిభృత్కటలంబు రూపరన్
నలిపెద నాకలోకంబును రే ♦ నాకము గీకము బ్రహ్మలోకమున్
గలఁగ నఖాగ్ర భిన్నములు ♦ గానొనరించెద నీక్షణంబునన్. ౨౧

మ. విధినై సర్గమొనర్తు సర్వమునిఁడనై ♦ వెల్గింతు లోకంబులో
మధులౌప్యాయన మొంద జేయుదు నాగన్ ♦ జంద్రుండనై నక్షముం
బుష రత్నంబునఁగూర్తు వహ్నిపవనాం ♦ భోనాధుడనై సర్వతా
వృధకారంబుల నేనచేయుదు దడి ♦ యజ్ఞానసంస్థాయినై. ౨౨

మ. అని గర్జిల్లుచు భూరిభీకరసహ్రా • రా పూర్ణరూపంబులన్
దనుజాధీశుఁడు పొంగి సైన్యపతులన్ • దత్సైన్యయుక్తంబుగాఁ
జనుమంచున్ నియమించి యాత్మతనజున్ • సాలోహతామ్రోగ్రలో
చనుఁడై వేగరథంబుఁ డెక్కురుచు నా • జ్ఞాపించెఁ దాసారథిన్.

వ. అప్పుడు. ౨౮

సహస్రకంఠుఁడు యుద్ధమునకు వెడలుట.

సీ. శతయోజనాధికా • యతమును వస్తకాం
చనకలితము సము • చద్విమూర్న
రత్నప్రకాండ వి • రాజమానము శత
కోటిభాస్కర నిరా • ఘాటభూరి
తేజఃప్రకాండము • త్రైజితధ్వజము నా
నావిధాయుధవితా • నప్రపూర్ణ
మనిలవేగాశ్వ స • హస్రసైంధవవాహ్య
మానమ్ముగ్రీఘ్ర ఘుం • టానినాద

గీ. బధిరితాశావకాశ మ • పారఖడ్గ
చక్రశూలముసలపరిఘాసి • చాపబాణ
తూణసంపూర్ణమైన బ్రూ • ఘురరథంబు
కడిమిమెరయంగ నెక్కెరా • క్షసవిభుండు. ౨౯

మ. కడునొప్పారి సహస్రమూర్ధములన • ర్కప్రాంశుకోటీరముల్
బెడఁగుల్ జూప సహస్రయుగ్మకరముల్ • భీమాయుధశ్రేణి నె
క్కుడు పెంపొంద నితాంతబాడబశిఖా • కుండంబులన్ బోలి యు
గ్రములై కన్నులు రెండువేలును వెలుం • గన్ దుర్నిరీక్ష్యాకృతిన్.

చ. వెడలిసహస్రవక్త్రముల • భీకరగర్జిత సింహనాదముల్
గడుభయదంబులై యడర • గాఢకభీషణబెంజితధ్వనుల్

దడబడ నుగ్రగర్జిత వ • లాహక రేఖ వెలుంగ నుద్ధతిన్
బుడమి చలింపఁగా దనుజ • ఘనగిప్రుఁడొక్కఁట నేగుచుండినన్.

వ. ఇట్లు వెడలిన దక్షైన్యపతులగు మహాదానవులు, కోటీశుండును, మనఃపూర్ణుండును, శలుండును, పాలుండును, నాలీముఖుండును, పిచ్ఛిలుండును, కోణపుండును, చక్రుండును, కాలవేగుండును, ప్రకాలుండును, హిరణ్యబాహుండును, శరణుండును, కక్షకాల దంతులును, పృచ్ఛాండకుండల కిరణనేత్ర ఫేణకోచ్ఛిక కరభ భద్ర విశ్వజేతృ విరోహణులును, శిలీకలశమూక సుకుమార ప్రవేశనులును, ముద్గర శశరోమ సురోమ మహాహనుపారావత పారియాత్రపాంశుర హరిణ కృశవిహంగ శిఖోదర ప్రమోద సహ తాపనులును, కృకర కుండర వేదస్కంధ సుమారకులును, బాహుక శంఖవేగ ఘూర్తకపోత పాతక శంకుకర్ణ నికరన కుటీరముఖ సేచక పూర్ణాంగద పూర్ణముఖ ప్రభావులును, శమనిహాస్యహాస్యోత్ర కామకకసుషేణ మానిసాన్వయ భైరవముండ దేవాంగపిశంగచో డపాలకులును, సౌరభ వేగవంత పిండారక మహాహనురక్తాంగ సర్వసారంగ సమృద్ధపాటవాసక వరాహకరానన సుచిత్ర చిత్రవేగి పరాశర తరుణక మాంసస్కంధాదులును, మొదలుగా నసంఖ్యాకు లగు సాహిసపతులు, సితాసితారుణ నానావర్ణసురోరాకారులు, సప్తపంచత్రిశీర్షులు, ద్విముఖులు నేకవక్త్రులు ననేకవక్త్రులు, మహా పర్వతసమాకారులు, యోజనాయామములు, ద్విత్రియోజనోచ్ఛ్రి తులు, మహాబలులు, మహాకాయులు, కామరూపులు, నానావిధ శస్త్రాస్త్రప్రహరణోపేతులు, వివిధవాహనారూఢులునై వెడ లిరి. ఏకాదశ ముఖ్యసేనాపతు లింక సాహస్య సేనానాయకు లను వినుము.

సీ. శంకుకర్ణుండు కపి • స్కంధుండు పద్ముండు
కుముదుండనంతుండు • కునదికుండు
ద్వాదశభుజుండును • ద్వాదశాక్షుండు కృ
ష్ణోపకృష్ణులును దీ • ర్ఘోష్ఠ జిహ్వుఁ
డుష్ణోదరుండు విక • టాసి కేతులు వికృ
తాక్షుండు మరి యుద • రాక్షుండును ర
థాక్షుండు ప్రియకరు • తాశనుల్ వజ్రనా
భవసుప్రభులును ప్ర • వాహా శైల

గీ. కంపిసిద్ధార్థ గజశీర్ష • కంపనాను
నామశతలోచనలు పుణ్య • నామ జూట
రోమనృష మేష విప్రేంద్ర • క్షేమబాహు
పులినను బహువీర్య శతబాహు • పులును మరియు. ౨౯

వ. కాంచనాక్షుండును, నికుంభుండును, జలంధరుండును, తమోభ్రకృత్తు సహస్రబాహువు, నేకజరాభిదుడు, నేకాక్షుండు, వ్యాఘ్రముఖ్యుడు కోకనదుండు, ప్రియమాల్యానులేపనుండు, సువక్రుండు, ప్రియదర్శి పరిశ్రితుండు, జ్వాలాజిహ్వుండు, కరాళుండు. చతుర్దంష్ట్రుండు, మేఘనాథుండు, పృథుశ్రవుండు, ధనుర్వక్రుండు, సముద్రవేగుండు, నందోపనందులు, ధూమ్రుండు, శ్వేతుండు, కళింగుండు, ప్రతాపవంతుండు, ప్రమోదుండు, స్వస్తికధ్రువకా సిద్ధపాత్రసుబాహువులు, సువ్రత గోవ్రజ కనకాపీడులు, మహాపారిషదుండు, గాయన దమన బాణ ఖడ్గ వీర్యవంతులు, దేవతాలి గపితాలులు, వేధకవాసికులు, హంసజుండు, సముద్రోన్మాదుండు, రణోత్కటుండు మొదలుగాగలవారు పెక్కండ్రుగలరు. లెక్కయిడి వారల పేరులు వక్కాణించుట కక్కంజభవునకైనం దరంబుగాకుండు. ౩౦

సీ. కాలకంఠ ప్రభాష • కాలకక్షులును కుం
భాండుండు శితుండును • యజ్ఞబాహు
భూతలోన్మథ సోమ • పుల్లప్రబాహువు దేవ
యాజనుజ్జ్వాలజిహ్వు • హార వసుప్ర
తులు మహాతేజఃక్ర • థులు క్రాథమధురులు
మధువర్ణ కలశ ప్ర • ర్ణములు సుప్ర
సాదసూచీవక్త్ర • చారువక్త్రి సువక్త్ర
కలశోదరులు మహా • బలకిరీటు

గీ. అచలుఁడును వీర్యవంతుండు • హంసవక్త్రుఁ
డవల మధువర్ణ శ్వేత వ • క్త్రాదులైన
వారమిత సంఖ్యలగువారు • భూరిబలులు
గలరు పుత్రులాసాహస్ర • కంధరునకు. ౩౧

మ. పృతనాధీశులు యోధముఖ్యులు మహావీరుల్ హితుల్మిత్రులుక్
సుతులుక్ బంధులు మిత్రులుక్ ప్రబల ర • క్షోనాయకుల్ విస్ఫుర
చ్చతురంగంబులు గొల్వఁ బల్విడి నటక్ • సంఖ్యాతిగస్ఫూర్తి ను
ద్ధతులైవచ్చి రుదాయుధప్రభలు మార్తాండుక్ విడంబించగక్.

సీ. కూర్మ కుక్కుట సర్ప • గోమాయువక్త్రులు
వ్యాఘ్రాననులు సింహ • వదనులు స్త్రీ
ఖరవరాహాశ్వ నృ • గాలకాకోలూక
శశమేషనకుల మా • ర్జాలముఖులు
నేక ద్వివక్త్రుల • నేకవక్త్రులు కృశో
దరులు మహోదరుల్ • తాళనిభులు
కుబ్జులు వికటులు • గోనాసులును మహా
కర్ణులు బహువిధ • వర్ణయుతులు.

గీ. హస్తికృష్ణాజినాంబరుల్ ♦ వ్యాఘ్రచర్మ
ధరులు బహువిధులన దలం ♦ కరణ భయద
విగ్రహులు నూర్ధ్వకేశులు ♦ విస్తృత వదను
లద్భుతాకారు లానిశా ♦ టాగ్ర సరులు. 33

శా. క్రూరవ్యాళ విహంగ కీట ఝష వ ♦ క్త్రుల్ భూరిశాహాగ్రహో
దారుల్ పంచ షడష్టవింశతిముఖుల్ ♦ తాదభ్రబాహ్వాగ్రికల్
చీరప్రావృతులాత్తకంచుకులును ♦ క్షీణ పాస్వాముల్ భీకరా
కారుల్ ఘోరతరాయుధుల్ లసదలం ♦ కారుల్ మహోదారులున్.

చ. హరిగజ మేషవానర ఖ ♦ రాశ్వ సృగాలత రక్షు భల్లుకా
సరమృగఖడ్గసూకర శ ♦ శప్లవ గోతువరాహ గోధికో
దుహ వృక కంక గృధ్ర శుక ♦ ద్రోణ భుజంగమ ముఖ్యజంతు సం
విరచిత వాహనుల్ వితత ♦ భీషణ వేషు లుపాత్త కోషులున్.

కం. అసి పరశు కుంతతోమర
ముసల గదా భిండివాల ♦ ముద్గర ధను ర
స్త్ర సమూహ భల్ల శల్యా
ద్య సమాయుధ హస్తు లమ్మ ♦ హాదనుజనరుల్. 34

మ. వివృతాస్యుల్ కటినాట్టహాస ముఖరుల్ ♦ భీమోల్ల సద్గజితా
రవులున్ భీకర వక్త్రగహ్వర రట ♦ త్స్ఫీత దంష్ట్రాంకుర
చ్ఛవిసందీప్త ముఖుల్ విలంబిత కచ ♦ శ్మశ్రూద్భటుల్ ఘోరదా
నవులే తెంచిరి లెక్క కెక్కుడగుచున్ ♦ నానాదిగంతంబులన్. 35

ఉ. కాటుకకొండలోయనఁగఁ ♦ గర్బుర భూధర కోటులో యనన్
గాటపు కాహిణాచల ని ♦ కాయములోయన దేహకాంతులన్
బాటిలుచున్ జరత్కుఠర ♦ పట్టులనన్ భయదస్వరూపముల్
దీటుకొనంగ వేగ నడ ♦ తెంచిరి రక్కసు లుక్కు నెక్కొనన్.

చ. అనుపమ శౌర్యధుర్యులు మ ◆ హా బలయుక్తులు జండవేగులున్
ఘనతర దేహులుం బహుళ ◆ గర్జితులైన నిశాచరావళుల్
పెనఁగొని యొక్కటన్ వెడలె ◆ లెక్కకు నెక్కువ గాఁగ నేలయున్
వినగలి నింగుమూచినను ◆ నిండిన చీకటి పిండులో యనన్. ౪౫

తే. అట్లువెడలిన దైత్యసై ◆ న్యమున కెల్ల
నగ్రసరుఁడైనయట్టి స ◆ హస్రకంఠుఁ
డుక్కుమిగులఁగ వేవింఛు ◆ లెక్కవెట్టి
ఘోరనినాదంబు చేసె ది ◆ క్కులు వడంక. ౪౬

వ. అట్లు చేసి. ౪౭

సహస్రకంఠునికి ఆకాశవాణి రామవృత్తాంత మెఱింగించుట.

కం. ఎవ్వారు వీరు బలువిడి
నివ్విటికి రాగతంబ ◆ దేమొకొ నాతో
చివ్వకుఁ దలకొని వచ్చిరొ
యివ్విధమంతయును దొలుత ◆ నెఱుఁగఁగవలదే. ౪౮

వ. అని తలచునంత. ౪౯

తే. కంచుగీచినకరణి న ◆ క్కజపుఁ బ్రమోత
వరలుచుండఁగ విస్పష్ట ◆ వర్ణయుక్తి
నొప్పడఁగ శాస్త్రభంగి ప ◆ ఠించె వేయి
కంఠముల సోకు వినఁగ నా ◆ కాశవాణి. ౫౦

ఉ. ఓయి! సహస్రకంధర! మ ◆ హోగ్రబలంబున నెల్లలోకముల్
వేయితెరంగులన్ దొసఁగు ◆ వెట్టితి నీకెదురెందు లేదటం
చాయతమైన గర్వమున ◆ నబ్బురపోవు మ షొంగు చుంటి విం
కీయురు పెల్లు సాగదు ఈ ◆ మీ యిఁకఁ దీసుగ నెయ్యో దీనికిన్.

మ. ఇతఁడంభోరుహ బంధువంశ కలశా ♦ బ్ధీందుం డయోధ్యాపురీ
పతిధర్మప్రతిపాల నక్షముఁడు దృ ♦ ప్యద్దైత్య నిర్మూలన
వ్రతుఁడత్యుజ్జ్వలకీర్తిసంయుతుఁడు శ్రీ ♦ రాముండు సుమ్మా! మహో
న్నతచారిత్రునితోడి వైరమది యె ♦ న్నన్ గీడుమీబోంట్లకున్.

మ. త్రిజగద్ద్రోహి దశాననుండు కపటో ♦ ద్దేశంబునన్ భార్య భూ
మిజఁ గొంపోవఁగ నెత్తిపోయి రణ భూ ♦ మిన్ బంధుమిత్రానుజా
త్మజ యుక్తంబుగ వానిరూపడఁచి ద ♦ త్స్వారాజ్యమున్ దజ్జఘ
న్యజుఁడాత్మాశ్రితుఁడౌ విభీషణునకున్ ♦ సానుగ్రహుండై యిడెన్.

కం. ఎదురెందు లేదనుచు ను
న్మదవృత్తిన్ మెలఁగు నిన్ను ♦ మ్రందించి మహా
భ్యుదయము జగములకొసఁగఁగ
వదలక నీమీఁదికిపుడు ♦ వచ్చెన్ జుమ్మా. ౫౪

కం. గురుతరవిక్రమ నరవా
నర రాత్రించర చమూ గ ♦ ణంబులు గొలువన్
ధరణీశుఁడు భ్రాతృపుర
స్సరముగ నిటరాక నిన్నుఁ ♦ జంపుటకె సుమీ. ౫౫

తే. అనుచు నశరీరవాణి సె ♦ ప్పిన సహస్ర
కంధరుండాలకించి దో ♦ ర్గర్వ దుర్మ
దాంధుఁడై తలలూఁచె నో ♦ రోరి! నన్ను
దాకి గెలువంగ నెవ్వారి ♦ తరమటంచు. ౫౬

చ. కరమునఁ జక్రముంగొనిన ♦ కైటభ వైరియు వజ్రహస్తుఁడౌ
సురపతి తక్కు దిక్పతులు ♦ శూరతఁ బోరఁగ లేక బీరుపో
యిరి ననుఁ గెల్చువారలె యి ♦ సీ! నరవానరకీటకంబులే
వెరతు నె! మింటిమోతలను ♦ వేల్పులమాయలు కట్టిపెట్టుఁడీ.

కం. వెరపించఁబూనిరే తిర
స్కరిణిఁగొని వేల్పులార ♦ చాలించుఁడు మీ
నరుజులు సహస్రగళు ముం
దరనా యిఁకఁగన్పడుగాక ♦ తత్ఫలమెల్లన్. ౫౮

కం. అనిపలికి సేనలంగనుఁ
గొని వింటిరె నన్నుఁ గెలువఁ ♦ గోరియిటకు వ
చ్చినవాఁడఁట వీఁడఁట పోరిఁ
గొనుఁడీ తినుఁడీ మనుష్య ♦ కోటిన్ సూటిన్. ౫౯

వ. అని సేనలకాజ్ఞాపించి తనరెండు వేలకరంబులనెత్తిన యసిముసల పరశుపట్టిస ప్రాస పరిఘ భిండివాల తోమర గదాద్యాయుధంబులొక్కపెట్టున బుష్పకంబుపై వైచి పేర్చి యార్చిన యేలినవాని యుత్సాహంబుఁ దిలకించి సేనలు తలకడచి యేనుయేనని యన్నిశాచర బలప్రకాండంబు పుష్పకాభిముఖంబై త్రోచి నడచి. ౬౦

అసురసైన్యముతో రాముని సైన్యమునకయిన యుద్ధము.

మ. హరిదంతంబులు పక్కనన్ బగులఁగ ♦ ర్జారావముల్ సేయుచున్
జరదుర్వీధరకోటిలోయనఁగ ను ♦ చ్చైర్దేహముల్ గ్రాల భీ
కరభంగిన్ దనుజప్రకాండములు పై ♦ కన్ బ్రాంగి నానాయుధో
త్కరముల్ గుప్పుచుఁ బుష్పకంబుపయిమూఁ ♦ కన్ గ్రమ్మి క్రొక్కుమ్మడిన్.

ఉ. అప్పుడు జానకీవిభుని ♦ యానతిఁ గైకొని వానరోత్తముల్
గుప్పున నుప్పరం బెగసి ♦ కోయనియార్చుచు వృక్షముల్ శిలల్
గుప్పుచు జానుపార్ష్ణినఖ ♦ కూర్పరపాదకరప్రహారముల్
జప్పుడు లుప్పతిల్లగ ని ♦ శాచరకోటి నడంచిరుక్కునన్. ౬౧

మ. ఘనసాలంబుల దీర్ఘదంష్ట్రిలువిరుం ♦ గన్ గొట్టి పాషాణ పా
తనలీలన్ శిరముల్ వగిల్చి నఖదం ♦ తస్వైరఘాతంబులన్

దనువుల్ నెత్తురువఱ్ఱుచేసికపి సై • న్యంబిద్ధ శౌర్యంబునన్
దనుజవ్రాతము సంవిదారితముగా • దర్పించెభీమోద్ధతిన్. ౬౩

ఉ. కొందఱిబట్టిశూలములఁ • గ్రుచ్చిగుదుల్ వడఁద్రిప్పి కొందఱిన్
గొందలమందఖడ్గములఁ • గ్రుమ్మిగదాహతి నుగ్గు నూచగాఁ
గొందఱి మ్రందజేసి మఱి • కొందఱిమ్రింగి ప్లవంగసేనలన్
జిందరవందరై సమయఁ • జేసిరిరక్కసులుక్కుమీఱగన్. ౬౪

చ. ఉఱుగక దీర్ఘ బాహుయుగ • మొయ్యనఁజాపినఁగోటకట్టుగా
మిఱుకఁగ నేరకిందుఁబడి • మీఁదికిదూకుప్లవంగకోటి యు
గ్గడువగునట్టి రక్కసుల • గాటపుకోఱల క్రింద నెందఱో
వడియములైరి మింటి తెరు • వగ్లకు గుండె దిగుల్జనింపఁగన్. ౬౫

చ. తడవులఁబట్టి సంపదల • దంధనలన్ గొనిమూరుమూలలన్
బడి వసియించు నమ్మనుజ • భక్షకకోటికి నప్డు జిహ్వాత్రు
ష్ణము వదలంగ నల్లయెగఁ • బోయుచుఁ జేరి మనుష్యమాంసముల్
వడి నమలంగఁ గల్గె రఘు • వల్లభుసేనలకో నెముగ్కనన్. ౬౬

ఉ. చేతులబట్టిరోమలను • జెండినగంపున బెండిపిండిగాఁ
గ్రోతుల మూకలన్నలిమి • రోతయటంచటుఁ బారవైచి సం
గాతమువచ్చు మానవ ని • కాయముడాసిన మాత్రఁబందువై
వాతులువిచ్చిగ్రంతులిడి • వచ్చిరిమ్రింగఁగ గొంటురక్కసుల్.

చ. అడరెడు నుగ్రదానవ చ • యంబునకున్ బిరుతీకరోషముల్
జడిగొన బొబ్బరించుచు వె • సన్ బ్లవగావళికొండపిండు పై
పిడుగులువడ్డచందమున • భీకరముష్టిహతుల్ సెలంగఁగాఁ
గెడపఁగజొచ్చిరాకడిమి • క్రేవలనభ్రచరుల్ నుతింపఁగాన్. ౬౮

చ. తరుచరకోటిదంత నఖ • దారిత కర్ణగళాది మత్కళే
బర పరితస్స్రవద్రుధిర • వాహినులన్ బహుళోద్గిరద్ఘుర

స్ఫురిత ధరాధరంబులను ♦ బోలుచు రాక్షసవీరు లారణాం
తరమునఁ గూలి రామరవి ♦ తానము మేల్భళియంచు మెచ్చఁగన్.

చ. రవితనయుండు నంగదుఁడు ♦ రంభుఁడు నీలుఁడు జాంబవంతుఁడున్
బవనతనూజుఁడున్ గజ గ ♦ వాక్షులు గేసరియున్ సుషేణుఁడున్
గవయుఁడు గంధమాదనుఁడు ♦ కామితరూపధరుల్ తదన్యులౌ
ప్లవఁగవరేణ్యులున్ గడఁగి ♦ బల్విడి నార్చుచుఁ దాకి రొక్కటన్.

కం. తరువులును గండశిలలున్
గిరులును వివిధాస్త్రతతులు ♦ గ్రిక్కిరియఁగ వేఁ
బరువుచున పుడో హరి సా
హరిఁ బోరిరి రాత్రిచరచ ♦ యంబును డివడన్. ౭౦

కం. రణజనితోత్సాహము
ల్బణచిత్తుండగుచు నసుర ♦ వర్గమునాగి ధా
రుణిఁ గూల్పఁగఁ జొచ్చె విభీ
షణుఁడు గదా హస్తుఁడగుచు ♦ సచివులతోడన్. ౭౧

ఉ. కాటుక కొండవంటి యొక ♦ గ్రద్దరి దైత్యుఁడు శూలహస్తుఁడై
బోటున కొక్క వేయికపి ♦ పుంగవులన్ గుదిగ్రుచ్చి కొంచురాఁ
బోటరియైన యుత్తరణి ♦ ఘర్మకుడడ్డము సొచ్చి యొక్క పెన్
వ్రేటునఁ గూల్చె మస్తకము ♦ వ్రీలిన లాలలు గ్రక్కుచున్ బడన్.

చ. తెరచిన యేడు నోళ్లు సెగ ♦ దేవరయేడు మొగంబు లొప్పఁగా
నరచుచు వచ్చి యడ్డమగు ♦ నందర మింగఁగఁ జూచి యద్దమై
వెరవునఁ బెంచితోక యురి ♦ వెట్టి తటాలున నేడు రుత్తుకల్
నురిమి గతాసుఁ జేసె నతి ♦ లోక పరాక్రముఁ డంగదుండొగిన్.

చ. పెదవులు రెండిటన్ భువి ది ♦ విన్ గబళింపఁగ నద్భుతంపు నో
రు దెరచి దీర్ఘ బాహులన ♦ రుల్ గపులున్ శతసంఖ్యలొక్క మా

రొదవిభ్రమింగుచుఁ బొదలు ♦ నొక్క మహాసురుఁ డాడలాడఁగాఁ
బదములఁదన్ని కూల్చెను బ్ర ♦ భంజనపుత్రకుఁ డొక్క పోటునన్.

ఉ. వేవురు మేటిదానవుల ♦ వీఁక నెదుర్కొని హస్తలాఘవం
బేవలనన్ బ్రాగల్భ్యవడ ♦ నిద్ధచపేట నఖప్రహారలీ
లావిధి నొక్క చందమున ♦ లాచికలంచిన వారనిస్పృతిన్
జేవురుకొండలై వెలుఁగఁ ♦ జేసె సుషేణుఁడు భీషణస్థితిన్. ౭౬

చ. చురచురనిప్పుకల్గొరుఁగఁ ♦ జూచుచు భీకరచంద్రహాస ని
ష్ఠురపరిచాలనోగ్రుఁడగు ♦ చున్ బరతెంచెడు దైత్యసైన్యమున్
బిరబిరఁదాకి తోకయురి ♦ వెట్టి కిలార్చుచు నాకసంబునన్
జిరచిరఁద్రిప్పి వేగఁ బలి ♦ చేసె రణోర్వికి నీలుఁ డుగ్రుఁడై. ౭౭

ఉ. పోరికివచ్చెఁ దోకవురు ♦ వుల్ నగుబాటిది గాదె! యంచుదం
ష్ట్రారటనంబుతో నుఱిమి ♦ యార్చుచు వచ్చెడు వాహినీపతిన్
జేరువఁడాసి యొక్కవల ♦ చే పిడిపోటునఁ గూల్చెఁ గేలిమై
మారుత సూతి తోడి కపిమండలము బ్బునఁ బొంగి యార్వఁగన్. ౭౮

ఉ. కోరలు దీటుకొంచు మిడి ♦ గ్రుడ్లు వెలుంగఁగ వార్చి మాసముద్దన్
బీరము సూపవచ్చితిరె! ♦ బింకమడంచెద నిల్వుడంచు యే
మారుచు వచ్చు రావణసు ♦ తాగ్రజుమారొకనియొక్క గ్రుద్దునన్
భోరునఁ బంచె నంతకుని ♦ ప్రోలికి గాలినుతుండు లీలఁగన్. ౭౯

చ. గొరియలఁ జేసినాడ సుర ♦ కోటుల నొగడకంచు దర్జనో
ద్ధురగతి ఋక్షవానరులఁ ♦ దోలుచు వచ్చెడు నగ్రవాహినీ
శ్వరు నెదిరించి ముష్టిహతి ♦ వ్రక్కలు సేసె శిరంబు నిర్జరే
శ్వరు మనుమండు మింట సుర♦వర్గము శౌర్యము సన్నుతింపఁగన్.

నర వానర సురాసుర ద్వంద్వ యుద్ధము.

వ. ఇట్లసంఖ్యాకులౌ నసురవీరు లహంకారపూర్వకంబుగా గర్వదు
ర్విషహ్యాగతి సుపర్వులు వెరగందన్ దాకిన, బీరువోక పేరువా
డి యవక్రవిక్రమంబున నరాసుర వనేచర చమూసమూహంబు

నెదిర్చి నిర్విఘ్నంబున నయ్యిరువాగును నూర్జిత గర్జారావంబు
లలరఁ గల్పాంతంబున నుత్తుంగ భంగ జల్పాకంబులై తారసిల్లు
పూర్వ పశ్చిమార్ణవంబులఁ గ్రేణిసేయుచు, నీరరసాపూరంబు పొం
గి పొరల, మాఁకుకొనిన నత్త్రోలి తాఁకుసలిఁకిఁబెరయు సమ్మర్దంబు
న విమర్దితంబై యెగయు ధరణీపరాగంబు నిరంధ్రంబుగఁ గ్రమ్మి
కారుచీకట్లు సంపాదింప నెత్తిన క్రొత్త చికిలికత్తుల తళతళలు
హత్తుకొను దీపకళికలై దృష్టిప్రసార సహకారంబులుగా బీరు
వోని యీరసంబునఁ దారసిల్లి యసి ముసల గదా పరిఘపట్టిస
ప్రముఖ వివిధాయుధ విలసనంబుఁజూపిన విదారితంబులగు నవయ
వంబులంగారు, ధారాళ రక్తపూరప్రసారంబునఁగ్రమ్మిన రజోం
ధకారంబడంగ విచ్చలవిడిఁ జెచ్చుపెరిగి యుచ్చైశ్చిష్టనాదంబు
లడర నడరి ఖడ్గంబులనఱికియు, సురియలంగ్రుచ్చియు, గదల జది
పియు, గుంతంబులఁ బొడిచియు, పాశంబులఁ జుట్టియు, బట్టి
సంబులఁ గొట్టియు, దోమరంబులఁ దూరుముసేసియు, సాలంబు
లఁ గూలంద్రోచియు, గొండలఁ బిండిపిండిగా మోదియు, భ
ల్లాంజలిక కూర్మనఖ రార్ధ చంద్రక ప్రముఖ బాణవేణికావితానంబు
లఁ బ్రాణంబులు బీల్చియు, వివిధాయుధంబులఁ బ్రవిదారణం
బుగావించి రెండు సైన్యంబులంగూను బెక్కాండ్ర నుక్క
డంచి రక్కడింది రక్కసు లుక్కుమిగిలి గ్రక్కునఁ బెక్కుమీరి
యక్కజంపు చందంబునకుం దొడంగి, మనుజప్లవంగ సముదయం
బులపైకుఱికి సరకుగొనక గరకుందనంబునఁ బిడికిళ్లం బట్టి దోమల
కైవడి నలుపువారును వెసంద నోళ్లు తెరచి పతంగంబులభంగి
మ్రింగువారును, నిడుదకోరల సందునఁ బొందుపరచి పడియంబుల
వడువునఁ నమలువారును పదులునూర్లు పాదిలిముర చేతంబట్టి పిసికిపిం

డంబులు చేసి వివృత వదన గహ్వరంబుల కెగుర వైచువారును, మిట్టిపోకుండ నట్టి చేతులంబట్టి కరకుపండ్ల మెడలు కొఱికి తత్తరంబునఁ గ్రొన్నెత్తురు పీల్చువారును, తడవునాళ్లకుం దొరికె నీ మనుష్యమాంసంబని సంతసంబునం గంతులు వైచుచు గేలంగీలించి కోలెమ్ముకలు విరచి పరిసరంబున వచ్చు చిఱుతరక్కసుల కామెతలు పెట్టువారును, శూలంబులం బొడిచి గుదులు గ్రుచ్చి పచ్చి నెత్తురు దోయిటం బట్టి త్రావి బ్రేవునఁ ద్రేవువారును క్రోఁతులంబట్టి ఱోక తోకలంగట్టి పేరులుగా నరుత ధరించువారును, నరులంబట్టి నరులను వానరులం బట్టి వానరులంగొట్టుచు నట్టువ తెరంగునం జిట్టాడువారును, వారువంబులఁ దోలించి సాదులం గైదువులపాలు చేసి కిలార్చువారును, మదగజంబుల కెదురించి తుండంబులు వట్టి చిరచిరం ద్రిప్పి యొండొంటితో వైచి రాచి యాచతురంగంబుల బడలువడ మోదువారును నై, క్రూరవిహారంబుల మీఱినం జూచి యాఁడుకరచి, నర సైన్యంబులగ్గలించి, బెగ్గిలక డగ్గఱి దాకొని యగ్గొంటు రాకాసిమూక చేకత్తులఁ గ్రుమ్మియు, వివిధాస్త్రంబులఁ జక్కు చేసియు, గఁదియలం జదిపియు, గండ్రగొడ్డండ్ల నఱికియు, బ్రాసంబుల దూసి పాఱబొడిచియు, బీరువోక పౌరుషంబు నెరప బ్రాసటలై గోలాంగూలబలంబు చలంబునం దలకొని తరువులం బరపి శిరంబులు బరియలు చేసియు గొండలవై చిపిండి చేసియుఁ బిడిగ్రుద్దులం బడమోదియు, జానుకూర్పరాఘాతంబుల నపేతప్రాణులం జేసియు, కడకాళ్లువట్టి రక్కసుని రక్కసునితోఁ గొట్టి మట్టగించియు, రథంబుల విటతాటంబులుగా విఱుగఁదన్ని తద్రథాంగంబులం గొని సేనాంగంబులు భంగంబు గావించియు, హరి హరిని గరి కరిని విసరి వైచి నుగ్గునూచనంబు చేసియు, గోరలు విఱుగఁదన్నియు దౌడలూడ బాదియుఁ, జేతులు

విరచియు, మూతులుజింపియుఁ, గ్రుడ్లు వికలించియుఁ, గోరులం గీరియు బెక్కుతెరంగుల జిత్రవధంబు గావించిరంత నయ్యుభయ బలంబులందును దెగిన తలలును, పగిలిన కపాలంబులును, విభిన్నంబులగు నవయవంబులును, విచ్ఛిన్నంబులగు నంగంబులును, గృత్తంబులగు ఖత్తుకలును గలిగి కేశశైవలంబులును, వదన కమలంబులును, బాహుమీనంబులును, జంఘానక్రంబులును, బ్రపద కూర్మంబులును, దేహయాదోవితానంబులును, గలుగు ననేక రక్తనదీప్రవాహంబులు ప్రవర్తించిన రణాంగణంబు దిదృక్షు సుర నికర భయంకరంబయ్యె నయ్యవసరంబునఁ గపిప్రకర విక్రాంతి విశేషంబున దానవసైన్యంబు దైన్యంబు నొందుటయును. ౮౧

సేనాధిపతుల యుద్ధము.

సీ. కోటీశుండు హాలీము ♦ ఖుండు హిరణ్యబా
హుండును పారియా ♦ త్రుండు కాల
వేగుండు మరి శంఖ ♦ వేగుండు పారావ
తుండును శంకుక ♦ ర్ణుండు వేగ
వంతుండు మరి కాల ♦ దంతుండు పిండార
కుండును పూర్ణాంగ ♦ దుండు ననెడు
పదియు నిద్దరు సైన్య ♦ పతులు విజృంభించి
బలములెల్లఁ గో ♦ ల్తల యొనర్చి

గీ. కడిమినడువఁగఁ గనితాల ♦ కంఠ కాల
కక్షకుంభాండ చారువ ♦ క్త్ర మధువర్ణ
యజ్ఞ బాహు ప్రబాహులు ♦ హంసవక్త్రుఁ
డనెడు రావణసుతులు తో ♦ డ్తైరి వేగ. ౮౨

చ. దారలును సైన్యనాథులును ♦ దోర్బలలీలఁ గడంగి మార్కొనన్
దెరలిన సైన్యమెల్ల నతి ♦ తీవ్ర సముద్ధతిఁ గ్రమ్మరంగ న

య్యుపవనడీకిన్ ద్రిదుక్షుసుర ♦ యూథము బెగ్గల మగ్గలించఁగా
నరిమురిఁ బారఁ జొచ్చె నిఁక ♦ నప్పటి రౌద్రము నేమి చెప్పెదున్.

చ. అలమె వియత్తలంబు నివి ♦ ధాయుధ కాంతి తళత్తళల్ మహా
స్థలి నరవానరప్రకర ♦ చారు శిరఃకమల ప్రకీర్ణమై
వెలసె నవాస్రవాహినులు ♦ వేమరు దిక్కుల నంటఁ బారె న
గ్గలికఁ బెనంగు దానవుల ♦ గర్జలఁ బిక్కటిలెన్ నభంబొగిన్. ౮౪

సీ. తరిమి చేతులు సాచి ♦ నురిమినై చెడు మదో
త్కట దైత్యులకు మశ ♦ కంబు లగుచు
పొదిలి గుప్పిటఁ బట్టి ♦ చిదిమివైచెడు దాన
వప్రతతికి శల ♦ భంబు లగుచు
నిడుదకోరలు దీటు ♦ వడివడి నమలెడు
నసురావలికి వడి ♦ యంబు లగుచు
పిసికి పిండలు చేసి ♦ వెస మింగు రక్షశ్చ
యంబునోళ్లకు గబ ♦ ళంబు లగుచు

గీ. పస నెసంగెడు నిశితాసి ♦ విసరినరుకు
కరకు వారికి లేసార ♦ కాయ లగుచు
పలువిధంబుల నలుగుడు ♦ పడి నశింపఁ
జొచ్చె నరవానరచమూస ♦ ముచ్చయంబు. ౮౫

శా. ఆరీతిన్ గతినాసురప్రతతి పా ♦ రై నొచ్చు సైన్యంబు గ
న్నారన్ గన్గొని యాంజనేయుఁడు సము ♦ ద్యత్క్రోధనిర్ఘాత దు
ర్వారుండై మెయి లెంచి యుగ్రతర గ ♦ ర్జారావపూర్వంబుగా
ఘోరాకారమెసంగ మాహ్వానియె ర ♦ క్షోరాజి గంపిల్లఁగన్.

సీ. అరిమురిఁ ద్రోఁకతో ♦ నురి వెట్టి చిరచిరఁ
ద్రిప్పి నేలను గొట్టి ♦ ద్రెళ్లనైచి

శిరములు చంకల ♦ నిఱికించి గ్రుచ్చుపై
కురుకఁ దిత్తులవోలె ♦ నొత్తినైచి
ఘనభుజార్గళులు బి ♦ గ్గనఁబట్టి వెన్నులు
విరచి చిత్రంబుగా ♦ నుఱిమినైచి
జానుకూర్పరముష్టి ♦ చరణప్రహారముల్
సలిపి యుగ్రస్థితి ♦ నలిపినైచి

గీ. కులిశనఖపాటనంబుల ♦ ఘోరభంగి
వలుదకడుపులు బలువిడి ♦ వ్రచ్చినైచి
పలువిధంబుల దానవ ♦ బలము నెల్లఁ
గడిమి నెఱయంగ నురక జీ ♦ కాకు పరచె. ౮౭

ఉ. ఎత్తిన మాయయుద్ధంబు లవి ♦ యేగొని క్రమ్మర వానిచేతనే
దుత్తుమురై చనన్ గడిమిఁ ♦ ద్రుంచుచు నొంచుచు దైత్యవీరులన్
మిత్తికిఁ దిండిసేయుచును ♦ మించి కలంచి యలంచి యుగ్రతన్
మత్తిలి యార్చె మింట నుర ♦ మండలమెల్ల సెబాసు మేలనన్.

కం. వడగొండలపై బెడిదపు
పిడుగులు వడ్డట్లు దనుజ ♦ బృందంబులపైఁ
బిడిగ్రుద్దులు పడియెడు చ
ప్పుడు లప్పుడుదోచె నన్నిల ♦ వ్రుత్తు మునుమునన్. ౮౯

కం. కడకాళ్లువట్టి విసరుచు
బెడిదపు రక్కసుల నొకని ♦ బెట్టి యొకని ను
క్కడగం బడమోదుచు నను
మడుచిత్రవిహారమంజి ♦ మం బెఱిగించెన్. ౯౦

కం. పెనుగాలి వీచినను గూ
లిన బూరుగుతోటవోలె ♦ లీలాగతి నా

హనుమంతు విక్రమక్రమ
మునకుఁ లోనైన రిపుచ ♦ మూసముదయముల్. ౯౧

ఉ. కేసరిపుత్త్రు బాఱికిని ♦ గేసరి ఘేటునబడ్డలేళ్ల పిం
డై సమదాసురప్రకర ♦ మంతయు నింతట నంతటన్ సము
ల్లాసముదక్కి యుల్లన బ ♦ లాయన కార్య పరాయణంబుగా
నీనునగాంచిగోటిశుఁడ ♦ హీనపరాక్రము మొప్ప సడ్డమై. ౯౨

మ. ధనువొండుద్ధతి నెక్కువెట్టి నిసితా ♦ స్త్రంబుల్ ప్రవర్షంబుగా
వినువీధిన్ గురియింపుచున్ గలిసియా ♦ వృక్షాటకోటి న్వెసన్
దునుకల్సేయుచు సింహనాదమడరన్ ♦ దుర్వారభంగిన్ గడం
గినవానిం గని యాంజనేయుఁడు మదిన్ ♦ గిన్కన్ మహోద్రిక్తుఁడై.

ఉ. వాలము వెంచి యుద్ధతర ♦ వంబున దిక్తటులల్లలాడగా
గేలియుబోతె రక్కసుని ♦ గ్రిక్కిరియన్ మెడబట్టి యంగముల్
ప్రీలగమింట ద్రిప్పుచు భు ♦ విన్ బడి నప్పుడ మేన ప్రాణముల్
దూలగగొట్టి యార్చెదన ♦ తోటికపుల్ ముదమొందిగర్జిలన్. ౯౪

ఉ. అంతయుగాంచి రోష విక్ర ♦ తానసుఁడై వెనుశంకుకర్ణుఁ డ
త్యంతపరాక్రమంబడర ♦ నార్చుచుడాసి నిశాతసాయకా
క్రాంతదిగంతరంబుగవ ♦ నాటచమూప్రకరంబు ద్రుంపఁగా
నంతటగాంచి క్రోధమున ♦ నంగదుఁ డంగము వొంగ నుగ్రుఁడై.

చ. చిరచిర ద్రిప్పి సాలమొక ♦ చేతబలం బలరంగ నేసినన్
శిరమటు వ్రయ్యలై రుధిర ♦ సిక్తవపుష్కతఁ గాలికొండఁ య
ట్లురువడి నుర్విఁ గూలె నది ♦ యోరఁగనుండగొని కాలవేగుఁడు
ప్పరమునదాటి యార్చుచు మ ♦ హోద్ధతిఁ దాకె ప్లవంగసేనలన్.

చ. పొరిఁబొరిఁ దాకి శూలమునఁ ♦ బోటునకొక్కొక్క వేయి వేయి వా
నరులు వడంగ రౌద్రకల ♦ నంబునకున్ బాడవేర్పరింపుచున్

బరువడినుగ్రగర్జిత ర ♦ వంబడరన్ జనుదెంచువానికిన్
దరుచరసైన్యమంతయు య ♦ థాయథలై గడువంగ బారుఁడున్.

మ. కనిసుగ్రీవుఁడు పోకుపోకుమిఁక నీ ♦ గర్వంబు నాముందు సె
ల్లునె రాత్రించరయంచునుగ్రోధరస ద ♦ ర్లోకాస్యుఁడై యుజ్వలా
శనిపాతంబునకీడుజోడయిన చం ♦ చన్ముష్టిఘాతంబునన్
దనువున్ గుల్లలత్తిత్తిసేసినడి న ♦ ద్దైత్యున్ బడన్ ద్రోచినన్. ౮౬

వ. అప్పుడిప్పగిది నొప్పింపంబడిన సేనాపతుల చందంబు గనుంగొని తక్కటివాహినీశు లుక్కున నొక్క మొగమై పరతెంచి మించిన చలంబున సేనలం గోలుతలగావించిన నారాత్రించర ప్రకాండంబు కొండ పిండుగండునందారసిల్లియుంరఁపులాకసంబు ముట్టఁగట్టుపకాను లైబిట్టుగిట్టినరవానరచమూసముదయంబునదమదంబుగాఁ బ్రాదవి గుదియలంజమువుచు, శూలంబులఁగీలించుచు, గత్తులం గుత్తుమురు సేయుచు, గండ్రగొడ్డండ్లఁ జెండివైచుచు నానావిధాయుధ విలసనంబు మెరయించినఁ దెగుతలలును, కృత్తంబులగు భుజంబులును, విచ్ఛిన్నంబులగు పదంబులును, శకలంబులగు దేహంబులును, జూర్ణంబులగు నెముల్లును, గలిగి మాంసకర్దమంబులును, గేశశైవలంబులును బాహుమృణాళంబులును, శిరఃకమఠంబులును, గలిగిన బహుళకీలాలప్రవాహంబులు వరగిన నందు స్నానంబుసేయువారును, బలలఖండంబుల నములువారును, మేదస్కన్యంబుల నాస్వాదించి యానందించువారునై క్రూరరాక్షసులు విజృంభించినం గన్గొని. ౮౭

## లక్ష్మణుని యుద్ధము.

ఉ. ఈసునబొంగి కన్గొనల ♦ నింగలముల్ స్రవియింపనుగ్ర ని
శ్వాస మరుత్ప్రసిద్ధిత రు ♦ షానలదీప్త ముఖంబుతోఁ బ్రా

శాసనపాణియై వెడలి ♦ యార్చుచు లక్ష్మణుఁడన్నిశాటులన్
డాసి సితాస్త్రసంతతి బ ♦ డల్పడనేసెఁగపుల్ గిలార్చఁగన్. ౧౦౧

చ. అలఘుధనుర్ఘనంబున గు ♦ ణారవగర్జిత పూర్వకంబుగా
విలసితదండరుక్మరుచి ♦ విద్యు దుదంచనముల్లసిల్ల ను
జ్వలశరవృష్టి దుర్మద ని ♦ శాచర దావహుతాశనార్చులం
బలుపుసెడంగనార్చిదృఢ ♦ మాత్రమునన్నృపుతమ్ముఁడయ్యెడన్.

శా. ఆసౌమిత్రి ధనుర్వినిర్గతనిశా ♦ తాస్త్ర ప్రఘాతంబులన్
గాసిం బొందినిశాటచక్రమపుడా ♦ కంపించి పారంగ రో
షాసంగంబునఁ గాలదంత ముఖులై ♦ న్యాశీశులొక్కుమ్మడిన్
వాసిన్ బేర్చిన సేనలన్ మరలి తీ ♦ వ్రప్రక్రియన్ దాకినన్. ౧౦౩

శత్రుఘ్నుని యుద్ధము.

మ. కని శత్రుఘ్నుఁడు చాపబాణధరుఁడై ♦ కన్దోయి కెంపెక్కఁగా
గొని నిర్ఘాత నిశాతబాణతతులన్ ♦ గుప్పించినన్ దిక్కులన్
దనుకన్ నెత్తురుటేర్లువార నతిరౌ ♦ ద్రంబయ్యె దైత్యావళీ
తనుఖండంబుల యుద్ధరంగమతి సాం ♦ ద్రంబై జిగీషార్థంబునన్.

ఉ. అంతట గాలదంతుఁడు రు ♦ షానలదీపితమూర్తియై యనుగ్రాం
తాంతకుపోలె పేర్చివిపి ♦ నాటచమూవిసరంబు నెల్ల దు
ర్దాంతగతిన్ దెమల్చి నిజ ♦ దంతఘురట్టవిఘట్టితాకృతి
భ్రాంతులఁ జేయుచున్ గలిసి ♦ పార్థివుపైఁ జనుదెంచె నుగ్రుఁడై.

భరతుని యుద్ధము.

చ. అతనికి నడ్డమై భరతుఁ ♦ డార్చి ధనుర్గుణనిస్వనంబు ది
క్తతులగలింపఁ బేర్చి నిశి ♦ తంబగు సాయకమొక్కఁ డేసినన్
దితిసుతుమూర్ధ్నమున్ దునుమఁ ♦ ద్రెళ్లె నఖండిలసన్నుతాచమూ

పటులురురోష దీప్తులయి ♦ సైకొని యమ్ముల వెల్లిదేల్చినన్
ధృతిసెడ కాన్పృపాలుఁ డతి ♦ ధీరతనిల్చె రణాంగణంబునన్. ౧౦౫

మ. కని పిండారకుఁ డుగ్రరోష వికటా ♦ కారంబుతో నుజ్జ్వలా
శనిఘోషంబన నార్చి పెల్లెసఁగఁ జం ♦ చద్బాణవర్షంబుతో
ఘనవిస్ఫూర్తి వనాటదర్పదహన ♦ క్రౌర్యంబు సల్లారగాఁ
గనుకన్ దాకిన వానికోత్తలకు ద్రు ♦ గ్గెన్ మానవానీకినుల్. ౧౦౬

తే. ఖాండవమయి మయ్యె సంగరాం ♦ గణము దనుజ
యోధగర్జా స్తనితవిరా ♦ వాధరీకృ
తంబుగా దోఁచె మేఘప ♦ దంబు నమ్మ
హోగ్రతకు నేమి చెప్ప న ♦ య్యుద్ధపటిమ. ౧౦౭

తే. చంగుచంగున దాటి గ్ర ♦ చ్చరబలాయు
ధంబుగావింపఁగా సార్ధ ♦ కంబుగాంచె
దమప్లవంగత్వమక్కపి ♦ తండములకు
దనుజసైన్యాధినాథు కో ♦ త్తలకుగాక. ౧౦౮

తే. తడవులం బట్టి మూర్ఖాలఁ ♦ బడుట మనుజ
పిశితమెఱుఁగని దానవ ♦ విసరములకు
జిహ్వాతృప్తి షువదలె ద ♦ త్సేన లెల్లఁ
ద్రాడరి పిండారకుని బాధ్కి ♦ బడినయపుడు. ౧౦౯

లక్ష్మణుఁడు పిండారకుం జంపుట.

మ. అదికన్నారఁగఁ జూచి లక్ష్మణుఁడు కో ♦ పాటోపమే పారఁగా
నెమ్మైరిమార్కొని యార్భటోగ్రరవం ♦ బే తేరఁగా నుజ్జ్వల
ప్రదరంబుల్ నిగుడించి దానవచమూ ♦ వ్రాతంబులన్ వేనవేల్
కదనక్షోణికి నొక్కపెట్టునబలిన్ ♦ గావించె నచ్చో వెసన్. ౧౧౦

తే. చేరియవ్వేళ సౌమిత్రి ♦ చిత్తజల్లు
గాఁగురియునంప పెల్లున ♦ కాగలేక

చెట్టుకొకపక్కియై దైత్య • సేనలెల్ల
దిగులుసెందియథాయథ • లగుచుఁబరచె. ౧౧౧

కం. మునుమెల్లను బయలైనఁ
గినుకఁ బిండారకుండు • నెరమంటలపై
గొనుచూవులడర వడిదా
కెను బిరుతివక నృపసూతి • కేల్గొను గడిమిన్. ౧౧౨

శా. భల్లంబొక్కటి విల్లుద్రుంచి హరులన్ • బాణాష్టక వ్యాహతిన్
ద్రొల్లంజేసి సిడంబుగూల్చికినుకన్ • దుర్వారుఁడై శౌర్యసం
పల్లీలాకలనంబుసూపి విలస • ద్బాణావిఁ బిండారకుం
డ్రెళ్లన్ జేసెభయార్తులై దితిసుతుల్ • దీనత్వముల్ జెందఁగన్.

వ. ఇట్లు పిండారకుండువడిన గండుసెడి దైత్యదానవ మండలంబు బెండువడి తలలువీడ పరవందొడంగిన మిగిలిన సేనాపతు లవష్టంభవిజృంభణంబునందలకడచి సేనల మరలించి కొలుతలగావించిన.

చ. క్షురపరిఘాసిముద్గరభు • సుండి శతఘ్ని గదాదికాయుధో
త్కరములురోదసీతలము • గార్కొనుచుఁ నిబిడాంధకారబం
ధురమగునట్లొగిన్ బరవ • దుత్తములై పడఁజొచ్చె నుర్వి వా
నరనికరంబు కొమ్మగొని • నంబడు నేరెడు పండ్లచందమై. ౧౧౩

మ. శరవిచ్ఛిన్న కపీంద్రదేహ గళితా • స్రప్రోద్ధితానేక ని
ర్ఘరసంతానముసంగరాంగణము నా • రంబారఁగాఁబుష్పకం
బురుకుంభప్లవమై నిశాచరమహా • హుంకారజంఝామరు
ద్భరపారిప్లవసన్నిరోధమునవి • భ్రాంతంబుగాఁజొచ్చినన్. ౧౧౪

శా. ఆసంరంభము సూచియేచిన వనౌ • కాసీకినుల్ భూరిసం
త్రాసంబందియులందురన్ గని నితాం • తక్రోధతామ్రాక్షుఁడై

యీసౌమిత్రిధనుర్గుణధ్వనికి బ్ర ♦ హ్మాండంబు భేదిల్లఁగా
నేసెన్ ఘోరశరప్రకాండములన ♦ య్యేపెల్లజల్లారఁగన్. ౧౧౭

తే. తొడరి యిరుగడ భరత శ ♦ త్రుఘ్నులడర
గడగి సౌమిత్రి రిపులుగ్ర ♦ క్కదలజదల
నుడుసువాలంపగములు ని ♦ గుడ్చనపుడు
నుడివడియెరాత్రిచరసేన ♦ కడిమిదక్కి. ౧౧౮

మ. దొరలిట్లుద్ధతిమార్గోన్నతిన్ గడఁగితో ♦ డ్తోవాయుపుత్రాంగదుల్
గరిమంబొప్పబరాక్రమోన్ముఖులుగా ♦ గండొప్పదక్కల్ల వా
నరయూథంబు విరోధశీలమయి నా ♦ నావృక్షపాషాణ భూ
ధరవర్షంబున మర్షతోఁగురిసి రు ♦ త్కర్షంబుదీపింపఁగన్. ౧౧౯

వ. ఇట్లు దొరలును సేనలు నేకముఖంబై సముత్సాహచోహాలంబునం దేర్చిన గార్చిచ్చు బొదవిన కాననంబునుంబోలె దానవసేనావితానంబుపక్రాంత దీనత్వభాజనంబుగా వెడలు భల్లాంజలిక ప్రకూర్మ నఖర ప్రముఖబాణవేణికావితానంబునకు సహాయంబులై పడిం గురియు తరుపాషాణవర్షంబుల సముత్కర్షంబునకుఁజిక్కి తలలువగిలియు, గంఠంబులుద్రెస్సియు, బ్రక్కలువ్రక్కలయ్యు వదనంబులుజదిసియు, నుదరంబులు జిదిగియు, కాళ్లువ్రెళ్లియు, కరంబులు విరిగియు, వివిధవధావిధానంబులకు భాజనంబులై దానవప్రతానంబులు బడలువడునప్పుడు వడిసడరి పిడుగులంబోని నారసంబులీరసంబునం బరంగించుచు గిలార్చి హాలీముఖుఁడు బలీముఖసేనలం దెగటార్చుచు, బేర్చిననార్చి సౌమిత్రి వింటంగూర్చి యేసిన చిచ్చుటమ్ము కార్చిచ్చు శుష్కవిటపంబు నేర్చుపోలిక నతనిబరిమార్చినంగాంచి హిరణ్యబాహు పారియాత్రశంఖవేగ పారావత వేగదంత పూర్ణాంగదులు జదల్లి తామయ్యెవికటాట్ట

హాసనిష్ఠురంబుగా మోహరించి మోహరి సాహసించెనగు నరవా
నర నిశాచరప్రకరంబుల జకితంబులుగావింపఁజొచ్చిన నుచ్చైర్ధ్వని
నాదంబులు రోదసీకుహరంబు నిరవకాశంబుగావింప, హనుమ
దంగద నలనీలసుగ్రీవ జాంబవంతు లార్వురుం గదసి పేర్వాడి యూ
సేనాధిపషట్కంబు నంత కని శౌర్యాతిథులంగావించిరంత దురం
తచింతాభరాక్రాంత రోష దవానలావేశంబునం బొంగి నిఖిలదా
నవలోకంబు నొక్కమొగి నుక్కునం బొదవినం జిక్కువడి స్రుక్కి
యక్కపిసేన దీనదశకు వచ్చినం బెచ్చుపెరిగిన కినుక బెనఁగొన
భరతలక్ష్మణశత్రుఘ్నులు దీర్ఘనిర్ఘోషంబు లెసఁగ ఘూర్వవిలస
నంబులు నెరయ, ధనుర్విద్యాపాటవంబు జూపినం గాటమ్ములై
యమ్ము లాయమ్ములం జించి కాయమ్ములు గాయమ్ములు గావించి
సించి రుధిరమ్ములం గురిపించ నేరులై పార నంతంత బుక్కిలింతలై
యసుర సేనలనుంపనంప పెల్లుప్పరంబునం దెప్పలందేల్పఁజొచ్చిన
గ్రిందుమీఁదును, గొందలంబునొందింప నెందేనియుం బరువిడరాక,
నడుగిడ లేక, నలుఁగడలేక, మైతాకునంప పోకునంచికమకలై చేయు
నది లేక నె యిదువెరిగినట్లై తల లవిసియు, యెమ్ములురిసియు, నవ
యవంబులు జిదిసియు, గండలు విరిసియు, నెత్తురులు గురిసియు,
వివిధచిత్రవధావిహారంబులకు గురియై, దానవసేనలెల్ల నొక్కంచుజి
క్కుకుండమడిసినం జిత్తజల్లుగురిసి వెలిసినట్లైన జొత్తిల్లు క్రొన్నెత్తు
రుచేరులు సూపట్టు సంగరాంగణంబు రౌద్రభయానక నిర్నిద్రం
బయ్యె నయ్యవసరంబున గపిసైన్యంబుల సింహనాదంబులును,
శంఖారవంబులును, దూర్యవిశేషంబులు, జయభేరీస్వనంబులును,
నాకర్ణనీయంబులైన వంతయు నసుసంధించి సహస్రకంధరుండు
నిర్నిద్రరౌద్రరసావేశంబున వివశుండై సారథింబదఁడి రథంబు వర
ళించి పుష్పకంబు సమీపించి నిలచి యిట్లనిశలంచె. ౧౫౨

సహస్రకంఠుఁడు వాయవ్యాస్త్రప్రయోగముచే
నరవానరసేనల దూలఁదోలుట.

మ. అవురా! వానరవారముల్ నరులు నీ ♦ రా! నన్ను సంగ్రామికో
త్సవచిత్తుం బటుశౌర్యమత్తునతి సాం ♦ ద్రప్రాభవాయత్తునిన్
గవయన్ జాలినవారు వీరలను నీ ♦ కందాకిపోరాడఁగా
నవుబాల్లాగద! సాటివారలిదివి ♦ న్నన్ వన్నెమెల్లన్ జెడన్. ౧౨౧

చ. శరదలునేటికిన్ గలుగఁ ♦ గాఁ గలిగెన్ దరుశాఖలంటు బ
ల్పురువులు గ్రోతులన్న నరు ♦ లున్ వడియంబులు దైత్యకోటికీ
నరులను గ్రోతులందొడరి ♦ నావల పేరును బెంపుగల్గు పో
టరియనిసేయ బూనిన యె ♦ డన్ జెడుదయ్యముసేతలేమనన్.

తే. క్రోతులెక్కడ దానవ ♦ జాతులెచట
పోతరంబున నెదిరించి ♦ పోదుచునెచట
నరులు దైత్యులపైయని ♦ కరముఖెచట
మాలవిధి చేతలను కను ♦ మాలమిదియె. ౧౨౩

కం. అగుగాక పూనియనికిన్
దిగిమెదనో క్షణములోన ♦ దీరదె యీపెన్
పొగరున బూంపిరివోయెడు
నగచరసేనయును యిట్టి ♦ నరసైన్యంబున్. ౧౨౪

ఉ. కాదనిపూని పట్టినను ♦ గట్టిగనాకొక గోటికిందికిన్
రాదిదిసేనయంచు బవ ♦ రంబుసకేమని పూనువాడ నీ
బీదమనుష్యులున్ గపులు ♦ బింకముసూప నెదుర్పఁ బేరు పెం
పే దగభోరనేమనుచు ♦ బీరముసూపెదనే నిసీ! యిటన్. ౧౨౫

చ. తెరగనురాచవాడొ పెగ ♦ దేవరయో జముడొకొ్క సంద్రపున్
దొరయకొ జక్కురేడొ పగ ♦ దూకొనకయుద్ధము సేయవారలే

యరగొరలేకబంటుతన • మంతయు వీట్కొని వెట్టిసేయఁగాఁ
గొరకొరమీ నీనరుల • గ్రోతులనేమని యే నెదిర్చెదన్. ౧౨౬

చ. ఎదుటికివచ్చి చక్కటి వ • చించఁగ నన్నులుమోములయ్యయున్
గొదుకుచునుండు బాల్కడలి • గూర్కెడు వేల్పు మొగంబుచాటుగా
బెదురుచుడాగు నాకు నిది • బిమ్మటివో నరవానరాళితో
నెదిరిచి కయ్యమెట్టు లొన • రింతు నిసీ! గరువంబుదూలఁగన్.

తే. ప్రాణధనములపైత్రీపి • బారవిడచి
కడగి ద్వీపాంతరమునకి • క్కడకువచ్చి
తమ్ము నెదురునెరుంగక • మమ్మెదుర్చ
నరుగుదెంచిరె నరులు వా • నరులునకట. ౧౨౮

తే. ఆసకును మేరయున్న దే • యుతరంబె
రుంగకీషేదమనుజులు • గ్రోతు లెంత
పోతరించిరినాతోడ • బోరవచ్చి
రక్కటా! ప్రాణములు బరు • వయ్యెనొక్కొ. ౧౨౯

తే. కడగియల్పులపైకత్తి • గట్టుకొందు
మంచివారలచేఁబ్రశం • సించఁబడదు
కానవీరలతోసరి • బూని పోరు
నకట సరివారితో బెద్ద • రికముగాదు. ౧౩౦

వ. అదియునుంగాక. ౧౩౧

తే. అసురులా! వేల్పులా! విష్ట • పాధిపతుల
క్షుద్రనరులును గ్రోతులు • చూచిచూచి
యని వధించినచోఁ బ్రయో • జనముగలదె
ఫలములేనికార్యం బేల • సలుపవలయు. ౧౩౨

కం. చూచెదరుగాక వీరలు
వాచేబలువించుకంత ♦ నర వానరులన్
ద్రోచెద నెచ్చటినుండి క్రి
యా చతురతవచ్చిరిచటి ♦ కచటికిమరలన్. ౧౩౩

తే. బాణవేగంబునకుగాటు ♦ పడిస్వకీయ
పదములందునబడి బ్రది ♦ కెదరుగాక
కాకపోక్షోర్చి యటనిల్వ ♦ గలుగువాఁడు
గల్గెనేనియుజూచెద ♦ గదనమునను. ౧౩౪

కం. అనిచింతించి నిశాటుఁడు
ధనువొండుద్దవిడినెత్తి ♦ దర్పోద్ధతుఁడై
యనిలాస్త్రంబు ప్రయోగిం
చెను గాఢాకర్షణంబు ♦ జేసి విడుచుచున్. ౧౩౫

వ. అట్లు ప్రయోగించుటయును. ౧౩౬

శా. కల్పాంతంబున సప్తమారుతము లే ♦ కంబై నితాంతత్వరా
జల్పాకస్థితినేచివీచుచు జగ ♦ త్సంక్షోభముల్ జేయు న
ట్లల్పానల్పదదుర్దమంబగుచు న ♦ య్యస్త్రప్రభూతానిలా
కల్పంబాక్కటరేగి మ్రోగుచు మహో ♦ గ్రప్రక్రియన్ బైకొనన్

కం. పటుజంఝూపవనము ద్రోఁ
చుటయున్ మున్నీటగలము ♦ సుడివడెడుగతిన్
జటులాస్త్రమారుతాహతి
ఘటియిల్లిన నపుడు పుష్ప ♦ కము సుడివడియెన్. ౧౩౭

వ. అప్పుడు. ౧౩౮

కం. సుడిగాలివేగమున లో
బడి దిర్దిరదిరుగు జీర్ణ ♦ పర్ణములగతిన్

బెడిదపు శరవేగంబున
జడిముడివడి రామునేన • చీకాకువడెన్. ౧౪౦

కం. బెడిదంపు దుమారమ్మున
బడికొట్టుక పోవు గడ్డి • పరకలకరణిన్
గడిమియుడివోయినిలుకడ
చెడిపడియెన్ రామునేన • చెల్లాచెదరై. ౧౪౧

కం. ఒడసి నృపభటులు దొంగల
మెడబట్టుక గెంటి త్రోచు • మెలవున దారె
య్యెడనుండి వచ్చిరచటికి
వడిద్రోచెన్ శరము నరుల • వానరులనటన్. ౧౪౨

తే. అస్త్ర వేగంబునకుబండు • టాకులట్ల
దూలినరవానరులసేన • జాలినొంది
చిటికెలోపోయిపడిరి య • చ్చెరువుదోప
నెచటనుండివచ్చిరి మును • పచటనచట. ౧౪౩

వ. ఇట్లు భరతలక్ష్మణశత్రుఘ్నులును, సుగ్రీవాంగద హనుమజ్జాంబవంత నలనీలాదులైన యోధులతోడి వానరసేనలును, విభీషణాది రాత్రించర సైన్యంబులును, సుమంత్రాది మంత్రులతోడి నరచతురంగంబులును, మున్ను తారెచ్చటినుంచివచ్చిరచ్చోటికి క్షణార్ధంబున ద్రోయబడి విస్మితులై చేయునదిలేక నిట్లనితలంచిరి. ౧౪౪

మ. కలయో నిక్కమొ యెద్దిపుష్పకము న • క్కాకుత్స్థవంశేంద్రుడా
వ్వాలనంజిక్కెనొ యిందరుగ్ గలసి య • వ్వారాసులందాటి వే
తలలుంగల్గిన సోకుపైజనుట త • థ్యంబో యబద్ధంబొ చి
ట్టలుగాకిచ్చటికి క్కొల్లువచ్చితిమి గో • టక్ మీటినట్లంతలోన్.

తే. పుష్కరద్వీపమేది య ♦ ప్పుష్పకంబు
నేది రాఘవుఁడేడి యి ♦ దేమివింత
వేతలలగొంటి రాకాసి ♦ చేత నేమి
యైతివో రామయనుచు న ♦ త్యార్తులగుచు. ౧౮౬

కం. ఒండొరుల మొగము సూచుచు
గొండాడుచు గ్రుడ్లనీళ్లు ♦ గ్రుక్కుచు దమలోఁ
బెండువడి వ్రుల్లవోవుచు
నుండిరి శరవేగమునకు ♦ నొగి వంచితులై. ౧౮౭

సీ. అస్త్రవేగంబు జం ♦ ఝూనిలంబది కులా
చలము గదల్పఁగా ♦ జాలనట్లు
ఘనుఁడైనరాముని ♦ గదలింపఁగాఁజాలఁ
దయ్యోనాతనియున్కి ♦ నధికగౌర
వముగాంచినట్టి పు ♦ ష్పకము చలించక
నిల్చెనందున సీత ♦ నిఖిలలోక
మాత శుచిస్మిత ♦ మంజులాస్యసమేత
యగుచుండె బ్రహ్మ తే ♦ జోతిశయము

గీ. గలిమిబ్రహ్మర్షి పుంగవుల్ ♦ నిలిచిరందుఁ
దక్కుగలసేనలన్ని య ♦ ధాయధలయి
యరిగె గంధర్వ నగరంబు ♦ కరణిమరగి
యపుడుగనుమూసి తెరచెడి ♦ యంతలోన. ౧౮౮

మ. గణనాతీతములైన యట్టి జలరు ♦ ద్గర్భాండభాండంబుల
త్యణురూపంబున గుక్షిలోనిమిడి స ♦ మ్యగ్గీల వర్తించునే
ప్రణుతప్రాభవశీలుఁడై తగు పర ♦ బ్రహ్మమ్మునందట్టి కా
రణమూర్తిం గదలింపజాలునె తృణ ♦ ప్రాయంబులౌనన్యముల్.

వ. అది యట్లుండె నట్లు నిమిషార్ధంబున గంధర్వనగరాకారంబయిన శ్రీరామ సైన్యంబు దైన్యంబునూచి మింట దెరగంటి మూకలు హాహాకారంబు లొనరించిరి. రథాంతరంబుననుండి మహర్షులు శాంతివిధానంబులు జపించిరిట్టియద్భుతకృత్యంబుగావించిన సహస్రకంధరుం డెట్టివాడనిన. ౧౫౦

సహస్రకంఠుఁడు మున్నువిష్ణువును పరిభవించుట.

మ. ఘనసత్త్వుండు సహస్రకంధరుఁడు లో • కద్రోహి వీనిం వధిం
చినగాకెక్కడి మన్కియంచు భువన • శ్రేణీపరిత్రాణ ద
క్షనుఁడౌ విష్ణుఁడొకానొకప్డు గరుడ • స్కంధాంతరాయాతుఁడై
చనుదెంచెన్ జగదేకభీకరజిగీ • షాపోషితోత్సాహుఁడై. ౧౫౧

ఉ. వచ్చి సహస్రకంధరుని • వాసముఁజేరి దిశావకాశముల్
విచ్చిచనంగమార్వి రవ • లిందగు శార్ఙము నెక్కువెట్టినన్
వెచ్చని యమ్మహారవము • వీనులుసోకిన నట్టువచ్చి వై
యచ్చరవైరి రోష వికృ • తాననసంవళితాట్టహాసుఁడై. ౧౫౧

శా. పోరన్ నన్నుజయింపవచ్చితివె! పో • పో! చాలు నీబూమె తె
వ్వారంచెంతో సహస్రకంధరుని మ • ద్బాహాగ్ర కండూతి పెం
పారం దారసిలంగ నీవొకడవే • పద్మాక్షులు లోకంబులున్
జేరం జాలవు ప్రాణమింతబరువే • ఛీ! పొమ్ము నీదారికిన్. ౧౫౩

మ. అనిగర్జిల్లుచు వామహస్తమున నా • య్యన్ దార్వ్యుతో గూడ వి
ష్ణునివేగైకొని వీచివైవ లవణా • ర్ణోరాసిలో గూలి లే
చి నతాస్యుండయి చాలు నెంతపని వ • చ్చెంవింటిమే యిట్టివిం
తని యేకాంతముగాఁ బల్కుడలిపుం • తన్ బట్టిపోయెన్ వెసన్.

వ. అట్టి బెట్టిదంపు చెయిదంబున నాచుట్టుకై దువుదాల్పుం బెట్టుపరచినదిమొదలుకొని. ౧౫౫

కం. సింగంపుఁగూఁదమగాంచి య
టంగడు జంబుకములట్లు • డాఁగెద రమరుల్
పొంగెడు నాతని వాసన
యుం గదిరిన భీతిఁజెదరు • నుల్లములదరన్. ౧౫౬

తే. వేతలల పోరు కడిమి యీ • వితముగలది
యట్టిమేటి నెదిర్చి పో • రాటసలుప
గోరితులును గొండముబ్బిచ్చులు • బారితియుగునె
నరులు తద్భోజనపుటుడు • గర లెకాదె. ౧౫౭

తే. విష్ణుఁడాతండె దశరథో • ర్వీ విభునకుఁ
బుత్త్రుఁడై పుట్టి యద్దేవ • శత్రుగెలువ
వచ్చెగాలంబు విషమమై • వాలికున్న
నతని గెలువంగఁ గలుగుట • యబ్బురంబు. ౧౫౮

తే. మింటగుంపులుగొని తెర • గంటిమూఁక
మాఁకుగలిగినపుణ్యా సం • పదలఫలము
లెల్ల శ్రీరాముఁడీదైత్య • వల్లభుని జ
యించునట్లు జేయుతమని • యెంచినపుడు. ౧౫౯

కం. మారుతశరంబుతాకున
గాఁతాకులశరణిరాము • కపిసైన్యాంబ
త్తీరున దూలినవిబుధేం
ద్రారాతిశరంబుదర్పి • తాత్తుండగుచున్. ౧౬౦

తే. అస్త్రవేగంబుదాఁబతి • హాశముసేయ
వాఁడడయ్యెనుత్తుల్లకుం • డీపతియని
ఋనకులోత్తంసు లెక్కగా • గొనకనుబ్బి
భూర్చినటియించె నాసహా • సానినుండు. ౧౬౧

వ. అప్పుడు. ౧౬౨

రాముఁడు సహస్రకంఠుని బాహుబలమున కచ్చెరువు పడుట.

మ. కడిమిం బూని సహస్రకంఠుఁడు శరా ♦ ఘాతంబునం జుల్కఁ జ
ప్పుడుగావించిన దుష్కరక్రియకు రా ♦ ముం డద్భుతంబంది యొ
వ్వఁడునుంగంటిమె యిట్టి యగ్గలపు విం ♦ తల్ గోటితో మీటినం
బడియుం బో!పదునాల్గులోకములు న ♦ న్నా!యింతవాఁడుండునే.

కం. అనిలోకమెచ్చుగదురగ
దనునట్లుపరాభవించు ♦ దానికి మదిలో
గన లుప్పతిల్ల రోషము
గొనవిడగను రౌద్రమూర్తి ♦ గొనకొనితాల్చెన్. ౧౬౪

మ. అరుణాంభోజ సదృక్షరూక్షతర వీ ♦ క్షాంశోద్వమజ్జ్వాలి క్రో
త్కరదుర్లక్ష్యసముల్లసద్వదన మ ♦ ధ్యాహ్నార్కరోచిష్ణుఁడై
పరమక్రోధ రసోల్బణాకృతిగడుం ♦ భాసిల్లు శ్రీరామునిం
భరియింపంగ నశక్తయయ్యె ధర గం ♦ పంబొందె నంభోనిధుల్.

మ. అతిఘోరాకృతియైన రామవిభు రా ♦ ద్రావేశముం సైపక
క్షితిసాంభోధి కులాచలంబుగ జలిం ♦ చెం దిక్కులల్లాడె సం
పతితంబయ్యెనుడువ్రజంబు శశియుం ♦ భానుండు మార్గాంతర
స్థితిగంపిల్లిరి యెల్లలోకములు ని ♦ శ్చేష్టంబులయ్యెం గడున్. ౧౬౬

వ. ఇట్లు ప్రళయభైరవాకారంబున దుర్నిరీక్ష్యుండైన రఘుశ్రేష్ఠుండు సహజదైత్యవైరదుర్వారుండు గావున నన్నిశాచరవర మారణోద్యోగంబునం బ్రవృత్తుండై కార్ముకంబు సజ్యంబుగావించి గుణంబు సారించి తద్దీర్ఘనిర్ఘోషంబునం దిక్కరి శ్రవణపాటవంబుగావించి మించి తూర్ణంబునను దీర్ణనారాచసంచయంబుబరగించి యాసహస్రవదనుని రథంబునకు మించి ముందునకువచ్చిన చతురంగంబుల

నెల్ల దిలమాత్రఖండంబులుగావించి బాణలాఘవంబు మెరయించి సింహనాదంబుగావించిన సైరించక రాత్రించరశేఖరుండనీకాగ్రంబు బాసిపించి గర్జించి యిట్లనియె. ౧౬౭

సహస్రకంఠుఁడు రామునిపైవచ్చుట.

మ. ఉరకంజూచుచు నిల్వుడీ యసురులే ♦ నొక్కండ నిర్జింతు నీ
నరునాకస్మిక శత్రునెచ్చటికి జ ♦ న్నఁగ నేటితో జేతు ని
ద్ధర నిర్మానుషగా దివంబు నిరమ ♦ ర్త్యవాసితగా భూధరో
త్కరముల్జూర్ణముగా నభం బపభగా ♦ గంభుల్ విశోషిల్లఁగన్.

మ. అనిగర్జిల్లుచు రాముపై నడచి రా ♦ రా?రాజకీటంబ వా
రనిశౌర్యంబున వచ్చితియ్యెడకు శూ ♦ రం మన్య లంకాపురం
బని భావించితొ పేదరావణుఁడితం ♦ డంచెంచితో యెవ్వరే
మని మోసంబొనరించిరో ననుసహా ♦ సాస్యున్నిరీక్షించవే.

చ. చొరవడి యచ్చటచ్చటను ♦ క్షుద్రుల దైత్యుల గొందరిం రణాం
తరమున గెల్చినాడనని ♦ దర్పము పెంపున కన్నుగాన కి
త్తెరవున కొల్లువచ్చితివి ♦ దీప్తశరంబుల నీశిరంబిదే
నరికి నవాస్రమామెత లొ ♦ నర్తు మదీయ నిశాటకోటికిన్. ౧౭౦

కం. కరి వెలగపండు చిదిమెడు
కరణి శిరంబుఁబగుల్తు ♦ గదవ్రేటున ని
బ్బరమింతసూపి నిలువుము
మరిపోవగరాదు నన్ను ♦ మార్కొని యెటకున్. ౧౭౧

వ. అనిన శ్రీరాముఁ డిట్లనియె. ౧౭౨

కం. ప్రల్లదములాడనేటికి
క్షుల్లకుల తెరంగుగాగ ♦ శూరాగ్రణివై.

విల్లు కరంబున నుండఁగ
యల్లనఁజే బలుపు నూపు ♦ మా దైత్యవరా!. ౧౭౩

కం. బెదరించిన బోదుమె నీ
వదన సహస్రంబు తాళ ♦ ఫలముల కరణిన్
జిదిమి ధరరాల్చ కెక్కఁడి ·
బ్రదుకింకిట నీకు దెలియ ♦ బహునిముసమునన్. ౧౭౪

కం. అనుచుఁ బరుసంబులాడుచు
దనుజ కులాగ్రణియు రామ ♦ ధరణీశుఁడు మా
ర్కొని రెండోరువుల నయ్యెడ
ననర్గళ శరప్రవాహ ♦ మదిదివిగప్పెన్. ౧౭౫

### సహస్రకంఠ రామద్వంద్వ యుద్ధము.

ఉ. దిక్కులుపిక్కటిల్ల నతి ♦ తీవ్రశరంబులు రోదసీస్థలం
బెక్కఁడగన్న సూదిమొన ♦ యేనియుదూరగరానియట్లుగా
నొక్కట నావరింప బగ ♦ లో నిశియో యెఱుంగరాని య
ట్లక్కజమైన చీకటుల ♦ నావృతమయ్యె దిగంతమంతయున్. ౧౭౬

కం. దొననుండి దివురుటయు గుణ
మునఁగూల్చుట లాగుటయును ♦ బోవిడుచుటయున్
గనరాక నేయఁదొడగిరి
మనుజ దనుజ వరులు నిశిత ♦ మార్గణపటలిన్. ౧౭౭

ఆ. అంచగరుల దెల్ల ♦ నౌ రాముసమ్ములు
గంకపక్షనైల్య ♦ కలన దనుజు
సాయకములు బెరసి ♦ చదలు గప్పిన దిల
తండులములు నెరపు ♦ దారిదోచె. ౧౭౮

మ. అసురుం డేయనృపుంసు ద్రుంచనృపుఁ డే • యం దైత్యుఁ ద్రుంచఁ
నసమా స్త్రంబులఖండముల్ గడు దలం • బై తీట్లలై గుట్లలై (గా
వసుధర్ గప్పె బరస్పరాభిహతినూ • ర్ధ్వవ్యాప్తిచేఁ గొన్ని యా
కసమెల్లన్ గళితావకాశముగ వీ • కం జేసె నాసందడిన్. ౧౭౯

కం. ఒండొంటిదాకి చురచుర
మండుచు దివి కెగయు నిశిత • మార్గణతతి భూ
మండలి దివి పైనుల్కల
పిండుగు కియునట్లుదోచె • పెల్లగుచునటన్ ౧౮౦

కం. మిడిసి తమమీద నెచ్చటఁ
బడునోయని తొలగి తొలగి • పలుమరును భయం
పడి మింట దిరుగు వేల్పులు
కడు వెక్కసపడుదురపుడు • కయ్యముసూడన్. ౧౮౧

కం. వేయిధనువులను విడువక
నేయు మహాసురుని పూన్కి • కెక్కువ మైయె భూ
నాయకు శరములసంఖ్యము
లై యసురుని రథముగప్పె • నద్భుతలీలన్. ౧౮౨

కం. గెలుపోటములిం చుకయున్
దలపంగారాక మనుజ • దనుజాధిపతుల్
బలివాసవుల తెరంగున
సలిపిరి చూపరకు వెక్క • సముగ దురంబున్. ౧౮౩

వ. అట్లు పోరునెడ. ౧౮౪

తే. దనుజవల్లభుఁ డేసె గాం • ధర్వ బాణ
మవనిపతి గ్రమ్మరించె న • య్యస్త్రమున నె
దైవతాస్త్రము మరలించె • దానవేసి
యుగ్రమంబున నప్పర • మాస్త్రవిదుడు. ౧౮౫

సీ. అపుడు సహస్రకం • ఠాసుఁడుండతిరోష
　　　వివశుఁడై గర్జిల్లి • వికృతముగను
నట్టహాసముసేసి • యాశీ విషాస్త్రంబు
　　　సంధించి తన్మాత్ర • సహితముగను
విడచిన నతిఘోర • వివృతాస్యములు విషా
　　　నలసుజాజ్వల్యమా • నములు శేష
వాసుకినిభములై • వరలుమహాభుజం
　　　గమజాలములు ననం • ఖ్యములుగలుగ.

గీ. నతిభయదలీల శ్రీరాము • నాక్రమింప
నెందుజూచినదాననయై • యేగుదేర
నది కనుంగొని యప్పర • మాస్త్రవిదుఁడు
రాముఁడప్పుడు విక్రమో • ద్దాముఁడగుచు. ౧౮౬

శా. సౌపర్ణాస్త్రము మంత్రసంయుతముగా • సంధించి బిట్టేసినన్
కోపాగ్నిజ్వాలదక్షిగోళములు న • క్షుద్రోచ్చలత్పక్ష వి
క్షేపక్షిప్త కులాచలంబులు దురు • చ్ఛేద్యంబులుచ్చంచుక
వ్యాపారంబులునై జనించె గరుడ • వ్రాతంబసంఖ్యంబుగన్. ౧౮౭

కం. ఆగరుడవ్యూహంబులు
భోగిసమూహంబు నిముస • మున జించి మహీ
భాగ గతంబుగఁజేసె న
భోగతులబ్బురముసెంది • పొగడఁగ వేగన్. ౧౮౮

చ. ప్రతిహతమై నిజాస్త్రము ప • రాముమునొందిన దోకదొక్కను
గ్రతగనలొందు పన్నగము • కైవడి మోగుచు రేగి విక్రమో
ద్ధతిని ధనుస్సహస్రమున • దారుణబాణపరంపరల్ నిగు
డ్చి తదిమి శస్త్రసంపిహితు • జేసె క్షణార్థములోన రామునిన్.

ఆ. కొండలంతలేసి ♦ గండశిలలు చిత్త
జల్లుకరణి నవుడు ♦ పెల్లుబరపి
పుష్పకం బదృశ్య ♦ ముగజేసె నత్తాక
సైప కవనిపతి వి ♦ షణ్ణుఁడయ్యె. ౧౯౦

శా. ఆసంరంభమునూచి రాముద్దెస నా ♦ సల్మాని మింటందళం
బై సిద్ధర్షి సురాదులొక్కమొగి హా ♦ హాకారముల్సల్పి రు
ల్లాసంబందిరి దైత్యదానవులు చా ♦ లన్ దైత్యరాడ్గ్రిహు సం
గ్రాసక్లేశము రామచంద్రునకుఁ గ ♦ ల్గన్ లోకముల్ భీతిలెన్.

వ. అప్పుడు. ౧౯౨

సీ. చంద్రవల్లభ నుప్రజాపత్య తారక
నాక్రమించి బుధుండు ♦ వక్రలీల
ప్రజలకు నహితమే ♦ ర్పడదృశ్యమానుఁడై
తగ ధూమకేతువు ♦ దగిలిమంద
రశ్మియై నష్టధ ♦ ర్మతగ బంధాంకుఁడై
పరుషవై ఖరిదోచె ♦ భాస్కరుండు
ఘనసధూమజ్వాలి ♦ కాపరివృతమయి
జలధిసూర్యనిడాయ ♦ జదలబ్రాంగె

గీ. గగనమండలమున బుట్టు ♦ ఖరసవృక్ష
రూక్షనిర్ఘోషములు ప్రతి ♦ శ్రుతములయ్యె
ప్రకటముగగల్గె నిట్టి యు ♦ త్పాతశతము
లహితమగునని తెలుప న ♦ య్యవసరమున. ౧౯౩

మ. భ్రుకుటీస్ఫూర్జిత ఫాలభాగుఁడగుచున్ ♦ భీమాట్టహాసస్ఫుర
ద్విక్రుతాస్యుండయి రక్తపంకజ సదృ ♦ గ్వీక్షావమద్విస్ఫులిం
గక దుర్లోకభయంకరాకృతి నెలం ♦ గన్ సంప్రవృద్ధక్రుధా
ధికుఁడై రాముఁడు ప్రజ్వరిల్లెనపుడు ♦ దీప్తాగ్ని చందంబునన్.

తే. కనుగొనల చాల విస్ఫులిం • గములురాల
రోమకూపంబులను జ్వాల • లావతిల్ల
నుగ్రుఁడై రాముఁ డసురేంద్రు • నున్నయునికి
సీరుసేయఁగజాలు న • స్త్రైరహించె. ౧౬౫

రాముఁడు సహస్రకంఠుని పైఁ బ్రహ్మాస్త్రము ప్రయోగించుట.

తే. అట్లురాముఁడు సంక్రుద్ధుఁ • డైనసర్వ
భూతములును సంత్రాసంబు • బొందెసకల
శైలజలరాశికానన • సహితముగను
నింపుసెడి భూత ధాత్రియుఁ • గంపమొందె. ౧౬౬

తే. అట్లు సంక్రుద్ధుఁడైన రా • మాధిపుండు
మున్నులంకను దశకంఠు • మన్నిగొనక
నస్త్రమెద్దిప్రయోగించె • నదిగ్రహించె
నాలుకలుగ్రోలుచున్న ప • న్నగముకరణి. ౧౬౭

సీ. భగవంతుఁడగుకుంభ • భవుఁడిచ్చెనదిరాము
నకు రావణాది వి • నాశమునకు
బ్రహ్మనిర్మించె బూ • ర్వము దాని దైత్యలోక్య
విజయార్థియౌదేవ • విభునికొఱకు
నదిక్రమంబునను బ్ర • హ్మర్షికులక్రమా
గతముగాదొరకె న • గస్త్యమునికి
నప్రతిహతమహి • మాన్వితంబై సర్వ
దేవాత్మకంబుగాఁ • దేజరిల్లె

గీ. నఖిలలోకైక దుర్జయుఁ • డైనపక్షి
కంధరునిప్రాణములను గ్రు • క్కగొనిక్రోలె
నట్టిదివ్యాస్త్రమునురాము • డందినంత
వడవడవడంకె బ్రహ్మాండ • పఙ్తులెల్ల. ౧౬౮

వ. మఱియు నయ్యస్త్రరాజంబునకు గరుల బవనుండును ఫలంబున నగ్నిభాస్కరులు శరీరంబున నాకాశంబును గౌరవంబున మేరుమందరంబులును నంగప్రత్యంగంబుల ధనద వరుణాంతకాది లోకపాలురును బ్రతిష్ఠింపఁబడియుండిరి. తేజంబున సర్వభూత దుర్దర్శనంబుగను, సధూమంబగు కాలాగ్నిచందంబునను, హేమ పుంఖభూషితంబై ప్రజ్వరిల్లుచునుండునానాయుధవిచ్ఛేదనంబును, పర్వతప్రభేదనంబున ననేక రక్షోరక్తసిక్తాంగంబును, సకలశత్రు నిబర్హణంబును, మహాచతురంగ నిర్మూలనశీలంబున నృపతిహతంబును, సర్వభూత భయావహంబును నగు నమ్మహాశరంబుఁ గరంబునంగొని.

తే. మంత్రపూతముజేసి య ♦ మ్మార్గణంబు
వింటసంధించి శ్రవణంబు ♦ లంటలాగి
రావణునిరొమ్ము గురిచేసి ♦ రామచంద్రుఁ
డతులరోషదుర్దర్శనుఁ ♦ డగుచువిడచె. ౨౦౦

చ. విడచిన గ్రొంబొగల్వెడలి ♦ వింటగలంతయు నిండఁదోడనే
బెడిదపుమంటలొక్కమొగి ♦ భీకరవైఖరి నుప్పతిల్లగా
బిడుగులసంఖ్యముల్వడెను ♦ పెల్లునమ్రోగుచు నెల్లలోకముల్
గడగడలాడగా వెడలె ♦ గ్రక్కునవేదలలయ్యమీదికిన్. ౨౦౧

రామునిబ్రహ్మాస్త్రము సహస్రకంఠుఁడు భగ్నముసేయుట.

కం. భువనభయంకరలీలం
జవమున బరతెంచునట్టి ♦ శరముంగని దా
నవభర్త హుమ్మనుచు నా
పి వేసె బెడకేలబట్టి ♦ పెంపర విరచెన్. ౨౦౨

తే. అఖిలలోకదుర్ధర్షమా • నస్త్రరాజ
మహిమ వ్యర్థమైచనంగ రా • మావనీంద్రుఁ
డతివిషణ్ణచిత్తుండు శో • కాకులుండు
నగుచు జదికిలబడియె చే • యూడకపుడు. ౨౦3

కం. ఆకృతి విషణ్ణుండగు
భూరమణునిదాకిగర్వ • మునసమ్ముఖభు
గ్వైరి సముద్ధతగతి గ
ర్జారవముఖరుఁడయి నిశిత • శరములు నరపెఁ. ౨౦౪

సహస్రకంఠుఁడు రాముని క్షురాస్త్రవిద్ధుని జేయుట.

కం. క్షురమను నస్త్రము వింటన్
బరువడిసంధించి తిగిచి • పరగించిన భూ
వరునురముగాఁడి వెలువడి
ధరజొచ్చిన మూర్ఛమునిఁగి • లేటుకునవ్రాలెన్. ౨౦౫

తే. పోటుగంటిన రుధిరము • పొంగివెడల
సడలిచేష్టలు బడలి కీ • లెడలినట్టి
జంత్రపుంబొమ్మకరణి భూ • జానిపుష్ప
కమున బడియున్న దెసల జీ • కట్లుగ్రమ్మె. ౨౦౬

రాముఁడు మూర్ఛిల్లుట.

మ. కలఁగెన్ వారిధి సప్తకంబు పవన • స్కంధంబు లల్లాడె ది
క్కుల బెంజీకటులావరించె వడఁకెన్ • క్షోణీధరంబుల్ జగం
బులు సోత్కంపములయ్యె మిన్ను మొరసెన్ • భూతంబులాక్రోశవి
హ్వాలతన్ గాంచె రవీందుపంధలతి వి • భ్రాంతంబులయ్యెన్ వెసన్.

తే. అఖిలసంక్షోభహేతువై • నట్టిరాము
మూర్ఛగనుగొని యమ్మహా • మునులు సురలు

మంట మింట మహారవం ♦ బంట జంట.
లగుచు హాహారవముచేసి ♦ రతిభయమున. ౨౦౮

క. తలచిరిది వోయకాండ
ప్రళయంబఖిలాబ్జజాండ ♦ పఙ్త్తులకని వే
ల్పులు పిచ్చలించి బ్రహ్మా
దులు దిగులొందిరిక నెద్ది ♦ తుదయోయనుచున్. ౨౦౯

మునులు భయమొందుట.

తే. అట్టిజగదేక విప్లవం ♦ బవధరించి
పుష్కరనివిష్టులగు మహా ♦ మునులుశాంతి
జపముసలుప నోరాడక ♦ జపలులగుచు
రిచ్చవడిరి భయంబున ♦ ముచ్చముణిఁగి. ౨౧౦

క. ఆసమయంబున నవదర
హాససమేతాస్య యగుచు ♦ నటనిల్చిన సీ
తాసతిగని తపసులు సం
త్రాసముతో బలికి రి త్తె ♦ రంగునఁ గృశులై. ౨౧౧

శా. సీతాయేమని విన్నవించితివి వ ♦ చ్చెన్ గీడు ధాత్రీసుతో
ద్వైతేయాధిపువృత్తముందున జగ ♦ త్త్రాణైక పారీణుఁడై
యేతెంచెన్ గద రాముఁడిచ్చటికి ని ♦ క్కేసుందు మత్యాహితం
బై తోఁచెన్ గడలేని యాపదతరం ♦ బా! తీర్ప నెవ్వారికిన్. ౨౧౨

తే. అమ్మరోసేన లేమాయె ♦ సనుజులేరి
ఘోట్లుఘటియించె నిపుడింత ♦ లేసిపనులు
రణమునను రాము నెదిరించి ♦ బ్రదికిపోక
గాక నెంతలు సేసె నీ ♦ సోకుఱేఁడు. ౨౧౩

కం. అనియిట్లు కొందలంబున
మునులడలఁగ నాలకించి ♦ ముసిముసినగవుల్
గనుఁగొనల దోప సీతా
వనజాయత నయన కొంత ♦ వడికిట్లనియెన్. ౨౧౫

కం. మునులార! మీరు వెరవఁగ
బని లేదు నృపాలమౌళికి ♦ భయమింతయు లే
దనుమానమేల నేఁడీ
దనుజుని మడియింతు జగము ♦ దలకొని కాతున్. ౨౧౬

కం. ఉల్లమున నడరు గర్వము
వెల్లువ ద్రుళ్లెడునవీఁడు ♦ పేర్మి ద్రిజగ
న్మల్లుఁడనని నిముసములో
ద్రెళ్లించెద జూడుడింక ♦ దృఢమతులారా! ౨౧౭

సీ తా సం రం భ ము , స హ స్ర కం ఠ వ ధ.

వ. అనిచెప్పి యప్పుడప్పుష్పకోపరితలంబున జిత్తజక్రీడాయత్తత బరి శోభితుండై మత్తకాశిని గుత్తంపు గుబ్బలం గౌగలించుకొని యుత్తమిల్లిన పురుషసత్తముని యెత్తున నాలింగితధనుష్కాండును, గించిన్మీలిత లోచనుండునునై శయానుండైన ప్రాణేశ్వరుని యొప్పరకించి యుప్పరంబున గర్జిల్లుచున్న దుర్జాతుండగు దైత్య వల్లభునభివీక్షించి రూక్షభంగి నీక్షణంబుల దక్షిణంబున సముద్ధతంబగు క్రోధానలంబు జాజ్వల్యమానంబై యంతరంగంబు పట్టసాలకనిట్టవొడువ నట్టహాసంబుసేసి కెవ్వున నార్పి పేర్చి నిజసాముమార్త్య రూపంబుజగించి క్షుత్క్షామోదరంబును, గోటరంబులవోలు నయన గోళంబుల జక్రభ్రమణంబుసేయు మిడిగ్రుడ్లును, దీర్ఘంబులగు జంఘలును, గరాళవక్త్రంబును, నాజానుబాహా చతుష్కంబును,

లలజ్జిహ్వాయు, వివృతాస్యంబును, నష్టిరకిరీ సముద్దతహారాభూషితంబును, ఖరస్వనంబును, నగు భయంకరాకారంబు దాల్చి, యూరితగరిత విద్యుల్లతాయుతంబగు ప్రళయ కాలాంబుదంబు తెరంగున ఖడ్గకర్పరంబులు ధరించి, రథంబుననుండి యుద్గమించి, కపోతంబు పై కురుకు సాళువంపుడేగ చందంబున సహస్రకంధరుని పైకురికి కరవాలంబు వెరికి, తత్కంధరా సహస్రంబుల్వ్రేత్తుగనరికి, యార్చి పేర్చిన దద్దానవేంద్ర విచ్ఛిన్న గళనాళ సహస్రంబునుండి చిమ్మిన గ్రోవి చిమ్మినకరణి నభంబునకుద్గమించు రక్తధారా సహస్రంబు జయలక్ష్మి వసంతోత్సవంబు పగిది బరిదృశ్యమానంబయ్యె. నయ్యవసరంబున వీరరౌద్రావేశంబు మూర్తీభవించిన చందంబున నర్తించుచు నమ్మహాదేవి దానవేంద్రునితోడి యోధవీరలోకంబు పైకురికి. కొందరి శిరంబులు కరవాలంబునకు గురిచేసియు, గొందరి తలలు నఖాగ్రంబులం జిదిమియు, గొందరి పాదంబులు ఛేదించియు గొందరి బక్కలు జక్కాడియు, గొందరి యురంబులు నుగ్గుము ఛేసియు, గొందరి హస్తంబులు విహస్తంబులు గావించియు, బహువిధంబుల వధించి, తనిని సనక జగత్ప్రళయంబు సేయునో యన భయంకరాకారంబునం దేజరిల్లిన యసుర విసరంబు దెస గానక ననురుసురని పారవజొచ్చిన గనిమసంగి యట్టహాసంబున నిశ్చేష్టులంగావించి శిరంబులు నుగిమియు నుదరంబులు విదారితంబులు సేసియు, నాంత్రంబులం ద్రెంచియు, జఘటంబులను జానుకూర్పరాఘాతంబులను, బాదవిక్షేపంబులను, నచేతనాంగులంగావించియు చిత్రవధావిహారంబున విదారించి నిమిషార్ధంబున నక్తంచర ప్రకరంబు నొక్కండును జిక్కకుండ నుసిమాడి తదీయాంత్ర మాలికలధరించి, భయానకమూర్తియై తదీయశిరంబులం గందుక క్రీడగావించుట, కుత్సహించిన యమ్మహాశక్తి రోమహర్షంబుల

సాట్టహాస వికృతాకారస్సుగు మాతృకా సహస్రంబు లున్నవి వివి-
వారల నామంబులు గొన్ని వివరించెద వినుమని యుగ్గ్రసియె.

మాతృకా సంభవము, తన్నామములు.

సీ. అలప్రభావతివిశా ♦ లాక్షిపాలితగోన
సియుబహుళాఖ్యయు ♦ శ్రీమతియును
బహుపుష్పికాఖ్య గో ♦ పాలియునప్సుజా
తయుజయంవతిబృహ ♦ దంబశాలి
కయుమాలతికధృవ ♦ కమలాక్షిరత్నాభ
యంకరివసుధామ ♦ యాసుధామ
యేకచూడయును,వి ♦ శోకనందిని మహా
చూడచటీతమ ♦ సుప్రసాద

గీ. చక్రనేమియు త్తేజని ♦ జయయుసేన
శోభనాఖ్యశత్రుంజయ ♦ శుభ్రవక్త్ర
క్రోధనయు శలభయు ఖరి ♦ మాధవియును
తీర్థసేనజటోజ్వల ♦ దీర్ఘజిహ్వ. ౨౧౭

వ. మరియును, గీతప్రియకల్యాణి కద్రురోమ అమితాశన మేఘస్వన
భోగవతిసుభ్రువు కనకావతి అలాతాక్షి వేగవతి విద్యుజ్జిహ్వా భారతి
పద్మావతి సునేత్ర గంధర బహుయోజనసన్నాళిక మహాకాళి కమ-
ల, మహాబలి, సుదామ, బహుదామ, సుప్రభ, యశస్విని,
నృత్యక్రియ, పరానంద, శతోలూఖల, మేఖల, శతఘంట, శతా
నంద, ఆనంద, భవతారిణి, వపుష్మతి, చంద్రసీత, భద్రకాళి,
సటామల, ఝుంకారిక, నిష్కుటిక, రామ, చత్వరవాసిని, సు-
మల, సుస్తనవతి, వృద్ధికామ, జయప్రియ, ధనద, భవద, జనే
శ్వరి, పడి, ఖేడి, సమేడి, వేతాళజనని, కండూతి, కంముక, వేద

మిత్ర, సుదేవిక, లంబాస్య, కేతరి, చిత్రసేన, చలాచల, కుక్కుటిక, శృంఖలిక, శంకులిక, హాద, కందాలిక, కాకలిక, కుంభిక, శతోదరి, ఉత్క్రాధిని, వేశ, మహావేగ, శంకిని, మనోజవ, కటకని, ప్రఘన, పూతన, ఖేశయ, అతిద్రష్టము, క్రోశనాధ, తటిత్ప్రభ, మందోదరి, తుండి, కోటర, మేఘవాహిని, సుభగ, లంబిని, లంబ, బహుచూడవికత్థిని, ఊర్ధ్వవేణి, ధరపింగాక్షి, లోహమేఘ, పృథువక్త్ర, మధువిహా, మధుకుంభ, యక్షానిక, మత్సరిక, జరాయువు అర్జునానన, ఖ్యాత, దహాదహా, ధమధమ, ఖండఖండ, పృథుశ్రోణి, పూషణ, మోకట్టుక, అమ్లోచ, నిమ్లోచ, లంబపయోధర, వేణువీణాధర, పింగాక్షి, లోహమేఖల, శశోలకముఖి, హృష్ట, ఖరజంఘ, మహాజర, శిశుమార, ముఖశ్వేత, లోహితాక్షి, విభీషణ, జటాలిక, కామచరి, దీర్ఘజిహ్వా, బలోత్కట, కాలాహిక, యామాలిక, ముకుట, ముకుటేశ్వరి, లోహితాక్షి, మహాకాయ, హావిపెండ, పిండిక, ఏకత్వచ, సుకూర్మ, కుల్లాకర్ణి, కర్ణిక, సురకర్ణి, చతుష్కర్ణి, కర్ణప్రావరణ, చతుష్పథనికేత, గోకర్ణి, మహిషానన, ఖరకర్ణి, మహాకర్ణి, భేరీస్వన, మహాస్వన, శంకకుంభశ్రవ, భగద, మహాబల, గణ, సుగణ, కామద, కన్యక, చతుష్పథరత, భూతితీర్థ, అగోచర, పశుద, విభుద, సుఖద, మహాయశ, పయోద, గోమహిషద, సువిశాల, చతుర్భుజ, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, రోచమాన, సులోచన, నౌకర్ణిముఖకర్ణి, విశిర, రుధిని, ఏకవక్త్ర, మేఘరవ, మేఘనాద, ద్విరోచన యను నీమొదలగు నామధేయంబులు గలవారలనేక కోటి సంఖ్యాకలు, దీర్ఘవక్షో దంతతుండలు, సరసలు, మహారాకృతులు యౌవనస్థులును, స్వలంకృతలు, మహాత్మ్యసంయుక్తలు, కామరూపధరలు, నిర్మాంసగాత్రలు, శ్వేతకాంచనవర్ణలు, కృష్ణమేఘసదృశ

లు, ధూమ్రవర్ణలు, నరుణకాంతియుతలు, దీర్ఘకేశినులు, నూర్ధ్వవేణీధరలు పింగాక్షికలు. లంబోదర లంబకర్ణ లంబస్తన లంబమేఖలాయుక్తలు, తామ్రాక్షణులు, తామ్రవర్ణలు, ననుబహువిధవికృతావికృతాకారలగు మాతృకాశక్తుల సంఖ్యాతలుద్భవిల్లి యందరుంగలసి సీతామహాదేవితోడ గందుకక్రీడగావింప నుత్సుకలై రట్టియెడ. ౨౧౯

సీ తా మా తృ కా కం దు క క్రీ డ.

శా. జోడై కూడి యసంఖ్యమాతృగణముల్ ♦ జోకం దిగంతంబు ల
ల్లాడం బ్రుబ్బుచు గేకిసల్గొనుచు హా ♦ స్థాయత్తలై యొండొరుల్
గూడం బాడుచు దైత్యమస్తచయము ♦ గ్గొందగ్గుగా గందుక
క్రీడల్సల్పిరి రామపత్నికడకన్ ♦ గ్రేన్గుబ్బినర్తించుచున్. ౨౨౦

శా. సీతాస్ఫీత కరాగ్రఖడ్గపరిత ♦ చ్ఛిన్నోగ్ర నక్తంచర
వ్రాతద్యోతచిరత్నరత్నమకుట ♦ ఖ్యాతిస్ఫుటన్మస్తకా
యాతాయాత విధాతిచిత్రితమహా ♦ ద్యావాపృథివ్యంతరం
బై తత్కందుక లీలలోచన సుఖంబయ్యెన్ సురశ్రేణికిన్. ౨౨౧

కం. దోషాటరుండమాలా
భూషితలై యట్టహాస ♦ ములసతివిహ్వాఁ
న్మేషమున మాతృనిచయమ
శేషముగీర్తించెనపుడు ♦ సీతాజయమున్. ౨౨౨

కం. పొంగడుచు మగుడుచు నిగుడుచు
నగడున మాతృగణమిట్టు ♦ లాడంగలీలా
ద్విగుణోత్సాహతసీతా
జగదేక సవిత్రిక్రీడ ♦ సలిపె రణభువిన్. ౨౨3

తే. కంకగృధ్రశివాస్వరా ♦ కంపితంబు
బహుళమాంసాసృగురువసా ♦ పంకిలంబు
విపులబీభత్సవేతాల ♦ విహృతిభయద
మగుచునతిఘోరమగు సంగ ♦ రాంగణమున. ౨౨౪

ఉ. వేతలలోపల నయ్యసుర ♦ ప్రేవులప్రోవులసుట్టి తచ్ఛిరో
వ్రాతముమాలికల్ గుదిచి ♦ వైచి సహస్రము తత్కపాల పా
త్రితతిబూనిలోకభయ ♦ దంబగు నాకృతిమీరనయ్యెడన్
జాతురిమీర నర్తనము ♦ సల్పఁగఁజొచ్చె మహోత్సవంబుగన్.

మ. బలవన్మారుత పీడ్యమానమగుచున్ ♦ వారాశి విభ్రాంతమా
కలముంబోలి ధరిత్రి చిత్రముగనా ♦ కంపించె భూమీధ్రముల్
చలియించెన్ దెసలల్లలాడి వడకెన్ ♦ సప్తాంబురాసుల్ గడున్
గలుషీభూతములయ్యెనయ్యెడమహా ♦ కాళ్యుగ్రనృత్యంబుగన్.

సీ. రవివాహములుముక్త ♦ రశ్మిలై యావలీ
వలనయ్యె గ్రహతార ♦ కలుచలించె
నభమునవ్యోమయా ♦ నములుగ కాపిక
లగుచునుర్వరగూలె ♦ నట్టహాస
సహితంబుగామహా ♦ శక్తి నృత్యముసల్ప
దుస్సహంబైన ద ♦ ద్భూరిభార
మోర్వీగజాలక ♦ యుర్వీరసాతల
గమనోన్ముఖత్వంబు ♦ గాంచిక్రుంగ

గీ. జొచ్చెనట్టియెడరు ♦ సూచియకాండప్ర
ళయమటంచు సురలు ♦ భయమునొంది
కావుకావుమనుచు ♦ దేవదేవునిమహా
దేవువేడిరపుడు ♦ దీనులగుచు. ౨౨౭

శివుఁడు శవరూపధారియై సీతాపాదభరము వహించుట.

సీ. సురలకుయ్యాలించి ♦ పరమేశ్వరుఁడు జగ
ద్గురుఁడుసదాశివుఁ ♦ డరుగుదెంచి
శవరూపధారియై ♦ జానకీపాద వి
న్యాససహిష్ణుఁడై ♦ యాత్మదేహ
మచట సంస్తంభించె ♦ నందుచే నుపశాంత
భారమైవిశ్రాంతి ♦ వసుధగనియె
జనకజాదీర్ఘని ♦ శ్వాసమారుతముచే
నతిఘోరహుంకార ♦ గతులచేత

గీ. నూర్ధ్వలోకంబులన్నియు ♦ నురుభయప్ర
కంపమానంబులై చిక్కి ♦ గాడుపడియె
నపుడుబ్రహ్మేంద్రముఖ్యులౌ ♦ నమరవరులు
సాంజలిశిరస్కులై వచ్చి ♦ రతిరయమున. ౨౨౮

కం. వచ్చిజయజానకీయను
నుచ్చైర్నాదములు వెలయ ♦ నురుతరభక్తిన్
జెచ్చెరసాష్టాంగంబుల
నచ్చటగావించినిల్చి ♦ సాంజలులగుచున్. ౨౨౯

ఉ. భూతసవిత్రి యాజనక ♦ పుత్రి ద్విశక్తి మయస్వరూపిణిన్
సీతఁ బ్రసన్న జేయుటకు ♦ జెచ్చెర వచ్చి వియచ్చరేంద్ర కం
జాత భవాది నిర్జర ని ♦ కాయము సన్నుతి చేయఁజొచ్చె స
త్యాతత సర్వవేద పర ♦ మార్థ నిగుంభిత వాక్యసంపదన్. ౨౩౦

బ్రహ్మాదికృతసీతాస్తవము.

తే. జయము జయమమ్మసీకోత్రి ♦ శక్తిరూపి
జయము జయము సమస్త వి ♦ ష్టప సవిత్రి

జయము జయము మహోన్నతై ♦ శ్వర్యధాత్రి
జయము జయమగు నీకు నో ♦ జనకపుత్రి. ౨౩౧

కం. నీవే విశ్వసవిత్రివి
నీవే పరాశక్తివఖిల ♦ నేత్రివి పుపుర్ణ
దావివలె నెపుడు నవినా
భావవగుచు నీశునందు ♦ బరగెద వెలమిన్. ౨౩౨

కం. స్వచ్ఛంబగు బ్రహ్మంబున
నిచ్ఛాజ్ఞానక్రియాప్తి ♦ నెసగి జగత్స
ర్గేచ్ఛ జనింపగ జేయుదు
చిచ్ఛక్తివనన్యరూప ♦ సిద్ధపు జననీ. ౨౩౩

కం. ఏకస్వరూపవయ్యు న
నేకోపాధిస్వరూప ♦ మొనసి నిజాంత
స్స్వీకృతి నేకబ్రహ్మము
నైకాకృతి జేతు విశ్వ ♦ నటనము సలుపన్. ౨౩౪

చ. అరయగ నిర్గుణుండయిన ♦ యట్టి పరాత్పరు సన్నిధిన్ క్రియా
పరిణతి విశ్వమెల్ల సలు ♦ పన్ నిలుపన్ జెరుపంగ హేతువై
పరగెద వీవ యింతయు ♦ భవన్మహిమంబు గుణాను షంగ సం
విరహితుడీశ్వరుండు పర ♦ మేశ్వరి వీవ గదమ్మ జానకీ. ౨౩౫

సీ. శాంతి విద్యాప్రతి ♦ ష్ఠా నివృత్తులనంగ
నాల్గు భేదంబులై ♦ గల్గు నీదు
శక్తు లధిష్ఠాన ♦ సంప్రాప్తి నీశ్వరుం
డును వ్యూహ భేదంబు ♦ నెనసి విశ్వ
హేతువై తాన జీ ♦ వేశ్వరాది విశేష
భాసితుండగు బరా ♦ త్పరుడనంతు

డంబ! నిన్ననసి యా • త్మానందమొందు గు
ణాది శూన్యుండు తా • నయ్యు నీదు

గీ. కతన నత్యున్నతైశ్వర్య • కలితుఁడగును
నీవలన భ్రామ్యమాణమౌ • నిఖిలమిట్టి
నిన్నఁగాని మాయికుండగు • చున్నవాఁడు
పరమపురుషుండనివ స • ర్వంబు నున్మ. ౨౩౫

కం. రాముం డగుణుఁడు నాత్మా
రాముఁడు తత్సంశ్రయవు ప • రాశక్తివి నీ
చే మెరయు విశ్వమంతయు
నీమహిమ నెరుంగ నెవరు • నేర్తురు తల్లీ. ౨౩౬

సీ. నీవమాయవు మాయ • నా వెలయును శూన్య
మదియున్న తత్ప్రాప్తి • నందియొకటి
స్థానోత్తరత చేత • దశశతాదికగణ
నోన్నతి నొందు న • ట్లో మహేశి
శూన్యరూపమున దో • చుచు విశ్వరూప వౌ
నట్టి నీహత్తున • నగుణుఁడాకృ
తైన విష్ణుండు స • ర్వాత్మ సర్వేశ్వరా
ద్యద్భుతైశ్వర్యంబు • లంది తోచు

గీ. విశ్వరూపకుఁడను పెంపు • శాశ్వతముగ
కలుగజేసితి వీవ నీ • యలఘుశక్తి
వలన జూమి శక్తి మంతుఁడౌ • వాసుదేవుఁ
డింతకును మూల మీవ చు • మ్మీశ్వరేశి. ౨౩౭

తే. జ్ఞాన శక్తిక్రియా శక్తి • ప్రాణశక్తి
యనెడు శక్తిత్రయంబు నీ • యంద గలుగు

శక్తికలిగిన బురుషుండు • శక్తిమంతుఁ
డదియ లేమి నశక్తుఁడౌ • నంబుజాక్ష. ౨౩౯

సీ. అగ్ని దేవునకు దా • హకశక్తి విలసిల్లు
బవనున కనిశసం • స్పందశక్తి
సవితకు సంప్రకా • శకశక్తి తద్భంగి
చంద్రునకును సుప్ర • సాదశక్తి
వెలయు నుర్వరయందు • విశ్వధారణశక్తి
సిద్ధించు జలమున • స్నేహశక్తి
పర్జన్యునందునే • ర్పడు ప్రవర్షణశక్తి
చర్చించ నభమున • శబ్దశక్తి

గీ. యరసిచూడ విశ్వ • మందు సమస్తంబు
శక్తిమయముగానె • సంగుచుండు
నట్టిశక్తులకు న • నాది శక్తివి నీవ
బ్రహ్మశక్తియనఁగ • బరగుచుండు. ౨౪౦

కం. హరియందు హరునియందును
సరసిజభవునందునీదు • శక్త్యంశము సు
స్థిరమగుట జగత్సర్గా
ద్యురుకృత్యములెల్ల జరుగు • చుండెడుజుమ్మా ౨౪౧

కం. శివుఁడొక్కఁడు నిర్గుణుఁడగు
సవిశేషతనుల్లసిల్లు • శక్తియు నొకటే
యవినాభావత నెసఁగుట
శివశక్తుల కొంద భేద • సిద్ధిఘటించుకా. ౨౪౨

సరసాంకవృత్తము.

పరికింప భోగ్యమగు • వస్తువు నీవసుమ్మీ
పురుషాంశయై దదుప • భోక్తభవత్ప్రసక్తిన్

సరవిఁ బ్రబన్ధితము • సల్పుచునుండు నయ్యా
క్షరుఁడౌ పరాత్పరుఁడు • సర్వముసాక్షి తానై. ౨౮౩

మణిమాలికావృత్తము.

మతియసనీవసు • మాపరమేశ్వరి • మరిమంత్రతయాపురుషునరుఁ
వితతముగాదగు • మంత్రమతుల్ రఘు • విభుఁడుఁ విను నీవునునగుచుఁ
క్షితిసుతరోవిల • స్లెదరెప్పుడు • చెలువొంబువుతావియు నునఁగఁ
చతురతభేదమి • సుంతయుగల్గక • చరియింతురసుష్మ్నాళిలమునఁ.

తరల.

సారదినేకముసర్వగతమును • సూక్ష్మమునుఁ బరమార్థమ
క్షరమచింత్యము శాశ్వతము ని • స్సామ్యమాద్య మచంచలం
బుఱుగుణాకరమంచు నెంచుదు • మోగులెల్ల భవత్పదం
బరయుచుందురమేయసంసృతి • పాశనిష్కృతి గోరుచుఁ. ౨౮౪

మ. సగణుండైన సహస్రకంధరు నవిఁ • సంహారముఁ జేసి యీ
జగముల్ స్వస్థతనొందజేసితి గదా • సంతోషకాలంబుగా
దెగరిష్ఠంబగు రౌద్రముప్పతిల న • ర్తింపంగ నివ్వేళ భూ
తగణోచ్ఛేదముసేయుగాదుగద మా • తా! యింక శాంతింపవే. ౨౮౫

పృథ్వీ.

అసంఖ్యభటకోటితో దనుజు • నంతమొందించుటఁ
బ్రాసంగెభువనంబులఁ • భవదు • పూర్వసమ్యక్కృపా
ప్రసారమునభద్రముల్ విడచి • రౌద్రరూపంబికఁ
బ్రసన్నవగుమమ్మ సౌమ్యరుచి • రసర్వరూపంబుతోఁ. ౨౮౬

మ. అని బ్రహ్మాదులు విన్నవింపఁగఁ దదీ • యాలాపమాలించి యి
ట్లనె నదేవి మదీయభర్త దనుజేం • ద్రాస్త్ర ప్రహారాతింబుఁ

గనుల౯ మోడ్చి విచేష్టుఁడై యచట నుం ♦ డ౯ నాకసంశాంతి గ
ల్గునెచాల్పొందుజగంబులన్నియునుదో ♦ ల్మద్దయ్యెడు౯ నాకిక౯.

సీ. అనిన నజ్ఞానసుం ♦ డమ్మరో రాముఁడా
ద్యంత శూన్యుండు స ♦ ర్వాత్మకుండు
గాడె యాతని కెందు ♦ గల్గునె వికృతుల్
నీవువిద్యారూపి ♦ ణివి గుణాశ్రి
తవుసర్వతంత్ర స్వ ♦ తంత్రవు సర్వ శ
క్తివి విశ్వసర్గాది ♦ కృత్యపరవు
నీకు నసాధ్యమెం ♦ దే కల్గునే యివ్వి
ధంబులీలా వినో ♦ దంబుగాక

గీ. నన్ను నీయాశ్రితుని హెచ్చు ♦ మన్ననకును
బాత్రుసేయఁగదలఁచిన ♦ భాతిగాక
నైన నీకృపచేనిట్టు ♦ లవధరించి
తల్లగావింతునని మ్రొక్కె ♦ యబ్జభవుఁడు. ౨౮౯

బ్రహ్మ రాముని మూర్ఛ బాపుట.

చ. చనియుట పుష్పకంబున వి ♦ సంజ్ఞతకన్గవమోడ్చి సుప్తి నొం
దిన గతినున్న రామవిభు ♦ నిం గని భక్తివినమ్రశీర్షుఁడై
తనకయి దమ్మినై నివుర ♦ తత్‌క్షణమాత్రఁపు నిద్రనుండి మే
ల్కనిన తెరంగుగా దెలివి ♦ గాంచి సముత్థితుఁడై రయంబున౯.

మ. అరరే! రాక్షస గర్వదుర్విషహ దు ♦ ష్ప్రారంభ సంరంభ ని
ల్వరయొక్కించుక నేడు నీతలల గూ ♦ ల్చు౯ ధాత్రిపై నంచు ని
ర్భరకోపంబున నుల్లసిల్లుచు ధను ♦ ర్బాణంబుల౯ దాల్చియు
ద్ధురత౯ నిల్చికనుంగొనె౯ ద్రిదశయు ♦ క్తు౯ బద్మజు౯ ముందట౯.

వ. అట్లుచూచి దృష్టిమరలపి పుష్పకంబున బ్రాణాధికయగు క్షోణీసుతం గానక సంశయాకులుండై పురోభాగంబున గరాళ కర వాల విరాజిత చతుర్బాహయు, దీర్ఘదంష్ట్రాంతర వేల్లజిహ్వాపల్ల వయు, కోటరాక్షయు, క్షుదాతురయు నాంత్రముండ మాలావి భూషణయు, నతిభీషణాట్టహాసకృతజగత్త్రాసయు, ప్రళయధ్వాం తఘోరాతిభీకరాకారయు, రాత్రించర కపాలపాత్రాంతరాపూరిత రుధిరాస్వాద సముదితామోదమహోగ్ర నృత్యక్రియా ప్రసారిత పాణిపాదయు, వికీర్యమాణ కేశపాశావృత వితతశ్రోణిభాగయు, దిగంబరయు, దనుజవీరశిరఃప్రకరపరికల్పిత కందుకక్రీడావిలోల స్వసమానానేక మాతృకాగణపరివారితయు, నవారితరౌద్రవీరభ యానకరసప్రపూర్ణ సముదీర్ణస్వరూపయు, గల్పాంతమేఘగర్జా రవ సదృశదీర్ఘనిర్ఘోషయు, శవరూపధరమహాదేవహృదయపీఠాం తరనానర్త్యమానయు, నగు నొక్క యపూర్వాతిభయంకరా కారధారిణి, విదళితాశేషదనుజమస్తక వికీర్ణంబును, ప్రవాహా భూతమేదోమాంసాసృక్పరీతంబును, శకలీభూత రథగజతురంగ మాదిసేనాంగ ఖండ హిండితంబును, నపార నిశాచరకబం ధబంధురంబును నగు రణాగ్రంబునం గనుంగొని భయనిమీ లితనయనుండును, వేపమానగాత్రుండునై గరాగ్రం బుననుండి ధనుశ్శరంబులు పరిచ్యుతంబులుగా బదంబులు నిలువక జదికిలంబడిన ఘోరఘుకులోత్తముని గదిసి సురజ్యేష్ఠుండిట్లనియె.

రామునికి మునులు సీతాసంరంభం బెఱింగించుట.

మ. నినుదైత్యేంద్ర శరావఘాతకలనా ♦ నిశ్చేష్టునీక్షించి సీ
త నితాంతోద్ధితరోషభీషణసుదు ♦ ర్దాంతక్రుధాయత్తయై
ఘనరౌద్రాకృతిదృశ్యమానభయదా ♦ కారంబుతో శత్రుసం
హననారంభ విజృంభమాణపటు సం ♦ రంభంబునన్ గ్రక్కునన్.

ఉ. డీకొని గూవ పైకురుకు ♦ డేగయుబోలె సహస్రకంఠుపై
దూకి కరాళఖడ్గహతి ♦ చూలదలల్ పదినూర్లు ద్రుంచి యా
వ్వీకునవాసంతో నసుర ♦ వీరుల నొక్కని జిక్కకుండ జీ
కాకొనరించి చంపి యధి ♦ కంబగు రౌద్రముపట్టజాలమిన్. ౨౫౪

కం. తనరోమకూపముల బు
ట్టిన మాతృగణంబుతో న ♦ టింపంగ దైత్యేం
ద్రుని తలలబంతులాడుచు
ఘనన్నృత్యము సలుపుచుండె ♦ గాకుత్థ్సవరా. ౨౫౫

చ. పరమగుణాఢ్యనీకు నన ♦ పాయిని చిన్మయశక్తి యీమెతో
బెరసియుచూవె యిజ్జగము ♦ బెంచసృజించహరించ గర్తవై
పరగెదునీవుశక్తినెడ ♦ బాసియొకింతయు జేయజాల వి
శ్వైరవుగఁజూడనేలవిను ♦ మీమె భవత్ప్రియచుమ్మురాఘవా.

కం. నీసాన్నిధ్యముచే తన
యీసచరాచరము లెల్ల ♦ యేనసృజింతున్
గ్రాసముగగొందునను టిటు
జేసెందెల్లముగ దనుజు ♦ జెండిమహాత్మా. ౨౫౬

చ. అనివనజాసనుండు తెలి.♦ యన్ వినుపించిన రాఘవుండు లో
చనములనల్లవిచ్చిభయ ♦ సంస్తిమితాత్మతవేపమానుఁడై
ఘనతరమైన తేజమది ♦ కన్నులుగప్పగ మోడ్పు కేలుతో
వినమితశీర్షుఁడై పరమ ♦ విస్మయసంభృతుఁడై మనిట్లనెన్. ౨౫౭

తే. తరుణ చంద్రకళాభూషి ♦ తస్వమూర్ధ
నమలకమలాయతాక్షి వీ ♦ వబలచెప్ప
మెవ్వతవానీదు చందమే ♦ నెరుగనేర
తథ్యమెఱిగింపు నీసవి ♦ స్తారమెల్ల. ౨౫౮

వ. అనియడిగిన శ్రీరామునకు నమ్మహాశక్తి యిట్లనియె. ౨౬౦

సీత రామునకుఁ దన మహిమ చెప్పుట.

చ. ఎఱుఁగుము నన్ను నాద్యగ మ ♦ హేశ్వరసంశ్రయగాఁగ నెన్నఁడున్
దఱుఁగని పెంపుఁ గోనలరు ♦ దానిఁగ నొక్కతెఁగా సురల్ మొదల్
గురుతెఱుఁగంగరాని గుణ ♦ కోవిదగా సకలాంతరాత్మతన్
బరఁగెడుదానిఁగాఁ బరమ ♦ పావనిగా శివనామయుక్తగన్. ౨౬౧

తే. సర్వవిజ్ఞానరూపిణి ♦ సర్వలోక
సంప్రవర్తిని ననుసర్వ ♦ శక్తియంచు
నెఱిఁగి మోక్షేచ్ఛువులు పార ♦ మెందులేని
ఘనమహాంభోధిఁ దరియించ ♦ గలరుసుమ్ము. ౨౬౨

ఆ. నను ననంతమహిమ ♦ ననఘ తేజోనిధి
నెట్టిధీరులైన ♦ నెఱుఁగలేరు
కరుణదివ్యదృష్టిఁ ♦ గావింతు నీకు న
న్గాంచి తెలియు మత్ప్ర ♦ కారమెల్ల. ౨౬౩

కం. అని యానతిచ్చి యమ్మే
దినిసుత రామునకు దివ్య ♦ దృష్టి యొసఁగినన్
గనియె నతఁడు తద్రూపం
బనఘము రవికోటి సదృశ ♦ మద్భుతపదమున్. ౨౬౪

సీతా విశ్వరూప సందర్శనము.

సీ. రవికోటి తేజో వి ♦ రాజితంబును జగ్రద
కోటిప్రసన్నమ ♦ కుంఠకోటి
కాలానలజ్వాలి ♦ కామాలికాసము
జ్వాలమచంచలము వి ♦ ద్యుజ్జ్వలాని

రాకులమఖిల దు ♦ ర్లోకప్రచండ స్వ
రూపమనేక శి ♦ రో భుజాక్షి
పాదాదికము మకు ♦ టాది నానావిధ
సమధికరత్న భూ ♦ షణ విభూషి

గీ. తంబు దంష్ట్రాకరాళ వ ♦ క్త్రంబు గన్నత్తి
వాస మసి ముసలాది వి ♦ భాసమాన
బహు విధాయుధ కలితోగ్ర ♦ బాహుకంబు
భూనభోమధ్య సర్వతః ♦ పూరితంబు. ౨౬౫

సీ. చంద్రరేఖావతం ♦ సము త్రినేత్రము శంఖ
చక్ర త్రిశూల పా ♦ శ వరదా భ
య విరాజమాన హ ♦ స్తాబ్జము దివ్య మా
ల్యాంబరాభరణ స ♦ మంచితంబు
దివ్యసుగంధ గం ♦ ధిలము నూపుర కిరీ
టాంగదాది విరాజి ♦ తావయవము
సర్వతఃపాణ్యంఘ్రి ♦ చక్షుశ్శిరస్కము
నతులిత తేజో మ ♦ యంబచింత్య

గీ. మాద్యమవ్యయరంబ ♦ నంత మక్షోభ్య మ
ఖండమఖిలమూర్తి ♦ మండితంబు
భూతి విపులమగుచు ♦ సీతామహాదేవి
విశ్వరూపమపుడు ♦ వెలసి తోచె. ౨౬౬

సీ. ఆనాభిపాదమ ♦ య్యతలాది పాతాళ
భువనంబు లటమీద ♦ భూర్భువస్స్వ
రాద్యూర్ధ్వలోకంబు ♦ లాననంబున వహ్ని
నయనంబులను జంద్ర ♦ సవిత హితులు

వరుణుఁడు జిహ్వాన • వ్వసురుద్రముఖ్య దే
వతలు బాహాదికా • వయవములను
నబ్ధులేడును గుక్షి • నబ్జగర్భుఁడు హృద
యంబున భుజముల • యందు శంఖ

గీ. చక్రహస్తుఁడైన • జలజనాభుఁడుఁబదం
బులను వాసవుండు • పూర్వదేవ
తతులు పృష్ఠమందు • తనుకోటి రోమ కూ
పముల నదులు సిరల • బరగెఁ జూచె. ౨౬౭

సీ. బ్రహ్మవిష్ణ్వాది దే • వతలతోఁగూడి మ
ర్త్యామర్త్య సర్గస • మంచితంబు
లైన బ్రహ్మాండ స • హస్రంబులవు డసం
ఖ్యములుగా రోమకూ • పములయందు
దర్శనీయంబులై • తగ నుదుంబరవృక్ష
మున నిండికొను ఫలం • బుల తెరంగు
దోప దన్మహనీయ • రూపంబునను విశ్వ
మంతయు నిండి బా • హ్యాంతరముల

గీ. నూది గ్రుచ్చ నెడము • చూడఁగా బడక న
య్యాదిశక్తి తేజ • మానరించె
నట్టి విపుల తేజ • మది సూచి కన్నులు
మొగిచి రాముఁడెదుట • మ్రొక్కి నిలిచె. ౨౬౮

తే. పరమవిస్మయచిత్తుఁడై • భక్తినుదుట
నంజలిఘటించి కనుల ము • దశ్రుపూర
మొదవ గద్గదకంఠుఁడై • యోంనమః ప
దంబులు వచించి యప్పుడివ్వి • ధమునఁ బొగడె. ౨౬౯

రాముఁడు సీతను స్తుతిచేయుట.

చ. జయమగునీకునోసకల ♦ శక్తిసమంచితెమూర్తివిష్టపా
శ్రయవపురభ్యుపేతబుధ ♦ సన్నుతదివ్యపదాంబుజాత య
వ్యయ భవదీయభూతి మయ ♦ మై జలజాతభవాండభాండ సం
చయము వెలుంగునే మనుచు ♦ సంస్తుతిసేయుదు నిన్నునీశ్వరీ.

ఉత్సాహము.

మొదలుతుదయు నిట్టిదనుచు ♦ పోల్చిచూడలేము నీ
యుదరమందు నిండియుండు ♦ నోర్చియెల్లలోకముల్
పదిలముగనునీదుపాద ♦ భజనసేయువారి కె
య్యది యలభ్యమంచు బల్కు ♦ నాగమంబులీశ్వరీ. ౨౭౧

తరల.

తలఁచిచూడఁగ శక్తివీవక ♦ దా జగంబఖిలంబు నీ
వలనఁగల్గి ప్రవర్తితంబయి ♦ పాయుచుండు భవద్గుణం
బులుగదా విధువిష్ణురుద్రులు ♦ మూలకారణమీవె నీ
వలన వ్యక్తతగాంచెదాఁ గుణ ♦ వంతుఁడై పురుషుండొగిన్.

చతుర్విధకందము.

శరణంబుగమ్మి ♦ విలస
త్కరుణా; చరణాబ్జవినత ♦ దైవత, వరదా
పరమార్యభక్త ♦ వత్సల
నిరతా; మరితార్తిదూర ♦ నిశిచర, విరతా. ౨౭౩

అష్టముఖీకందము.

[1] పనివడి కలపును [2] దలపున
నణువున [3] కలుములు గలుగగ ♦ [4] నలవగుసిలుగుల్
[5] కనుకనిదొలఁగను [6] చెలువము
బెనగను [7] తొలుదయవలనను ♦ [8] వెలయుగ తలనిన్. ౨౭౪

## దండకము.

జయవిజయతాం విశ్వమాతస్సమస్తార్థసంధాయిని శ్రీమహాదేవి
చిచ్ఛక్తిసర్వాత్మికే సర్వతంత్రస్వతంత్రే త్వయైవేదముత్పాద్యతే
వృద్ధిమాపద్యతే ఛిద్యతే విశ్వమైశ్యైశ్వరం తేజ ఏవాసిసత్యా
భవత్యద్వితీయం చిదానందరూపం సునిర్లేపమాద్యంతశూన్యం సని
ర్వాచ్యముద్యోతమానం సమానాధికైర్హీన మజ్ఞానదూరం పరం
జ్ఞానశక్తిప్రధానం పరాశక్త్యుపభ్రాజితం సర్వతంత్రస్వతంత్రం
మహాలోమాతరాబిభ్రతీ యుష్మదీయా మహాశక్తిరేవాస్తి బ్రహ్మేం
ద్రరుద్రాదిలోకేశ్వరాణాం షడైశ్వర్యసంధాయినీ కించ నానా
చరస్థావరాకార భూతప్రకాండాంతరుద్యోతచైతన్యలీలావిశేషస్వ
రూపం వహంతీ జగన్నాటకం బాఢమాతన్వతీ తత్రతావత్త్వదం
శాంశ సంజాయమానా స్స్వయంబ్రహ్మవిష్ణ్వీశ రుద్రాభిధానాస్స్రు
ష్టిరక్షావినాశాభిధానాం చితానుగ్రహాఖ్యక్రియామధిష్ఠితా స్స్వస్థు
దేవిత్వమాసన్నివిష్టా భవంతశ్చిరం తే పరంజ్యోతిరాకారిణీత్వంహి
విశ్వైకమూలం కళానాధచూడే త్వయాభ్రామ్యతే బ్రహ్మచక్రం
మహామాయిని త్వద్విలాసేన తంపూరుషం నిర్గుణం నిర్వికారం ము
హుర్భ్రామయిత్వా త్వదాయత్తమాతన్వతీమాయికంచేశ్వరం
కల్పయిత్వా జగత్సర్జనేచ్ఛాన్వితం సంగృహీత్వా తమేవాద్య
యాఽవిద్యయాం శాంశరూపేణ సంఛాద్యతత్రాంబు భాండాంత
రాంబింబతేందుప్రతీకాశమానంత్య రూపం మమత్వాదిసంఛన్నమ
జ్ఞానరుద్ధం పునర్జీవసంజ్ఞం విధాయాస్య సంసారముత్పాద్య తస్మిన్
పరిభ్రామయంత్యత్ర నానావిధాకార శారీరసంచార మాపాద
యంతీ మహానాట్యరంగే తదస్మిన్ విచిత్రం పరావర్తయంతీ యదే
తత్సమస్తంగుణాసంగశూన్యే పరేపుంసిరామే ముధాభావ్యతే తత్వ

విజ్ఞానిభిన్నర్వమేవ త్వదీయం నముల్లాసమిత్యేః సంపశ్యతేదేవి విశ్వే
శ్వరి త్వాం యథావత్పరిజ్ఞాతుమీశాశ్చకే కేఃయం మూఢచిత్తాః
ప్రసీద ప్రసీద ప్రపన్నాపదుద్ధారకే విశ్వరక్షాధురీణే నమస్తే
నమస్తే నమః. ౨౭౫

వ. అనిపొగడి నిటలఘటితాంజలియై ఓం నమః పదంబులతోఁగూర్చి
చతుర్థ్యంతంబులుగ "సీతోమాపరమాశక్తి" యను నామం
బులు మొదలుగను "వియన్మూర్తి దేవమూర్తి యమూర్తి"
యను నామంబులంతంబుగను గలుగ నష్టోత్తర సహస్రనామంబు
లుచ్చరించి ప్రహృష్ట మానసయగు సీతామహాదేవిని సంస్తుతించె.
నని చెప్పి వాల్మీకి భరద్వాజునకిట్లనియె. ౨౭౬

ఉ. రామునిచేత నిట్టు లభి ♦ రామముగా వచియింపఁబడ్డ యా
నామసహస్ర మెవ్వఁడయి ♦ నఁ బఠియించిన విన్నఁ బాతక
స్తోమవిముక్తుఁడై పరమ ♦ శోభనమాపద మొందునిందు ని
స్సీమ సమస్తభోగములుఁ ♦ జెందియనంతర మప్రమత్తతన్. ౨౭౭

తే. ద్విజసమాఖ్యాతులయిన భూ ♦ దేవరాజ
వైశ్యులిదిపాఠ మొనరించి ♦ బ్రహ్మపదముఁ
గంద్రుఁ శూద్రుఁడు ధనధాన్య ♦ ఘనతఁగాంచి
యవలసద్గతినొందుఁ జు ♦ మ్మాన్యతిలక. ౨౭౮

కం. మారీ రాజభయామయ
చోరాగ్ని భయాదికముల ♦ స్తోత్రమిది సదా
పారాయణ మొనరింప ని
వారణముం గాంచునిదియ ♦ స్వస్త్యయనంబౌ. ౨౭౯

తే. ఎచట నీనామసాహస్ర ♦ మెప్పుడు పఠిత
మగుచునుండెడు నచ్చట ♦ ననవరతము

రామసహితంబుగానిల్పి ♦ భూమితనయ
సకలకామితసిద్ధులు ♦ సంఘటించు. ౨౮౦

వ. అనిచెప్పి యవలికథ వినుమనియిట్లనియె. ౨౮౧

తే. అట్లురాముఁడు సామ స ♦ హస్రమునను
భక్తితోఁ బ్రస్తుతించి తా ♦ బ్రణతుఁడగుచు
ఘోరమీరూపమికజూడ ♦ నేరభీతి
గదిరె నిక సౌమ్యరూపంబు ♦ గాన్పుమనియె. ౨౮౨

కం. అనిరాముఁడు వేఁడిన వా
రని కృప సంశాంతయగుచు ♦ రౌద్రాకృతిఁ గ్ర
న్నన నుజ్జగించి సౌమ్యతఁ
దనర శుభాకారమపుడు ♦ తాల్చినిలిచినఁ. ౨౮౩

సీ. కాంచనాంబుజగర్భ ♦ గౌరంబు వికసిత
కమలదళాయతా ♦ క్షంబుబద్మ
గంధంబునీలాల ♦ కవిరాజమానంబు
కుసుమకోమలము వి ♦ లసిత తిలక
మారక్తకరచర ♦ ణాంబుజమీషద్వి
కసితలోచనదర ♦ హాసితమఖిల
భూషణప్రకర వి ♦ భూషితంబు మనోజ్ఞ
మాల్యాంబరాది స ♦ మన్వితంబు

గీ. లలితపూర్ణచంద్ర ♦ లపనంబు తనుమధ్య
మఖిలచారులక్ష ♦ ణాన్వితంబు
నైనజనకపుత్రి ♦ యాకారమీక్షించి
రాముఁడధికహర్ష ♦ ధాముఁడగుచు. ౨౮౪

కం. ఇపుడుగదయేనొనర్చిన
తపములు ఫలియించె జనియు ♦ ధన్యాంబయ్యెన్
జపలాక్షిలోచనోత్సవ
విపులంబగు నీదురూపు ♦ వీక్షించుటచేన్. ౨౮౫

వ. అని మరియు నిట్లని సన్నుతించె. ౨౮౬

కం. జగములు నీచేసృష్టము
లగునీయందు వసియించు ♦ నటనీయందే
యొగిలీనములగు నింతకుఁ
దగుకారణ మీవసుమ్ము ♦ ధరణీతనయా. ౨౮౭

కం. వికృతికిఁ బరమై యొప్పెడు
ప్రకృతివనుచుఁ గొందరిట్లు ♦ పలుకుదురు శివా
త్మికగా శివసంశ్రయగాఁ
బ్రకటింతురు కొందరిట్లు ♦ పరమాత్మజ్ఞుల్. ౨౮౮

కం. పురుషుండు ప్రధానము నీ
శ్వరుఁడున్ బ్రహ్మయు నవిద్య ♦ జ్ఞానము మాయా
స్ఫురణము కాలాదులు నను
పరికరములు నీవిభూతి ♦ భవములు సీతా. ౨౮౯

అంసగతివృత్తము.

అరయఁబరమేశ్వరివ ♦ నాద్యవునవంత
స్ఫురితవు సమస్తగుణ ♦ పూర్ణవును సర్వాం
తరవు పరమేష్టివి ప్ర ♦ ధానవు విభేదా
కరవు పరశక్తివి జ ♦ గజ్జనని వీవే. ౨౯౦

వనమయూరము.

నీవలననండగొని ♦ నిక్కముగ గాదే
యీవిపులవిశ్వము సృ ♦ జించుఁబరమేశుం

డీవు పరమేశ్వరివి ♦ యింతకును నీ మా
యావిభవమిట్టిదన ♦ నౌనె జగదంబా! ౨౯౧

హంసగతి.

ఆనందధాత్రివి చి ♦ దానందరూపవు మ ♦ హానందసారమయవున్
జ్ఞానస్వరూపవు న ♦ నంతవు ననాద్యవు ఘ ♦ నజ్యోతిరాకృతివి స
ర్వానుప్రవిష్టవు శి ♦ వాత్మికవు సర్వజగ ♦ దాధార విధ్ధగుణవున్
మానాదిహీన పర ♦ మవ్యోమమాత్రవు స ♦ మస్తార్థధాత్రి వెపుడున్.

సీ. సర్వదేవతలలో ♦ శక్రుండనఁగనీవ
బ్రహ్మవేత్తలలోన ♦ బ్రహ్మవీవ
కపిలుండవీవ సాం ♦ ఖ్యవిదుత్తములలోన
రుద్రులలో శంక ♦ రుండ వీవ
యాదిత్యులందు మ ♦ హావిష్ణుఁడవునీవ
వసువులయందు బా ♦ వకుఁడవీవ
వేదంబులను సామ ♦ వేదంబనఁగ నీవ
యఖిలఛందముల గా ♦ యత్రివీవ

గీ. విద్యలందెల్ల నధ్యాత్మ ♦ విద్యవీవ
గతులయందెల్లఁ బరమమా ♦ గతివినీవ
సర్వశక్తులపుం ... ఖ్య ♦ శక్తివీవ
కాలమవునీవ కలయిత్రి ♦ గణమునందు. ౨౯౩

సీ. అతిగుహ్యవర్ణంబు ♦ లందు నోంకారంబు
నాశ్రమంబులనుగా ♦ గృహస్థధర్మ
మీశ్వరులందు మ ♦ హేశ్వరుండుఁ బురుషు
లందుఁబురుషుఁడు భూ ♦ తాంతరస్థు

డుపనిషత్తులను గు ♦ సాంఖ్యపరత్వత్తు భూ
పతులలో నీశితా♦స్పదుండు మరియు
యుగములందును గృత ♦ యుగము మార్గంబుల
నాదిత్యమార్గంబు ♦ నఖిలవాక్కు-

గీ. లందువాణిసురూపల ♦ యందులక్ష్మి
తగు పతివ్రతలం దరుం♦ధతియు పతగ
తతుల యందు సుపర్ణుండు ♦ తథ్యముగను
నీవి భూతులు సుమ్మ వ ♦ర్ణితచరిత్ర. ౨౯౪

తరువోజ.

అరయమామ్నాయముల ♦ యందువిష్ణుండు ♦ యజువులశతరుద్రి ♦ యంబది నీవ
పురుషసూక్తము ముఖ్య ♦ ముగ సూక్తములను ♦ భూధరంబుల మేరు ♦ భూధరంబీవ
సరవిజప్యములందు ♦ సావిత్రి వేద ♦ జాలంబులోపల ♦ సామంబు నీవ
యురగకులంబులో ♦ నుర్విభాగంబు ♦ నొగిదాల్చు శేషుండ ♦ వానరగనీవ. ౨౯౫

తే. అఖిలదోషవిహీనమ ♦ ద్యంతశూన్య
మాద్యమఖిలైకకారణ ♦ మైననీదు
లలితవిజ్ఞానబ్రహ్మాక ♦ శాస్త్రరూప
మైనరూపంబుఁ దలచి జో ♦ హారుసేతు. ౨౯౬

తే. పరమవేదాంతవిజ్ఞాన ♦ పరులు ధీరు
లే! భవదూపమిా జగ ♦ దేకసంప్ర
నూతిహేతువటంచుఁ బ్ర ♦ స్తుతియొనర్తు
రట్టినూనందరూపమే ♦ నభినుతింతు. ౨౯౭

మ. మణులన్ సూత్రమువోలె భూతముల నా • త్మజ్యోతిరాకారధా
రిణివై ప్రాణసమాఖ్య నెల్లపుడుఁ జే • ర్చిన్ వెల్గుచున్ సర్వకా
రణమై యుందువు జన్మనాశ భయ దా • గ్గత్యాప దుద్ధర్త్రివై
యణిమాద్యన్విత యుష్మదాకృతికి సా • ష్టాంగంబు గావించెదన్.

తే. మొదలు తుదలేక జగములు • మొలుచ నిలువ
నెలవగుచు నన్నిటికిఁ దాన • గలిగియుండుఁ
బరమ పురుషాఖ్య విలసిల్లు • భవదుదార
రూపమున కేను సద్భక్తి • మ్రొక్కువాఁడ. ౨౯౯

తే. అణువులందెల్ల నణువు మ • హత్తులందుఁ
బరమమైన మహత్తుగాఁ • బరగి విశ్వ
బీజమైశ్వర్యవిజ్ఞాన • విభవహేతు
వైన నీరూపుఁ దలఁచి సా • ష్టాంగమిడుదు. 300

కం. త్రిగుణాతీతమచింత్యం
బగుణంబు సమస్త కార • ణాత్మకము త్రయీ
నిగదితమగుచున్ దగు నీ
జగదాశ్రయ రూపమేను • సన్నుతి సేతున్. 3౦౧

కం. జ్ఞానానందనిదానము
నానావిధ నామరూప • నయభేద పరి
జ్ఞానసమాశ్రయము సధి
ష్ఠానమునగు నీస్వరూప • మరసి భజింతున్. 3౦౨

తే. సకల జగదండ సంప్రకా • శకము నిగమ
మూల కందస్వరూప ము • న్మాలితాఘ
మమల హైరణ్మయాకార • మైన సవితృ
మండలస్థ భవన్మూర్తి • మహిమఁ దలఁతు. 3౦౩

వంశస్థవృత్తము.

సహస్ర పాదాక్షి ♦ శయాస్యయుక్తముల్
సహస్రమూర్ధంబు ♦ సహస్రనామముల్
మహాబ్ధిమధ్యే గ ♦ మమాణ మా భవ
స్మహీయ వారాయ ♦ ణ రూపమెంచెదన్. ౩౦౪

ఉపేంద్రవజ్రము.

కరాళదంష్ట్రాంకము ♦ కల్పవేళా
స్ఫురన్మహావహ్ని సు ♦ పుష్టరూపం
బురుక్రమంబుల్ బురు ♦ హూతవంద్యం
బురాజిలుల్ గాలసు ♦ మూర్తినీకున్. ౩౦౫

పంచచామరము.

మహాఫణా సహస్రభాస ♦ మాన మాన తేంద్రముల్
మహాభరాతి దూర్వహ ప్ర ♦ మాణ మాన నీయముల్
మహిష్ఠ మప్రమేయ మాది ♦ మధ్యశూన్యముల్ ద్విష
ద్గుహాంబు తావకం బనంత ♦ రూప మేస్మరించెదన్. ౩౦౬

భుజంగప్రయాతము.

సదావ్యాహ తైశ్వర్య ♦ సంయుక్తమంహ
చ్ఛిదంబుల్ త్రినేత్రంబు ♦ చిచ్ఛక్తియుక్తం
బనంభస్ఫుటానంద ♦ మద్వంద్వమాత్మా
స్పదంబా భవద్రుద్ర ♦ భావంబు గొల్తున్. ౩౦౭

ఉ. శోకవిదూరముల్ బరమ ♦ శోభన మప్రతిమాన వైభవో
త్సేకము సర్వవిష్టప ని ♦ షేవిత పాదసరోజ మాశ్రిత
శ్రీకరముల్ సుఖాత్మికము ♦ చిన్మయముల్ లసమాన సత్కృపా
లోకముగా భజింతు మది ♦ లో భవదీయ సుశాంతరూపముల్.

కం. అనియిట్లు పెక్కుభంగుల
వినుతించి కకుత్స్థవంశ ♦ విభుఁడా భూనం
దిని జూచుచు బ్రాంజలియై
దనికెను వినయమున నిట్టు ♦ దత్పార్శ్వమునన్. 3౦౯

కం. అవనీతనూజ రామ
స్తవమాకర్ణించి ప్రముది ♦ త స్వాంతయు దీ
ప్త విమల దరస్మితాస్యయు
సవిలాస వచఃప్రసక్తి ♦ జనపతి కనియెన్. 3౧౦

సీ. రాజేంద్ర నేడిట్లు ♦ రావణ వధగోరి
ధరియించినట్టి రా ♦ ద్రస్వరూప
ధారివై మానసో ♦ త్తరభూమి నెప్పుడు
వసియించి యుండెద ♦ నస మలీల
ప్రకృతిచే నీల రూ ♦ పధరుండవీవు లో
హితకాంతి రావణా ♦ ద్దితుఁడ వగుచుఁ
దాల్చితివే నవ్వి ♦ ధమ్మునసీల లో
హితరూపధారివై ♦ యెపుడు నిన్ను

గీ. బాయక భజించియుండెదఁ ♦ బార్థివేంద్ర
భవదుదార స్తవంబునఁ ♦ బ్రముదితాత్మ
నైతినీవాంఛితంబెద్ది ♦ యానతిమ్ము
దానిసఫలమ్ముగావింతుఁ ♦ దథ్యముగను. 3౧౧

రాముననకుసీతవరంబులిచ్చుట.

ఉ. నావుడుసీతఁజూచి రఘు ♦ నాయకుఁడిట్లనె నట్లుకాక యో
దేవి నిజంబుగా భగవ ♦ తీమహితాంశజ వీవు నీవు న
న్నేవినుతింపఁగాఁగలనె ♦ యిప్పుడుసూపిన విశ్వరూపముల్
భావమునందు నాకు నెసఁ ♦ బాయకయుండ వరంబొసంగుమా.

శా. ఓకల్యాణిరో నాదు తమ్ములు కపుల్ ♦ యోగాగ్రణుల్ రావణో
త్సేకాపోహితసత్వులై చెదరియెం ♦ దేపోయిరేయంగదల్
లేకాయందరుగ్రమ్మరన్ సనుఖులై ♦ లీలన్ ననుంజేరగా
నీకారుణ్యము కల్మి నిమ్ము వరమున్ ♦ నీరేజపత్రేక్షణా. 3౧3

కం. అనివేడినదరహాసము
కనుగొనలందనుకనల్ల ♦ కానిమ్మని భూ
తనయ వరమిచ్చెనప్పుడు
వినువీథింభోరుకొలగె ♦ వేల్పులభేరుల్. 3౧౪

శా. ఆమ్రాంచితదుందుభిధ్వనులతో ♦ నాకాశమార్గంబునం
దామోదంబునితాంతమైపరగఁబు ♦ ష్పాసారమున్ నిర్జర
స్తోమంబాకృటఁ బర్వఁజేసె నపుడా ♦ క్షోణీసుతా రాఘవా
త్మామూర్ధన్యులమీద నద్భుతగతిన్ ♦ సంతోషపూర్వంబుగన్.

మ. అపుడారాముఁడు పంకజాసనుని చా ♦ యంజూచి యోసర్వవి
ష్టపసర్గప్రవణాత్మ నీవు కరుణన్ ♦ స్సంజీవితున్ జేసితీ
యుపకారంబుమరాక నెంతు విబుధ ♦ వ్యూహంబుతోడన్ద్రివి
ష్టపమున్ జేరగబొమ్ము మమ్ము మదిలో ♦ సంప్రీతిదీవించుచున్.

రాము నిబ్రహ్మస్తుతించుట.

కం. అని యానతి నొసగిన నే
వ్వనజాసనుఁడారఘుప్ర ♦ వరునింగని యి
ట్లను నలికన్యస్తాంజలి
యునువినయానమితశీర్ష ♦ యుక్తుఁడునగుచున్. 3౧౫

గోమూత్రికాబంధము.

కం. రామచరణానమితసుర
కామజనకభక్తనిచయ ♦ ఘనతరఫలదా

భీమశరదానహితకర,
ధీమదనఘభద్రనిలయ ♦ దినకరకులజా. ౩౧౮

చ. దినకరవంశపావన సు ♦ ధీజనతావన నీమనంబునన్
గనికరమొప్పలోకములు ♦ గావగ నెంచి సహస్రకంధరున్
దనువు దలంచి యిచ్చటికిఁ ♦ దోడ్కొనిరా జగదేకమాతచే
దనుజులుద్రుంగ మారు భ్రమ ♦ దంబుఘటిల్లె ననల్పవైఖరిన్.

కం. దేవాదిదేవనీవా
శ్రీవైకుంఠంబువిడచి ♦ క్షితిదనుజభయా
ప్లావిత గావగ వచ్చిన
యావనరుహనాభుఁడవుజు ♦ మయ్యమహాత్మా. ౩౨౦

కం. జనకనుత నీకు ననపా
యినియగు నయ్యాదిశక్తి ♦ యిందిరజగముల్
మనుపమనుజావతారము
లనుకంపన్ దాల్చితిరి మ ♦ హాత్మకమీరల్. ౩౨౧

చ. గుణములులేకసంగమున ♦ కుం బనిబూనక యున్న నిమ్మహా
గుణునిగ విశ్వసర్గలయ ♦ గోపనదక్షునిగానొనర్చితా
నణఁగిభవత్సమాశ్రయము ♦ నందిసముజ్వలమైన విశ్వకా
రిణియగు నాదిశక్తియ ధ ♦ రాసుతసీమె నెరుంగశక్యమే. ౩౨౨

మ. అమనోవాగభివేద్యమై తనరు మా ♦ యాశక్తి సంశక్తి నా
మము రూపంబు గుణంబునీకుశ్రుతిస ♦ న్మాన్యంబులై యోచు ని
ష్క్రమునీ వెన్నఁగ నప్రమేయుఁడవు లో ♦ కంబుల్ సృజింపంగ బెం
చ మరిం ద్రుంచగ మాయనీవలనదా ♦ శక్త్యాత్మయానీశ్వరా.

కం. కనువిచ్చినలోకంబులు
జనియించున్ గన్నుమూయ ♦ సమయున్ సకతే

శుని నిను బ్రబోధితునిగా
నానరింపఁగ నన్నుఁదాఁచు ♦ లోపుమురె హరీ. ౩౨౪

చ. అనఘ రజోగుణంబున స ♦ మస్తము గల్పనజేయ నన్ను నొ
క్కని సృజియించి నీదగు న ♦ కంపితశక్తిసుటిల్లు సర్గకృ
త్యనియతినాపయిం నిలిపి ♦ నట్టివిభుండవు నాకుదండ్రివి
వనుపమమైన నీమహిమ ♦ నూరయనాతరమేమహేశ్వరా. ౩౨౫

వ. అని విన్నవించి సీతాభగవతినుద్దేశించి. ౩౨౬

బ్రహ్మ సీతాదేవి నభినుతించుట.

మ. అవనిం దానవపీడ్యమానగని స ♦ మ్యక్సత్కృపాయుక్తి నిం
దవతారంబొనరింపగర్భనరకా ♦ యానంబుఁజింతించి మా
నవదేహంబున నుర్విగర్భమున జ ♦ న్మంబంది గాకుత్స్థవం
శవిభుం రామునిగూడి యీప్సితవిధుల్ ♦ సాధించితీపీశ్వరీ. ౩౨౭

సీ. అలయజామేకామ ♦ టన్నత్రయ్యంతవా
క్యముగుణత్రయహేతు ♦ వనుచువిశ్వ
కారణంబుగనిన్ను ♦ గదతెల్పుశుక్లలో
హితకృష్ణకాంతుల ♦ నెసగుసత్వ
మునురజంబునుదమం ♦ బునుదాదృశాకృతు
లగుబ్రహ్మవిష్ణురు ♦ ద్రాభిదలను
బనివడిసర్గపా ♦ లనలయంబులుసేయ
నింతకుమూలమై ♦ యీవుసూచు

గీ. చుందునఖిలైకసాక్షివై ♦ శుద్ధసత్వ
రూపిణివి చిన్మయివిసుఖ ♦ రూపవాది
మధ్యహీనవు నీపేర్మి ♦ మాదృశులకు
నెరుఁగఁదరమాన్నసీత ♦ వై ♦ శ్వైకమాత. ౩౨౮

కం. పుపునందు వేరువోఁచక
బ్రవితతమగుతావిపోల్కి • బరమేశ్వరునం
దవినాభావముగానుం
డువుబోధమయస్వరూప • ఘూర్వరూపగుచున్. 329

ఉ. చూడగమాయ కెందునికి • శూన్యముశూన్యముప్రక్క నొక్కటిన్
గూడినసున్న శోభ్నతిని • గుంభనగాంచెడు భంగినీ వొగిన్
గూడినవిగ్రహేశ్వరుఁడ • గున్ సగుణుండనుసమస్తకర్తయున్
గూడునెయిట్టినీమహిమ • కుంబమిమారణము విశ్వకారణీ. 330

చ. తలచినచో నసంఖ్యముగ • దామరసప్రభవాండభాండముల్
గలుగుటలేదెనాశమును • గాంచరెనేవృతలంపదానవుల్
కలితవినోదలీలలకు • గాదె భవన్మహితావతారనం
కలనముచేతనోద్ధరణ • కారణదివ్యగుణానుషక్తిచేన్. 331

చ. అరయఁగసర్గపాలనల • యంబులుతావకకృత్యముల్ మహే
శ్వరినిజకృత్యతత్పరత • వర్తిలునీకు నిశాటమారణం
బరుదని సన్నుతింపవలె • నా భువనంబులకీవకాక యె
వ్వరు గలరింక రక్షకులు • భక్తజనాభయ దానవైభవా. 332

చ. ఇనుఁడు తపింప వాయువు చ • లింప విభావసుఁడున్ దహింపఁ బా
వనెరప నింద్రుఁడుర్వియెద • నన్ సకలంబు ధరింపఁజాలు ని
ఘనతరశక్తిసంకలన • గాదె మహేశ్వరి యిట్టి నిన్ను నే
వినుతియొనర్పఁగాగలనె • బిడ్డనిపై నెనరుంచు మొప్పుచున్. 333

కం. అని విన్నవించి యభివం
దనములుఁ గావించి జనక • తనయూరఘువం
శ నిధానుల యనుమతి గొని
వనజభవుండరిగె నిమిష • వర్గముతోడన్. 334

వ. అప్పుడు. 33౭

రాముఁడు సీతాసహితుఁడై యయోధ్యకు వచ్చుట.

మాలిని.

పుడమితనయతోడన్ ♦ బుష్పకారూఢుఁడై రా
ముఁడు మునివరులెల్లన్ ♦ మోదమొప్పన్ భజింపన్
దడయక జలరాసుల్ ♦ దాటి సాకేతమార్గం
బుడుగక గొనివచ్చెన్ ♦ వ్యోమమార్గంబునందున్. 33౮

మ. కనె శ్రీరాముఁడుముందరన్ గగన మా ♦ ర్గవ్యాపి సౌధావళీ
కనదత్యుజ్వల హైమకుంభగతరం ♦ గద్రత్న రోచిచ్ఛటా
భినవశ్రీపరి పుష్టభాస్కరకరా ♦ విద్యోతమున్ భూరి కే
తన వాయుప్రవిధూతఖేచర వియ ♦ ద్యాతమ్ము సాకేతమున్.

చ. కని నగరోపకంఠమున ♦ గ్రక్కున బుష్పకముర్విచాయ డి
గ్గ నడపి రాకపీటికెరు ♦ గంబడశంఖము బూరితంబుజే
సిన నిబిడధ్వనిన్ జెవులు ♦ చిల్లులువోబురిలోనవారు త
త్స్వనము దశాననాంతకుని ♦ శంఖరవంబని నిశ్చయించుచున్.

తే. భరతలక్ష్మణశత్రుఘ్ను ♦ లరసమొదవ
రవిసుతాంగద నల నీల ♦ పవనపుత్ర
ముఖ్యకపుల విభీషణ ♦ ముఖదనుజుల
నలసుమంత్రాదిమంత్రుల ♦ నెలమిఁబిలచి. 33౯

మ. చతురంగంబులతోడ సైన్యపతు లు ♦ త్సాహంబునన్ రాఁ బురో
హితసామంత హితార్యపౌరజనతా ♦ వృద్ధాది సంయుక్తులై
తతతూర్యధ్వనులన్ దిగంతములునిం ♦ డన్ దద్దిదృక్షాసమ
ర్పితకౌతూహలులౌచు వచ్చిరెదురై ♦ ప్రీతిన్ దశాస్యారికిన్.

వ. అట్లువచ్చిన భరతాదిసోదరులను, సుగ్రీవాదికపులను, విభీషణాది దైత్యులను, సుమంత్రాది మంత్రిసామంతయోధవీరులను, నుపలక్షించి వారందరు సహస్రకంధర శరోపద్రవంబునకుం జిక్కక సాకేతంబునకుం జేరి సుఖంబుండుటకు సీతావర మహానుభావంబునకుం బరితుష్టహృదయుండై రఘుకులోత్తముండు సంజాత సంతోషబాష్పవికీర్ణ కపోలతలుండై రయంబున బుష్పకంబు మహీతలంబున కవతరింపం జేసి సీతాసమేతుండై తదవరోహణంబాచరించిన భరతలక్ష్మణశత్రుఘ్నులు వాహనంబు లుడిగి వేగంబునంజని తదీయపాదప్రణామంబాచరించిన హర్షపులక కంటకితంబులగు వారి మువ్వుర గాత్రంబులును గ్రుచ్చి యొక్కకౌగిటన గీలించి సమ్మదాశ్రుకణంబులం దనమ్మూర్ధాభిషేకంబు సలుపుచు గద్గదవాక్యంబులం గుశలంబడిగి తోడనె సమాగతులగు హనుమదాదుల ప్రణామంబులభినందనపూర్వకంబుగ గైకొని యందరితోడ నడచి సీతాసమేతంబుగా వసిష్ఠునికి సాష్టాంగంబాచరించి తదాశీర్వచనపూతుండై తదనుమతి భద్రదంతావళంబధిరోహించి యనుజులును బరివారంబును నుచితవాహనారోహితులై తోడ రా మందగమనంబుల రాజమార్గంబున నరుగుచు నందందం బురకాంతల మంగళనీరాజనంబులును శోభనలాజార్పణంబులును నంగీకరించుచు రాజనగరద్వారంబున వాహనంబులు డిగ్గి యాస్థానమంటపంబుం బ్రవేశించి భద్రసింహాసనంబధిరోహించి యప్పటిపరివారంబెల్ల యుపాసింపనుండి యిట్లనియె. ౩౮౧

రాముఁడు సీతావిజయము నెరింగించుట.

ఆ. అనుజులార! మీర • లందరు నవ్వేయు
తలల సోకురేని • చిలుకు సోకుఁ

డొలఁగి మేలుగలిగి • మెలఁగుట మత్పుణ్య
ఫలము సీతకరుణ • బలమునుండు. ౩౯౨

క. అల దశశత వక్త్రుని కో
త్తలమున్ దలమున్కలై దొ • లంగక పోరన్
బలితపు చిలుకున నొగిలిచి
కలనన్ నను మూర్ఛమునుగ • గా జేసెనన్. ౩౯౩

మ. అని భూపుత్రి యుదాత్త రోషరభసా • కారంబునన్ గాళికా
ఘనరూపంబున ఖడ్గకర్పర కరో • గ్రస్ఫూర్తి నుత్సాహ వ
ర్ధన మొప్పన్ దనుజేంద్రు పైకురికి మూ • ర్ధశ్రేణి ఖండించి చ
య్యన దత్సేనల నెల్ల ద్రుంచె నస • హాయస్ఫార శౌర్యంబునన్.

తే. అట్లు దానవ సంహార • మాచరించి
లనను తను రోమకూప సం • జనిత శక్తి
వితతితో దైత్యమస్తక • ప్రతతి చెండు
లాడుచుండిన బ్రహ్మాండ • లరుగు దెంచి. ౩౯౪

మ. నతులై సాంత్వనపూర్వకంబుగఁ దదా • జ్ఞావృత్తి నన్మూర్ఛన్ బున
స్స్మృతి సంయుక్తుని జేసె పద్మజుఁడు నే • సీతామహాదేవి యు
ద్భుత రూపంబును గాంచి తత్కృప వరంబున్ వేడి యంగీకృతాం
చిత సౌమ్యాకృతి యైన భూ తనయతో • శ్రీమించ విచ్చేసితిన్.

మ. అని సీతావిజయంబు సెప్పిన నృపా • లాగ్రేసరాలాపముల్
విని యాస్థానిక నున్న యందరును ను • ర్వీపుత్రి నంచజ్జయ
ధ్వనిపూర్వంబుగ బ్రస్తుతించుచు నము • ద్యచ్చిన్మహాత్వంబెఱిం
గిన వారై యల యాది శక్తియని భ • క్తి ప్రమోదారాసములై.

సీ. దేవ! యాద్యంతరహితవు • నీవు నీవు
[illegible]చే నీశ్వరంబు విశ్వ • స[illegible]

ఉ.గు మహాకవి ప్రభృతి • యనఁగ నొప్పు
యనఘ బ్రహ్మాదులకు నీ • యాఖ్యలె జుమీ. ౩౪౭

క. ఎల్లజగంబుల కీవే
తల్లివి సర్వేశ్వరులము గ • దా మాకైనన్
జల్లని చూడ్కిం జూడుము
తల్లీ! నిను గనుట నాకు • ధన్యత గలిగెన్. ౩౪౮

వ. అని విన్నవించి తదీయ కృపాతరంగితాపాంగ వీక్షణంబులం బరితుష్టాంతరంగులైరి. తదనంతరంబ. ౩౪౯

సుగ్రీవాదులు స్వస్థానములకరుగుట.

కం. సుగ్రీవాది కపులును ద
శగ్రీవానుజుఁడు నాత్మ • సైన్యంబులతో
దిగ్గజనుతుఁడు రాముం
డగ్రిమ సత్కారమొసఁగి • యనుప ముదితులై. ౩౫౦

వ. స్వస్థానంబుల కరిగి రంత నమ్మునీశ్వరులు సీతామహాదేవిని బహువిధంబుల సన్నుతించి శ్రీరాముని బ్రశంసించి మీరు లాలక్ష్మీనారాయణులని విన్నవించి సత్యంబులగు నాశీర్వచనంబులం బరితుష్టులం గావించి తదామంత్రితులై నిజాశ్రమంబులకుం జనిరి పదంపడి. ౩౫౧

మ. అనుజుల్ భక్తివినమ్రులై కొలువఁగా • నాప్తులై భూపతుల్
వినయంబొప్ప నుపాయనంబు లిడి సే • వింపన్ ధరిత్రీప్రజల్
దనుఁ గన్నట్టి ప్రజంచు బ్రోచుమను నీ • తాదేవితోఁ గూడ స
మ్మదవంశాగ్రణి రాముఁడేలె మహిన • వ్యక్షీణ మార్గంబునన్.

మ. సరయూతీరధరిత్రి భూరి విధ యజ్ఞ • స్తోత్రశేషి సంధానితో
స్థానస్యన్మునీ యూపసప్రిహారమై • శోభిల్లగా జేసె భూ

వరచూడామణి రామచంద్రుఁడు ప్రజల్ • వర్ధిల్ల ధర్మోత్తర
స్ఫురణన్ రాజ్యమొనర్చె నెల్ల భువనం•బుల్ సన్నుతింపంగదన్.

కం. పదివేలును దత్సంగతిఁ
బదినూరులు ననెడు సంఖ్య • పైఁబడు నేడుల్
వదలక రాముఁడుఁ గడు నె
మ్మదిగన బాలించె ధరణి • మండలమెల్లన్. ౩౫౫

కం. సుర నర కిన్నర విద్యా
ధర గంధర్వాప్సరో వి • తానమురుగుణా
భరణుని రాముని బొగడుదు
రరసి యతండాదివిష్ణు • వని నిత్యంబున్.  ౩౫౬

శా. భారద్వాజ భవత్కృతంబయిన సం • ప్రశ్నంబుచే నద్భుతో
దారంబౌ చరితంబు సెప్పితిని వే • ద్యంబైన రామాయణం
బారూఢిం బునరుక్త శంక నిట వ్యా • ఖ్యానంబుఁ గావింప త
చ్చారిత్రంబును గూర్చి యెంచుమిది యా•శ్చర్యంబటంచున్మదిన్.

ఫలశ్రుతి.

శా. పంకేజాసనుఁ డీ చరిత్రము మహా • భద్రంబుగా వాచ ని
శ్శంకప్రక్రియ నవ్యకర్ణపదవీ • సంగంబుఁ గావింపఁ గాఁ
బంకక్షాళన దక్షమద్భుత కథా • పారంబు నౌ దీని నీ
వింకన్ వేదసమంబుగాఁ దలచి భా • వింపందగున్ నిత్యమున్.

తే. ఎవ్వఁడిది విను నెవడు ప • ఠించు నెవ్వ
డాత్మ భావించు నీయర్థ • మనుదినంబు
నతడు దుష్కృత బంధంబు • లన్ని ద్రెంచి
బ్రహ్మలోకంబుగాంచు శా • శ్వతముఁగాగ.  ౩౫౭

ఆ. ఒక్కశ్లోకమైన ♦ నొక్కపాదమైన
నిద్ధభక్తితోఁ ప ♦ ఠించునెవ్వఁ
డతఁడుగాంచునిర్వ ♦ దైదు వేలగ్రంథంబు
చదివినంతఁగలుగు ♦ సత్ఫలంబు. ౩౬౦

కం. రామాయణ మిది విని యును
బ్రేమఁబఠించియును జదర ♦ విశరీవాసో
ద్దామక్లేశము గ్రమ్మర
నామనుజుఁడుఁబొందఁడట్టి ♦ డైన మహాత్మా ౩౬౧

కం. రాము కథవినక యెరుగక
పామరుఁడై యుండు ద్విజుని ♦ బ్రహ్మఘ్నసమం
గామదిఁదలంచిగ్రక్కున
భూమీశుఁడు పురము విడచి ♦ పొమ్మనవలయున్. ౩౬౨

తే. అద్భుతోత్తరరామాయ ♦ ణాఖ్యమిద్ది
శ్రుతిచతుష్కముకంటె హె ♦ చ్చుగఁదలంపు
నిట్టిరామాయణము విను ♦ నెవ్వఁడట్టి
వానికెందునసాధ్య ము ♦ ల్గానరావు. ౩౬౩

కం. మందాకిని తటమునను బు
రందరునకుఁ జెప్పినట్టి ♦ రామకథన్నీ
యందలి వాత్సల్యంబున
జెందినకుతుకముననిపుడు ♦ చెప్పితిమరలన్. ౩౬౪

సీ. బ్రహ్మమానసమను ♦ పాలవెల్లినిబుట్టి
నట్టిరామాయణం ♦ బనెడురత్న
రాజంబుఁదెచ్చి నా ♦ రదుఁడు నాకునొసంగె
నేనుదానికిని వ ♦ న్నియనుగూర్చి

తిని మేము ముప్పూర ♦ మునుగాక ద్భద్రత్న
సారంబెరుంగగా ♦ జాలఁడారుషు
బ్రహ్మలోకమున గు ♦ ప్తంబయ్యె రామాయ
ణార్థంబు గలిగిన ♦ యంతనట్లు

గీ. నాకమునమద్రిమధ్యమ ♦ లోకమునను
నవలబాతాళ భువనంబు ♦ నందుగొంత
గొంతవిలసిల్లుజుమ్ము దు ♦ ర్దాంతకలుష
హరణ పారాయణంబు రా ♦ మాయణంబు. ౩౭౫

సీ. దండకాటవిముని ♦ తల్లజరక్తసం
యోగంబుచేత మం ♦ డోదరికిని
సీతజన్మించిన ♦ చిత్రకథయు బంచ
వటివిశ్వరూపంబు ♦ వాయుజుండుఁ
గనుటయురాముఁడు ♦ దినకరసుతుమైత్రి
జలధిబంధించి ని ♦ శాటవిభుని
దునిమి యయోధ్యకు ♦ జనుదెంచుటయు ముని
జనులు ప్రశంసింప ♦ జనకకన్య

గీ. రహిసహస్రకంఠ ♦ రావణు కథ జెప్ప
దద్వధార్థమవని ♦ తనయతోడ
రాముఁడపుడుపుష్క ♦ రద్వీపమునకేగు
టయును జనకతనయ ♦ జయముగనుట. ౩౭౬

కం. ఇది సంక్షేపార్థంబుగ
నుదితంబగు నట్టి యద్భు ♦ తోత్తరచరితం
బిది వినినను వినిపించిన
జదివిన నతనికి లభించు ♦ శాశ్వతపదవుల్. ౩౭౭

క. శ్లోక మొకటైన మఱియును
శ్లోకార్ధం బైననిందు ♦ సుమహితభక్తిన్
గైకొని జదివిన నరునకు
నాకల్పముగా లభించు ♦ నఖిల శుభంబుల్. ౩౬౮

తే. వినుము పున్నమ ద్వాదశి ♦ విషువకాల
మునను బంచపర్వంబులఁ ♦ బుణ్యతిథుల
విష్ణుసన్నిధి నీకథ ♦ వినిన వినిచి
ననుసమస్త శుభంబులు ♦ ననుసరించు. ౩౬౯

తే. అవనిజాత్యద్భుతశ్రీ జ ♦ యావహంబు
నఖిల కలికల్మషోద్వ్యధ్వ ♦ యాపహంబు
నద్భుతోత్తరకాండ రా ♦ మాయణంబుఁ
బుడమి నాచంద్రతారమై ♦ పొదలుఁగాత. ౩౭౦

చ. విదితముగాశకాబ్దములు ♦ వేయును నెన్మిది నూర్లమీఁద ము
ప్పదియొకటైన సౌమ్యయను ♦ వర్షమునందు నమేయమంగళా
స్పదమగునీమహాకృతిని ♦ సాంగముగారచియించి మంగళ
ప్రదుఁడగునీశ్వరేశునకు ♦ భక్తిసమర్పణమాచరించితిన్. ౩౭౧

శా. వామార్ధాంగ నగేంద్రజా కచసుమ ♦ వ్యాకీర్ణమత్తాలి గా
నామోదప్రవిలీనతత్కర విపం ♦ చ్యాభావ పీయూష ధా
రా మాధుర్యముహుః ప్రహర్షపరి పూ ♦ ర్ణస్వాంత సంవేశ స
ర్వామర్త్యప్రణుతిప్రకాశ.యమరే ♦ శాభక్తచేతోవశా. ౩౭౨

క. తారకదైత్యవిదూరా
తారకజపసార కరధృ ♦ త మృగ కిశోరా
తారక హీరకళా వి
స్తారకశారీర భక్త ♦ జనమందారా. ౩౭౩

మంగళమహాశ్రీవృత్తము.

ఓమనెడు నక్షరము ♦ నొక్కటి సమస్తనిగ ♦
మోపగతమూలమని చెప్పం
గా మహిమనొప్పు నది ♦ గా భవదమేయగుణా ♦
కల్పిత సమాకృతిగనొప్పఁ
క్షేమముగ విశ్వము సృ ♦ జించ భరియించఁగ న ♦
శించఁగను గర్తవగు నీ ని
స్సీమ దయ మాకొసఁగు ♦ శ్రేయములు నీకగుత ♦
శ్రీమహిత మంగళమహాశ్రీ. 328

గద్య.

ఇది శ్రీరామచంద్రచరణారవిందసపర్యామరందతుందిలమనోమిళిందపవన
నందన పద వందనానంద సందర్శిత సరసకవితావిచిత్ర శ్రీమదానంద
తీర్థ భగవత్పాదాచార్య గురుకరుణాపాత్ర పరిచితాశ్వలాయన
సూత్ర విశ్వామిత్రగోత్రపవిత్ర నందగిరివంశశరనిధి రాకాకు
ముదమిత్ర వేంకటనృసింహరాయపుత్ర శేషమాంబాగర్భ
శుక్తిముక్తాఫలాయమాన నిరుపమాన భాగధేయ
సకల సుకవినికాయ విధేయ వేంకటప్పారాయ
నామధేయవిరచితంబగు వాల్మీకీయ శ్రీమద్రా
మాయణాద్భుతోత్తర కాండమున
సర్వంబును షష్ఠాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ

# శుద్ధపత్రిక.

☞ దయచేసి చదువరులు ముందీశుద్ధపత్రిక ననుసరించి గ్రంథము దిద్దికొని చదువదొరకొందురుగాక.

| పుట. | పద్యం. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 2 | 6 | 3 | యానల్వ | నానల్వ |
| 3 | 9 | 5 | యలరు | నలరు |
| 4 | 10 | 7 | వంతు | మంతు |
| | 13 | 4 | వంతుఁ | మంతుఁ |
| | | 4 | మహచ్ఛాంతుఁ | మహాశాంతుఁ |
| 5 | 16 | 2 | పద | పర |
| | 17 | 3 | వసిష్టు | వసిష్ఠు |
| | 18 | 4 | ధూర్జిర్వహాత్సాహునిఁ | ధుర్యాగ్రణిఁ ధీమణిఁ |
| 6 | 21 | 12 | సుకవి | కవి |
| 7 | 23 | 3 | త్శ్వ | త్వ |
| | 24 | 4 | యొనర్పన | యొనర్ప |
| 8 | 28 | 3 | ముఖ్య | రేవా |
| 10 | 37 | 1 | పుల్ | పులు |
| 11 | 38 | 10 | నుపమా | మనుపమా |
| 13 | 44 | 8 | రులుము | డువారు |
| 14 | 46 | 3 | స్త్య | స్థ్య |
| 17 | 53 | 13 | విడచి | విడిచి |
| 18 | ,, | 17 | బులు | బుల |
| 19 | ,, | 14 | గొట్టి | గొట్టు |

| | | | | |
|---|---|---|---|---|
| 19 | ,, | 17 | విడచి | విడిచి |
| 21 | ,, | 3 | కొలచి | కొలిచి |
| 23 | 54 | 1 | గ్రస్తుత్వ | గ్రస్ఫుత్వ |
| 25 | 67 | 6 | యియు | యియును |
| 26 | ,, | 4 | యభి | నభి |
| 29 | 84 | 3 | యిండ్లక్ | గిండ్లక్ |
| 31 | 92 | 2 | యొని | యొన |
| ,, | 94 | 4 | యక్క | య్యక |
| 32 | 98 | 2 | నిష్ట | నిష్ఠ |
| ,, | 100 | 4 | ష్టింపక్ | ష్ఠింపక్ |
| 33 | 105 | 2 | గనుచు. | గగుచు |
| ,, | 106 | 1 | చ. | ఉ. |
| 34 | 112 | 3 | గ్రిమా | గ్రిమ |
| 35 | 119 | 2 | యమ | నమ |
| 43 | 32 | 12 | రమున | రమ్మున |
| 45 | 41 | 1 | వీ | లీ |
| 46 | 44 | 2 | త్సము | త్సవము |
| 47 | 51 | 4 | గూర్చి | గూర్కి |
| 50 | 65 | 4 | లే | వే |
| 51 | 68 | 1 | నిష్టా | నిష్ఠా |
| ,, | 69 | 4 | దలంచి | వలంచి |
| ,, | 70 | 4 | నిలచి | నిలిచి |
| 54 | ,, | 1 | ల్పిత | పిత |
| ,, | ,, | 6 | కేశ | కేస |
| ,, | ,, | 11 | రిణ | రిణో |
| ,, | 81 | 3 | బిృదా | బింద్రా |
| 55 | 85 | 4 | కంతి | గంధి |
| 5? | 88 | 2 | మాంక | మాన |

| | | | | |
|---|---|---|---|---|
| 57 | 93 | 2 | పట | పద |
| 59 | 103 | 3 | లయ్యు | లయ్యో |
| ,, | 104 | 1 | ఇరులల్ | ఇరులుల్ |
| | | 3 | మింద | మించ |
| | 107 | 3 | లందె | లందు |
| 61 | 115 | 4 | మలక | లమగ |
| 62 | 118 | 9 | లునునను | లునను |
| 63 | 123 | 3 | జల | జనల |
| | 125 | 4 | సౌష్ట | సౌష్ఠ |
| | 126 | 5 | సౌష్ట | సౌష్ఠ |
| | | 8 | గరఁగ | గరుఁగ |
| 64 | 128 | 2 | రిష్ట | రిష్ఠ |
| 67 | 143 | 8 | త్తములు | త్తరులు |
| 68 | 150 | 4 | తకుం | తరుం |
| 71 | 161 | 2 | ష్టా | ష్ఠా |
| 72 | 167 | 1 | చెలి | చెవి |
| | 168 | 7 | నంఘు | నఘు |
| 78 | 199 | 3 | విడచి | విడిచి |
| 79 | 203 | 4 | వసిష్ట | వసిష్ఠ |

ద్వితీయాశ్వాసము.

| | | | | |
|---|---|---|---|---|
| 81 | 5 | 1 | నిష్టా | నిష్ఠా |
| | 6 | 1 | నిష్టా | నిష్ఠా |
| 82 | 13 | 4 | నిలచి | నిలిచి |
| | | 5 | గోష్టి | గోష్ఠి |
| | | 8 | కాశ | క్రాశ |
| 84 | 19 | 4 | విను | విని |
| | 23 | 2 | గాష్ట | గాష్ఠ |
| | | 4 | రుగు | రిగి |

| | | | | |
|---|---|---|---|---|
| 85 | 28 | 2 | గోష్టి | గోష్ఠి |
| | 29 | 4 | శ్చరం | శ్చర్యా |
| 87 | 36 | 4 | దామోదరశ్రీధర | సహ్వాసుహృద్వసుతా |
| 88 | 41 | 1 | మీాలై | మీా ై |
| | 43 | 4 | నిలచి | నిలిచి |
| 91 | 60 | 2 | క్షేత్ర | వేశ్మ |
| 92 | 63 | 2 | గోష్టి | గోష్ఠి |
| 93 | 66 | 1 | నిలచి, | నిలిచి |
| | 68 | 2 | స్వస్వర | సుస్వర |
| 94 | 74 | 1 | అప్పడు | అప్పుడు |
| | | 4 | బురు | బురుం |
| 95 | 78 | 2 | నంచుచు | నంచు |
| 96 | 86 | 3 | ఘువా | ఘునా |
| 98 | 93 | 9 | వాసిని | వాసి |
| | 95 | 4 | ద్దయోః | ద్దయః |
| 100 | 106 | 1 | ద్వద్వా | ద్వంద్వా |
| | | 2 | స్వాంతుం | స్వాంతు |
| | 108 | 2 | మహార్ష | మహార్హ |
| 101 | 115 | 1 | జితమా | జితంమా |
| 102 | ,, | 1 | క్షుదా | క్షుధా |
| | 116 | 2 | క్షుద | క్షుధ |
| | 120 | 4 | నిష్టలు | నిష్ఠలు |
| 103 | 122 | 4 | క్షుద | క్షుధ |
| | 124 | 3 | క్షుద | క్షుధ |
| | 126 | 1 | దక్షణ | దక్షిణ |
| 104 | 129 | 2 | చ్ఛ్రమం | త్స్రమం |
| 108 | 157 | 3 | భుజిం | భ జిం |
| 109 | 160 | 2 | సక్షే | సక్షి |

| | | | | |
|---|---|---|---|---|
| 109 | 160 | 3 | పృష్ట | పృష్ఠ |
| ,, | ,, | ,, | శ్లోష్ట | శ్లోష్ఠ |
| ,, | 161 | 1 | రాంగత | గాంగత |
| | 162 | 3 | ముప్వి | ముల్వి |
| 111 | 171 | 7 | లాటలి | లాటపి |
| 112 | ,, | 3 | వృషీ | హృషి |
| 113 | 177 | 2 | మూర్ధ్న | మూర్ధ |

తృతీయాశ్వాసము.

| | | | | |
|---|---|---|---|---|
| 118 | 5 | 1 | నిష్టా | నిష్ఠా |
| | | 4 | నిష్ట | నిష్ఠ |
| | 9 | 1 | కూతురి | పుత్రిక |
| 121 | 21 | 3 | ష్టుర | ష్ఠుర |
| | 23 | 1 | నిష్టా | నిష్ఠా |
| 123 | 31 | 2 | నిష్ట | నిష్ఠ |
| 124 | 39 | 1 | రైణి | రైణు |
| | 40 | 4 | బహూా | బహు |
| 125 | 42 | 4 | మటన్నగ్ | ముకడిమిగ్ |
| | 43 | 2 | ధిఃక్ర | ధిక్క్రి |
| 146 | 50 | 10 | రొండ | రాండ |
| 127 | 51 | 4 | నాకుల | యాకుల |
| 128 | 56 | 2 | ధిఃకా | ధికా |
| | 57 | 4 | నిష్ట | నిష్ఠ |
| | 58 | 2 | నిష్టా | నిష్ఠా |
| | 59 | 2 | స్టార | ష్ఠార |
| | 66 | 3 | తరిణోం | తర |
| | 67 | 2 | తరిశ | తర శ |
| 130 | 69 | 4 | త్యాదికి | త్యాగి |

| | | | | |
|---|---|---|---|---|
| 130 | 70 | 1 | ఏవ్వుర | వవ్వురు |
| 131 | 73 | 9 | సశీ | సుశీ |
| 133 | 85 | 2 | నన్ని | నగ్ని |
| | 86 | 4 | ప్రణీత | ప్రణేత |
| 135 | 91 | 4 | లుగ | లుగఁగ |
| | 93 | 3 | జోతి | జ్యోతి |
| | 96 | 4 | లబి | లబ్ధి |
| 136 | 97 | 3 | గలిసం | గవిసం |
| | 98 | 4 | గది | నిది |
| | 99 | 1 | అను | అగు |
| 137 | 105 | 4 | కేశ | క్లేశ |
| 141 | 126 | 2 | నాడి | నిండి |
| 143 | 133 | 10 | యన్ని | యగ్ని |
| | 134 | 3 | యదు | యది |
| 144 | 139 | 3 | మహీ | మహే |
| | 140 | 2 | రించి | రిచి |
| 145 | 145 | 2 | భల | ఫల |
| 148 | 163 | 2 | తత్వ | తత్త్వ |
| | 164 | 2 | తత్వ | తత్త్వ |
| 149 | 166 | 2 | దాని | వాని |
| 150 | 173 | 2 | పదైక | పధైక |
| 152 | 181 | 8 | కవిలం | కలిలం |
| | 183 | 2 | బృహితం | బృంహితం |

చతుర్థాశ్వాసము.

| | | | | |
|---|---|---|---|---|
| 155 | 3 | 1 | మహాయోంకార<br>దూర్జ | నిబృంహిష్ఠోం<br>క్రియాత్మ |
| 156 | 7 | 4 | గరిష్ట | గరిష్ఠ |

| | | | | |
|---|---|---|---|---|
| 156 | 7 | 4 | గరిష్ట | గరిష్ఠ |
| 157 | 12 | 2 | త్వాంతకం | త్వాంకం |
| | 13 | 3 | నిష్టుల్ | నిష్ఠుల్ |
| | 15 | 2 | మేష్టి | మేష్ఠి |
| 158 | 17 | 2 | ధా్రి | ధాత్రి |
| | 18 | 4 | స్రష్ట | స్రష్ఠ |
| | 19 | 1 | స్రష్ట | స్రష్ఠ |
| | | 4 | తిష్ట | తిష్ఠ |
| 159 | 25 | 4 | గర్త | గర్తృ |
| | 26 | 1 | రక్షారగ | రక్షోవర |
| | | 2 | భూతంబు | భూతంబులు |
| | 28 | 1 | వత్సల్య | వాత్సల్య |
| 160 | 30 | 4 | త్రిలి | త్రివి |
| | 33 | 3 | మార్గ | మీార్గ |
| 161 | 36 | 1 | శ్వర | శ్వరు |
| 162 | 42 | 4 | దెరె | దిరె |
| 164 | 53 | 3 | వస్త్రంబు | వక్త్రంబు |
| | 56 | 3 | లిరహ | విరహ |
| | | 4 | పెట్టునట్లు | పెట్టులట్లు |
| 165 | 60 | 3 | శిఖల | యుక్తి |
| | 62 | 3 | వర్బో | వంబో |
| | 63 | 1 | హితుని | హితుల |
| 166 | 64 | 4 | నసీతి | నసీతి |
| | 65 | 1 | మెరయం | మొరయం |
| 167 | 71 | 3 | లవిర్ | లలిర్ |
| | | 4 | నుమన | సుమ్మన |
| | 72 | 4 | సంపదులు | సంపదలు |
| 168 | 75 | 2 | చంపాలుసరు | చండాలురకు |

| | | | | |
|---|---|---|---|---|
| 168 | 78 | 4 | మహీమ | మలీమ |
| | 79 | 1 | నిష్ట | నిష్ఠ |
| | 80 | 3 | యాత్రనొ | యాత్రకునో |
| 170 | 86 | 1 | నప్సరో | నప్సరః |
| | | 2 | పగతేం | ప్రగతేం |
| | 91 | 2 | పయంట | పయెంట |
| 171 | ,, | 2 | దళక | తనుచ |
| 172 | 102 | 1 | నోప్తిలోగొనిన | నఃప్రసక్తిఃగని |
| 173 | 107 | 1 | బందె | బదె |
| 174 | 111 | 2 | జూడం | జూతం |

పంచమాశ్వాసము.

| | | | | |
|---|---|---|---|---|
| 185 | 3 | 2 | తిష్టి | తిష్ఠి |
| | | ,, | స్పిష్టు | స్పిష్ఠు |
| | 4 | 2 | దాశ్వీ | దాశీ |
| 186 | 4 | 5 | నవికపల | నలికఫల |
| | | 9 | సలీడ | సనీడ |
| | | 10 | కలకలంబులుకు | కలకలంబుల కులుకు |
| 188 | 4 | 1 | బలసి | బలిసి |
| | | 1 | సేవాసర | సేవావసర |
| | | 9 | వారాసి | వారాశి |
| | 5 | 1 | వైభ్య | రైభ్య |
| | | 4 | కస్యపాత్రివసిష్ట | కశ్యపాత్రివసిష్ఠ |
| 191 | 19 | 1 | వక్షోద్రే | వర్షోద్రే |
| | 22 | 1 | నొక్క | యొక్క |
| 192 | 24 | 2 | ప్రబల | ప్రజల |
| | 26 | 4 | యెంత | యంత |
| 194 | 37 | 2 | ఘూతి | భూపతి |

| | | | | |
|---|---|---|---|---|
| 194 | | 3 | దుప | నుప |
| 196 | 50 | 1 | గనిష్టు | గనిష్ఠం |
| 199 | 69 | 2 | సాద | సార |
| 200 | 75 | 1 | కనకదష్టా | కనదష్టా |
| | 77 | 4 | నిబిడి | నిజంబిడి |
| 201 | 81 | 4 | లోష్ట | లోష్ఠ |
| 202 | 86 | 4 | లీడంగ | వీడంగ |
| 204 | 99 | 3 | విక్రషూ | విక్రమో |
| 205 | 105 | 4 | విశధ | విశద |
| 207 | 113 | 4 | పరీకాత్మ | పక్షీతాత్మ |
| | 114 | 3 | సన్నుగ్ధులై | సన్నద్ధులై |
| | 115 | 2 | యావహాంబు | యాహావంబు |
| | 116 | 1 | మంద | మంథ |
| 208 | 120 | 1 | వంతార్క | వదర్క |
| 210 | 134 | 1 | సిష్టాత్రికణ్వాకస్య | సిష్ఠాత్రికణ్వాకశ్య |
| 212 | 147 | 4 | సృప | సపృ |
| 213 | 148 | 2 | శమత | శమిత |

## షష్ఠాశ్వాసము.

| | | | | |
|---|---|---|---|---|
| 215 | 8 | 1 | బున | బుల |
| 216 | 11 | 2 | దేసిం | దేశిం |
| | 12 | 4 | శ్లోక్య | శ్లోక |
| | 16 | 2 | రశ్యం | ర్యశం |
| | | ,, | దుర్ | దుః |
| 218 | 23 | 3 | నీషా | గీషా |
| | 26 | 1 | మూర్ధ్వ | మూర్ధ |
| 219 | 28 | 21 | శేనా | సేనా |
| 220 | 29 | 5 | డజ్ఞో | లజ్ఞో |

| | | | | |
|---|---|---|---|---|
| 220 | 29 | 10 | చనలు | చనులు |
| | 30 | 6 | ధూమృడు | ధూమ్రుడు |
| 222 | 34 | 2 | త్ర్వంఘ్రికల్ | త్ర్యంఘ్రికుల్ |
| 223 | 39 | 4 | లీక | వీక |
| | | ,, | గదురక్ | గదురుక్ |
| | 42 | 2 | ద్యాళ | వ్యాళ |
| 226 | 60 | 2 | కోటిలో | కోటులో |
| 228 | 71 | 3 | బరువుచు | బరపుచు |
| 230 | 81 | 4 | లీక | వీక |
| | | 24 | పొదిలి | పొదివి |
| 231 | ,, | 2 | పందు | పండు |
| | | 5 | రక్కసల | రక్కసుల |
| | | 15 | జక్క | జక్కు |
| 232 | 82 | 1 | కోటీశుండు | కోటిశుండు |
| 233 | 83 | 1 | దిద్రుక్షు | దిదృక్షు |
| | 84 | 1 | మహా | మహీ |
| | 85 | 3 | పొదిలి | పొదివి |
| | | 5 | దీటు | దీటి |
| | 86 | 3 | లెంచి | వెంచి |
| 235 | 93 | 2 | గలిసి | గవిసి |
| | 96 | 2 | గాలి | గావి |
| | | 4 | మహోద్ధతి | సుబల్విడి |
| 236 | 99 | 4 | యారప్రు | యారుప్రు |
| | | 13 | మేద | మేదః |
| 237 | 100 | 2 | సితా | శితా |
| 238 | 109 | 3 | తృష్టా | త్రుష్టా |
| | 110 | 2 | యార్ద్ద | యార్పు |
| 239 | 113 | 1 | హలతిక్ | హాతిక్ |

| | | | | |
|---|---|---|---|---|
| 239 | 113 | 3 | బాణావి | బాణాలి |
| | 117 | 1 | కాన్సీ | కోన్సీ |
| 241 | 120 | 5 | శాయ్యా | కాయ్యా |
| 143 | 126 | 2 | మీాసీ | మీారసీ |
| | 128 | 1 | విడచి | విడిచి |
| | 129 | 1 | యుతరం | యంతరం |
| | 130 | 4 | నకట | టకట |
| 248 | 159 | 4 | యెంచి | యెంచె |
| | 161 | 2 | నొాప | నోప |
| 249 | 164 | 1 | లోక | లోన |
| | | 4 | గోనవి | గోనలి |
| | 167 | 4 | పాటవం | పాటనం |
| 251 | 175 | 3 | రెండోరు | రొండోరు |
| | 177 | 1 | డివురు | దివుచు |
| | | 2 | గూల్చు | గూర్చు |
| 253 | 189 | 1 | పరామ | విరామ |
| 254 | 194 | 1 | భీమా | భూమా |
| | | 3 | దుర్లోక్య | దుర్లోక |
| | 197 | 2 | గోనక | గోనంగ |
| 256 | 199 | 2 | నగిన్న | నగ్ని |
| | 200 | 4 | విడచె | విడిచె |
| | 201 | 1 | విడచిన | విడిచిన |
| 257 | 203 | 2 | వృధ | వృథ |
| 258 | 213 | 4 | నెంతలు | యెంతలు |
| 259 | 217 | 2 | గాగలిం | గాంగిలిం |
| | | 6 | రూక్షే | రూక్ష |
| | | | దక్షణం | దక్షిణం |
| 260 | ,, | 6 | బుల్వోత్తు | బులువ్వోత్తు |

| | | | | |
|---|---|---|---|---|
| 261 | 218 | 9 | జని | జని |
| 262 | 219 | 4 | కటకని | కటకని |
| | | 20 | ప్రతిష్ట | ప్రతిష్ఠ |
| | | | సుప్రతిష్ట | సుప్రతిష్ఠ |
| | | 23 | మధూరా | మధురా |
| | | 24 | వనస్థు | వనస్థ |
| 263 | | 3 | తామ్రేక్షణులు | తామ్రేక్షణులు |
| | | | సను | సగు |
| | 221 | 1 | చ్ఛిన్నో | శ్ఛిన్నో |
| 264 | 226 | 4 | బుగర్ | బునర్ |
| | 227 | 9 | యెడరు | యడరు |
| 265 | 230 | 3 | జాతభవాది నిర్జరని | జాతభవాది నిర్జరు |
| | | | కాయము సన్నుతి | లుసన్నుతిఁజేయఁగ |
| | | | జేయజొచ్చిన | జొచ్చిరప్డున |
| 265 | 231 | 1 | రూపి | రూప |
| 267 | 239 | 6 | షుండ | షుండు |
| 269 | 245 | 2 | నిస్సామ్య | గతసామ్య |
| | 246 | 4 | సేయు | సేయ |
| | 247 | 4 | రసర్వ | రస్వ |
| 270 | 249 | 3 | కృతుల్ | కృతులు |
| 271 | 252 | 1 | మలపి | మలిపి |
| | | 4 | రాక్షయుక్షుధా | రాక్షియుక్షుధా |
| | | 16 | సీనాంగ | సేనాంగ |
| | | 20 | జ్యేష్టం | జ్యేష్ఠం |
| 272 | 259 | 1 | మూర్ధ్న | మూర్ధ |
| 273 | 262 | 4 | మహాంభోధి | భవాంభోధి |
| 275 | 267 | 7 | పృష్ట | వృష్ఠ |
| | 268 | 1 | బడకన | బడకయు |

| | | | | |
|---|---|---|---|---|
| 280 | 290 | 3 | మేష్టి | మేష్ఠి |
| 282 | 294 | 1 | నిక్షప్తు | నిషత్తు |
| 281 | 306 | 2 | మహాభరాతిదూ | మహీంభరాతిసూ |
| | 307 | 2 | చ్ఛిదం | శ్ఛిదం |
| 286 | 313 | 1 | యోగా | యోధా |
| | 314 | 4 | కొలగె | కలఁగె |
| | 315 | 3 | రాఘవా | రాఘవ |
| 287 | 322 | 1 | మ్మహా | న్మహా |
| | | 4 | రణి | రఁణి |
| | 323 | 1 | సంశక్తి | సంపక్తి |
| 288 | 328 | 6 | భిద | భిధ |
| 290 | 337 | 2 | చ్ఛటా | శ్ఛటా |
| | 338 | 3 | లోన | లోని |
| 291 | 341 | 13 | నడచి | నడచి |
| | | 14 | వసిష్టు | వసిష్ఠు |
| 292 | 344 | 3 | మూర్ధ్వ | మూర్ధ |
| 295 | 362 | 4 | విడచి | పిడిచి |
| | 363 | 3 | నిట్టి | మిట్టి |

ఇందు అరసున్నలును ద్రుతములకంటె బరమగు పరుషములకు సరళములును సరిగా వేయఁబడలేదు. అట్టియన్నియుం గైకొనిన నీ శుద్ధపత్రిక మిగుల వృద్ధియగునను శంకచే వానినెల్ల నిందుఁజేర్చక విడిచితిమి. దయతోఁ జదువరులే వానిం దిద్దికొను భారము వహింపఁ జెదరుగాక.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B131 |
| పుస్తకం పేరు | అద్భుత ఉత్తరరామాయణము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 335 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2,3,14 ,8 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | Good |